

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు
శ్రీమతి బులుసు కామేశ్వరి
గ్రంథకర్తృ దంపతులు

# భగవత్సన్నిధికి తుదిమెట్లు



గ్రంథకర్త:

బులుసు వేంకటేశ్వర్లు, ఎం.ఏ.

# భగవత్సన్నిధికి తుదిమెట్లు

ప్రథమ ముద్రణము

1000 ప్రతులు



వెల 15-00

సిద్ధార్థి పుష్యము 1980

ప్రతులకు :—

బులుసు వేంకటేశ్వర్లు,
2/8-10-22, కమలాదేవి వీధి,
గాంధినగరము, కాకినాడ - 4.

శ్రీగాయత్రి ప్రెస్, కాకినాడ-4.

# భగవత్సన్నిధికి తుదిమెట్లు

శ్రీ చిర్రావూరి వివేకానందమూర్తిగారు,
I. A. S., Retired Chairman, Andhra Pradesh
Public Service Commission.

ఆశీర్వచన వాక్యములు—

నా ప్రియమిత్రులు బ్రహ్మశ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు వచ్చి తమగ్రంథ పరిచయ వాక్యములు వ్రాయుమని కోరిరి; ఇది దైవాజ్ఞ అనియు వారు చెప్పిరి. దైవాజ్ఞగా శిరసావహించి నేను కొలఁది మాటలు వ్రాయుట కంగీకరించితిని.

శ్రీ వేంకటేశ్వర్లుగారు నాకు చిరకాల మిత్రులు. నేను సర్వీసు కమీషన్ చైర్మనుగా రిటైరయి, కాకినాడలో స్థిరపడి నప్పటినుండియు మేము మిత్రులమైతిమి. వారనేక గ్రంథములు రచించిరి. వానిని నేను శ్రద్ధతో ఁజదివితిని. వారిటీవల వ్రాసిన స్వీయచరిత్రము, భగవత్సన్నిధికి వేయిమెట్లు, భగవత్సన్నిధికి తుదిమెట్లు ముఖ్యములైనవి; వీరింకను భక్తిరస భరితములైన శ్రీరామప్రభు శతకము, శ్రీకృష్ణప్రభు శతకము, శ్రీశివప్రభు శతకము, శ్రీవిశ్వేశ్వరీ శతకమును వ్రాసిరి. వీరు భక్తి కర్మజ్ఞానములలో వేదవేదాంత రహస్యములన్నియు నెఱిగియుండుటేకాక, నిత్యజీవితములో సాధనకు ప్రాముఖ్యమిచ్చి దీక్షతో నాచరణ చేయుచున్న నిష్ఠాపరులు. ఉద్యోగ విరమణానంతరము వీరు తమ జీవితమునంతను, వేదవేదాంత

రహస్యముల దెలిసికొని, నిత్యజీవితములో దపస్సాధనచేసి, వాని సత్యముల ననుభవపూర్వకముగా దెలిసికొనుటకై యెడతెగని కృషిచేయుచున్న పుణ్యపురుషులు.

ఈ గ్రంథములో వీరు, సామాన్య మానవులందరు భక్తిమార్గము నభ్యసించి దాని ప్రభావము వలన కర్మజ్ఞానముల నేకకాలమున నాచరించి, జీవన్ముక్తి పడయుటకు అనగా బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు, అనగా బ్రహ్మానుభవ సిద్ధి గాంచవచ్చుననిబహుముఖముల బ్రదర్శించి యున్నారు.

సంస్కృతభాషలో నుద్గ్రంథములను జదువలేని వారందరకు దెలుగుభాషలో మిక్కిలి సులభము, మృదు మధురమునగు రీతిగా వీరీగ్రంథమును రచించి, ఆంధ్ర ప్రజానీకమునకు మహోపకారము చేసియున్నారు. దైవభక్తి లోపించి, నీచ భోగవిలాసములపై గోర్కెలధికమై, పవిత్ర జీవిత విధానములు దిగజారిపోవుచున్న నేటి ఆంధ్రులీగ్రంథము చదివి, భక్తిజ్ఞాన వైరాగ్యము లభ్యసించి తరింపవచ్చును. ఈ సద్గ్రంథము నాంధ్రులందరు భక్తిశ్రద్ధలతో జదివి ధన్యులగుదురుగాక యనియు, బ్రహ్మశ్రీ వేంకటేశ్వర్లుగారి కింక నిట్టి సద్గ్రంథ రచనచేయుటకు భగవంతుడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక యనియు గోరుచున్నాను.

— చి॥ వివేకానందమూర్తి.

# ఉ పో ద్ఘా త ము

— ర చ యి త

"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్య; తపో బ్రహ్మేతి" "ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇవి ఉపనిషద్వాక్యములు. మానవజాతి కంతకు, దేశకాల పాత్రలతో నిమిత్తములేని పిలుపు పలుకులు. ఈ పలుకులు భారత మాతృహృదయ స్వచ్ఛ కృపామృతమును సూచించును. "మానవుఁడా! నీకు దుఃఖముతో (గూడిన జననమరణాదిక బాధలులేని శాశ్వతశాంతి సౌఖ్యములు కావలసినవి; కోరఁదగినవి. దేహముచేతను, లోకములోని భోగ్యములగు కాంతాకనక వస్తువాహనాదికముచేతను నీకు, క్షణికము దుఃఖసమ్మిశ్రితము నగు సుఖభ్రాంతియేకాని, నిరవధికానందము; స్థిరపూర్ణానందము లభింపదు.

నీ వెవ్వఁడవో, నిన్ను, సర్వలోకములను సృజించి నడపుశక్తి స్వరూప మెట్టిదో, నీకు నా పరమశక్తికిఁ గల సంబంధమెట్టిదో నీవు తెలిసికొనకుండ (గాలము గడపుచో, (గోటి జన్మములెత్తినను నీకు సుఖము, నీవు కోరు చెడని సుఖము లభింపదు. అందుచే నీవు చేయవలయు కార్యక్రమమును నిర్ణయించి కొనవలెను. అదృష్టవశమున దీని నెవనికి వాఁడే నిర్ణయించుకొను శ్రమ అవసరములేకుఁడ, భారత

పుణ్యభూమిలో వేదములు, ఉపనిషత్తులు, శాస్త్రములు, పురాణేతిహాసములు, భగవద్గీతామృతము, భక్తుల, జ్ఞానుల అనుభవవాక్యములు - మానవుని కర్తవ్యమును, కార్యక్రమమును నిర్ణయించి ప్రకటించి, విస్తరిలో అన్నము వడ్డించి, పీటవేసి, కూర్చుండఁబెట్టి, తినుమని కోరినరీతిగా, మన కందించినారు.

ఆత్మయనగా (పరమాత్మ; అనగా భగవంతుని నిజ స్వరూపము. అదియే పరిపూర్ణ సత్యము. అది తెలిసినచో, సర్వదుఃఖములు క్లేశములు నశించి, సర్వసుఖశాంతి సమృద్ధమగు మోక్షము లభించును. దాని లక్షణములను గూర్చి శ్రుతులు చెప్పినది వినుట; వినిన విషయమునుగూర్చి సంశయములు లేకుండ స్థిరనిశ్చయమునకై ఆలోచించుట, వివేకించుట; దానిని పొందుట కేకాగ్ర బుద్ధితో ధ్యానదీక్ష పూనుట, దర్శించుట జరుగవలసిన పనులు. వినుట, ఆలోచించుట త్వరలో ముగించికొని, ధ్యానసమాధి యోగము నభ్యసింపవలెను. వినుట ప్రథమ దశ; వివేకించుట రెండవ దశ; ధ్యానము మూడవది; సాక్షాత్కారసిద్ధి నాల్గవదశ; అదియే ముక్తావస్థ. ప్రథమ ద్వితీయ దశలలోనే మన ఆయుర్దాయము సంతను వ్యయించినచో, మరల జన్మించుట తప్పదు. మరణములోపున ముక్తావస్థగాంచుట మన ఆదర్శమై యుండవలెను.

ఇదివరలో భగవత్సన్నిధికి వేయిమెట్లు గ్రంథ మును రచించి ప్రకటించియున్నాను; దేవతాదర్శనమున కాలయము మెట్లెక్కిపోవునటులే యీమెట్లు భక్తి క్రమో న్నత పరిణతికిఁ జేర్చును; భక్తుని ప్రయాణము భగవత్సన్నిధికి; తరువాత తదైక్యమునకునై యున్నది. ఈ పయనములో, పరిణతిగాంచిన కొలఁది, క్రమోన్నతానుభవములు గోచ రించును. ఇపుడీ భగవత్సన్నిధికి (దుదిమెట్లు, స్వీయానుభవ పరిణతికి రూపమిచ్చు ప్రయత్నమై యున్నది. భగవత్సన్నిధి లభించులోపున, భక్తిపరిణతిలో దశాంతర్దశలు, క్రమోన్నత స్థాయినంది, భక్తితోఁబాటు జ్ఞానమును వికాసము పొందును. ఈ రచనలు, స్వీయ భక్తిజ్ఞాన సంపాదనములో సాధన రూప ముల ఫలితములే. ఇవి నాకు రచించుటవలన సాధనాభ్యాస బలము నిచ్చినవి; ఇచ్చుచున్నవి. నావంటి యితరాన్వేషకు లకు నుపయోగించినచో నిది పరమేశ్వర సంకల్పముగా జరు గును. ఇందు ధన కీర్తికాంక్షలు నాకు గలుగలేదు. ఇవి నాకొఱకు నేను వ్రాసికొంటిని; ఇది తపస్సాధనలో నొక భాగము. ఇవి అన్యులకు నుపయోగ యోగ్యములగుట కీశ్వర సంకల్పమునకు విడిచిపెట్టితిని. ఇపుడు నాకు డెబ్బది నాల్గవయేడు నిండుచున్నది. ఇఁక నాయుర్దాయ మెంత యుండునో, ఇంక నిట్టి మెట్లు వ్రాయించునో అది శ్రీకృష్ణ ప్రభువు సంకల్పమునకు హృదయపూర్వకముగా విడిచి పెట్టి తిని. మృతి పొందులోపున భగవాను నభయహస్తము

గాంచుటే నాదృఢవాంఛ. నాజీవిత సర్వస్వమీశ్వరార్పణము చేసి దినదిన మాభగవానుని దివ్యసంకల్ప లీలలను దర్శించు సాధనలో నుపయోగించు చున్నాను. ఈ రచన పూర్తియై అచ్చునకీయవలెనని తలచుచుండగా, నొకభక్తుఁడు చూచుటకు వచ్చి, యీముద్రణమునకు వలయు ధనము నొసఁగి, సాష్టాంగ నమస్కారము చేసి వెడలెను. ఆతఁడు వచ్చి యిచ్చునని, పూర్వదినముననే నాకు గోచరించినది; ఇదియే కృష్ణప్రభువు లీల; అనగా శ్రీకృష్ణప్రభువున కీరచన యందును, ముద్రణమందును సంకల్పమున్నదని స్పష్టము. ఈ దాతృశేఖరుని పటము, వారి గుణగణనము వేరొకచోట నీగ్రంథమున ( జూడవచ్చును.

మానవుఁడు ముక్తి, దుఃఖవిముక్తి పొందుటకే పుట్టినాఁడు; ముక్తియే సుఖము; అదిలేనిదే దుఃఖము. లెమ్మా! మేల్కొనుము; తపస్సు, జపము, ప్రార్థన, సంకీర్తనము, ధ్యానము, చేసి తరింపుఁడని భారతభూమి సర్వలోకవాసులకు గొంతెత్తి అరచుచున్నది, ఇదియే భారతమాతృ హృదయము; ఇదియే జగన్మాతృహృదయము; సందేశమునై యున్నది.

— బులుసు వేంకటేశ్వర్లు

ఓమ్

# బ్రహ్మజ్ఞాన కిరణములు లేక భగవత్సన్నిధికి తుదిమెట్లు

1. ప్రపంచములోని వస్తువుల నీశ్వరుఁడు ప్రాణుల మానసముల నాకర్షించి, బంధించుట కుపయోగించువానినిగాఁ గల్పించెను. ప్రకృతిలోని సహజవస్తువులను, జూచి యెవరికి వారు వీలైనంతగా వానిని స్వాధీన పరచుకొని అనుభవింప వలెనని కోరుదురు. అవి జీవుల స్వార్థపరతను, అజ్ఞానము నధికముగాఁబెంచి, అదృశ్యములై, మోసగించి, సౌఖ్యమునకు బదులు దుఃఖమునిచ్చును, ఈ కీలకమెఱిగి వస్తువాంఛ నఱికట్టి వస్తుకర్తయగు భగవాను నారాధించి తరింపవలెను.

2. సంసార మెంతజితేంద్రియుని చిత్తస్థైర్యమునైనను జెడఁగొట్టఁగలదు. దైవానుగ్రహమార్జించినవానినదియేమియుఁ జేయలేదు. కావున సంసారసాగర తరంగ తాడనముల ధాటి కోర్వఁజాలు శక్తివలయుచో, మానవుఁడు దైవారాధన దీక్షా పరతంత్రుఁడై దైవకృప నార్జించుటవలన మాత్రమే పొందఁ గలఁడు. ఇది యేకైకమార్గము. కాని యీసాధనకు సంసార మడ్డురాదా? సాధన కడ్డుపడునదే సంసారము. భగవాను నాశ్రయించు దీక్షయు, దైవకృపయు, సంసార మడ్డుపడగల బలము క్షీణింపఁజేసి తుదకు నశింపఁజేయుటయు, సాధనవిజయ మందుటయు సత్యము.

3. ఏవిషయము మనస్సంక్షోభమును కలిగింపఁ బోవునో, దానిని దొలగించు సాధనమును జూచికొనవలెను. కష్ట దుఃఖములను గలిగించు విషయములను మనస్సమీపము నకు రానీయరాదు. మనస్స్వాతంత్ర్యమును నిలుపుకొని పరి ష్కారసాధనము నన్వేషింపవలెను. ఉత్తమ పరిష్కార సాధ నము భగవానుని పాదపద్మముల నాశ్రయించుటయే. భగ వానుఁడు రానున్న కష్టములను దొలగించును, లేదా వాని ననుకూలముగాఁ బరిష్కరించు నుపాయమును స్ఫురింపఁ జేయును. ప్రతి వ్యక్తియు దీనినాచరణలోఁ బెట్టి ఫలితము లను గాంచి ధన్యత నందవలెను.

4. ప్రతి దినమును, గృహస్థులు తమ యిండ్లను దుడిచి శుభ్రమొనర్చికొందురు ; దేహములను స్నానాభ్యం గనాదులచే శుద్ధిచేసికొందురు. కానిలోనున్న సూక్ష్మలింగ దేహములలోఁ జేరి గడ్డకట్టియున్న కుళ్ళు నెవ్వఁడును దుడు వఁడు. కడిగివేయుటకు యత్నింపఁడు. బాహ్యశుద్ధిచే వ్యక్తులు పైకి మేడిపండ్లవలె బాగుగానే గోచరింతురుగాని లోపలి దేహములలోని దోషములు నిలువయుండి కుళ్ళుచుండును. ఆ కుళ్ళువలన రోగములు, సకలబాధలు, దుఃఖములు సంభ వించుటేగాక, వేలకొలది జన్మము, లజ్ఞానాంధకారమున ద్రుగ్గి, బయటపడు మార్గములేక దురపిల్లవలసి వచ్చును. అందుచే దినదినము మానవులు పై దేహములనేగాక లోనిదేహము లనుగూడఁ గడిగి శుద్ధి యొనర్చుకొనుచుండవలెను. దైవా

రాధన దీక్ష, ధర్మనిష్ఠ, సజ్జనసాంగత్యము, జపతపధ్యానాదిక ముచే నంతశ్శుద్ధిగలిగి మానవుఁడు సర్వదుఃఖ విముక్తి నొందవచ్చును. ఈ కృషి నిర్విరామముగాఁ జేసి కృతార్థుఁడగుట మానవుని ప్రప్రథమ కర్తవ్యము.

**5.** భగవంతుని సేవచేయుచు, జపతపాదికములు దీక్షతో నడపుచున్నను, కొన్ని ముఖ్యములైనవాంఛితార్థము లేల సిద్ధింపవు? భగవత్కృప కలుగ లేదన్న మాట. ఎందుకుఁ గలుగలేదు? జన్మాంతర పాపరాశి యింకను విశేషముగా నిలువయున్న దన్నమాట; ఆ గతజన్మ పాపరాశి నశించి మనము పూర్తిగా నిష్పాపుల మైనప్పుడు, దైవకృప, వెంటనే కార్యసిద్ధి కలుగును. లోనున్న గతపాపరాశి త్వరగా నశించుటకు మనము మన భక్తిజ్ఞాన ధ్యానాదికమును దీవ్రతర మొనర్చి, నిర్విరామ కృషి సలుపవలెను.

**6.** మానవజన్మ మెత్తినందుకు భగవాను నారాధింపవలెను. ఎటు లారాధింపవలెను? భగవంతుని సాక్షాత్కారము, అనుగ్రహము లభించువఱకుఁ గఠోరదీక్షతో నిర్విరామముగా నారాధింపవలెను ఆ దీక్ష యెట్టిదై యుండవలెను? జీవితము ప్రతిక్షణము సంశయాస్పదముగావున, మనమతి వేగముగా దీక్షను నిర్వహించి మరణాత్పూర్వమైనను విజయము నందవలెను. అనగా మనజీవితకాలమును మరెందుకు నుపయోగింపరాదు. సర్వ జీవశక్తిని దేవునిపైఁ గేంద్రీకరించి, కృతార్థులము గావలెను.

7. ఇహలోక జీవితార్థము తెలిసి జీవించుట, కఠోర మగు కృషియే, ముఖ్యముగా నాత్మోద్ధరణమునకై చేయ వలయు పనులకుఁ గాలము చాలదు. వినోద విలాసములకు, దేహసంతుష్టికిఁ జేయవలయు కార్యములు చాలకాలమును వ్యర్థ మొనర్చును, అజ్ఞానమును దొలగించుకొను కార్యమునం దెవఁడు నుత్సాహముతోఁ బనిచేయఁ బూనుకొనఁడు. అజ్ఞాన సంతానములగు కామమోహాదులు, భోగకాంక్షలు, కాల మును వ్యర్థ మొనర్చుటే గాక. అజ్ఞాన వృక్షము వ్రేళ్లతోగా ( బాతుకొని బలిష్ఠములగుట కుపయోగించును. ఇట్టి మానవ జీవితము, తరించుట కెట్టి ప్రబలదీక్షను గోరునో చెప్పనవస రము లేదు.

8. మానవులు—కొలది మంది జ్ఞానులుతప్ప—అంద రును అమాయికులు, అల్పసంతుష్టులు, క్షణిక సంతృప్తి నిచ్చి, శాశ్వతదుఃఖములను గలుగఁజేయు కామకాంచన భోగములకు దాసులగుచున్నారు. జన్మజరామరణాదు లెన్నిమారులు కలిగి దుఃఖమునిచ్చినను లెక్క చేయక కామినీ కాంచన భోగవ్యామోహవశులై జీవితములను భగ్న మొనర్చుకొనుచున్నారు. మనము నిజముగా గోరఁదగిన దిదియేనాయని ప్రశ్నింపరు—ఎంత అల్పసంతుష్టులో!

9. సర్వకాల సర్వావస్థలయందు నత్తవారి యింటి వద్ద మనుగుడుపులుఁ గుడుచుచు నిర్విచారముగా సౌఖ్య డోలికలలోఁ దేలియాడు ప్రియుఁడగునల్లునివలె, భక్తుఁడు

తనకత్యంత ప్రియుఁడగు భగవానుని రాజభవనమందు సర్వ సుఖము లనుభవించుచు జీవింపవచ్చును, తాను, దనతండ్రి, తల్లి, మామ, ప్రభువునైన భగవానుని దివ్యమందిరములో నుంటినని గుర్తించి, యేక్షణ మాతనిని మఱువకుండ దృఢ తమవిశ్వాసముతో స్మరించు చుండుటే చేయువలయు పని, ఏలన, భగవానుని కంటె నధికుఁడు, సమర్థుఁడు, దయానిధి, వేరెవఁడున్నాఁడు ? మనము నివసించు నీప్రపంచ మాతని మందిరము కాదా ? దేవునింటఁగూర్చుండి కన్నీరు పెట్టునవ సరమేమున్నది ?

10. నీకెందుకురా తాపత్రయము! నీవుచేయఁదలచు కొన్నది, సాధ్యమైనంత వరకు ధర్మవిరుద్ధము గాకుండఁ జేయు చుండుము, అదియెట్లు జరిగిన బాగుండునో సత్ఫలితములిచ్చి సౌఖ్య శాంతులను సమకూర్చునో, ఆవిషయములు నీకుఁ దెలిసినట్లుండునుగాని, నిజముగాఁదెలియదు, ఆబాధ్యత భగ వంతునికి విడిచిపెట్టుట, పరమశ్రేయస్కరము, భగవానుని నమ్మినిస్సంశయుధైర్యముతో నుండి, పరిశీలించు, సర్వవిధ ములనీకార్యములతి విచిత్రముగా జరిగి, సత్ఫలితములిచ్చి తీరును నీవట్టి నిష్ఠాభ్యాస పడవలెను. ఈయభ్యాస మఖండా నందమును సంతుష్టిని సమకూర్చును.

11. నేనుగాదు; అంతయుదేవుఁడే చేయుచున్నాఁడని తెలిసినంత మాత్రమున లాభములేదు. దేవుఁడే సర్వమని అనుకొనిన వెంటనే 'అహం' అనుసర్పము తలపైకెత్తి 'నేనే'

చేయుచున్నాననను భావము కలిగించి, దేవుని మరపింప జేయును. అహంభావము సులభముగా దొలగిపోదు; నశింపదు, అనేక జన్మముల కృషిచే దైవానుగ్రహము కలిగినచో నప్పుడు సాధ్యమగును, "నేనుగాదు, భగవానుడే" యను మంత్రము నెల్లప్పుడు జపించి, నిత్యానుష్ఠానములో నామంత్ర ప్రభావమును గమనింప వలెను, మఱపు, తెరపివచ్చి పోవుచుండును, ఈసాధన మొదట కష్టమై, తరువాత సులభసాధ్యమగును. సాధనలో శ్రమతో నానందమును గలుగును.

12. మరణములోపుగ గామక్రోధముల ఉద్రేకమును జయించినవాడు యుక్తుడు, సుఖియని గీతావాక్యము, గీతాపారాయణము చాలదు. కామక్రోధాదుల జయించు కార్యక్రమము ననుష్ఠింపవలెను, ఓర్పులేని వానికి దేవుని నిశ్చల చిత్తముతో భజించుటెట్లు సాధ్యమగును? కామక్రోధములు చిత్తమును జలింపజేసి యేకాగ్రతను జంపి వేయును. భక్తునికేకాగ్ర చిత్తములేనిదే దైవసాక్షాత్కారము లభింపదు, అందుచేగామక్రోధ విజయ మత్యంత ముఖ్యమైనది.

13. ఆత్మఅచంచలమైనది; విచారములేనిది; నిత్యానంద శాంతి సమృద్ధమైనది. మనస్సు చపలశీలము గలది. విషాదక్లేశములు, అశాంతి దుఃఖములు గలది. "ఆత్మసంస్థం మనః కృత్వా, నకించిదపి చింతయేత్;...ఆత్మన్యేవ వశంనయేత్." గీతావాక్యములు, చలించు మనస్సును చలింపని

ఆత్మవశ మొనర్ప వలెను, అపుడు మనస్సు స్థిరతనంది ఆత్మ లక్షణములైన స్థిర శాంత్యానందములను గాంచును, ఆత్మ యనగా దేవుఁడే, దేవుని యందు మనస్సును నిలిపినచో, మనస్సునకు దైవగుణములు సంక్రమించును.

14. దేవుఁడొక విషయము నీవిధముగాఁ జేయునని నిర్వచించుట మానవబుద్ధికసాధ్యము, ఏలన నేపని జరిగించుటకైనను, దేవునికగణ్యములైన దృక్పథములు, పరిష్కార మార్గములు నుండును, ఆగణనాతీతావకాశములు దేవుని కొక్కనికే తెలియును, మరెవ్వరికిఁ దెలియుట కవకాశము లేదు. కొలది మార్గములే మనబుద్ధికి గోచరించుటచే మనము వానినే తర్కించి, అందొక పద్ధతిలో దేవుఁడు చేయవచ్చునని భావింతుము, అందుచే మనభావములు తప్పవచ్చును, కావున పరిష్కారమార్గము దేవునికి విడిచి, ప్రార్థించుటే ఉత్తమ పద్ధతి యగును.

15. భౌతిక శరీరమును భూమికొప్పగింపక తప్పదు గావున మనస్సును దేవునికొప్పగించిన యెడల శరీరము పోయిన దుఃఖముండదు, దేవునికిచ్చుటచే మనస్సు దైవలక్షణములైన అవ్యయానంద జ్ఞాన శాంతులను పొందును, మనస్సును దేహముపై నుంచి, దేహమమకారమును బెంచికొని, దేహసుఖకైముల కాలమంతను వినియోగించినచో పునర్జన్మము, సంసార దుఃఖము తప్పవు, కావున బుద్ధిమంతుఁడు తనదేహ మనస్సు లనెట్లుపయోగించికొని

ధన్యుఁడు కావలెనో నిశ్చయించికొని, జీవించుట నేర్చికొని కృతార్థుఁడు కావలెను.

16. కర్తృత్వభావమును సంపూర్ణముగా విడిచిపెట్టి, సర్వ మీశ్వరాధీనమని గుర్తించి జీవించు సాధన చేసినచో దేవుఁడే మిగిలి, నీవు వేరుగా నుండక, దేవునితో నొకఁడవై అఖండానంద ప్రజ్ఞాసామర్థ్యములు గలవాఁడవై, జన్మ జరా మరణముల నెట్టివేసి, హాయిగా నుందువు. నిజముగాఁగర్తృత్వము నీకు లేనేలేదు, లేనిదానిని విడిచి పెట్టుటేమి? లేదని గుర్తించుటే విడిచిపెట్టుట, ఈగుర్తింపులో దేవుఁడున్నాఁడు

17. దేవునియందు నీకు నమ్మకము పరిపూర్ణముగా నున్నచో, "నాకు మనశ్శాంతిని జెడఁగొట్టునది, విషాదమును గలిగించునది, బాధించునదియు నెట్టిది జరుగద"ను వజ్రసంకల్పమును నీవు సాధింపవలెను. అదియే నిజమైనభక్తి; నిజమైన జ్ఞానము, దేవుఁడు దనకు వ్యతిరేకముగా నేపీసమంతయైన జరిగించునని నుట దేవుని భక్తజనావనశీల మహిమ నెఱుగని మూర్ఖప్రలాపము. తన్నుఁజిత్తశుద్ధితో నమ్మిన భక్తుని రక్షణమును దనరక్షణముగనే భావించి వర్తించునననన్యమహిమ దేవునిది. ఈసూత్రమును జీవితములో నాచరించి చిద్విలాసముతో నృత్యమొనర్పుము.

18. భగవానుఁడు భక్తులకుఁజికాకు లెందుకుఁగలిగించును? పూర్ణభక్తులకెట్టి చికాకులును గలిగింపఁడు, సాధనావస్థలోనున్న భక్తులకుఁగొన్ని చికాకులు గలిగించి, తన

యందుభక్తి దృఢతర మొనర్చికొని వారిని పూర్ణభక్తులుగాఁ జేయునిమిత్తమే. చికాకులు లేనప్పుడందర మనస్సులు నిబ్బరముగానే నిలచును. చికాకుఁగలిగినప్పుడు నిశ్చల మనశ్శాంతి నార్జించుకొన్న వాఁడే నిజమైన సాధకుఁడు, పూర్ణభక్తుని జేయు చికాకులు భక్తుని బాధింపవు.

**19.** "ఇదిగో నిటుచూడవేమి ? నీవు నాకుసంపూర్ణాత్మార్పణము చేసితివి కాదురా ! నీపనులన్నియు నేను తప్పక నిర్వహింతును. నాకు నొకగడియారమున్నది ! నీపనులన్నియు సమగ్రముగాఁజేయుటకు సిద్ధముగానున్నాను; చేయుచున్నాను. మరల నీవేల నీపనులలో వ్రేలుపెట్టఁజూతువు ? నమ్మకము చెదరనీయకురా ! నీపని నాపనియే ! నమ్మిచూడు !" అని భగవానుఁడు దయతో బలుకుచున్నాఁడు.

20. ఆహాహా! ఎంత ప్రబలచిత్తక్షోభ తప్పిపోయినది! ఇది యేమిచేయవలయు, నదియెట్లు జరుగునను సమస్యల నన్నిటిని దుడిచివేసితిని, శ్రీకృష్ణప్రభువు నాపనులన్నియు జూచుచున్నాఁడు, వకాలత్ ప్రభువుకిచ్చివేసితిని ఇంకేమి జరిగిన నాకేమి లోపమగును. ? భగవానుఁడు నాయెడ ననుగ్రహముతో నాపనులన్నియు జూచుచున్నాఁడు, ఎంత భాగ్యము! ఏమి అదృష్టము! సంక్షోభములన్నియు నుసియైపోయినవి.

21. మనము వాక్కును, మనస్సును, దేహమును నిగ్రహించి నడపుకొనవలెనని చెప్పెదరు, అదియెంత సులభమా? మనకుఁదెలియకుండగనే, కొన్ని సందర్భములలో కొన్ని మాటలు, ఆలోచనలు, పనులు మనలోనుండి జరిగి పోవుచున్నవి. అదిజరిగిన తరువాత మాత్రమే మనకుఁదెలియు చున్నది. జరిగిపోయినవానిని నిగ్రహించుటెట్లు ? అనగా నిగ్రహము దైవాధీనమై యున్నదని తెలియవలెను. భగవంతునాశ్రయించుటొక్కటే కర్తవ్యము.

22. మనుజుల కర్మలు కొంత శ్రమపడినచో మన కర్థమగును, భగవానుఁడొనర్చు క్రియలు మానవబుద్ధి శక్తి కందవు, అందుచే భగవానుని పనులు మనకర్థమాయినట్లు గోచరించి, మనమనుకొనిన యర్థముల కతీతముగా చూపట్టును, కారణము స్పష్టము, అనంతప్రజ్ఞా స్వరూపి, విశ్వప్రపంచ బాధ్యతను వహించి పరమేశ్వరుఁడు దనసంకల్పముల నెరవేర్చును, దైవకృప లేనిదే దైవసంకల్ప కార్యక్రమము లర్థము కావు, దేవునెఱుఁగుటకు దేవుని కృపయే సాధనము, సాధనాంతరము లేదు

23 ఏదైన విషయమునుగూర్చి నేను కంగారు పడు చుండుట, వెనుకనుండి, "నేనున్నానుకాదురా! ఎందుకు కంగారు ?" అని కృష్ణభగవానుఁడు పలుకుచుండుట వినఁబడు చున్నది. ఇది ప్రస్తుతస్థితి; భగవానుని పలుకులు వినుటయుఁ గంగారు తొలగుటయుఁ దరువాతస్థితి, భక్తాధీనుఁడైన భగ

వాఁడెల్లవేళల భక్తుని సర్వకార్యములు శుభప్రదముగా నెరవేర్చుచుండ గమనించి నిశ్చలానందము నందుచుండుట కోరఁదగిన మహోన్నతస్థితి.

24. ఎవరిని నమ్మవలెను ? నమ్మిన దగాచేయువారిని నమ్ముట బుద్ధిమాంద్యము, చేయవలెనని దగాచేయువారు కొందరు, మంచిచేయుట కనర్హులై దగాచేయువారు కొందరు, తమ్ముతామే దగాచేసి కొనువారు కొందరు, దగాచేయగలుగుట గొప్ప తెలివని భావించువారు కొందరు, సజీవ మృతినంది దగాచేయువారు కొందరు మానవులు పలుతెగలుగా నున్నారు. ఎవరిని దగాచేయు కోర్కె వీసమంతయు లేనివాఁడై, యెవఁడెవ్వరిని దగాచేయక, నమ్మినంత మాత్రమున నిరంతర రక్షణమిచ్చి కాపాడునో అట్టి భగవానునే నమ్మి సురక్షితుఁడగుట బుద్ధిమంతుని కర్తవ్యము.

25. పరిపూర్ణ బ్రహ్మవేత్తకుఁ దప్ప పరిపూర్ణ చిత్తశాంతి లభింపదు. నిజమగుశాంతి పరమాత్మలక్షణము, చిత్తలక్షణ మశాంతియే. తాను వేరుగా నొకవ్యక్తినని యహంకారముబెట్టుకొని,బుద్ధి చిత్తేంద్రియ దేహములు నేనని భ్రమించువానికెన్నికోట్ల జన్మములెత్తినను శాంతి లభింపదు. నేను పరమాత్మ స్వరూపునను జ్ఞానసిద్ధి వలననే సంపూర్ణ శాంతి సౌఖ్యములు లభించును. కావున మానవుఁడు తన నిజస్వరూప మెరిగి సుఖింపవలెను.

26. రేతశ్శక్తి మానవవ్యక్తిలోఁగల సృజనాత్మక శక్తి; అదియే బలము, కాంతి, ప్రజ్ఞ, అదియే భగవంతుని సృష్టి ప్రవాహాగమనమునకు ముఖ్యమైన ఉపకరణము. రేతశ్శక్తినూర్ధ్వా ధోముఖములఁ బ్రసరింపఁ జేయవచ్చును ఊర్ధ్వరేతస్కుఁడైనచో నీశక్తి సహస్రార కమలములోఁజేరి బ్రహ్మజ్ఞానమునిచ్చి యీశ్వర సాక్షాత్కారము కలుగఁ జేయును. అధోరేతస్కుఁడైనచో సందేహాస్పదమైన తాత్కాలిక సంయోగ సుఖావేశమునిచ్చి ప్రజోత్పత్తి చేసి, గృహస్థ ధర్మానుష్ఠానమునందుఁ దోడ్పడి బ్రహ్మజ్ఞానమునకుఁ దోడ్పడును. అధర్మముగా రేతశ్శక్తిని వినియోగించునాతఁడు (వ్యభిచారి) అకాలమృత్యువును,నరకమును. సకలవిధ భ్రష్టతనుబొందును.

27. ప్రతిప్రాణికి సుఖమేకావలెను; దుఃఖమెవ్వరును గోరరు; స్వేచ్ఛ కావలెను; బానిసత్వమును గోరరు; పరిపూర్ణత కావలెను, అసంపూర్ణత పనికిరాదు; శాంతికావలెను. అసంపూర్ణత నెవ్వరును వాంఛింపరు, అనగాఁ బ్రతి ప్రాణి యుఁగోరు సుఖము, స్వేచ్ఛ. పరిపూర్ణత, శాంతి మున్నగు లక్షణములన్నియుఁ బరమేశ్వరునికే కలవు. అవి మరెచ్చటను లేవు. అందుచేఁ జేయవలసిన పని పరమేశ్వరు నాశ్రయించి, పరమేశ్వర కృపచే వానిని సంపాదించుటో,తానే దేవుఁడగుటో- మార్గాంతరము లేదు. మొదటిది భక్తిమార్గము, రెండవది జ్ఞానమార్గము.

28 సకాలమున జరుగవలసిన పను లకాలమున జరుగవు. అకాలమున జరుగ లేదని విచారింతువా? శీతకాల మున మంచు టెండలు, రోహిణీకార్తిలో హేమంత శీతలము సంభవించుట విడ్డూరమగును. పగలు నక్షత్రములు, రాత్రి సూర్యుఁ డుదయించుటయు జరుగదు. భగవానుఁడు సర్వకర్త యైయుండి జరుగవలసిన వానినన్నిటిని దాను నిశ్చయించిన కాలములో జరిగించుచుండగా – ఈ విధముగా నెందుకు జరుగ లేదు, ముందుగా నేల జరుగ లేదు – అని తర్కించుటయీశ్వర తత్త్వము నెఱుగని బాలుర ప్రసంగమగును. కావున దేవుని నమ్మి, ఓర్పు వహించి, దైవసంకల్పము లెంతఅద్భుతముగా జరుగునో గమనించి ఆనంద పరవశుఁడవు కమ్ము.

29. నీకు కోపముండవలసిన అవసరమెన్నడు నుండ రాదు. నీకు కోపముగలిగెనా, నీవు వ్యక్తులను నమ్మి దేవుని నమ్ముట మానితివన్న మాట. వ్యక్తు లసత్యదృశ్యములు,కర్త, సత్యము దేవుఁడొక్కఁడే. అజ్ఞానదృష్టికి భిన్నవ్యక్తుల దృశ్య ములు గోచరించును. అందుచే వ్యక్తు లనుకూల విరోధ భావ ములు ప్రదర్శించినపుడు,నీవు రాగద్వేష రహితుఁడవై నిశ్చల ప్రసన్న చిత్తమును జూపవలెను. దేవుఁడే సర్వమను విశ్వా సము నీ కపుడు స్థిరపడును రాగద్వేషములజ్ఞానమువలన జనించును వానిని నీవు పొందితివా, ఫలితములైన అవాంఛిత దుఃఖము లనుభవింప వలసివచ్చును. అందుచే దేవుఁడే సత్యము, వ్యక్తులసత్యదృశ్యములని నమ్ముము.

30. చిత్తశాంతి, ఆనందమనగా నేమో తెలిసికొన వలసియున్నది. శాంతియే ఆనందము; ఆనందమే శాంతి; రెండునొకటే. శాంతి వినా ఆనందము, ఆనందము వినా శాంతియు నర్థరహితములు. అశాంతిగలచోట నానందమెట్లుం డును? ఆనందముగాక దుఃఖమున్నచోట శాంతియెట్లుండును? మరియు నీ శాంతియు నానందమును నెన్నడును జెడనివై యుండవలెను. స్థిరమైన శాంత్యానందములు స్థిరమైన వస్తువు నాశ్రయించియుండును. ఎన్నడు మార్పులేనివాఁడు భగవా నుఁడే. ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మయు నాతఁడే, పర మాత్మయందు భక్తి లేక జ్ఞానము మనకున్నచో నిర్వికార శాంతియు నానందమును మనకులభించును. అదియే బ్రహ్మ జ్ఞానము, ఆత్మదర్శనము. పరిపూర్ణ భక్తియు ననిచెప్ప వచ్చును.

31. మరణమనగా బాహ్యస్థూల శరీరమును విసర్జిం చుట. సూక్ష్మ కారణ దేహములు నిలిచియే యుండును. అవి బాహ్యేంద్రియములకు గోచరింపవు; బాహ్యేంద్రియములకు గోచరించునది స్థూలదేహమొక్కటే, అందుచే స్థూల శరీ రముపోవుటతో, స్థూలదృష్టి కది మరణము; దుఃఖమును గలి గించును. సూక్ష్మకారణదేహములు జ్ఞానకర్మ బలము ననుస రించి, లోకాంతరములలో సుఖదుఃఖము లనుభవించి, అనం తరము మరల స్థూలదేహమును బొందును. పూర్ణజ్ఞానియైన వానికి, సూక్ష్మకారణ శరీరములును నశించును. అప్పుడాజీవి

తానాత్మనుండి వేరుకాదని తెలిసి ముక్తుఁడై, శాశ్వతానంద శాంతులను పొందును.

32. నీవు చేయవలసిన పనులున్నవి; అవి జరుగుట లేదు, అనుకొనినరీతి జరుగుట లేదు. అందుచే చిత్తశాంతిచెడి, కంగారుపడి,విషాదగ్రస్తుఁడ వగుచున్నావా? అవసరము లేదు. మొట్టమొదటి సారి గర్భాదానపు గదిలోనికేగి, నీ ప్రియురాలిని గలిసికొనినప్పటి ప్రజ్వలితోత్సాహముతో నీ వుండవచ్చును. ఒకటినమ్ము చాలు, భగవానుఁ డన్ని నిర్ణయములు పనులు చేయుచున్నాఁడు. భగవానుఁడు నిర్ణయించిన కాలములో నవి జరుగును. భగవానుని నమ్మి యుండుము,చాలు! సర్వము నీ కనుకూలముగా జరుగుటచూచి ఆశ్చర్య కంపితుఁడ వగుదువు.

33 నీ విషయములోగాని యితరుల విషయములోఁ గాని జరుగుచున్నవి చూచుచు ప్రశాంత మనస్కుఁడవై హరి స్మరణ సంజాత బాష్ప నేత్రుఁడవై ఆనందించుటే నీవు చేయవలసినపని, దేవుఁడన్నియు స్వయముగాఁ దన సంకల్ప మాత్రముచే నడపుచున్నాఁడు. ఆయన ప్రజ్ఞ అప్రమేయము, ఆయన శక్తి అనంతము, ఆయన యోగ్యత పరిపూర్ణము. ఆయనను సేవారాధించు చుండగా నీకే విఘ్నముగు హాని, బాధ, మనోవైకల్యము, దుఃఖము నెన్నఁడు సంభవింపవు. నీ భక్తి నిర్దుష్టమైనచో నీకన్ని శుభములు, సౌఖ్యములు చేకూరును. ఇంతకంటె నేమి కావలెను ?

34. జీవితార్థ రహస్యము, లేక సృష్టి రహస్యము, లేక భగవత్తత్త్వము పరమ విచిత్రమైనది. అది యెట్టిదనగా, మనము ధరించు జందెము నిద్దురలో నటునిటు దొరలుటవలన ముడులుపడును. వానిని తొందరగా విప్పఁబూనుచో జందెము తెగిపోవును. సూక్ష్మముగాఁ బరికించి, ఓర్పుతో నొక కీలకమైన ముడివిప్పినచో లంకెలన్నియుఁ దెగిపోకుండ విడిపోవును, అటులే జీవితసమస్య. కీలకపు లంకె లేక ముడిని విప్పినచో, అన్నిముడులు విడిపోయి, జన్మార్థరహస్యము బయటపడును. అపుడే శాంతి సౌఖ్యములు లభించును. కీలకపు ముడిని విప్పుటకు దైవానుగ్రహము కావలెను, దైవానుగ్రహము దైవారాధన దీక్షచే లభించును.

35. జీవితమునకుఁ గీలకము దేవుఁడు, దేవునెఱుగకుండ బ్రతుకుట గాఢాంధకార జీవితము, భగవంతు నెరిగి జీవించుట సర్వము స్పష్టమై గోచరించు రవికాంతిలో జీవించుట. అప్పుడది దివ్యజీవితమై, అఖండానందమయమై, పునర్జన్మాది దోషరహితమై వెలయఁగలదు. ఈ కీలకము నెఱిగినవాఁడొక్కఁడే తెలివైనవాఁడు; వీరుఁడు, ధీరుఁడు, ధన్యుఁడు. పూజ్యుఁడును, మిగిలినవారు యమునిరాకకై యెదురుచూచువారే! చర్వితచర్వణముగా జన్మమరణముల చక్రములోఁ దిరిగి నలుగుచుందురు.

36. ధర్మమార్గమున వర్తించుటకు బుద్ధిపుట్టెననగా నావ్యక్తికి దైవకృప కలిగెనన్నమాట ; ఏలన ధర్మవర్తమున

దైవోద్దిష్టవర్తనము. దేవుని కిష్టములేని వ్యక్తిని దన సమీపమునకు రానీయఁడు. వక్రకుటిలబుద్ధి నీకున్నచో నీయెడ దేవుని కిష్టములేదని స్పష్టము, దుర్బుద్ధులు దేవునికి దూరస్థులై సకల దుఃఖము లనుభవింతురు. కావున ధర్మయుక్తము లగు భావ వాక్కర్మలుగలవారు ధన్యులు. వారికి భగవంతుని కృప కలిగినదన్నమాట. అట్టిపుణ్య పురుషుల ఉనికిచే లోకము పవిత్రమగును.

37. హిందూ మతమనగా మానవత్వము నమ్మి దైవత్వమును సంపాదించుట; భగవానుని పాదపద్మములు పట్టుకొని. మోక్షసామ్రాజ్య కిరీటమును ధరించుట, క్షణిక సుఖలేశమును తృణీకరించి అవ్యయానందమును స్వీకరించుట చిల్లిగవ్వనిచ్చి రత్నహారమును గాంచుట, భక్తిపులకిత బాష్ప బిందువులనిచ్చి అమృత భాండమును సంపాదించుట; నశించు దానినిచ్చి, అవినాశ పదవి నాక్రమించుట.– ఎంత అద్భుతమగు విషయమో! అనిత్య పరిమితోపాధి నర్పించి. నిత్య పరమాత్మ పదవిని సాధించుట – ఎంతమహదాశయమో! ఇట్లు సాధించుటే వేదార్థ రహస్యము.

38. వాఙ్మయతపస్సు చేసి సిద్ధిగాంచిన వారికి నిరతిశయసుఖము లభించును. సత్యమై, మృదువై, అనుద్వేగకరమై, ప్రియము హితమునైన రీతిగా మాటాడుట అనేక జన్మల తపఃఫలము–దీనికమితమగు నోర్పు కావలెను. మనకు సన్నిహితులు ముఖ్యులు నైనవారు మనయెడ ద్వేషము

గలవారు పలుకు పలుకులు ములుకులై గ్రుచ్చుకొని బాధిం చును వానిని సహించుటయేకాక, వారియెడ మృదుమధుర సత్య వచనములను నేప్పుతో నోర్పుతోఁ బలుకనేర్చుటయు నొకగొప్ప తపస్సే. అట్టి తపస్సులో నీశ్వరారాధన మేళవించి సులభముగాఁ దరింపవచ్చును.

39. లోకములో నెల్లరు కష్టము సంభవింపగాఁ, దలమోదుకొని, గుండెలుబాదుకొని రోదింతురు. కారణము చిన్నదే; దేవుని నమ్మకుండుటే; వేరుకారణము లేదు. దేవునేల నమ్మరు? నమ్మటలోఁగల దివ్యానందమును చవి చూడకుండుటే, దుఃఖానుభవ మభ్యాసమై సౌఖ్యము సులభ సాధ్యమని గ్రహింపలేక, భగవానుని సరిగా నమ్మకుండుటే.

40. అనుభవైక వేద్యమయినది భగవంతుని కృప. అదిమాటలతోఁ జెప్పుట కందనిది. భగవత్కృప, భక్తునికిఁ జిత్తప్రసాద మనుగ్రహించును. చిత్తప్రసాద మనగాఁ జిత్తోల్లాసందము; తత్తుల్యశాంతియు లేవు. ఎన్నియున్నను చిత్త ప్రసన్నత లేనినాడు సుఖముండదు. అన్నియునుండి ఐదవ తనము లోపించునటులే. స్వస్తివచనము "ఓమ్ శాంతిః" అని చెప్పఁబడెను. ఓమ్ అనగాఁబరమాత్మ; పరమాత్మయే పరమ శాంతి; అనగా నానందము. దేవుఁ డనంతానందసాగరము; అవ్యయ శాంతినిలయము. దైవ కృప లభించుటనగా నా దేవు ననంతమైన శాంత్యానందామృత సాగరములో నీదులాడుటయే,

41. "మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి." 'నాయందుఁ జిత్తముంచినచో, నాకృపవలన సర్వ క్లిష్ట పరిస్థితుల నధిగమింపఁ గలవు' ? శ్రీ కృష్ణ భగవానుని వాక్యము. సకలకష్టములనుండి రక్షణ మిచ్చుట యను మహా భాగ్య మనుగ్రహించుట కెంత స్వల్పమైన పనన్న వేసినాఁడో భగవానుఁడు? "నీవు నీ చిత్తమును నాయందుంచు." అంతే నీవు చేయవలసినపని. ఎంతసులభము! ఇందేమి శ్రమయున్నది? ఎంత అల్పబుద్ధియైనను జేయవచ్చును. ఫలితమో, సర్వ లోకాధిపతియగు భగవానుఁడు నీకే కష్టములేకుండ రక్షించును. దైవకృపకు మితిలేదే!

42. 'తమేవ శరణమ్‌గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరామ్ శాంతిస్థానమ్ ప్రాప్స్యసి శాశ్వతమ్'

"ఆభగవానునే శరణుపొందుము; లేశమాత్రమును సంశయింపకుము. నీకాయన కృప కలుగును. దాని వలన శాశ్వత శాంతిస్థానము లభించును." గీతావాక్యము దేవు నను గ్రహమెంత సులభము. నీ చిత్తమాయన కర్పింపలేవా? పనికిరాని తుచ్ఛవిషయము లన్నిటి కిచ్చుటలవాటుపడి, దేవు నంతటివాని కిచ్చుటమాని, సకలదుఃఖము లనుభవించు టేమి తెలివి? వెంటనేబుద్ధిమార్చుకొని దైవానుగ్రహ మార్జింపుము.

43. నేనెవరో తెలిసికొనుటకుముందు నేనేది కాదో తెలిసికొనుట సులభము. నేను దేహమునుగాను, నేను మన స్సునుగాను; ఇంద్రియములుగాను, బుద్ధినిగాను; ఇవి పోవు

చున్నవి, నేను పోవుట లేదు. నేను లేని కాలము లేదు. అనగా నేన వినాశమగు నాత్మస్వరూపమును, ఆత్మ త్రికాలాబాధ్యము, ఆత్మజ్ఞాన మనగా నన్ను నేను దెలిసికొనుటయే. నేను పరిపూర్ణ జ్ఞానానంద శాంతి స్వరూపుఁడను. అనంత బల శక్తి స్థైర్యములు నాలక్షణములు.. నాసంగతి నాకు దెలియక యేడ్చుచున్నాను. నన్నుగూర్చిన జ్ఞానమజ్ఞానముచే నావరింపఁబడినది. దానిని జ్ఞానముచేఁ దొలగించుటే మోక్షము.

**44.** పాపమెక్కువగా నిలువయున్నవారికి సద్బుద్ధి పుట్టుటంత సులభముకాదు. వారిబుద్ధి వక్రగతులనే పట్టును. వారిభావములు దోష దూషితములై యుండును, వారి పనులు హేయములై నడచును. వారిని దూషించి మందలించినచో శత్రుత్వము బూనుదురు. ఊరకున్నచోఁ దాము నిర్దోషులమని భావింతురు. వారిని భగవానుఁడే సముచిత శిక్షనిచ్చి బాగుచేయును. వారిని జూచి మనము వారివలె నెన్నడు వర్తింపరాదను పాఠమును నేర్చికొని దైవారాధన తత్పరులమై తరింపవలెను.

**45.** మనశ్శాంతి నిలుచుటెట్లు? ఇదిగో ఉపాయమున్నది, అతిసులభమైనది. నీకు గలిగిన చిన్నవి పెద్దవి సమస్యలను, వెంటనే భగవానుని కొప్పగించి నిశ్చలముగాఁ గూర్చుండుము. నీవట్లొప్పగించుటవలన నేమి జరుగును? నీవు త్రికరణశుద్ధిగా నట్లొప్పగించుచో, భగవానుఁడు వానిని స్వీకరించి పరిష్కరించును. నీ కాహ్లాదము, నానందము,

అఖండశాంతియుఁ గలుగురీతిగా నీసమస్యలను పరిష్కరించును. సర్వలోకైక నాథుఁడు అనంత దయాసాగరుఁడు, భక్తుల ననుగ్రహించుటలో సర్వకాల సంసిద్ధుఁడునగు భగవానుని పరిష్కారములలో లోపము లుండునా? దేవుఁడు సర్వత్ర, సర్వవేళల నిన్నురక్షింప సంసిద్ధుఁడై యుండగా లోటు వచ్చునా ?

46. ఒక గొప్పవిషయము మనము నేర్చుకొనవలసి యున్నది. అది దేవుని నమ్ముటలోని గొప్పరహస్యము, అంతః కరణశుద్ధితో నమ్మినయెడల దైవకృప తప్పక కలుగును, దానికి ప్రత్యక్ష సాక్ష్యమున్నదా?ఉన్నది. మనకేవో కొన్ని పనులు గావలసియున్నవి. ధనమో, పదవియో, యితర వస్తు వాహనాదికమో మున్నగునవి. మనము దేవుని నమ్మితి మను కొంటిమి కాని అది జరుగలేదు. మనము నమ్మితిమే, యేల వాంఛాసిద్ధి కలుగలేదు? కలుగునా, కలుగదా? ఇచటనే ప్రత్యక్షసాక్ష్యము కావలెను. ఓర్పుకావలెను. దేవుఁడు నిర్ణ యించిన సమయమున మనము కోరున నెంతగొప్ప కార్యము లైనను, క్లిష్టమైన వైనను, దేవుఁడు క్షణకాలమున జరిగిం చును ఓర్పు, నమ్మకమునున్న అపజయముండదు.

47. దేవుఁడేది యెందుకెపుడు చేయునో నీకుఁదెలిసి తీరవలెనా? అట్లుతెలిసికొను సామర్థ్యము నీకున్నదా? దేవుఁ డేభావములతో నేది చేయునో నీకుఁ దెలియక పోవచ్చును. అవి విడ్డూరముగా నీకుఁ గనిపింపవచ్చును. ఆశాభంగము

కలిగింపవచ్చును; మనఃక్షోభకారణముగా వచ్చును. కాని నీవనుకొన్నపను లనుకొన్నరీతిగా దేవుఁడు జరిగింపకుండుట నీకు మిక్కిలి శ్రేయస్కరమని నెమ్మదిగాఁ దరువాత బోధపడవచ్చును, వెంటనే బోధపడలేదని దేవునిఁ దూలనాడకుము, నమ్మకము మానకుము, విచారింపకుము, కలఁతపొందకుము, అన్నియు సవ్యములై పరిణమించుటజూచి, నీవే ఆశ్చర్యపడుదువు.

48. దేవుని మరచిపోకుండు కార్యక్రమము నిరాఘాటముగా జరుగుచుండగాఁ డక్కినపనులు నీవేమి చేసినను చేయకున్నను సమానమే, సర్వకాల సర్వావస్థలలోను సర్వకార్యములు దేవుఁడే చేయుచున్నాఁడు నీచేతఁ గొన్నిపనులు దేవుఁడే చేయించును, కొన్ని మానిపించును. నీవుమాత్రము దేవుని పాదములు విడువకుండ భక్తితో నాశ్రయించినచో నీయోగక్షేమ భారమాయన స్వీకరించును. అంతకంటె నీకు వలయున దేమున్నది ? అందుచే నేమిచేయుము, మానుము దేవునిమాత్రము మఱువకు, మఱువకు, మఱువకు.

49. నేనాత్మస్వరూపుఁడనని నమ్మి గుర్తించినచో మనస్సు నన్నెన్నఁడును బాధింపలేదు. మఱియు మనస్సు క్రమముగా హరించిపోవును. మనస్సు నేనని నమ్మితివా, అదినిన్నుఁ బెట్టని బాధలుండవు; సకల దుఃఖమునకు మనస్సే కారణము. మనస్సు నాత్మవశ మొనర్చినచో నీ వాత్మబుద్ధికలిగి తరింతువు.

50. అందరు నీలోకములోనికి వచ్చుట, పోవుట కొఱకే, నీతండ్రితాత, వానితండ్రి, వానితండ్రితాత- ఎంత

వెనుకకుఁ బోవలెనో, అటులే నీకొడుకు, మనుమఁడు, వాని కొడుకు, వానికొడుకు, వాని మనుమఁడు - ఎప్పటివఱకో,- అందఱుపోయిరి, పోవనున్నారు. ఈ యనంతమైన గొలుసులో నీవొక లంకె, ఈ మహాసాగరములో నీవొక నీటిబొట్టువు మాత్రమే. ఈ గొలుసు కదలుచున్నది; తాత్కాలికముగా భ్రాంతివశమున నిశ్చలముగా నున్నట్లుతోఁచును. నిలుచుటకు వీలులేనిచోట నేను నిలుతునను భ్రాంతి మెరిగి తొలగించుకొని, శాశ్వతముగా నిలిచి, సంపూర్ణస్థిర శాంతిసౌఖ్యము లిచ్చు సృష్టిహేతు భూతుఁడైన పరమాత్మ నాశ్రయించుటకుఁ బూనవేమి ?

51. ఆరుమాసములనుండి కదలుచున్న దంతమొకటి ముఖప్రక్షాళణములో నూడిపోయెను. పిసరంత బాధపెట్టలేదు. మరణకాలమున దేహమిట్లూడిపోవలెను, అదియెంతపుణ్యమో! కాని చాలమంది దుర్భర యాతన లనుభవించి, తమసన్నిహితులకును బాధలుకలిగించి. మరణింతురు. పాపమే దానికిఁ గారణము. ఎండినఆకు, పండినపండు. ముచిక పట్టూడి క్రింద పడునట్లు, మనదేహములు పడిపోవలెను. ఇట్టి కోర్కెతోఁ బ్రతివ్యక్తియుఁ బాపవినాశమును, పుణ్య సముపార్జనమును జేసికొనవలెను, దీనిని గుర్తింపవా? దుఃఖము తప్పదు.

52. అన్నిటికిఁ గర్తయేకాక, యేకైక కర్త భగవానుఁడే. ఏపనియు నాతఁడు జగత్కల్యాణమునకు వ్యతిరేకముగాఁ జేయఁడు. అగుచోఁ గొందరను బాధించుటలేదా?

ఆతఁడు పెట్టుబాధలన్నియు జ్ఞానోపదేశ లాభమిచ్చుటకే. భగవానుని గుర్తించి, భక్తిపరులై యుండువారికి బాధ లుండవు; ఏ స్వల్పముగానైనను గలిగినచోఁ బ్రార్థించినచో వెంటనే వానినిఁ దొలగించును. అందుచే లోకకళ్యాణబద్ధుఁ డగు పరమేశ్వరుఁ డీలోకము నెల్లప్పుడు పాలించుచుండఁగా భక్తులమనితలచువారు మనశ్శాంతి నేలచెడఁగొట్టుకొనవలెను? పాపములున్నవా, భగవానుని కీర్తించి పోఁగొట్టుకొనుము; బాధలు కలిగెనా? జపముచేసి తొలగించుకొనుము; ఇదిపరమ సత్యమని, చేసిచూచినఁదెలియగలదు.

53. అమ్మయ్య! దేవుఁడున్నాఁడుగనుక సరిపోయి నది; దేవుఁడే లేకున్న నేమగునో! ధర్మరక్షణమును తు, చ తప్పకుండ సమకూర్చు దీక్ష, శక్తి,సామర్థ్యము, అనంత కృప, పరిపూర్ణముగాఁగల పరమేశ్వరుఁడున్నాఁడు; భయము లేదు, హాయిగా, నిర్విచారముగా నుండవచ్చునని, మానవుఁడు బ్రహ్మానంద భరితుఁడై సుఖింపవచ్చును. జగత్తులో దేవునికిఁ దెలియకుండగా, దేవు ననుమతి లేకుండగా నేమియు జరుగదు, జరుగుట కవకాశము లేదు, అట్టి దేవుని పాదపద్మము లాశ్ర యించి, భక్తితో భీతితో బ్రతుకువారికి బాధలుండవు.

54. ఏ వస్తువునుగాని. ప్రాణినిగాని, మానవునిగాని చూచినను, దేవుఁడే గోచరించుచున్నాఁడు. ముఖ్యముగా మానవులెవరైనను. ధనికుఁడైనను దరిద్రుఁడైనను, పండితుఁ డైనను పామరుఁడైనను,చక్రవర్తియైనను,సామాన్యుఁడైనను,

ప్రతివ్యక్తిలో నేనోయొక లోపముపెట్టి, యేడ్పించి భగవంతుఁడు తన్నుస్మరింపఁ జేసికొనుచున్నాఁడు, స్మరించు వరకు నేడిపించును; వాఁడే భగవానుఁడు, ఆతఁడే లేకున్న యెడల మనమొకరి నొకరు కొరికి తినివేయుదుము. భగవానుఁడందరను హద్దులలో నిలుపుచున్నాఁడు.

55. భగవానుఁ డనేక సమస్యలను గల్పించి, భక్తులపై విసరుచున్నాఁడు, భక్తుఁడు కీలకమెరుగవలెను, తనపై సమస్యలను బువ్వినవాఁడు దేవుఁడే, మరెవ్వరు గారని నిస్సంశయముగా గ్రహించి, వెన్వెంటనే తనపైఁబడినవానిని తిరిగి దేవునిపై విసరవలెను. కాని దేవుఁడు విసరినంత వేగముతోఁగాని, బలముతోగాని భక్తుఁడు విసర లేఁడు. జయము దేవునిదే యగును, కాని శుద్ధభక్తితో మనము మన సమస్యలను దేవునిపై విసరినచో భగవానుఁ డపుడు మనపై మృదు మధుర, శుభకరములైన పరిష్కారములనే మనపై విసరి, శాంతి సౌఖ్యములను జేకూర్చును,

56. "శివుఁడాజ్ఞ లేనిదే చీమకుట్టదు." ఈసామెతలో గొప్ప విశేషములున్నవి. దాని యర్థమీశ్వర సంకల్పము చేతనే సర్వము జరుగుచున్నవి. పండుటాకు రాలుట మొదలు ప్రళయము సంభవించు వఱకు, లోకములో జరుగుచున్న వన్నియు నీశ్వరసంకల్పముచే. జరుగుచున్న వే, జీవులు నిమిత్తమాత్రులు, ఏకైక కర్త యీశ్వరుఁడే. ఈశ్వర కర్తృత్వ మెట్టిది ? ఈశ్వరుఁడు సర్వతో ముఖపరిపూర్ణుఁడు;

ఆయన పనులందుచే లోపరహితములు. జగమంతయునట్టి యీశ్వర సంకల్పముచే నడచుచున్న సత్యము భక్తజనులా నందింప వలసిన మహాభాగ్యము, అట్టి భగవాను నాశ్రయించి బ్రతుకు వారికి లోపరహితము, సుఖశాంతి ప్రదమునగు జీవితము సిద్ధించుచుండగా నికవిచార మెందుకు?

57. క్షణికమైనది జీవితము, అనగా మృత్యువేక్షణములోనైనను తటస్థింప వచ్చును. "ఏమీ జబ్బులేదే! నిన్న మాటాడినాడు; భోజనము మామూలుగాఁ జేసినాడు; నేఁడు మృతుఁడయ్యెన"ని మనము పలుకు చుందుము, ప్రతి వ్యక్తియుఁ దనసంగతియు నిట్టిదేయని గుర్తించి అతివేగముగా దైవరక్షణ ప్రాప్తికి వలయు చర్యలు తీసికొనవలదా?

58. కోటివిద్యలు రావచ్చును; కోట్లధనము లభింప వచ్చును; కాని కృష్ణభగవానుని పాదపద్మములపై దృష్టిని కేంద్రీకరించి, నిశ్చల భక్తితో జీవించు మహాభాగ్యము లభించుట ముఖ్యమైనది. ఇది నిరవధికాభ్యాసమును గోరును. మనస్సులో భగవానుని దివ్యపాదముల కగ్రస్థానమిచ్చి భజించుటభ్యసించి, కృతార్థుఁడైనచో, నట్టివ్యక్తి కిహపర సర్వ సౌఖ్యములు సిద్ధించి తీరును.

59. ఎవరుధన్యులు? పరమేశ్వరుని పరమవిశ్వాసముతో నర్చించి జీవితము గడుపఁబూనని వారి దౌర్భాగ్యము, దానివలనఁ గలుగుదుర్దశలు, సంక్షోభములు వర్ణనాతీతములు. కాని భగవానుఁ డీవిధముగా దుర్దశలు కలుగఁజేసి,

యేడ్పించి, తనయందు భక్తి కలిగించి, క్రమముగా రక్షించును. అందుచే, దుఃఖమునిచ్చు శిక్షణో నిమిత్తము లేకుండ ముందరే మేలొ్కని,అచంచల విశ్వాసముతో నీశ్వరారాధన చేయు పుణ్యమూర్తులే ధన్యులు.

60. మన సంగతులెవరితోడనో చెప్పికొని ప్రయోజనమేమి? వారును మనవలెనేవో రకమైన బాధలు గలవారే, సర్వత్ర నిలిచి, యెల్లవేళల వినుటకు సిద్ధముగానున్న పరమ కారుణ్యమూర్తియు, నవ్యయానందమూర్తియునగు భగవానునితోఁ జెప్పుకొను టెంత సుఖమో! నమ్మి పూజించు వారికి భగవానుఁడు చేయు నుపకారము, సదుపాయములు, చూపు సంపూర్ణానుగ్రహము - సంపూర్ణములై యుండును. అది జీవితము నర్పించి, అర్చించు భక్తులకనుభవైకవేద్యము, వాగతీతము నైనది.

61. నాపనులన్నియు దేవుఁడుదార కృపామృతము జూపి చేయు చుండగా దర్శించి ఆనందించుటయును భాగ్యముతోఁ ద్రిలోక సామ్రాజ్యాధి పత్యమును సాటిరాదు. ఏపని వచ్చినను, మన 'నాన్న' గారైన దేవునితోఁ జెప్పుటచాలు. మనస్సులో ననుకొనినఁ జాలు; చెప్పనవసరముకూడ లేదు. అదృష్టవశమున భగవానుఁడత్యంత సమీపముననున్నాఁడు. మనకంటె ముందుగనే మన భావముల నెఱుఁగఁగలఁడు. సర్వలోక కార్యములాయన తృణలీల నెరవేర్పఁగలఁడు, మనకు శ్రమ లేదు; ఆయనకసలే లేదు. ఈ రహస్యమెఱిగి

చిదానంద పరవశులై జీవించు వారెంత ధన్యులో! వారికి సములు వారే!

62. శాపానుగ్రహ సామర్థ్యమును, నిజమైన భక్తులు, జ్ఞానులు, యోగులు కలిగియుందురు. వారినోటి వెంబడివచ్చు మాటలు నిజములగును, ఇందు రహస్యమేమియును లేదు. భక్తుఁడులేక జ్ఞాని పరిపూర్ణశుద్ధుఁడు భగవదర్పిత సర్వస్వుఁడు; అందుచే భగవత్తుల్యుఁడు. భగవంతునిశక్తి వానిలో ప్రవహించు చుండును. అట్టి వ్యక్తి నవమానించుట, దూషించుట మున్నగు పనులకు బూనుకొన్న వారు తమకుఁ దామే నష్టము కలిగించుకొన్న వారగుదురు. భగవానుఁడిరువురను పరిపాలించును. తప్పుచేసిన వారికి శిక్ష-భక్తులకు రక్ష-అమోఘముగా జరిగించును. శాపమనగాఁ దప్పుచేయు వారు తమ్ముఁదామే శపించుకొను చున్నారు; సత్పురుషులు తమ్ముఁ దామే అనుగ్రహించుకొను చున్నారు. ఇది దేవుని పరిపాలన పద్ధతి.

63. "మీరు చేయవలసిన పనులున్నవి, లేచి వెళ్లి నలుగురిని కలిసికొని, మాటాడి, కార్యసాధన చూచికోవలెను. కదలకుండ కుర్చీలోఁ గూర్చుండుట బాగుగా లేదు, ధర్మమునుగాద"ని మిత్రులు పలుకు చుందురు. "నేను కదలుటెందులకు ? శ్రీకృష్ణ భగవానుఁడు నాపనులుచూచు చున్నాఁడు. నేను కదలవలసివచ్చినచో నన్ను కృష్ణుఁడే కదుపును; నేనుకదల కుండ నాపనులాయన చేయఁగలఁడు,

అట్లు భక్తుని పనులాయన స్వయముగాఁ జేయుటాయన కెంత యోయిష్టము. మఱియు నాయన విలాసము ననుసరించి నన్నుఁగదుపును, నేను కదలుటలేదు, మానుటయులేదు, ప్రస్తుత మాకృష్ణుఁడే నన్నుఁగదల కుండ గూర్చుండఁ బెట్టెను. కారణము తెలియదు; వలయుచో నీవు కృష్ణునే పోయి అడుగుము.

64. వ్యావహారిక జగత్తులో రాగద్వేషములు, కామ క్రోధములు, తప్పవు, ఏలన, లోకములో నత్యధిక సంఖ్యా కులు కామక్రోధాదులకు వశులు, కాని జ్ఞానికాఁదలఁచుకొన్న వాఁడు కామక్రోధాదుల కెన్నఁడును వశుఁడుకారాదు. అందుచే నాతఁడు వ్యావహారిక జగత్తులో మెలగునపుడు మాని యైయున్నచో వ్యవహారములు చెడును. కామాదులకు వశుఁడుగాకుండ వానిని జూపవచ్చును. వానికి వశుఁడై కామాదులఁ జూపినచో నజ్ఞుఁడగును. జ్ఞానియై, అవసరోచి తముగా, జితేంద్రియుఁడై కామాదులఁ జూపకున్న వ్యవ హార భగ్నత కలుగును. అందుచే, నాతఁడు లోపలజ్ఞాని, నిస్సంగుఁడు. నిర్వికారియై పైకి అజ్ఞాని, సక్తచిత్తుఁడువలె వర్తింప వలెను.

65. అణ్వస్త్ర ప్రయోగ భీతియున్నది; జనాభా మితిమీరి పెరుగు భీతి–ఆర్థికముగా దుస్థితి–మున్నగునలజడులు లోకములో శాంతిని జెడఁగొట్టు చున్నవి. కాని భగవంతుని రాజ్యమిది, విశ్వమును సృజించి నడపుచున్న భగవానుని

కీసంగతి తెలియదా ? పాలకులకు. ప్రజా సమూహములకు రాగద్వేషములు పెంపొందినందున అణ్వస్త్ర ప్రయోగము; కామము పెరిగినందున కుటుంబనియంత్రణము; కాంచనాభిలాష మితిమీరుటచే నార్థిక కల్లోలము పెరిగినవి, ప్రజల మనస్తత్వము ననుసరించి, శిక్షణార్థమై, భయంకర పరిస్థితులాయనయే కల్పించుచున్నాడు. భగవంతుని నమ్మి, మితినెఱిగివర్తించు వారికెట్టి భయమును లేకుండ భగవానుడు రక్షించును.

66. నేటి మన రాజ్యములు ప్రజల యిహ జీవితావసరముల నే తీర్చలేనివై యున్నవి. మానవజాతిని దరింపజేయు జ్ఞాన భిక్షనీప్రభుత్వము లెట్లు సమకూర్పఁగలవు? ప్రజలన్న వస్త్రాదిక సంపాదనముకే ఆ యుద్యాయము చాలక కటకటలాడుచుండనిక వారికి పరమార్థ సంపాదనావకాశమేది ? ప్రజల జీవితములో ధర్మార్థకామ మోక్షచతుర్విధ పురుషార్థముల సాధించు కార్యక్రమమిచ్చి జాతిని నడపిన వైదిక మహర్షు లెంతగొప్పవారో! ప్రజలకన్న వస్త్రములనిచ్చు వృత్తుల సమకూర్చి, కొంత తీరికచేకూర్చి, చెదరని మనస్సులు వారికి నిలిపి, ఆధ్యాత్మిక చింతనమున కవకాశము కల్పించిన పరిపాలనమే పూజ్యమైనది.

67. ముక్తి పొందుట కొకచిన్న కార్యక్రమమును జెప్పవచ్చును. నీకుఁ దోఁచిన పనులు చేయుము; నీకిష్టము లేనివి మానుము, కాని ఒకటి మఱువకుము; నీవేది చేసినను దేవుడు

చేయించెననియు, నేనిచేయకున్నను దేవుఁడు మానిపించె ననియు నమ్ముము. సర్వజీవులు దేవుని చేతిలో నుపకరణ మాత్రములనియు, సర్వము దైవాధీనమై యున్నదనియు. నమ్మకము దేవుని ధ్యానించుటయు దేవుఁడే చేయించును. అప్పుడు నీవుచేసిన, చేయునికర్మల పుణ్యపాపములు నీకంటవు. ఈ ఒక్క సూత్రము ఆచరణలోఁ బెట్టిచూడుము. నీవు ముక్తుఁడ వగుదువు.

68 నిజముగా జ్ఞానపిపాసగలవాఁడు సంసారములో నుండ లేఁడు ఏలన సంసారముజ్ఞానవిరోధి;అజ్ఞానవాతావరణము కాలుష్యమును, కొట్లాటలను, కష్టనష్టములను, కోటి వికారములను గలుగఁజేయును. అందుచేతనే పూర్వులు సన్యాసమును, అరణ్యవాసమును ప్రతిపాదించిరి. జ్ఞానసిద్ధి పొందిన వెనుక సంసారము బాధింపఁజాలదు, కాని సాధనకాలములో సంసారము శత్రువై పనిచేయును. నేటియుగములో నాశ్రమ సన్యాసముల కవకాశములు లేవుగనుక బాహ్యమున గృహస్థుఁడై, ఆంతరంగికముగా సన్యాసివై, అత్యంత నైపుణ్యముతో సంసారమున జీవింపవలెను.

69. అన్ని పనులలోను దేవుని దివ్యహస్తమును జూడ వలెను. కారణమన్నిటిలో దేవుని దివ్యహస్తము నిత్యము పనిచేయుచున్నది గనుక, లేనిహస్తమును జూచు ప్రసక్తియే లేదు. దేవుని హస్తమును జూచుటనగా దేవుని దర్శించుటే. "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖః..." అని వేదము పలుకుచున్నది, ఇందొక రహస్యము దేవుని దర్శించుటకంటెఁ బర

మార్థమేముండును? దేవుని దర్శన మాత్రముచే జన్మజరా మృత్యుదుఃఖములే పోవుచుండగా, సంసారములోని వైకల్యములు, అనారోగ్య బాధలు, సంక్షోభములు నశించి, శాంతి సౌఖ్యములు సిద్ధించునని వేరుగా వచింపలెనా?

70. జగములో నేమి జరిగినను శ్రీకృష్ణలీలయే; జగమే శ్రీకృష్ణలీల! ఏలీలకేమి యర్థమో మనము తెలిసికొనఁజాలము కాని భగవానుఁడు కర్త గనుక ఆయన చేయు లీలలన్నియు గంభీరార్థములు కలిగి యుండును శ్రీకృష్ణ లీలార్థము శ్రీకృష్ణవచోమృతము వలననే తెలియును శ్రీకృష్ణవచోమృతము భగవద్గీతయే, ఆయన మన భక్తి ననుసరించి, కొందరకు ప్రత్యక్షముగాను, కొందరకు ఁబరోక్షముగాను దెలియఁజేయును నీవు తరింపఁగోరుదువా? ఏమితటస్థించినను శ్రీకృష్ణలీలయని గ్రహించి శ్రీకృష్ణ పరమాత్మ పాదారవిందముల నెడతెగని భక్తితో నారాధించి చూడు అద్భుత ఫలితములు గోచరించును.

71. ఎవరిమనస్సు నొప్పింపకుండ మాటాడుట కఖండ పుణ్యముండవలెను. ఇతరులపై రాగద్వేషము లున్నచో, నీనోటవచ్చు మాటలు రాగద్వేష కలుషితములై బాధించును. అనగా నీవు జితేంద్రియత్వ మార్జించినఁగాని హిత సత్యవాక్కు నీకు లభింపదు. దైవానుగ్రహముచే నది లభించును, దైవానుగ్రహ ప్రాప్తి పూర్వానేక జన్మకృత పుణ్యరాశియున్న లభించును, కావున శీఘ్రముగా ఁబుణ్య ధనరాశి నార్జింపయత్నింపుము.

72. నీవు భక్తుఁడవా? అగుచో, "ఈపని యిపుడు జరుగవలసినది జరుగలేదు. నాప్రయత్నలోపము కారణము" మున్నగు వాక్యములు భక్తుఁడవైన నీవుచ్చరించుట-నీవు భక్తుఁడవుకావని ఋజువు చేయుచున్నది. ఇందలి రహస్య మును భక్తుఁడు కాఁగోరునతఁడు గుర్తింప వలెను. "ఏది యెప్పుడు జరిగిన నది అప్పుడే జరుగవలెను. ఒకక్షణము, ముందుగాని, తరువాతగాని జరుగరాదు. ఏలన సర్వమీశ్వర సంకల్పము వలననే జరుగును. నీవు భక్తుఁడవైనచో నీశ్వర సంకల్పము ననుసరించి యేకాలమున నేపని జరిగిన నది నీకను కూలము, శుభప్రదమునగును." ఇది పరిపూర్ణ పరమసత్య మని యెఱిగి, యెన్నడును మనోల్లాసమును దొలగించు నశాంతి వశుఁడవు కాకుము.

73. మరణభీతి పోవుటకు దైవభీతి దివ్యాయుధము. దైవభీతియనగా దేవుని కిష్టము లేని రీతి మనమేమైన తలతుమో, మాటడుదుమో, చేయుదుమోయను భీతి. ఈభీతి నూటికి నూరు పాళ్ళు కలిగి, ప్రవర్తించుట కభ్యసించినచో నీకు దేవునితో సన్నిహితమైత్రి యేర్పడును, మైత్రివలన, భీతి ప్రేమగా మారును, ప్రేమ పరిపూర్ణమైనపుడు దేవుఁడు నీవు నేకమగుట వలన, నా వెనుక, భీతి యుండదు; ప్రేమయునుండదు. దేవుఁడు దేవునికి భయపడుట, దేవుఁడు దేవుని ప్రేమించుటయు నుండవు.

74. నిత్యము గీతాపారాయణమున్నచోట శ్రీకృష్ణ భగవానుఁడుండును, అట్లుండునని తెలిసి ఆరాధించు వానికి

భగవానుఁడు దనలీలలను జూపి, వానికర్థములు చెప్పి, పరిపూర్ణ బ్రహ్మజ్ఞాన దానముచేయును. అది గీతలో ప్రతి శ్లోకములో నున్నదని చూపును. భాష్యకారుల భావములు భాష్యకారుల హృదయములను వెల్లడించును; శ్రీకృష్ణభగవానుఁడే భాష్యకారుఁడై చెప్పినచో, శ్రీకృష్ణ భగవానుని హృదయము వెల్లడియగును.

75. సృష్టిలో మహా బలవంతులుగాని, సార్వభౌములుగాని నీవెంట్రుకను స్పృశింపఁ జాలరు; కారణము నీజీవితము శ్రీకృష్ణార్పితము. శ్రీకృష్ణ భగవాను నెవఁడేమి చేయఁగలఁడు? భగవానుఁడంతవాఁడు నీకండయై నిలుచుండగా జగమంతయునేకమై యేమిచేయఁగలదు? ఆభగవానుఁడు చిత్రవిచిత్రముగా మార్చి నీకే సంపూర్ణజయము చేకూర్చును. అందుచే నీవేగొడవయు మనస్సులోఁ బెట్టికొని చలింపనవసరము లేదు – శ్రీకృష్ణ భగవానుని నమ్ముట–కలత చెందుట – పరస్పర విరుద్ధములు, ఇది నమ్మి ఋజువు చేసికొనుము.

76. ఈశ్వరాజ్ఞ లేనిదే ఆకు కదలదు. వాయువు చలింపదు; రవి చంద్రు లుదయింపరు; నీవు కదలుట, కదలకుండుట నీచేతిలోని పనియని తలఁచుట దారుణ భ్రాంతి, నీవు కూర్చుండుట, లేచుట, చేయికదపుట, ఱెప్పవాల్చుట, తెరచుట ఇవియు నీశ్వరాజ్ఞ లేనిదే జరుగవని దృఢముగా నమ్మి, యీశ్వరానుగ్రహము సంపాదించుకో!

77. ఓ కృష్ణప్రభూ! సర్వము నీసంకల్ప ప్రభావముచే జరుగుచున్నది. సర్వములో - మినహాయింపు లేదు. నేను నేడిట్లుంటుట నీ సంకల్పమే, నేనెట్లుండ వలెను, ఎట్లుందును, ఏమగుదును? 'నాతండ్రీ! నీవెట్లు చేసిన నట్లుందును. నీవు నన్ను భక్తుని, జ్ఞానిని, ముక్తునిఁజేయ (బూనినచో నటులే యగుదును. నీవు నన్ను నిన్నుఁగాఁ జేసిన నట్లగుదును ఎప్పుడు? నీదయ కలిగినచో నిప్పుడే! అదియు నీనిర్ణయమే అంతా నీవే; నేనునీవేమో!

78. తల్లిదండ్రులను గాని, భార్యను గాని బిడ్డలను గాని, మిత్రులను గాని నమ్ముటకంటె, భగవానుని నమ్ముట వేయిరెట్లు సులభము, అనంతకోటిరెట్లు శుభసుఖ ప్రదము నైన పని. పైవారందరకు మనపైఁ గొంత ప్రేమ యుండ వచ్చును గాని స్వార్థమధికముగా నుండును. దేవుఁడు చూపునది స్వార్థరహితము సంపూర్ణమునగు ప్రేమ, స్వచ్ఛహృదయముతో నమ్మిన నాతఁడు చేపట్టి సర్వమిచ్చును.

79. దేవునాశ్రయించి యింకను బెంగలెందుకు? సర్వదోషములను దునుమాడి సర్వశుభములిచ్చు అనంతశక్తి నిధి దేవుఁడై యుండగా, సర్వత్ర చేతులుసాచి, రక్షించుటకుఁగనిపెట్టికొని యుండీ ఎదురుచూచుచుండగా (బరిశుద్ధ చిత్తముతో దేవునికి నమస్కరించుటకు సంకోచమేల? చిత్తమిచ్చి స్మరించుటెంత సులభమైనపని. అన్నిబెంగలు విడిచి, చేతులు జోడించి దేవుని నిత్యము ప్రార్థించుటయే చేయలేవా?

తుచ్ఛకాంక్షలతో నీహృదయమును తూట్లుపడఁజేసికొని దుఃఖించుటకు నీకేమి ప్రారబ్ధము పట్టినది ? మెలకువయను చీపురుపెట్టి, బెంగలన్నిటిని తుడిచిపెట్టు! దేవుఁడను చక్రవర్తి యింట యువరాజువలె నూనూగుమీసములు దువ్వుకొనుచు హాయిగా నానందప్రపూర్ణ హృదయముతో జీవించు, నీకెన్నడు లోటుండదు.

80. మనస్సులోఁ గాలుష్యము, కలఁత, విషాదము, దైన్యము మున్నగునవి క్రిములవలెఁ జిత్తశాంతిని, ఆనందమును కొఱికివేయుచుండగా ఁజూచి, ఊరకుండుట కంటెఁ గుష్ఠాదిజాడ్యము లనుభవించుట మంచిది. మనస్సును శుభ్రపరచుకొను కార్యక్రమ మొక్కటే ముఖ్యమైనది. రాగద్వేషాదులు, కామక్రోధాదులు లేకుండఁ జేకొనుము. అది నీకసాధ్యమైన పనికాదు; మఱియు నత్యంత సులభసాధ్యము, అనంతశాంతి సుఖప్రదము. భగవానునేకైకకర్తృత్వమును, అనంత ప్రజ్ఞాన్విత కృపామృతమును నమ్మి భజించుట కారంభింపుము. ఇదియే రాజమార్గము, ఒక్కఅడుగు ప్రక్కకు వేయకుము.

81. గంగా ప్రవాహమువలె, స్వచ్ఛానందమమృతమై హృదయములోఁ బ్రవేశించి చేకూర్చుహాయి వాగతీతమైనది. "నాన్న అన్నియు ఁజూచును. నీకెందుకు? ఆయన పాదపద్మములు నమ్మి స్థిమితముగాఁ గూర్చుండుము. నాన్న అను భగవానుఁడు అనంత కృపానిధి, అనంత ప్రజ్ఞానిధియు

అప్రమేయ బలసంపన్నుఁడు నగుటచే, నీకెట్టి కష్టము, లోపము, అవమానము. అశుభము, హాని, భీతి, మున్నగునవి నీదరికి రానీయఁడు," అను పరమసత్యమును నమ్మి చూడుము, నాన్నగారి మహిమ!

82. నీజీవితమును సంపూర్ణముగా భగవానుని కర్పించి-తరువాత నీవర్పించిన మాట మఱచి, మరల నీజీవితము నీకుఁదోఁచినట్లు వాడుకొనఁ బూనుకొనుట – దేవుని కిచ్చిన సొత్తునపహరించుటే యగును. అది దేవునింట నీవొనర్చిన చౌర్యమగును. చౌర్యమునకు శిక్షలున్నవి. భక్తులమని అనుకొని పెక్కురీ విధమైన చోరత్వమునకు బాల్పడి, బాధించు శిక్షలనుభవించు చున్నారు. అందులకే భక్తులమనుకొనువారికి బరీక్షా రూపమున బెక్కుకడగండ్లు తటస్థించి బాధించు చుండుట మనము చూచుచున్నాము. నీజీవితము దేవునికి దానము చేయుము; దానమిచ్చినది మఱల బుచ్చుకొను తలంపు పెట్టుకొనకుము; దొంగ బుద్ధిని విడిచి పెట్టి, సర్వశుభ సంపత్సంపన్నమైన సర్వోత్తమస్థితిని సంపాదింపుము.

83. సర్వదోషపరిహారకమై స్వచ్ఛ పవిత్ర హృదయము కలుగుటకు బరమేశ్వరారాధన మేకైకమార్గము. పరమేశ్వరారాధనమే పరమేశ్వరు నారాధించు కోర్కెను గలిగించును. ఏది ముందు, ఏది వెనుకయను సమస్య లేదు, రెండును గలిసి యేకకాలముననే జరుగుచు విజయము లభిం

వఱకు (గొనసాగును. అందు తీర్ణత లభించుటయు మోక్ష సిద్ధియు నేకకాలముననే జరుగును పరమేశ్వరారాధన మొక సారి చిత్తశుద్ధితో నారంభించుటే నీపని; ఆతరువాత నదియే నిన్ను స్వవశమొనర్చికొని, నీయీశ్వరారాధన కార్యక్రమమును మోక్షసిద్ధి కాలము వఱకు మానకుండునట్లు కాపాడి చేయించును. దేవునెదుట నిలిచి నీవు నమస్కరించినచో నాతఁడికఁ నిన్నెన్నఁడును విడిచి పెట్టఁడు!

84. భగవానునితో నిట్లు సంభాషణ జరిపితిని. దేవుఁడు, "ఏమిరా తప్పుచేసితివి?" నాజవాబు; "నేనుతప్పు చేయలేదు." నేను చేసినది తప్పైన నీవేల చేయించితివి? భగవానుని జవాబు; "అయినచో నొక మంచిపని చేసినపుడు, నేనుచేయలేను, భగవానుఁడే చేయించెనని పలుకుదువా?" నాజవాబు; "అనుమానము లేకుండ నటులే భావించి పలుకుదును. మఱియు నా బాధ్యతను నీకు హృదయపూర్వకముగా నొప్పఁజెప్పి వేసితిని, నేనికఁ దప్పు చేయకుండఁజేయు బాధ్యత నీదై యున్నది. ఇఁక నేను చేసినదెల్ల మంచిదే కావలెను; నీవు చేయించిన దానిలోఁ దప్పుండుట కవకాశమేది? దేవుఁడు చేసిన, చేయించిన దానిలోఁ దప్పుండుననుట మహాపాతకము." "ఈదీక్షతో నీవున్నచో, నీకెట్టి దోషమంటదు" దేవుని తుదిమాట!

85. అనుకూలవతియగు భార్య గలుగుట యనునది అసాధ్యములలో నొకటి. భార్యా భర్తల మధ్య మందు నెల

కొనియుండు ప్రేమయనునది స్వార్థ కలుషితము గాకుండ నుండుట కవకాశము లేదు. స్వార్థ ప్రయోజనముల అను కూల్యముల ననుసరించి భార్య అనుకూలవతి, భర్త ప్రియుఁడునై వర్తింతురు. దైహిక సుఖాపేక్షపై నాధారపడు ప్రేమ స్థిరము, పవిత్రము, సంపూర్ణము కాఁజాలదు, ఏకొలఁది కుటుంబములలోనో అరుదుగాఁ దపస్సు, దైవభక్తి, ధర్మ దీక్షయు ఁజిన్ననాటి నుండియు సుశిక్షితములై వర్తించునో, అచట ఁగొలది మంది వ్యక్తులు, ప్రేమ లేశము చూపుట కవకాశము లేకపోలేదు. అత్యధిక సంఖ్యాకులలో ప్రేమ యిచ్చిపుచ్చుకొను కూరగాయల బేరమే.

86. భగవాను నిట్లు ప్రార్థింప వలెను; "నామనస్సులో నేభావములుండుట వలన నీకృప నాకు ఁగలుగునో అట్టి భావములనే ఉండనిమ్ము; నిన్ను మరచి, నీకృప లేకుండ ఁజేయు భావములనునామనస్సులో ఁజేరనీయకుము. ఆపని నీదే! నేను జేయుటకు సమర్థుఁడనుగాను, నామనస్సు నేను చెప్పి నట్లుగా వినదు. కామకాంచన సుఖాపేక్షలను, నన్ను నిగ్ర హింపు మనుట, ధర్మమా? నీవిచ్చిన గాని నిగ్రహించు శక్తి నాకెక్కడిది? అందుచే నిన్నే వేడికొందును; నన్ను ఁబుణ్యాత్మునిగా ఁదీర్చిదిద్దుము. అట్లుదిద్దుటలో నాకెట్టి బాధలు యాతనలు కలుగకుండ దిద్దుము"

87. భగవంతుని స్మరింపరు, ఆశ్రయింపరు; తమ తెలివితో సకల కార్యములు చేయఁగలమని నమ్మి అది

అసత్యమగుటచే దుఃఖముల పాలగుదురు. కాని అట్టివారి నెన్నడును నిందింపరాదు. భగవంతుఁడే భగవంతుని స్మరింప ఁజేయనిదే తమకు ఁదామై యెవ్వఁడును స్మరింప ఁజాలరు. భగవానుఁడే ఆశ్రయింప ఁజేసికొని, భక్తులనుజేసి, వారిని దరింప ఁజేయును.

88. ఏపని చేయఁదలచినను దాని వలని సదసత్ఫలితము లెట్లుండునో మనకు సమగ్రముగా ఁదెలిసికొనుటకు వలయు సకలాంశములు మనకు సువిదితములు గావు. మన బుద్ధి శక్తి పరిమితమైనది; కొన్ని తెలియును; అన్నిఁటిని ఁదెలియవు. సర్వాంశ విజ్ఞానరాశి కృష్ణప్రభువే. అందుచే మనము కృష్ణప్రభువు పాదపద్మములు నమ్మి, సంపూర్ణాత్మ సమర్పణము చేసినచో, సంపూర్ణ సర్వాంశ సమన్వయ జ్ఞానముచే, సర్వకర్తయైన ప్రభువు, మనకేది శుభసుఖప్రదమో నిర్ణయించి జరిగించును. ఆయన జరిగించినదే మనకెల్లప్పుడు శ్రేయః ప్రదమగుననుటలో సందేహము లేదు.

89. ప్రతి క్షణము, ప్రతి స్థలము, ప్రతి విషయము శ్రీకృష్ణప్రభువు నధీనమై, ఆయన సంకల్ప నిర్ణయములతో మేళవించి యుండును. ఇది గుర్తించిన వ్యక్తి అవ్యయ శాంత్యానంద సామ్రాజ్యకిరీటధారి కావచ్చును. శ్రీకృష్ణ ప్రభువెప్పుడేది యెందుకు ఁజేయించునో ఆచింతయు మన కవసరము లేదు. మనము మనహృదయ మిచ్చి ఆప్రభు పాదముల నెన్నడు విడువక కూర్చుండుట నేర్చినచో నన్నియు

మన కనుకూలములై, శుభప్రదములై, ముక్తి నిచ్చునవై జరుగును. చిన్నపని, అనంత ఫలితము! ఈసాధనమును జీవితములోఁ జొప్పించి, ధన్యుఁడవై సుఖింపుము

90. స్వేచ్ఛా ప్రవృత్తి కధికారమిరువురకున్నది. స్వైరవిహారి, భక్తియుక్తనిరహంకారి. (1) స్వైరవిహారి యనగా మూర్ఖుఁడు, తుంటరి; నీతి నియమములు గాని దైవ భీతికాని లేనివాఁడు, వాఁడు స్వేచ్ఛగా వర్తించి, సర్వ దుఃఖ ముల ననుభవించి, శాశ్వత నరకము ననుభవించును, (2) భక్తుఁడు, నిరహంకారి. నేనను దావగింజంతయైన మిగుల్చు కొనకుండ, భగవంతునికి సర్వార్పణముచేసి, పరిపూర్ణ నిర హంకారియై జీవించును, అప్పుడన్నియు నాతనిచే భగవానుఁడే చేయించును. అందుచే నాతనికే లేశమాత్రమును కాలుష్య మంటదు. భగవానుఁడు పూర్ణశుద్ధుఁడు; భక్తుఁడునంతే!

91, ఎవఁడో మనకెట్టి శ్రమయు లేకుండ మన పను లను జేసిపెట్టుట మనకెల్ల పుడానందము నిచ్చును. ఆతఁడెట్టి వాఁడైన, నిస్సంశయము, నిరవధికము సంపూర్ణము, నిష్క లుషమునైన యానందము లభించునో తెలిసికొనుట కష్టము కాదు. మానవ లోకములో నెవఁడైనను, ఎంత ఉత్తమ వదాన్యుఁడైనను వాని శక్తులు పరిమితములే. మన కోర్కె ననగా దుఃఖలేశములేని అఖండానంద కాంక్షను మానవుఁడు తీర్పలేఁడు. ఇఁక భగవానుఁడొక్కఁడే దానిని దీర్పఁగలఁడు, నీవు వానికి స్వాధీనుఁడవై, నిలిచిచూడు. అది ఉత్తమ తపస్సు; ఫలితము దైవానుగ్రహ సంజాత నిరవధి కానందము.

92. దూర సామీప్య శబ్దములు రెండు ప్రకృతిలో అన్నివస్తువులకును వర్తించును. ఒక్క భగవానుని కవి వర్తింపవు. ఆతఁడు సర్వవ్యాపిత్వము గలవాఁడు; సర్వ స్వరూపియు, లోపల వెలుపల నంతట నిండియున్నాఁడు. అందుచే దేవు నెఱిగి యారాధింపఁగోరువారి కత్యంత సౌలభ్య మేర్పడినది. సామీప్య శబ్దమునిచట వర్తింపదు. ఏలన, అన్నిటితోనేకమై, అన్నిటి రూపమై యున్న భగవానుని సమీపవర్తి యనుటయు బొసఁగదు. ఏకత్వము సామీప్య మెట్లగును? సామీప్యము కొలదిగానైన దూరమును సూచించును. ఇఁక సర్వత్రనున్న వానికి దూరత్వమెట్లు పొసగును? అందుచే దేవుని జూచుట కారంభించి, నీలోనే దేవుని జూచి, నీకంటె దేవుఁడు వేరు కాదని గ్రహింతువు.

93. కాలత్రయమందు నెట్టి క్లేశము లేకుండ ఆనంద మనుభవించుచు జీవితమును గడపుట కుపాయ మొక్కటే యున్నది. భూతకాలములో జరిగినవన్నియు భగవానుఁడు చేసినవే; వర్తమానములో నన్నియు భగవానుఁడు జరిగించుచున్నాఁడు; భవిష్యత్తులో నంతే; అన్ని కాలములలో నన్నియు భగవానుఁడే అన్నియు జేయుచుండగా, నీకు విచార మెందుకు? నీకేమైన బాధలున్నవా? పో! ఆయనపాదములపై దలమోపి, నీబాధ లాయనతోఁజెప్పికొని కన్నీళ్ళు విడిచి పెట్టుము నీకంటిరెప్పల తడియారులోపున, ఆయన నిన్ను గ్రహించి, నీబాధలు తొలగించును!

94. అధ్యాత్మిక సాధనమనఁగా ననుక్షణము మెలకువగా నుండుటే, ఏయొక్క క్షణములో నీవేమరపాటు చూపినను, గతసాధనమంతయును గంగపాలుకావచ్చును. ఇఁక ముందు నీవసలే చేయలేక పోవచ్చును. కావున ననుక్షణ జాగృతి వలయును. ఒకవేళ నీసాధనకు భంగకరములైన సంఘటనలేవైనఁ దటస్థించుచో, గుర్తించి, వెన్వెంటనే. "హే ప్రభూ! ఇదియేమి? చూడు" మని దేవుని కెదుట నిలిచి చెప్పుకొనవలెను నీవట్లు చెప్పుకొనుటయు, నీవెదుర్కొను సంఘటనలు తొలగుటయు నేకకాలముననే జరుగును.

95. దంతములు పూర్తిగానూడినవెనుక నావ్యక్తి అలవాటు చొప్పున, నమలు చుండుట మానఁడు. దంతము లున్నప్పు డవసరార్థము నమలును; లేనప్పు డలవాటుచే నమలును.అభ్యాసబలమే యీపనికిఁ గారణము అదేవిధముగా 'నేను' లేక 'అహం' దేవుని కర్పించివేసిన వెనుక, అభ్యాస వశమున మరల 'అహం' కారము యథాస్థానమునకు వచ్చి కూర్చుండి, 'నేనుచేయుచున్నా'నని పలుకుచుండును, 'నేను'ను దేవుని కిచ్చివేసితినను సంగతి మఱచిపోవును దేవుని కిచ్చిన దానిని మరలఁ బుచ్చుకొనుట దేవుని ద్రవ్యము నపహరించుటేయగును. సాధకుఁడిట్టి దైవద్రోహమునకుఁ బాల్పడి, తానింకను భక్తుఁడనే యని తలచుచుండుట దైవద్రోహమే కాక, ఆత్మద్రోహమునగును.

96. ద్వేషింపఁ దగినవారు లోకములో నిజముగా లేరు, కొందరను మిత్రులను, కొందరను శత్రువులు గను భాసింపఁజేసి భగవానుఁడు జగన్నాటక కళాప్రావీణ్యమును జూపుచున్నాఁడు. ఉభయులలోనుఁడి దేవుఁడే మిత్రామిత్ర భావముల గలిగించు చున్నాఁడు, మనకు నిశితవీక్షణ శక్తి లేమిచే, మిత్రశత్రు భావము దేవుని లీలయని గ్రహింప లేకున్నాము, దేవుని స్వరూప స్వభావము లెరిగి, భక్తితో నారాధించినచో నాతని నటన కర్థము తెలిసి. యావెనుక, దేవుని లీలయని గ్రహించినంతనే, మనకు శత్రువులుండరు; అందరు మిత్రులేయగుదురు, చూడు శత్రువు వెనుక, మిత్రుని వెనుక దేవుఁడే నిలిచి, నవ్వుచున్నాఁడు. అన్నిటివెనుక, అందరివెనుక దేవుఁడే! నీవెనుక దేవుఁడే!

97. కోపమునకు స్థానములేదు, ఏప్రాణియు నేవిషయమునకు నిజమగు బాధ్యత గలదికాదు. భగవానుఁడే అందరలోనుండి, అన్ని పనులు చేయించుచున్నాఁడు. ఈ రహస్యమెరిగినచో, నెవరి యెడనైన నీకుఁ గోపము కలుగవలసి వచ్చుచో నిజముగా దేవుఁడే కర్తగనుక, కోపగింపఁ దగిన వాఁడు. దేవుఁనిపైఁ గోపము కలుగుట రెండు కారణములచే వ్యర్థము (1) దేవుఁడు సర్వాతీతుఁడగుటచే నీకోప మాతని కంటదు. (2) నీవు మూర్ఖుఁడవై దేవుఁనిపైఁ గోపముచూపి నీవా దేవు నేమిచేయఁగలవు? పైగా నిన్నాతఁ డుచితరీతిగా శిక్షింప సమర్థుఁడు, అందుచేఁ గోపమునకుఁ దావు లేదు.

98. ఎవరి పనులలోను జోక్యము కల్పించుకొనుట తప్పు, అందు ముఖ్యముగా సత్పురుషుల విషయములో జోక్యము శిక్షార్హము, ఇఁక సర్వలోకైకనాథుఁడగు దేవుని పనిలో జోక్యము పెట్టుకొనుట ప్రమాదహేతువు. ఈ లోకములో నేమిజరిగినను దేవుని జోక్యము లేనిదేజరుగదు; దేవుని జోక్యమును గుర్తింపక, దేవుని కార్యక్రమములో నీ జోక్యమా? దేవునారాధించుటే నీపని. తక్కిన వన్నియు దేవుని పనులే. దైవారాధన మను దివ్యకార్యక్రమమున నిమగ్నుఁడవైన నీకు వేరుపనికిఁ గాలమేది? నీగొడవ నీవు చూచికొమ్ము. ఇతరుల గొడవకై క్షణార్థమైన వ్యర్థమొనరింపకుము.

99. నీవొక బలశాలి చేతిలోఁ బట్టుబడినచో నాతఁడు నిన్నుఁగదలకుండఁ జేయఁగలడు. అనగా నీకే మాత్రమును స్వేచ్ఛ లేకుండఁ జేయును. ప్రాణులందరు అనంతబలసంపన్నుఁడైన భగవానునిచేతిలోఁ బట్టుపడియున్నారు. స్వేచ్ఛకై గింజుకొనుచున్నాడు. తమ స్వశక్తిచే బయటపడి స్వతంత్రులై సుఖింపఁ గోరుచున్నారు. కాని దేవునిపట్టునుండి తప్పించుకొను శక్తి యెవరికినిలేదు. మానవుఁడు దైవబలము నెరిగి, తన బలహీనతను గుర్తింపవలెను. భగవాను నాశ్రయించి పూజించినచో దేవుఁడే బంధవిముక్తి నిచ్చును. స్వప్రయత్నము వ్యర్థమని తెలియుట, దైవ కృప నార్జించుటే బంధవిముక్తి మార్గమని గ్రహించుట, దైవకృప నార్జించుటకై నిరంతర ధ్యాన దీక్షయు ముఖ్యము.

100. ప్రతి వ్యక్తియుఁ దన సముద్ధరణకై తాను జపము చేసికొనుటేకాక, యితరులకై తప్పనిసరిగా జపము చేయవలెను. "నాబుద్ధివక్రతనుబోఁగొట్టి పరిశుద్ధ చిత్తము నిచ్చి రక్షింపు"మని దేవుని ప్రార్థించుట తప్పని సరియైనదే; కాని నాసన్నిహితులు, బంధువులు, మిత్రులు, నాకు సంబంధించిన యితరులు వక్రబుద్ధులై, కలుషిత చిత్తులైనచో వారితోఁ గలిసిజీవించుటచే నాబుద్ధియు వక్రించి భ్రష్టమై తీరును. అప్పుడు నేనును దేవునిభజించుట మఱచు దుస్థితి సంభవించును. కావున ప్రతివ్యక్తియు. "నన్ను, నాకు సంబంధించిన అందరను పరిశుద్ధులఁజేసి రక్షింపు"మని ప్రార్థించుటభ్యసింపవలెను.

101 మనకుఁ గలుగు చికాకులు, బాధలు, దుఃఖములకుఁ గారణము దేవునిపని మననెత్తిపైఁ బెట్టుకొనుచున్నాము వానినిమోయు శక్తిలేనివార మగుటచే నవి మనల బాధించుచున్నవి. అవిలేకుండఁ బోవుట కొకటే యుపాయమున్నది. సకల ప్రాణుల భారములు దేవుని భుజస్కంధములపై నున్నవి. ఆయనకెట్టి భారము నుండదు. అనంత జగద్భార మును వహించు నఖండ పరిపూర్ణశక్తిగల భగవానునికి ప్రాణుల భారము వహించుట తృణప్రాయ మైనది. ఈ సత్యమును మనస్సులో నుంచుకొని, "భగవాన్! నాభారములన్నిటిని నీవే తొలగించి రక్షింపవలెను. తొలగించుకొను శక్తి నాకెక్కడిది?" అని ప్రార్థించుటయే కర్తవ్యము.

102. భగవత్కృపామృతమును రుచిచూచి అందలి ఆనంద మాధుర్యము లింద్రియ సుఖములకంటె నత్యంత శ్రేష్ఠమైనవని అనుభవ పూర్వకముగాఁ దెలియనినాఁడింద్రియ సౌఖ్యాభిలాష నెవ్వఁడును విడిచిపెట్టఁ జాలఁడు, అత్యంత మధుర క్షీరాన్నము లభించువరకు, అన్నమే తినుచుందుము. లోకులు కామకాంచన దాసులుకాక ఏమిచేయుదురు. ఇంద్రియ సుఖాపేక్ష విడిచిపెట్టినఁగాని దైవకృపామృతము లభింపదు. దైవ కృపామృతమును రుచిచూచినఁగాని, యింద్రియసుఖ లాలసత్వముపోదు. ఏమిచేయవలెను? దైవకృపకై తీవ్ర పరి తాపమంది భజించుటే. దైవకృపచేతనే అదియులభించును.

103. ఏఆలోచనగాని, మాటగాని. పనిగాని, ఎట్టి వాఁడుచేసినచో లోపరహితమగును? జవాబు మిక్కిలి సుల భము, పరిపూర్ణ జ్ఞానమూర్తి, సంపూర్ణానంద శాంతి సమృద్ధి గలిగి, సర్వసమర్థుఁడైన వాఁడుచేసినచో నట్టిలక్షణములు పట్టును. అట్టిపూర్ణ పురుషుఁడు దేవుఁడొక్కఁడే, మనకందరకు లోపములు, దౌర్బల్యములు, కళంకములు, అల్పజ్ఞత. అపరి పూర్ణత మున్నగు ననేకలోపములున్నవి. అందుచే మనకుఁ గావలసినవన్నియు దేవునిచేఁ జేయించుకొనవలెను. మనము మనఃస్ఫూర్తిగాఁ గోరుచో మన కనుగ్రహము చూపుటకు దేవుఁడెల్లప్పుడు సిద్ధముగానున్నాఁడు.

104 పురుషప్రయత్న మున్నదనుకొనుట, స్వహస్త ముతోఁ దలపైఁ గొట్టివిపెట్టి గోకుకొనుటే! సర్వసంపూర్ణ

కర్తృత్వాధికారి భగవానుఁడే నేను ప్రయత్నించి పనులు చేయుట లేదా? చేయుచున్నాను. నేనెట్టి కర్తను? స్వతంత్ర కర్తనుగాను, దేవుఁడు చేయించు కర్తను. కొన్ని పనులు దేవుఁడు కొంతశక్తినిచ్చి నాచేఁ జేయింపుచున్నాఁడు ఆయన నిర్ణయించినపని, ఆయన యిచ్చిన శక్తి, ననుసరించి, నేను కర్తనగుదు. భగవానుఁడు కర్త; నే నుపకరణమును

105. "మమమాయాదురత్యయా"యని శ్రీకృష్ణ భగవానుఁడు గీతలోఁ బలికినాఁడు. భగవానుఁడు కల్పించిన మాయ నెవ్వఁ డతిక్రమింపలేఁడు. మాయలో బ్రతుకుట, చీకటిలోఁ బ్రతుకుటయే, ఎచట నేమున్నదో, ఏదియెట్లున్నదో, దేనిస్వరూప స్వభావము లెట్టివో ఏమియు దెలియని కారణమున జీవితము దుఃఖమయ మగును. పోని, మాయ నతిక్రమించి, జ్ఞాన సూర్యకాంతిలో సకల విషయార్థముల నెరిగి నచో సుఖముగా జీవింపవచ్చు నన్నచో మాయ నతిక్రమించు నుపాయమున్నదా? ఉన్నదని మాయ నతిక్రమించు మార్గమును భగవానుఁడే. "మామేవయే ప్రపద్యంతే, మాయమేతాం తరంతితే," నన్నెవరు శరణు పొందుదురో వారు నామాయను దాటఁగలర"ని పలికినాఁడు, మాయాతీతుఁడైన భగవాను నాశ్రయించుటచే మనమును మాయాతీతులము కాఁగలము.

106. "మానావమాన యోస్తుల్యః" భగవానుఁడు గీతలోఁ బలికినాఁడు. పలుకుటయే కాక, తనభక్తులు కాఁగోరు

వారికందర కవమానములు కలిగించి, మానావ మానతుల్య భావమును నేర్చికొమ్మని ప్రోత్సహించుచున్నాఁడు. కాని అవ మాన మత్యంత సన్నిహితుల వలననే జరిగినప్పుడీ శ్లోకము భక్తునకు జ్ఞాపకముండదు. అందుచేఁ దాను రక్షింపఁ దలచిన తనభక్తుల కవమాన పరంపరలు కలిగించి, జ్ఞాపకము వచ్చు రీతిగాఁ చేయుచున్నాఁడు. మానావ మాన తుల్యత్వమును సాధించిన భక్తుల రక్షించుచున్నాఁడు,

107 ఎన్ని తెలిసినను మనస్సు కలుషితమై విషాద గ్రస్తమగు చుండును. అనగా దానిభావమేమనగా మనకుఁ దెలియవలసినదంతయుఁ దెలియలేదనియే. మఱియుఁ దెలియ వలసినదంతయు బుద్ధిస్థాయిలో మాత్రమేకాక, అనుభూతి స్థాయిలో సాక్షాత్కరించుటే నిజముగాఁ దెలియుట యగును. అనగా సంపూర్ణసత్య సాక్షాత్కారసిద్ధిలేక బ్రహ్మజ్ఞానసిద్ధి. లేక దైవదర్శన సంసిద్ధి కలుగవలెను. అప్పుడు సంశయ సంపూర్ణ రాహిత్య మగును. అప్పుడిక విషాదమునకుఁ దావుండదు. అప్పటివఱకు నేను దెలిసినవాఁడనని యెవ్వఁడు తలపరాదు, ఓర్పుతో. భక్తితో, వినయముతో నీశ్వర ధ్యానముచేయుట నెన్నఁడు మానరాదని తెలియవలెను.

108. అనంత సృష్టివైచిత్ర్యములను దెలిసికొనుట కెన్నిజన్మములును సరిపడవు, ఏలన 'అనంత' శబ్దమే 'అసాధ్య' మని సూచించు చున్నది. కాని కొన్ని వైచిత్ర్యములను మచ్చుగాఁ జూచి, భగవానుని మహత్త్వమును పిసరంత

గ్రహించి, భగవాను నప్రమేయత్వము నూహింపవచ్చును. సపోటాకాయలుకోసి బుట్టలో ముగ్గవేసితిని. ఒకటో రెండో మెత్తపడెను. కండచీమలు పుట్టలుపట్టి తినివేయనారంభించెను. వానికెట్లు తెలిసెను, పురుగుపట్టి, పంటలను, కూరగాయలను తినివేయును. మందారాది పుష్పముల రేకలనుకొరికివేయును, బియ్యమునకుఁ జీమలు, ఎలుకలు; ఈగలు, దోమలు మానవ దేహములపై ప్రాలి రక్తమును పీల్చును. భగవానుఁడేల వీనిని నిర్మించెను? ప్రాణులే ప్రాణులను దినుట! మనకుఁ దెలియదు; అన్నియుఁ దెలియునని గర్వింతుము!

109. సర్వ దోషములకుఁ బరిహారము సర్వేశ్వరా రాధనమే. ఏబాపతు దోషము, తన్మూలమున క్లేశము సంభవించినను, సంభవింపనున్నను. దక్కిన గొడవలన్నియు విడిచిపెట్టి, పరమేశ్వర పాదారవిందముల భజించుటేపని. ఎట్టి దోషములనైనను తృణప్రాయముగాఁ బరిహరించి, భగవానుఁడు రక్షింపఁగలఁడు, రక్షించును. ఇది సులభసాధ్యమైన పనివలె గోచరించును. కాని దోష క్లేశములు సంభవించి. దేవుని మరపింపఁజేయును. నిరంతర సాధనచే నట్టిమరపు రాకుండఁ జూచికొని, మరపు రాకుండఁ జేయుమనియు దేవునే ప్రార్థింపవలెను.

110. మనము దేవునితో సంబంధము పెట్టుకొనుటలో వజ్రసంకల్పము, దృఢనిశ్చయము ముఖ్యమైనవి. నీయోగ క్షేమభార మాభగవానుని హస్తములలో నుంచుట యనున

దంత స్వల్పవిషయముగాదు, భగవానుఁ డెట్టివాఁడో బాగుగా నాలోచించితివా? నీ వాయనను పరిశుద్ధ చిత్తముతో నమ్మి నచో, నీ కింక లోకెన్నఁడు తటస్థింపకుండగా రక్షించును. అట్టి అనన్య సామర్థ్యము, కృపయు ననంతముగా గలవాఁడు భగవానుఁడు. నీవు నమ్మితివా? నీ నమ్మకము తిరుగులేనిదై యుండవలెను. అంతే–సర్వ దుఃఖములు, బాధలు లోపములు పోయిన వన్నమాటే!

111. భగవానుని ప్రత్యక్షముగాఁ జూచుటనగా అసాధ్యవిషయము, అనంతకోటి సూర్యుల తేజస్సాయనది. మనము చూడలేము. మనకుఁగల అల్పదృష్టితో, మానవరూపము ధరించిన భగవానుని శ్రీరామునిగనో, శ్రీకృష్ణునిగనో చూడఁగలము, మఱియు భగవానుఁడే తప్ప జరిగించుట కవకాశములేని క్రియలలో నాతని సంకల్ప క్రియాశక్తి రూపమున దర్శింపవచ్చును, ఆయనతో నేకమైనపుడే దేవుని సంపూర్ణరూపము నెఱుఁగనగును. కావున జీవిత క్రియాకలాపమందే, భగవానుని దివ్యహస్త నైపుణ్యమును దర్శించి, తన్మూలమున లభించు నవ్యయానందము ననుభవింపవచ్చును.

112 నిద్ర దేవునిఁ జూపును, దానిని భగవానుఁ డేర్పాటు చేసెను. సర్వప్రాణికోటి కప్రయత్నముగా నిద్ర సంభవించి, దేహమును మరపింపఁ జేయును. సుషుప్తియనగా గాఢనిద్రలోఁ బరబ్రహ్మ స్పర్శకలిగి, వచింపరాని యానందమును, మెలకువ వచ్చినవెనుక దేహమునకు బడలికపోయి

నవ్యాచై తన్యమును లభించును. అనగా జీవులు ప్రతిదినము నిద్ర మూలముగాఁ దమనాథుఁడైన పరమాత్మతో నైక్యమై, తమ స్వస్వరూపమున సంపూర్ణానందము నందుచున్నవి. ఇది అజ్ఞానములో జరుగుప్రక్రియ; తెలిసి ధ్యాన నిద్రలోఁ బర మాత్మ నాలింగనము చేసికొనుచే ముక్తియగును, మనకు వలయునది నిద్రకాదు, ధ్యాననిద్ర, యోగనిద్ర. అఖండ సాధనముచే నవి లభించును.

113. నీకు దుఃఖముకావలెనా? దేవుని స్మరింపకు; నీకు దుఃఖము లేని సుఖము కావలెనా, దేవుని స్మరింపుము; నీ కెన్నడు దుఃఖము లేశమైన లేకుండవలెనా? దేవు నెల్ల వేళల స్మరింపుము. జన్మమృత్యు జరారోగాదికము కవకాశము లేని స్థిరమైన అఖండానంద మనుభవింపఁ గోరుదువా? దేవుని గూర్చిన జపమే నీవై పోవలెను. జపమే నీవైనచో, నీవే దేవుఁ డవై, సచ్చిదానంద పరమాత్మవు నీవేయను ననుభూతి లభిం చును. అల్పవ్యక్తి వనుకొను నిన్ను, జపము దేవునితో నేక మొనర్చును. అపుడు నీవు దేవుఁడవో, తత్తుల్యుఁడవో అయి, సకల కళ్యాణగుణ పరిపూర్ణుఁడ వగుదువు, అందుకే గీతలో భగవానుఁడు. తాను "యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి" యనగాఁ దానే జపయజ్ఞమునని పలికినాఁడు.

114. నాకిది కావలెనది కావలెనని భగవాను నడు గుట తప్పుకాదు. నీవడిగినవన్నియు దేవుఁ డనుగ్రహించును, కాని యిది ఉత్తమ భక్తుని లక్షణముకాదు. ఏలన నిందహం

కారమున్నది. నాకుఁ గావలసినది నాకుఁ దెలియుననుట సహం భావము. నాకుఁ దెలిసినది స్వల్పము; నాకుఁ దెలియని దనంతముగా నున్నదిఁ కావున, నాకేది శ్రేయస్కరమో అది యిమ్మని నిర్దుష్ట హృదయముతో నిరహంకారివై దేవుని గోరుట నిజమైన ప్రార్థనయగును.

115. "ఓ జగన్నాథా! నన్ను నేను మరువలేను గావున నిన్ను నేను మరువఁ జాలను. నన్ను నేను మఱచు టెట్లు? నన్ను నన్నుగా ననుక్షణము నిలఁబెట్టుచున్నది నీవే. నీవు కృపతో నన్ను ప్రతిక్షణము రక్షింపకున్నచో నేనొకక్షణాంశమాత్రముకూడ సజీవుఁడనై యుండఁ జాలను. నాగుండె కదలుట, నాలో రక్తప్రసారము జరుగుట, ఊపిరాడుట, అవయవములు పనిచేయుట, దేహేంద్రియ మనోబుద్ధి ప్రవృత్తులన్నియు నిరాఘాటముగా నడచుచుండుట – వీని యన్నిటికి నీవే కర్తవు. 'నేన'ను సర్వమును నీవే నడపుచుండగా, నిజముగా నేను నీకు వేరుగా నెచటనున్నాను? నిజముగా నేను నీవే; ఇఁక నిన్ను మఱచు ప్రశ్నయెచట నుండును. నేను బ్రతికి యుండుటే నీవుంటివని గుర్తు.

116. మనలనెదుర్కొను నేసమస్య యెట్లు పరిష్కరింపఁబడినచో మనకు శ్రేయఃప్రదమో మనకు సరిగాఁ దెలియదు. అందుచే నేసమస్యనైనను భగవానుఁడు పరిష్కరించునెడల మనకు సంపూర్ణాముగా క్షేమకరమైన విషయము. నిజముగా నన్నిసమస్యలను కల్పించి, పరిష్కరించు

వాఁడు భగవానుఁడే, అందుచే మనకేసమస్య తలయెత్తినను, "భగవాన్, దయతో దీనిని (బరిష్కరింపవా" యని చేతులెత్తి నమస్కరించి ప్రార్థింపవలెను. భగవానుఁడు మనకు శ్రేయః ప్రదముగాఁ బరిష్కరించును. మఱియు నెట్టి క్లిష్టసమస్యలు మనకుఁ గలుగకుండఁ జేయును.

117. దేవుని మహిమ దేవునివలెనే అనంతమైనదగుటచే మానవబుద్ధికి సంపూర్ణముగాఁ దెలియుట కవకాశము లేనిది. కాని మనమందుచే, దానిని దెలియఁ గోరుట తప్పు కాదు. కడివెడు తేనె త్రాఁగలేము కాని, ఒక 'చంచాడు' రుచిచూచి ఆనందింపఁగలము. అటులే లేశమాత్రమైనను భగవన్మహిమను గుర్తించి, చవిచూచినచోఁ దన్మయులమై, యెన్నఁడును మరువలేని అవ్యయానందము ననుభవింపఁగలము. మనము తరించి ధన్యులమగుటకు భగవన్మహిమామృతములో నొక్కచుక్కయే చాలును.

118. "నేనేమియుఁ జేయను; మానను; చేసినది చేయకుండ నుండలేనందున చేసితిని; మానినది మానకుండ నుండలేనందున మానితిని, నీవే అన్నియుఁ జేయుదువు; ఎందుకుఁ జేయుదువో నాకుఁ దెలియదు; నేననగా నేమో నాకుఁ దెలియదు; నీవనగా నెంతటి ఘనుఁడవో నేనెఱుగను; నిన్నాశ్రయింపవలెనని తోఁచినది. అందుచే నిన్నే ఆశ్రయించి కీర్తించుచున్నాను. నాకెట్టి బాధలు లేకుండఁ జేసి, నిత్యసుఖము నీవీయఁగలవని పెద్దలు చెప్పిరి. అదినమ్మి బ్రతుకు

తున్నాను; పెద్దలు చెప్పినది సత్యమని, కొన్నినాయనుభవములు సాక్ష్యమిచ్చినవి, నానమ్మకము చెడకుండుటకు, వృద్ధి పొందుట కీసాక్ష్యములు బలవత్తరములైనవి, తిరుగులేనివే. విపత్తులుపైఁబడువేళ, హృదయ మిచ్చి వేడుకొనగా వానిని తృణప్రాయముగా నీవు తొలగించితివి." అని దేవునితో సంభాషణ.

119. ఎన్నివిధముల నాలోచించి, పరిశీలించి చూచినను, ఒకే ఒక సత్యము రవికాంతితోఁ బ్రస్ఫుటమగుచున్నది. అన్నిటికంటె ఁబ్రాధాన్యము భగవంతునాశ్రయించి యథాశక్తి పూజించి, కీర్తించుటకిచ్చి, పరమేశ్వరకృపైకార్థివై బ్రతుక నిశ్చయించి, తత్సాధనలో నిమగ్నుఁడవై యుండుటకై యత్నింతువా – నీజీవితము సవ్యమార్గమును పట్టినదని చెప్పవచ్చును. సాధన కాలములో నేమైన కొలఁది యిబ్బందులు కలిగినను, క్రమముగా నవి తొలఁగిపోయి అఖండ శాంతి సౌఖ్యములు నీపై వర్షించును. ఇఁక భగవానునాశ్రయింపకుండ బ్రతుకఁ బూనుదువా! తుదమొదలులేని నీదుస్థితి నెవ్వఁడు వర్ణింపఁగలఁడు ?

120. ఈ లోకములో నీకిచ్చవచ్చినట్లాడుకో! నీనాన్నగారైన భగవానుని నిరంతరము గుర్తులో నుంచుకొని ఆడుకో, నీయాటలో నేవైన కష్టనష్టములు వచ్చినచో నాన్నగారిని కేకవేసి చెప్పుకో. ఆయన వానిని వెంటనే తొలగించి రక్షించును. అసలు నీవు నాన్నగారిని నమ్మి యీజగమంతయు

నాన్నగారిదని గుర్తించి, నాన్నగారి యెడనిస్సంశయ మర్యాద, పూజ్యభావమును జూపుచో నీయాటలలో నాతఁడును పాల్గొని నీకేకష్టనష్టములును రాకుండఁ జూచును. మరియు నాతఁడాటలోఁ బాల్గొనుటచే, నీయాట దేవునితో నాటయగును. దేవునితో నాడుకొనుటెరిగి వర్తించినచో నంతకంటె సుఖమెచ్చట నుండును ?

121. "మచ్చిత్తస్సర్వదుర్గాణి, మత్ప్రసాదాత్తరిష్యసి." యని గీతా వాక్యము, "నాయందు నీచిత్తము నుంచినచో నాకృపచే దాటశక్యము కాని కష్టసాగరములన్నిటిని (సులభముగా, సుఖముగా) దాటగలవు." ఇంతదయతో నింతస్పష్టముగా మానవులకు శ్రీకృష్ణభగవానుఁడు శరణోపాయము ప్రకటించుట మహాభాగ్యము కాదా? నీచిత్తము నాయందుంచుము; నాదయచూపుదును, నీకు సర్వ శుభముల నిత్తును; నీకే కష్టములు లేకుండఁ జేయుదును, మోక్షముతో సహా సర్వ సౌఖ్యముల నీకిత్తునని పలుకుట భగవానుని భక్తులయెడ మితిలేని ప్రేమరసమును వ్యక్తీకరించును. చిత్తమిచ్చి చిదానంద రాజ్యమును గైకొనుము!

122. దినదినము మన మనశ్శాంతిని జెడఁగొట్టు చిన్నవి పెద్దవి సమస్యలు మనకు సంసారములోఁ దటస్థించుచుండును. అభిప్రాయభేదములు భార్యతో, బుత్రులతో, గోడళ్ళతో, వంటదానితో, పనిమనిషితో, మనకు రాజకీయ సంస్థలతో, సంబంధమున్నచో నందలి సభ్యులతో నిత్య ముదయించు

చుండును. మన చిత్తములు చలించి, రాగద్వేషవశములై, వైరములకు, అశాంతికి హేతువులై బాధించును. ఇందుచే తనే యెవరి ముఖావలోకనము చేసినను సమస్యలను ముడతలు భయంకరముగా గోచరించును. అందరియెడ రాగద్వేషములను విసర్జించుటే యీసాంసారిక సంక్షోభ జాడ్యమునకు దివ్యౌషధము, అందరలో భావము లుదయింపఁజేయు వాఁడు భగవానుఁడే. అందుచే నెవరిని తప్పు పట్టెదవు? ఈ సమస్యకు (బరిష్కార మార్గమొక్కటే. అందరి భావములకుఁ గారకుఁడు భగవానుఁడే కావున, నెవ్వరి నంతరంగములో (దప్పుపట్టి ద్వేషింపకుము. అందరయెడ నుదారభావము గలిగి, యెవరికి నుద్రేకము కలుగని రీతిగా మధురహితప్రేమపూరిత వాక్యములు పలికి, నీచిత్తశాంతిని నిలుపుకొని, యితరులకును దానిని పంచిపెట్టుచు, నిదంతయు భగవానుని జగన్నాటక లీలయని లోపలగ్రహించి, నిర్విచారముగా జీవించుట నేర్వవలెను.

123. పువ్వులుకోయుట, దేవునిపటముల కలంకరించి సమస్కరించుటయుఁ జిరకాలాభ్యాసమైనది. రుద్రపారాయణము లోపలఁ జేయుచుఁ బువ్వులచెట్లు పెద్దవగుటచే గెడకొంకితోఁ గోయు టలవాటైనది. వివిధరకములైన మందారములే అధికము. విచిత్రము! తమతల్లియైన వృక్షమున నున్న పువ్వులు కోయుట కిష్టపడవు; తత్క్షణమే వానికి ప్రాణహాని యగును. "మీరు సాయంకాలమున కెట్లున నెండి రాలిపోవుదురుగదా, మిమ్ముకోసి, దేవున కర్పించుట మీకు లాభమేకదా" యని

చెప్పికోయుచుందును, కొన్ని పువ్వులు నాసలహా నంగీక రింపక, నాకోయుప్రయత్నమునకు వ్యతిరేకముగా వ్యవహరిం చును. కోపమువచ్చి కొన్ని క్రిందనున్న కళ్లు నీటిలో బడి పోవును. మీపిల్లలను మీరు దేవుని కర్పింతురా యని వృక్ష శాఖలు పలుకుచున్నట్లు దోచును. కాని కొన్ని పువ్వులు. త్వరగా గోసి మమ్ము దేవుని కర్పించి మాకు ధన్యతనొసగు మని శ్రమలేకుండ హస్తగతములై సంతసించును! వృక్ష లతాదులకుల, జీవరకు జడములకుఁ గూడ ప్రాణమున్నది; చైతన్యమున్నది. సర్వేశ్వరుఁడు వానిలోనున్నాఁడు. అందుకే వేదములలో మృత్తికామంత్రములున్నవి. అన్నియు దేవుని రూపములే; దైవచైతన్యమయములే; దేవుఁడు చేయనిది, లేనిది, లేనిదే !

124. భగవానునెడ మనమెట్లు ప్రవర్తింపవలెను ?
భగవానుని పాదారవిందములకు మనదనుకొను సర్వమును సంపూర్ణార్పణ మొనర్చి, మౌనము వహించుటే మనము చేయవలయు జపరహస్యము, భగవాను ననుగ్రహముచేఁ గాక మరొకవిధమునఁ జిత్తశాంతి సౌఖ్యములు లభింపవు. మౌనము వహించుటనగా, నెట్టియార్భాటములేని ఆంతరంగిక సంకీర్తన ధ్యానాదికమని యర్థము; మరియు మౌనమనగా వ్యర్థసంభాషణము లన్నియు విడిచిపెట్టుట. జీవిత మర్పించి చిత్తము దేవునిపాదములకు బంధించి నిలచుటే పరమతపస్సు.

125. ఎవరికి మనయెడ నెట్టిభావము కలిగినను, నిబ్బంది లేదు. ఒక్క భగవానునికి మాత్రము మనయెడ దయాభావ ముండుటే ముఖ్యము. మన యోగ్యతగాంచి, భగవానుఁడు సంతసించుచో మనకు వలయు యోగక్షేమములు సుసంపన్నములగును. అందుచే మనయెడ నితరులుచూపు భావముల కౌదాసీన్యము, చిదానంద సంయుత మౌనమువహించి, అచంచలదీక్షతో భగవాను నుపాసించు దీక్షపూనవలెను, ఈ దీక్ష లేనిలోకు లజ్ఞానులు. వారి భావములకు విలువ యేముండును?

126. ఒక దినమున శ్రీకృష్ణ భగవానుని వాక్యము లిట్లు శ్రుతిగోచరము లయ్యెను; "నీ ద్వితీయపుత్రిక విజయలక్ష్మి వివాహవిషయమై ఎందు కాందోళన పడెదవు. ఆమె నాభక్తురాలు; నీవు నాభక్తుడవు; నేనున్నాను; తగువిధముగా నేర్పాటుచేయుదును. నేను కర్తనుగాను, నీవే కృష్ణ భగవాఁనుఁడే, యేకైక కర్తవని పెక్కుమారులు పలికి గ్రంథములలో వ్రాసితివి. మరల నీకు కంగారెందుకు? ఓర్పువహించి యుండుము; నన్నునమ్మిన నిన్ను దగాచేయుదునా? భయము లేదు. అన్నియు సవ్యముగా సర్వజనామోద యోగ్యముగా జరిపింతును. నన్నుమరచిపోకు" మని భగవానుఁడు పలికి వెన్వెంటనే అటులేచేసి, ప్రబల సాక్ష్యమిచ్చెను.

127. భగవంతుఁ డనంతకోటి జీవరాసులను, అనంతకోటిబ్రహ్మాండములను సృజించి నడపుచున్నాఁడు. అందులో మానవుఁ డొక నలుసు! ఈ నలుసు లోకమున కుపకారము

125. ఎవరికి మనయెడ నెట్టిభావము కలిగినను, నిబ్బంది లేదు. ఒక్క భగవానునికి మాత్రము మనయెడ దయాభావ ముండుటే ముఖ్యము. మన యోగ్యతగాంచి, భగవానుఁడు సంతసించుచో మనకు వలయు యోగక్షేమములు సుసంపన్నములగును. అందుచే మనయెడ నితరులుచూపు భావముల కౌదాసీన్యము, చిదానంద సంయుత మౌనమువహించి, అచంచలదీక్షతో భగవాను నుపాసించు దీక్షవూనవలెను, ఈ దీక్ష లేనిలోకు లజ్ఞానులు. వారి భావములకు విలువ యేముండును?

126. ఒక దినమున శ్రీ కృష్ణ భగవానుని వాక్యము లిట్లు శ్రుతిగోచరము లయ్యెను; "నీ ద్వితీయపుత్రిక విజయలక్ష్మి వివాహవిషయమై యెందు కాందోళన పడెదవు. ఆమె నాభక్తురాలు; నీవు నాభక్తుడవు; నేనున్నాను; తగువిధముగా నేర్పాటుచేయుదును. నేను కర్తనుగాను, నీవే కృష్ణ భగవాఁనుఁడే, యేకైక కర్తవని పెక్కుమారులు పలికి గ్రంథములలో వ్రాసితివి. మరల నీకు కంగారెందుకు? ఓర్పువహించి యుండుము; నన్ను నమ్మిన నిన్ను దగాచేయుదునా? భయము లేదు. అన్నియు నవ్యముగా సర్వజనామోద యోగ్యముగా జరిపింతును. నన్నుమరచిపోకు" మని భగవానుఁడు పలికి వెన్వెంటనే అటులేచేసి, ప్రబల సాక్ష్యమిచ్చెను.

127. భగవంతుఁ డనంతకోటి జీవరాసులను, అనంత కోటిబ్రహ్మాండములను సృజించి నడపుచున్నాఁడు. అందులో మానవుఁ డొక నలుసు! ఈ నలుసు లోకమున కుపకారము

ములుగా నుదయించి, నామరూప జగత్తును కల్పించి విచిత్ర ప్రదర్శనము చేయుచున్నది. ఎందుకిట్లుచేయునో మనకుఁదెలిసి కొను శక్తి లేదు. కాని యీసృష్టిలో జరుగునవన్నియుఁ బర స్పర విరుద్ధములుగా గోచరించుచున్నవి, భగవానుఁడు విరుద్ధ ములుచేయునా? ఈ జగత్ప్రదర్శనము భ్రాంతియని వేదాం తము చెప్పుచున్నది. ఏదియేమైనను, మనము భగవంతు నారా ధించుటవలననే యీ రహస్యము నాతఁడు దయతో మనకు స్ఫురింపఁజేయును. మార్గాంతరము లేదు.

130. నేను దేనినిఁ గోరను; అన్నిటినిఁ గోరుదును; దేనిని నేనుచేయను; ఏదియుమానను. నాకుఁగోరిక పుట్టిం చుట పుట్టకుండఁ జేయుట నీశ్వర సంకల్పముపై నాధార పడియున్నది. నేనేదైనఁ జేయుట, మానుట యీశ్వర సంక ల్పమే. ధర్మములే దధర్మమును లేదు, బంధము లేదు మోక్ష మును లేదు; దుఃఖము లేదు. సుఖమును లేదు, శ్రీ కృష్ణప్రభువు చేతిలో నాజీవిత సర్వస్వమున్నది. ఆయన కన్నియుఁ దెలి యును; నాగోడవ నాకెందుకు; కృష్ణప్రభువు చూచును, ఇట్టి విశ్వాసముతో జీవించుభక్తుని కేమిచ్చిన ముక్తుఁడగునో, ఏ మిచ్చిన సర్వదుఃఖ నాశనమగునో; అదియే భగవానుఁడిచ్చి రక్షించును.

**131.** త్రికరణశుద్ధిగా నమ్మిభజించిన వానిని భగవా నుఁడు రక్షించును. రక్షించునా, రక్షింపఁడా యనుసంశయము తలయెత్తుటకు జన్మాంతర పాపసంస్కార రాశి యింకను

మిగిలియుండుటే కారణము.రక్షించుట నిశ్చయమను నిశ్చయ జ్ఞానము, పాప శేషము పూర్తిగాఁ గరిగిపోవునప్పుడే కలుగును. ఈలోగా భగవానుఁడు తాను కోరినట్లుగా సంపూర్ణ రక్షణముచూపలేదని, దేవునిపై నిందమోపుటమాని, నిరంతర దైవధ్యాన జపతపాదిక కార్యక్రమము దృఢ దీక్షతో నిర్వహించు చుండవలెను. దానివలననే సంపూర్ణపాప వినాశమగును.సంపూర్ణ పాప వినాశము, పరిపూర్ణ దైవానుగ్రహము నేకకాలికములు.

132. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి, మా శుచ." యనునిది గీతలో భగవానుఁడు తుదిమాట చెప్పినాఁడు. "అన్ని ధర్మములను విడిచి, నన్నే శరణుపొందుము. నిన్ను సర్వపాపములనుండియు విముక్తునిఁ జేయుదును, విచారింపకుము." ధర్మసంస్థాపనార్థ మవతరించిన భగవానుఁ డన్ని ధర్మములను విడిచిపెట్టుమని బోధించు టుచితమా? కట్టకట్టి ధర్మములన్నిటిని గంగలోఁ బార వేయమను టెంతసాహసమో! ఇందు రెండర్థములున్నవి. (1) సకల ధర్మము లాయనలో నున్నవి. నూరురూప్యముల కాగితములో నూరురూప్యముల చిల్లరనాణెములన్నియు నిమిడియున్నట్లు, కృష్ణభగవాను నాశ్రయించుటే సర్వధర్మముల నాచరించుటే యగును, (2)ధర్మము త్రిగుణాత్మకమైనది. సత్త్వ రజస్తమో గుణములు గలవారికి ధర్మాధర్మములు కావలెను. భగవానుఁడు సకల ధర్మా

ధర్మముల కతీతుఁడు; కారణమాతఁడు త్రిగుణా తీతుఁడు, అందుకే "నిస్త్రైగుణ్యో భవార్జున" యని వేరొకచోట చెప్పి నాఁడు. ధర్మాతీత, గుణాతీతమూర్తి నాశ్రయించి, భక్తుఁడును ధర్మాతీత గుణాతీత మూర్తియగును.

133. రామరాజ్యములో దుఃఖములుండవు; జారచోర దోషములు లేవు; అకాలమరణములు, ప్రకృతివైపరీత్యములు, కలహములు, రాగద్వేష కామక్రోధాధి సంక్షోభములు లేవు. రామరాజ్యమనగా దేవుని రాజ్యము. రామస్మరణ ముచే నీవు రామరాజ్యములోఁ జేరి, దుఃఖ మిశ్రమములేని పూర్ణసుఖము ననుభవింప వచ్చును. నీవు రాముని నమ్మి, రామస్మరణముతో నేకమైపోవలెను. నీ గుండె కొట్టుకొనుట తోఁబాటు రామనామోచ్చారణము క్షణార్థమైన మానకుండఁ జేయుచుండవలెను. క్షణార్థము గుండెకొట్టుకొనుట మానిన దేహము పడిపోవును. క్షణార్ధము రామస్మరణము మానిన, దానిని మరణ తుల్యముగా భావింపవలెను. ప్రతిరోమ కూప మునుండి రామనామోచ్చారణము జరుగుచుండవలెను. ఈ విధముగా శ్రీ రామప్రభువు రాజ్యములో నీవు ప్రవేశించి జీవించుట కారంభించుచో, సంపూర్ణ శాంత్యానందబల జ్ఞాన సమృద్ధమగు ముక్తావస్థను నీ కనుగ్రహించి రక్షించును. ఈ ఒక్క కార్యక్రమము ననుసరించి ధన్యుఁడవు కమ్ము, వేయి పుస్తకములు పఠించుట , లక్షవిధముల పూజలు, జపములు, యాత్రలు, నవసరములేదు.

134. జన్మజరా మరణరోగాది దుఃఖముల కాలవాల మైన దేహమును ధరింపవలసి వచ్చుట దుర్గతియే. ఇది దుర్గతి యని తెలిసి, దానిని ధరించు నవసరమును తొలగించుకొను మార్గమాలోచించి అనుసరించువాఁడు వివేకి, స్త్రీ ధన వస్తు భోగములవలన సుఖమున్నదని భావించి, కోర్కెలను పెంపు చేయుటవలననే యీ దుర్గతి సంభవించును. ఇది అజ్ఞానము కారణముగాఁ గలది. జ్ఞానము నార్జించి దానినిఁ దొలగించు కొనవలెను. భక్తిసాధనముచేఁ బరమేశ్వర కృప, పరమేశ్వర కృపచే బ్రహ్మజ్ఞానము లభించి జన్మజరామరణ శీలమగు దేహధారణావసరము తొలఁగిపోయి, శాశ్వత సుఖస్థానమైన మోక్షము లభించును. అందుచే నిరంతర పరమేశ్వరారా ధనమే, ఉత్తమసాధనము.

135. అసత్యమును సత్యమనియు, అస్థిరమును స్థిర మనియు, దుఃఖమును సుఖమనియు, అశాంతిని శాంతియనియు గ్రహించు దౌర్భాగ్యము సకల దౌర్భాగ్యములలో సాటి లేని దౌర్భాగ్యము, ఎందుచే మనమిట్లు గ్రహించుచున్నాము? మనదేహము నశించునని తెలియును; నశింపక నిలుచునని భావించుట, కనపడున వన్నియు నింద్రజాలములోని వస్తువుల వలె నదృశ్యములగును, కాని యవి నిజముగా నుండునని నమ్మి వానికొరకు మన సర్వశక్తులు కాలమును వినియోగించి మోసపోవుచుండుట, కనపడి కొంతికాలముండి, అదృశ్యము లగున వన్నియు దుఃఖము నిచ్చుటనెరిగి వానినే నమ్ముట, మున్నగునదే అజ్ఞానము. ఈశ్వర సాక్షాత్కారము వలనను,

బ్రహ్మజ్ఞానము వలనను మాత్రమే సుస్థిర శాంతి సౌఖ్యములు లభించునని విని యుండియువాని నార్జించు ప్రయత్నములో వైముఖ్యమునకుఁ గారణ మజ్ఞానమే. ఈదౌర్భాగ్యమును తొలగించు కొనుటకుఁ దీవ్రకృషి చేయువారే ధన్యాత్ములు.

136. భగవంతుఁ డనగా నెంతలోకాతీతమైన గొప్ప తనము గల వాఁడో! మన దేహేంద్రియ మనస్సులకు, భాషకు అతీతుఁడు – అందుకే 'నేతి' వాదము నుపనిషత్తులు పలికినవి. పరమాత్మ యేదికాదో చెప్పవచ్చును; ఏదో చెప్పసాధ్యము కాదని దాని భావము. కావున సాధకులు, పొరపాటునఁ దమ హ్రస్వదృష్టితోఁ బరిశీలించి, లోకములోని గొప్పవ్యక్తులనఁబడు వారికిచ్చు మర్యాద నిచ్చి పరమేశ్వరుని స్తుతింతురు. అన్నిటి కాయన అతీతుఁడు, దేవునిగూర్చి తలఁచునపుడు, మాటాడునపుడు, ప్రార్థించునపుడు మనమఖండ మర్యాదను, వినయమును భక్తిని ప్రదర్శింపవలెను. ఏకారణము చేతను తృణీకార భావమును జూపుటకాని, విమర్శించుటకాని, హేళన చేయుటకాని, స్వప్నమందైనను మనము చేయరాదు.

137. యౌవనము మానవ దేహమున కుత్కృష్టమైన పుష్టికాలము. ఆదశకుఁ బరిపాలకుఁడు మన్మథుఁడు. మోహ భ్రాంతులు, క్రోధలోభములతోఁ గూడిన ఔద్ధత్యము–మన్మథుని పరివారము. ఆదశలో యువతీ యువకు లున్మత్తులై, సదసద్వివేకము గోల్పోయి వర్తింతురు. ధర్మ దైవగురు

సత్పురుష పూజాభావము లన్నియు నధమ స్థితికి దిగజారును. కావున యౌవనమా విర్భవింపని కౌమారావస్థలోనే, ధర్మ దైవవిషయము లన్నిటిని బోధించి, యువతీ యువకులకు సంపూర్ణ సుశిక్షణమిచ్చి. తరువాత యౌవనములో నైతిక పరిశుద్ధ జీవితమును గడపుటకు (దోడ్పడు జాతియే దైవకృపా పాత్రత నార్జించుకొనును. సుశిక్షితముగాని యౌవనము పాపాంధ కూపమున కీడ్చి, నశింపఁజేయును.

138. భగవంతుని నామమును భక్తితోఁ గీర్తించు టన నేమో తెలియునా? అది అమోఘమగు నుచ్చాటన మంత్ర ప్రయోగము; అది సర్వదోషములను దహించివేయు దావానలము; తాపత్రయాగ్నినిఁ జల్లార్చు కుంభవృష్టి; జన్మజరామరణ దుఃఖ పాశములను తుత్తునియలొనర్చు విష్ణుచక్రము; శాశ్వత మోక్షానందమును సమకూర్చు కల్ప వృక్షము; అనంతశక్తి బలజ్ఞానప్రశాంతి సౌఖ్యముల నిచ్చు చింతామణి. కావున పరమేశ్వర దివ్యనామ సంకీర్తనము చేయు నవకాశము దేవేంద్ర కుబేర వైభవముల మించిన అఖండ వైభవము.

139. మనకు రాగద్వేషములు, అశాంతి, మనోవ్యథ, దుఃఖము నెప్పుడువచ్చును? సర్వ కారణుఁడైన దేవునిపై మనదృష్టిని కేంద్రీకరించుటకు బదులు, దైవేతరములపైఁ గేంద్రీకరించుటచే వచ్చును? గురితప్పినచో మనము ప్రయో గించిన బాణముచే మనము కొట్టఁదలఁచిన పక్షికి దెబ్బతగులదు.

మనము చేయువలసినది - అన్యథా వర్తించు మనస్సును వెను కకులాగి భగవానుని పాదపద్మములపై వర్తింపఁజేయు సాధ నము చేయవలెను.

140. కర్త యెవ్వఁడైననున్నచో వానిపై రాగద్వేష ములు చూపవచ్చును. కర్త ఒక్కఁడే; భగవానుఁడే; భగ వానుఁడేమి చేసినను నిర్దోషియే. లోకములోని మనుజులంద, రజ్ఞానవశులై, నిజముగాఁ దాము కానిదే, తామే స్వతంత్ర కర్తలమని భ్రమించుచున్నారు. పిచ్చివాని మాటలకుఁ గోప గింతుమా? అజ్ఞానమను పిచ్చి లోకులందరనావహించి, లేని కర్తృత్వము నారోపించుకొనఁజేసి, యాడించుచున్నది. దేవు నికి దోషములేదు; మరెవరికిఁ గర్తృత్వములేదు. ఇఁక మన రాగద్వేషములకుఁ దావేది?

141. భగవాను నంతఃకరణ శుద్ధితో నమ్ముము. భగ వాను నెన్నఁడును మఱువకుము. ఆపై నెన్ని అద్భుతములు జరిగి, సర్వము నీకనుకూలమై నీకుత్తమ శాంతిని, బ్రహ్మానం దమునిచ్చునో పరిశీలించు చుండుము. మనవిశ్వాసము పవిత్ర మైనదైనచో, భగవానుఁ డెన్నఁడు మనకశుభము, అశాంతి, క్లేశము లేశమాత్రమును కలుగకుండ సకల సందర్భములను మనకత్యంతానుకూలములగునట్లు జరిగించును. అనంత సామ ర్థ్యముగలవాఁడు కావున, నాతని కెట్టికష్టము నుండదు. పూర్తిగానమ్ము; ఆవెనుక నన్నితాటస్థ్యములను బరిశీలిం చుము; అన్నిటిలో దేవుని దివ్యహస్తము నీకు గోచరించును.

**144.** మహా మునీశ్వరులను, మహాపురుషులగు ధర్మ రాజాదులను, పతివ్రతా శిరోమణులగు సీతా ద్రౌపది దమ యంతులను భగవానుఁడు శిక్షించి ధన్యులఁజేసెను. మన బోటి సామాన్య మానవుల కన్నియు లోపములే. భగ వానుఁడు మనల శిక్షింపఁబూనుచో మనకుఁగోటి జన్మ ములు వలసియుండును. అట్టి చిరకాల శిక్షణావసరము లేకుండ మనల కనుగ్రహము చూపుమని భగవాను నర్థించుటకు మన కధికారమున్నది. తీవ్ర శిక్షణమునకు మనమర్హులముకాము; మనమల్పులము; అమాయకులము; దుర్బలులము; చంటి బిడ్డలవంటివారము. మనకు స్వల్ప శిక్షణము నిచ్చిరో, అదియు నవసరము లేకుండగనో భగవానుఁడు మనల రక్షిం పఁగలఁడు; రక్షించును. తండ్రి చిన్నబిడ్డల లోపములతో నిమి త్తము లేకుండ రక్షించును; వయస్సు వచ్చినవారిని శిక్షించును. రక్షించుమని చంటిబిడ్డలమై యేడ్చుటే మనపని, మనయేడ్పు నాజగజ్జనకుఁడు చూడలేఁడు గనుక వెంటనేకాపాడును.

145 దోషము లున్నవారే మానవులు గావున దోష ములు పోఁగొట్టుకొనుటకై భగవాను నాశ్రయింపవలెను. దోషములు పోఁగొట్టుకొనినవారు తిరిగి దోషములు సంక్ర మింపకుండుటకై భగవాను నాశ్రయింపవలెను. మరియు దోషములు పోవచ్చును; మరల రాకుండ నుండవచ్చును, గాని మనకు రావలసిన శుభములకై భగవాను నాశ్రయింప వలెను. మనకు రావలసినవి, ప్రస్తుత జన్మములో దేహపోష

ణావసరములన్నియు సులభముగా, మనకాలమును బలమును వ్యర్థమొనర్పకుండ లభింపఁజేయుటయు, సన్నిటికంటె ముఖ్యములైన బ్రహ్మజ్ఞాన మోక్షములు కలుగునట్లు చేయుటకును భగవానునాశ్రయింపవలెను. అనగా మనుష్యత్వ దోషములన్నియుఁ బోయి, పూర్ణ దైవత్వము సిద్ధించువరకు మనము భగవానునాశ్రయించి, జపతపములు, ధ్యానయోగములు మానకుండఁ జేయుచుండ వలసినది.

146 ఏమిజరిగినను, "ఇది భగవానుని లీల" యని తలంచి, నిర్వికార చిత్తశాంతియుతదరహాస వదనుఁడవై యుండుటంత తేలికపనికాదు. నిన్ను మాయావరణలోనుంచి అజ్ఞాన కలుషితమై, రాగద్వేష దోషసహితమై, అందుచే నిరంతర క్లేశోత్పాదకమైన జీవితములోనుంచి, భగవానుని మరచునట్లు చేయును, వెనుకనిలిచి, భగవానుఁడు చిరునవ్వుతో జగన్నాటకము బాగుగా జరిగించుచుండును. కష్టములు క్లేశములు లేనప్పుడు నీవు భగవానుని స్మరించి, దుర్భరయాతనలు కలిగినప్పుడు భగవానుని మరచి, స్మరించుట మానుటజూచి, "నీవు నన్ను మఱచి తప్పుచేసితివి, కష్టములు బాధించునప్పుడు విడిచిపెట్టెదవా? కష్టములులేనప్పుడు నన్నుస్మరించిన పుణ్యమునకు ఫలితముగా నీకు నాస్మరణ జ్ఞాపకము చేయుచున్నాను; భయపడక స్మరించు, నీ కష్టములన్నిటిని బోగొట్టి కాపాడెదన"ని భగవానుఁడు మందహాస ముఖుఁడై పలికి, వెన్వెంటనే కాపాడును కష్టములు లేనప్పు

నైనను భగవంతుని స్మరించుట వ్యర్థముకాదు. కష్టములలో నిన్ను మరపించి, కృపతో మరల జ్ఞాపకముచేసి, కష్టముల దొలగించి భగవానుఁడు రక్షించును.

**147.** భగవానుని సర్వములో నెల్లప్పుడు చూచుటనగా సాధకునికి నిరవధిక దీక్షవలయును. భగవానుఁడు నిత్యము మన కెన్నియో తికమకలు కల్పించి, నాపాదములపై నీమనస్సు చెదరకుండ నిలుపుమని అభ్యాసము చేయించి, దయచూపి నిన్ను భక్తునొనర్చి కాపాడుచున్నాఁడు. భగవంతునమేయ శక్తికి సాధ్యాసాధ్యముల ప్రశ్నయేలేదు. ఒకక్షణములో ఁగోట్యంశ కాలములో భగవానుఁడెట్టి కార్యక్రమమునైనను నెరవేర్పఁ గలఁడు. చెక్కుచెదరని భక్తితో నారాధించు భక్తుని కాతఁడు చేయని శుభముండదు.

148. భగవానుఁడే నిన్ను విడిచిపెట్టినచో నిఁకనిన్ను ఁగాపాడఁగల వాఁడెవ్వఁడును లేఁడు, ఈ సంగతి నెరిగి, పరిశుద్ధ చిత్తముతో నీవు భగవానుని నమ్మి జీవించుచున్నచో నిన్ను విడిచిపెట్టి, భగవానుఁడు కఠోరముగా ఁబ్రవర్తించు ననుకొనుట బుద్ధిమాంద్యమునే సూచించును. నీభక్తిలో లోపము లేకున్నచో భగవానుఁ డఖండకృపామృతమును నీపై వర్షించి, నిన్నుద్ధరించుననుటలో నెట్టి సందేహము నుండనవసరము లేదు. ఒకవేళ నేయల్పదోషమైనను నీయందున్నను, దయతో క్షమించి, రక్షణలో లోపమొన్నఁడు చేయఁడు. నీవు భక్తుఁడవై పరిశీలించికొనుము.

149. ఎన్ని ప్రయత్నములు చేసినను దప్పించు కొనుటకు వీలుపడక, మీఁదవచ్చిపడిన అనిష్టకష్టము లనుభవింపక తప్పదని యర్థము. అట్టి సమయమున నీవు రెండువిషయములను మరువరాదు. (1) భగవానునతిశయ భక్తితో స్మరింపవలెను. అట్లు స్మరించుట వలన, క్షణకాలమేచాలు – భగవానుఁడు తదనుభవములోని దోషమును దొలగించి, నామమాత్రానుభవముగామార్చి శ్రమ లేకుండఁ జేయును. (2) అనుభవింపక తీరని కష్టము సంభవించునప్పుడు నీవు దేవుని మరువకుండ దీక్ష నీకు లభించును. అట్టి దీక్ష నీకున్నదని తెలియుట కొకటి రెండు సారులే, దుర్భర కష్టస్థితిలో నిన్నుంచి, నీదీక్షను స్థిరపరచి, యీ వెనుక నెన్నఁడట్టి కష్టములు కలుగకుండఁ జేయును.

150. ప్రతివ్యక్తికి హృదయమున్నది. ఆహృదయ మందిరమును నిలయముగాఁ జేసికొని సర్వలోకైక విభుఁడగు పరమేశ్వరుఁడు నివసించుచున్నాడు. అట్లు నివసించుచుఁ బ్రతివ్యక్తి మనోబుద్ధీంద్రియములను ప్రచోదనము చేసినడపుచున్నాఁడు. అనగాఁ బ్రతి మానవునిలో భగవానుఁడు పరిపూర్ణశక్తితో నిలిచియున్నాఁడు. ప్రతి మానవుఁడెచటికేగినను, భగవానునిఁ దనతోఁ గూడఁదీసికొని పోవుచున్నాడు. నీవేమి చేయుచున్నను పరమేశ్వరుఁడు నీతో నుండి సాక్షియై తిలకించుచున్నాఁడు. నిజమునకు నీవు వేరుగాలేవు. నీవు భ్రాంతి, ప్రతిప్రాణి రూపములో దేవుఁడే నిండియుండి సర్వమును

జేయుచున్నాఁడు. నీవు వేరుగాలేవని తెలిసికొనుటే "శివో హమ్మ"ను ననుభవసిద్ధి వెన్వెంటనే లభించును.

151. ధర్మములేదు; అధర్మమునులేదు. ఆగోడవ విడిచిపెట్టి, చతురక్షర మంత్రము ననుసరింపుము. "నన్ను నమ్ము." అన్ని సమస్యలు విడిపోవును. ఇది భగవానుఁడగు శ్రీకృష్ణునాదేశము, ఈచతురక్షర మంత్రానుష్ఠానముచే, నీకు చతుర్విధ పురుషార్థములు లభించును. నాలుగక్షరములు; నాలుగు పురుషార్థములు. ఇంకేమి కావలెను? ఇంక గోరవలసిన వేమియులేవు. నాల్గవ పురుషార్థసిద్ధితో నీవు దేవుఁడవై కూర్చుందువు; "నన్ను నమ్ము."

152. స్త్రీ పురుష రూపముల సృజించుటలో భగవానుని ప్రజ్ఞ వర్ణనాతీతమైనది. స్త్రీ పురుషులు పరస్పరాధారము లేనిదే బ్రతుకలేరు. యౌవనోద్రేకము కలిగించి, పరస్పర సాంగత్యముచే నిఁకెందును లభింపని తాత్కాలిక క్షణిక సుఖమునిచ్చి, దృష్టి నట్టి క్షణములపైననే. కేంద్రీకరించి జీవింప జేయుచున్నది పరమేశ్వర శక్తియే, సంయోగ సౌఖ్య లేశమునకై యెన్ని యిక్కట్లనైనను భరింతురు. కాని, యౌవనము నిలుచునది కాదుకదా! కాని క్షణిక సుఖమునకై. సంతతి, పోషణము, ధనార్జనము మున్నగు సమస్యలను సృజించి, వాని కొఱకు మితిలేని సంకటములను దుఃఖమును కలిగించుచున్నాఁడు. ఈయిక్కట్లతో వార్ధకదశ, మృత్యువు సంభవించును. భగవద్ధ్యానము చేయుటకు, భగ

వత్కృప నార్జించుటకు (దీరిక, కోరికకూడ నుండదు. ఇదియే సర్వప్రాణి కోటి దురవస్థ !

153. ఎచటికి (బోవుట? ఎవరితో మాటాడుట; ఏమి మాటాడుట, ఎవరితో నేమి మాటాడిన నేమి ఫలితము వచ్చును ? ఎచటికిని బోనవసరములేదు; తాపత్రయాగ్ని జ్వాలలన్ని చోటులందునున్నవి. మాటాడవలసిన వారెవరు? నిత్యజ్ఞాన శాంతిసౌఖ్యముల నార్జించినవారితో మాటాడుట మంచిదే, వారులభించుట కీశ్వరానుగ్రహ ముండవలెను. దైవేతర వ్యర్థప్రసంగములు చేయువారితో మాటాడుట వలనc బుండుపైc గారము చల్లుకొనుటయే యగును. కష్ట నష్టదుఃఖములను బోగొట్టువారు, భగవానుcడు భగవద్భక్తులు, భగవానుcడు సులభముగా మనతో మాట్లాడునా? అటులే నిజమైన భక్తపుంగవులు దొరకుదురా? అందుచే నేకాంత మునc గూర్చుండి,సర్వత్ర నిండియుండిన జగత్ప్రభువుతో మాటాడు నభ్యాసమువలన, మనచిత్తశుద్ధి ననుసరించి, భగ వానునుండి జవాబు వచ్చితీరును.

154. ఒక్కటి మఱచిపోకుండc జూచికొని తక్కిన వానికన్నిటికి గడ్డిపరక విలువనిమ్ము. ఆ ఒక్కటేమనగా, భగ వానుని మఱువకు. అదిగో కృష్ణభగవానుcడు నవ్వుచున్నాcడు. నన్ను మఱువకుండ నుండగలవో లేవో నీకుcబరితాపాగ్ని జ్వాలల వేడిమికలిగించి చూచెదనందువా? దానికి సమాధాన మేమనగా, అంత వేడిమి నోర్చుకొను శక్తినాకు లేదుగావున,

దయతోఁ దేలికగా నీ యనుగ్రహముచూపి కాపాడుమని ప్రార్థింపవలెను. కృష్ణప్రభువు మరల చిరునగవుతో, "భయ పడకు, నీవు కోరినరీతిగాఁ దేలికపరీక్షయు లేకుండ నిన్ను నేను కాపాడఁగలను. నీశక్తి నాకుదెలియుదనుకొనకుమ"ని జవాబుచెప్పెను.

155 "హేభగవాన్! చిన్ననాటినుండి నన్ను నీవెన్ని విధముల రక్షించితివో తలఁచినచో, నాకు నీయందు నిర్మ లము, అచంచలము,నైన భక్తిని నీవేయొసఁగి కాపాడితివని తెలిసినది. శ్రోత్రియవంశమునఁ బవిత్ర దంపతులకు ఁబుట్టిం చితివి, వేదముకొంత చెప్పించితివి; ఆంగ్లవిద్య నిచ్చితివి; ఉపని షత్తులు, గీత, పురాణేతిహాసములు మహాభక్తుల జీవితోప దేశములు చదివించి భక్తిజ్ఞాన బీజములు నాటితివి, అనేక ప్రమాద సమయములలో నడ్డుపడి రక్షించితివి. భుక్తికి లోపమురాకుండఁ జేసితివి; పరిపూర్ణ బ్రహ్మవేత్తయగు గురు దేవునిఁ జూపితివి, భక్తిజ్ఞాన రహస్యములఁ జెప్పించితివి, జప తపాదులు చేయించితివి. మరణాత్పూర్వమే, నాకు నీదర్శన మిచ్చి,ముక్తి ననుగ్రహింపుమ"ని ప్రార్థించితిని;నాతండ్రియగు భగవానుఁడటులే, నాకులోటు చేయడని నమ్ముచున్నాను.

156. భర్తమృతుఁడైనచో స్త్రీకివైధవ్యము; భార్య మరణించినచో భర్తకు వైధవ్యము; స్త్రీపురుషులకు దేవుని మఱచుటే వైధవ్యము; ఏలన భగవానుఁ డందరకు భర్త; భక్తునికి భగవద్రక్షణమును శంకించుట వైధవ్యము; జ్ఞానికి

లేశమాత్ర ద్వేషమున్నను వైధవ్యమే; భగవంతుననన్య భక్తితో భజించుభక్తుఁడు; సర్వ చరాచర ప్రకృతిలో (బర మాత్మ దర్శనము చేయుచు ద్వేషభావమును జయించిన జ్ఞానియు, నీలోకమును పవిత్ర మొనరించు మహనీయులు, వారి ఉనికియే జగత్కల్యాణ ప్రదము. వారి స్మరణ దర్శనములే పరమపుణ్య ప్రదములు.

157. నిర్గుణ సగుణ బ్రహ్మజ్ఞానసిద్ధియో, సగుణ భగ వత్సాక్షాత్కార సిద్ధియో, పొందని బ్రతుకుకంటె దుఃఖ దూషితమైన బ్రతుకింకొకటి లేదు, ఇది తెలియకుండ బ్రతుకుచు నేను ఘనుఁడనని గర్వము చూపువాని మౌర్ఖ్య మును జూచి మౌనము వహించుట తప్ప మరేమిచేయఁ గలము? తక్కినవన్నియు నుండుటయు లేకుండుటయు సమా నమే, భగవానుని మాయామహేంద్రజాలములోనుండి, భగ వానునాశ్రయించి, దానిని నిర్మూలించుకొను కార్యదీక్ష గల పూజ్యుని పాదరజోలేశమున కేదియు సరిరాదు.

158. బ్రతికియుండుట కనగా దేహకుటుంబ పోషణా వసరములు సంపాదించు కొనుటకే, కోట్లకొలది మానవుల జీవితకాలమంతయు వ్యయమైపోవుటయు, ఇట్లు వ్యయమై పోయియు సరియగు పోషణము లభింపకుండుటయుఁదటస్థించు రాజ్యము పూజ్యమెట్లగును. ఇఁకనెందుకు బ్రతుకవలెనో, పరమార్థమేదో, తత్సాధనమేదో తెలిసికొని యాచరించుట కవకాశమేది? అనగా నార్థిక పారమార్థిక సమృద్ధి గలుగఁ

జేయుచే ప్రభువుల ప్రధానవిధి ఇట్టి సమృద్ధినిచ్చి పాలింపఁ గల ప్రభువులే పూజ్యులు.

159. విశ్వ ప్రపంచములో నేవిషయమును భగవానుని సంకల్ప నిర్ణయములు లేకుండ జరుగదని తెలిసికొని, భగ వానుని భజించుటయే సర్వశుభములకు మూలకారణమని గ్రహించి ఆరీతిగా నడుచుకొనువాఁడు, తెలివైనవాఁడు. భగవానుఁడనంత కల్యాణ గుణపరిపూర్ణుఁడు, తన్ను నమ్మి భజించు భక్తుల కఖండ కృపామృత మిచ్చువాఁడు, మరె వ్వఁడును లేఁడు. ఇది నిజమాయని శంక గలిగినచో, నెన్ని వేల మంది భక్తులను, జ్ఞానులను దయతో నెన్ని విధముల రక్షించెనో, ప్రతి పురాణము చెప్పుచున్నదికదా. పురాణములు చదివియో, వినియో ప్రయోజనమేమున్నది, నమ్మి దేవుని దయ రుచిచూడవలెను.

160. "భగవాన్! శ్రీరామ ప్రభూ! శ్రీకృష్ణప్రభూ!" అని నమ్మి నోరెత్తి పిలువలేవా? ఇందేమి కష్టమున్నది? అట్లు పిలిచి, మ్రొక్కి, నీగోడవలు చంటిపిల్లవాఁడు తల్లితో వలె, పతివ్రత యగు భార్య భర్తతోవలెఁ జెప్పికొని, వినయ విధేయతలతో నాతఁడేమి చెప్పునో వినుట కలవాటు చేసి కొనుము; భగవానుఁడిట్లు బదులు పలుకును; "ఏమిరా! నేనిచటనేయున్నాను; నిన్ను నిరంతరము కాపాడుచున్నాను, భయమెందుకు? నీ యోగక్షేమములు నావే"యని యీశ్వర వాణి, మన కత్యంత సమీపవర్తియై భగవానుఁడున్నాఁడని

నమ్మిన రీతినే. మనకు జవాబు చెప్పుననియు నమ్మి వినుట నేర్వవలెను.

161. ఆపదలెపుడువచ్చునో, శుభములెపుడు వచ్చునో తెలియదు; ఆపదలకుఁగారణము భగవానుని కృపలేకుండుట, శుభములకుఁగారణము భగవానుని కృపయుండుట, భగవానుని కృప లేకుండుట లేకుండఁబోవలెను, ఎల్లప్పుడు భగవానుని కృప కలిగియుండవలెను, అందుచే సర్వకాల సర్వావస్థలలో మనము భగవానుని భజించుఁ టవసరము, అపుడు దేవునితో నెల్లప్పుడుందుము; క్షణ కాలమైనను దేవునికి దూరము కాని వానికాపదలెట్లు వచ్చును; కావున నమ్మి, భజించి, నిత్యము దేవుని దగ్గరనుండుము.

162. అన్ని విషయములు తెలిసినట్లుండి, తెలియకుండుటే మానవత్వ లక్షణము, ఇది తెలిసి. తెలియునను గర్వము, అహంకారమును విడిచిపెట్టుటే తెలివి, కాని ఒక్క విషయము నిస్సంశయముగాఁ దెలిసినచో నన్నియుఁదెలియును, భగవాను నాశ్రయించుట, ఇదొక్కటియే తెలిసి చేసినచో అన్నియుఁ దెలిసినట్లే. ఏలన సర్వము నెరుగుశక్తి భగవానుని కృపచే లభించును, సర్వలోకములు, సర్వలోక సర్వ విషయములు-అనగాఁబరిపూర్ణ జ్ఞానము, పరిపూర్ణానందము, పరిపూర్ణ శక్తి, పరిపూర్ణ శాంతి - దేవుని పాద పద్మములలో నున్నవి. అట్టి పాదములను మనమంటి యుండినచో, నాలక్షణములు మనకు సంక్రమించును.

163. సూర్య భగవానుని కుదయాస్తమయ కాలము లలో గాయత్రీ మంత్రము చెప్పి అర్ఘ్యమిచ్చి, "అసావా దిత్యో బ్రహ్మేతి" యని చదువవలెను. సూర్యుఁడు భగ వానుఁడు, పరమాత్మ, పరబ్రహ్మ స్వరూపి, చేతిలో నీరు దేవుఁడు, దోసిలొగ్గి నీరు పట్టుకొని మంత్రముచ్చరించు శక్తి దేవుడు, సర్వము భగవానుఁడే, ఈ భావముతో నర్ఘ్యమిచ్చు నాతఁడు దేవుఁడగును, లేక బ్రహ్మమగును. "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి," యని చదువుచు నర్ఘ్యమిత్తుము, ఒక్క అర్ఘ్య ప్రదానముతో బరబ్రహ్మమగు సాధనమే సంధ్యావందనము. ఇది చేయుట కధికారము గలిగి, పొగరుబోతుతనముచే మానినవారి దుర్గతి వర్ణింపఁజాలము.

164. పుండరీకాక్ష నామోచ్చారణ మాత్రముచే బాహ్యాభ్యంతర శౌచము లభించునని చెప్పఁబడెను, అనగా లోపల, బయట శౌచమనగా "ఆరోగ్యము, పటుత్వము, బలము, జ్ఞానము, బ్రహ్మత్వము" లభించును, ఆపైని కేశ వాది నామము, లుచ్చరించి మూడుసారు లుదకము లోనికిఁ బుచ్చుకొనవలెను, కేశవున కర్పించి, ఉదకము మనము త్రాగుచున్నాము, అనగాఁ గేశవుడు మనలో నున్నాఁడని తెలియవలెను, ఇఁక బాహ్యాంభ్యతర శౌచమునకు లోటేమి యుండును, పూర్ణ శౌచమనగాఁ బరమాత్మయే, పుండరీకాక్ష స్మరణచేఁ బరమాత్మ యగుటకు సందేహము లేదని యెరుగ వలెను.

165. శ్రీకృష్ణ ప్రభువు చేతిలో నన్నిటిని విడిచిపెట్టి నిర్విచారముగాఁ జిద్విలాస వదనుఁడవై కూర్చుండుటే అత్యు త్తమ కార్యక్రమము; అత్యంత సుఖప్రదము, నీవు పెట్టుకున్నను, నిజముగా సర్వము కృష్ణ ప్రభువు చేతిలోనే యున్నవి, నీవు విడిచిపెట్ట వలసినది, అన్నియు నీ చేతిలోనే యున్నవనుకొను భ్రాంతి, నీవిది యెరిగి కూర్చుండుచో శ్రీ కృష్ణ కృపామృత ధార, నిరంతరము నీపైఁ బ్రవహించుచుండును, ఫలితమో! అఖండ శాంతి, అనంత సంతృప్తి, అనిర్వాచ్యానందము, పరిపూర్ణ జ్ఞానము, అనుభవించి చూడు, మాటలేమి లాభము, ఇది నమ్మి, చేసి, అనుభవింపవలసిన పరమ పావన సత్యము, పలుదోముపుల్ల మొదలు పరబ్రహ్మత్వము వఱకు కృష్ణ ప్రభువు నీకు తృణప్రాయముగాఁ బ్రసాదింపఁగలఁడు, నీకవుకు సిద్ధింపని కోర్కెలుండవు!

166. దీక్షయే మోక్షము, మూఁడు సూత్రములను దీక్షతో నీజీవితములో ననుసరించుటకుఁ బూనినచో మోక్షము లభించును. (1) ఏ ప్రాణినెన్నఁ డేకారణముచేతను ద్వేషింప కుండుటే గాక, సకల ప్రాణి జాతమునకు క్షేమ సౌఖ్యము లనే కోరు ప్రేమను గల్గియుండుట. (2) దైవేతర ప్రసంగము లను సాధ్యమైనంతగా విడిచిపెట్టి, మిత భాషిత్వ మలవఱచు కొని, సత్య ధర్మములను గూర్చి మృదు మధురముగాఁ బలుకుట (3) సర్వకాల సర్వావస్థలలో భగవాను నహంకార గర్వములు విడిచి. వినయ భయ భక్తులతో

భజించుట యనునవి సూత్ర త్రయము, వీనిని సాధించు దీక్ష విజయ మందుటయు మోక్ష ప్రాప్తియు నేకకాలముననే జరుగును.

167. "సంతుష్టస్సతతం యోగీ," యనునది సూత్రము, యోగి యనగా జ్ఞాని నిత్య సంతుష్టి గలవాఁడై యుండ వలెను, అనగా నిత్య సంతుష్టి గల వాడే యోగి లేక జ్ఞాని యని యర్థము. దేనితోఁదుల్యమైనది కాని, తదధికమైనది గాని లేదో, అట్టి వస్తువు లభించినపుడు మనకు సంపూర్ణ సంతుష్టి యుండును. ప్రాణికోటి కసంతుష్టి, అసంతృప్తి పిశాచమువలె బాధించుచున్నది, ఏమి సంపాదించినను, ఏది అనుభవించినను, తృప్తి కలుగుట లేదు. తనకున్నవి కాక లేనివెన్నో యింకను గావలెను, అనగాఁ బరమాత్మ, సకల ప్రాణులలో నుండి, యీ అసంతుష్టి యను నగ్నిని జ్వలింపజేఁయుచున్నాడు. తాము పరమాత్మ స్వరూపమే యని అనుభవసిద్ధి కలుగు వఱకు అసంతుష్టి బాధించుచునే యుం డును, బ్రహ్మాత్వ సిద్ధిచేఁ బూర్ణ సంతుష్టి లభించును. యోగి లేక జ్ఞాని యనగాఁబరమాత్మ నెఱిగి, పరమాత్మతోఁ దాదాత్మ్యమందుటయే, అనగా యోగి, జ్ఞాని, ఉత్తమ భక్తుఁడు నిజముగా పరబ్రహ్మాత్వ సిద్ధి గలిగి. పరమాత్మ లక్షణ మగు నిత్య సంతుష్టిని గాంతురు.

168. ప్రతి ప్రాణియుఁ బ్రతి మానవుఁడు లోకములోఁ బుట్టినది మొదలు, లోకమును విడిచి వెడలిపోవుటకే యాత్ర

సాగించుచున్నాఁడు, జీవించుటనగా లోకాంతర ప్రయాణమే, మానవుఁ డేమిచేయుచున్నను ప్రయాణములోఁ జేయుచున్న పనియే. కూర్చుండినను, నిద్రించుచున్నను అదినడకయే! లోకాంతరమున కాగకుండఁజేయు నూటియాత్రయే, ఈ యాత్రలోఁ జదువులు,వివాహములు, సంతతి, ఉద్యోగములు, భోగములు,తాపత్రయములు బాధించుచున్నవి.ఈ యాత్రలో నెల్లప్పుడు జీవించుట దుర్భరము. భగవానుని దర్శించుటతో నీ యాత్రముఁగియును, తత్ప్రియత్న మొక్కటే ప్రయాణ సౌకర్యమును, ప్రయాణ సమాప్తిని కలుగఁజేయును.

168. అనంత బ్రహ్మాండమును సృజించిన భగవానుఁ డందొక నలుసువంటి నిన్నును సృజించెను. నీస్తవము, నీ పూజ, నీ భక్తి భగవానుని కవసరములేదు. అఖండ పరిపూర్ణత్వము, అవ్యయానందము, భగవానుని లక్షణములే! నీ పూజవలన భగవానునికేదియు సంతసింపవలసిన పనిలేదు. కాని మనపూజార్చన ధ్యానాదికములు నిరర్థకములుగావు. మనకుఁ జిత్తశుద్ధి, సుశిక్షణము, నవియిచ్చి, భగవన్మహిమ నెఱుగుటకుఁ దోడ్పడును, అందుచే దేవునికిఁ బూజ మన పూజయే, అనగా మనక్షేమార్థమే; దేవునికి దానివలన లాభ నష్టములులేవు.

169. భగవానుఁడు మాటాడఁగలఁడా? కలఁడన్నచో మనతో మాటాడునా? ఈ ప్రశ్నలు సులభముగా వేయ వచ్చును. సమాధానమును సులభమే, భగవానుఁడు మాటా

డును; ఎవరితోనైన మాటాడును. భగవానుఁడు లోపల వెలుపల సర్వత్ర నిండియున్నాఁడు. మనకష్ట సుఖము లాయనతోఁ జెప్పికొను టభ్యసింపవలెను. మనకుఁ బరిపూర్ణ విశ్వాసము, అంతరంగశుద్ధి ఓర్పునున్నచో, భగవానుఁడు మనతో మాటాడును, మాటాడుటనగా దర్శనమిచ్చుటయు జరుగును. దర్శనమిచ్చినా, పలుకరించునాయను సందేహములుండరాదు. భగవానుని మహిమనెఱిగిన నిస్సంశయ భక్తి కసాధ్యము లుండవు. విశ్వసించి, మాటాడువఱకు భక్తితో భగవాను నెదుట మనకేమికావలెనో చెప్పికొని, ఓర్పుతో వేచియుండి ఆయన పలుకు అత్యంత మధుర వాగమృతమును గ్రోలి ధన్యులము కావచ్చును.

170. అద్వైతసిద్ధి యనగా, నీవు పరమాత్మ తాదాత్మ్యమంది, సర్వప్రాణులలో నీవున్న సంగతి అనుభవపూర్వకముగా గుర్తించి, ప్రాణుల సుఖ దుఃఖములు నీవనుభవింపవలెను. ఎవఁడు బాధనందుచున్నను, వాని హృదయములో నీవుంటివని తెలిసి. నీవాతఁడై వాని అనుభవమును పొందవలెను. ఎవఁడు సుఖము ననుభవించుచున్నన దే రీతి నీవును సుఖింపవలెను. ఇది సర్వములో నేనుంటినను జ్ఞానబలము చేతను, తదభ్యాస బలము చేతను సంపాదింపఁదగిన అద్వైత సిద్ధి, అప్పుడు నీకాకలి, దప్పిక, అనారోగ్యము, దుఃఖము నుండవు. ఆత్మకవి లేవు కావున, నీవాత్మానుభవ సామర్థ్యముచే సకల సౌఖ్యానుభూతిగాంచవచ్చును.

171. నేనే పరమాత్మనగుటచే నన్ని దేహములు నావే అన్ని మనస్సులు, బుద్ధులు, నావే; జగమునందుజరుగు సర్వము నేనే చేయుచున్నాను. మాయాశక్తిచే నందరకు భ్రాంతి కల్పించుచున్నది నేనే; చెట్టు, దానిపువ్వులు, కాయలు నేనే; మేఘము, వాయువు, వర్షము నేనే; సూర్యచంద్ర గ్రహ నక్షత్రకాంతి, అగ్ని నేనే; పంచభూతములు నేనే; సర్వబీజములు నేనే; నేను నాయిచ్ఛ వచ్చిన రూపము ధరింపఁగలను; విడువఁగలను; పరమాత్మధరించు రూపములన్నియు నావే నేనే కృష్ణుఁడు, రాముఁడు, సర్వమును.

172. అన్నికట్టిపెట్టి, దేవునినమ్మి కూర్చుండి,కన్నులు తెరచి చూచుచుండుము. భగవానుఁ డెన్ని విచిత్ర విషయములు చూపునో! ఆయన సంకల్పశక్తి మాత్రముచే బ్రహ్మాండములన్నియు నడచుచున్నవి. నీ విషయము తృణప్రాయము, భగవాను నాశ్రయింపుము; నీకు వలయునవన్నియు నప్రయత్నముగా లభించును. అనగా నిహలోక యాత్రావసరములు. సమగ్రజ్ఞాన భక్తియోగములు, మోక్షము నీకు లభించుటలో నాశ్చర్యములేదు. భగవానుని మహిమ వర్ణనాతీతమైనది. నమ్మి దాని అనంత సౌందర్యమును కన్నులారఁజూచి అనుభవింపుము. అప్పుడు నీవు భక్తుఁడవని చెప్పవచ్చును.

173. మన దేహనిర్మాణములోని నైపుణ్యమును బరిశీలించినచో నది భగవాను నద్భుత నిర్మాణమని స్పష్టమగును మనుష్య దేహమునేకాదు,ఏప్రాణి దేహనిర్మాణ మైననుసరే,

ఒక సింహము, ఏనుగు, పంది, ఆవు, ఈగ, దోమ, కాకి, దేహములు,— అటులే వృక్షలతాదుల నిర్మాణము— అనంత వైవిధ్యముగల రంగులు, రూపములు. సౌరభములు—పరీక్షించినచో దేవు నఖండమహిమ ప్రత్యక్షమగును, ఎంత శాస్త్రవేత్తయు, నొక్క మనుజదేహమును, ఒక పక్షిని, ఒక పుష్పమును, తుదకొక గడ్డిపరకును సృజింపఁగలఁడా? వీనినన్నిటిని నాశమొనర్చు మారణాయుధములను మాత్రము సృజించి, ప్రాణకోటి కశాంతిని గల్పించుశక్తి మాత్రము వీరికిఁ గలదు.

174. దేవు నాశ్రయించుటలో నెంత సుఖమున్నదో వర్ణింపఁజాలము, శంకరులవారు భగవానుని గూర్చి యిట్లనిరి. "నమస్తే సమస్త ప్రపంచ ప్రభోగ ప్రమాణప్రవీణ." అనగా నేప్రాణి యేమేమి యెంత నెప్పు డెట్లనుభవింపవలెనో నిర్ణయించు ప్రావీణ్యము గలవాఁడే భగవానుఁడని యర్థము. ఈశ్వరసంకల్ప ప్రావీణ్య మమోఘమై; సర్వప్రాణి గత కార్యక్రమము లమలు జరుపుటలో నెన్నడును లేశమాత్రమైనఁ బొరపాటుండదు. ఇందీశ్వరుని కేమియు శ్రమలేదు. నీ వట్టి పరమేశ్వరు నాశ్రయించి, పరిశుద్ధ చిత్తుఁడవై నిలుచుచో నీ యవసరము లన్నిటినిచ్చి, నిన్ను మనుగుడుపు పెండ్లికొడుకు వలెఁజూచి రక్షించును.

175. సకలబాధలకు దివ్యమగు రాజవైద్యము శ్రీరామ స్మరణమే; నీవు చేయువలయుపని రామజపమే. అన్ని బాధలు పోవువరకు శ్రీ రామజపముచేసి, తిరిగి యెట్టిబాధలు

రాకుండ నుండుటకును శ్రీరామ స్మరణముచేసి, అఖండ శాంత్యానందములు లభించుటకు శ్రీరామ స్మరణమేచేసి, మోక్షసిద్ధి యగువఱకు శ్రీరామ స్మరణమేచేసి, ముక్తుఁడ వనగా, శ్రీరామ ప్రభువులో నైక్యముసాధించి, నీవే శ్రీరాముఁడవైయైె అప్పుడుమాత్రమే శ్రీరామస్మరణము మాన వచ్చును. అంతవఱకెన్నఁడును మానరాదు.

176. సముద్రముపై భాగమునఁదరంగములు, వాయు కల్లోలములు, సుడిగుండములు నుండును. అటులే మానవ బాహ్యజీవితమున—అనగా బాహ్య సంసారసాగరమునఁదాప త్రయ తరంగములవలన అశాంతి, అలజడి, ఆందోళనము, మున్నగునవి యుండును. సముద్ర గర్భమున నిశ్చలతవలెనే, అంతర్ముఖుఁడై, లోనికిఁ బ్రవేశించి, మూలములోనికి దృష్టి కేంద్రీకరించుచో, నిశ్చలమైన ఆత్మ ప్రశాంతి లభించును. అదియేఆత్మస్వరూపము అదియే నిజమైన మానవుని రూపము.

177. సర్వప్రాణికోటికి, సర్వావస్థలలో నేమిచేయ వలెనో సమగ్రముగా నెఱిఁగి ఆప్రకారము నడపుచున్నవాఁడే భగవానుఁడు. చీమకు, దోమకు, మనుజులకు, దేవతలకు, బ్రహ్మపర్యంత సర్వ జీవరాశులకు, వలయున వన్నియు భగ వానుఁడే చేయుచు సుఖదుఃఖానుభవములను కలుగఁజేయు చున్నాఁడు. భగవానుని మహిమయిట్టిదని యెరిగి, నమ్మి, నిరంతరము భజించుచుండు భక్తునికి సుఖానుభూతియిచ్చి, దుఃఖానుభవావకాశము లేకుండఁజేసి, జ్ఞాన మోక్ష సాధన లను జేయించి తరింపఁజేయును.

178. అనారోగ్యము బాధించునపుడు దేహముయొక్క తుచ్ఛత్వము బోధపడును. ఆరోగ్యము కలిగి, బలము పుష్టి కలిగినచో, భోగానుభవకాంక్ష తలయెత్తి మారుత్రోవలు పట్టించును. మనమేది కోరవలెను? అనారోగ్యము కోరం జాలము; మరి దేహబలము పుష్టినిగోరిన చో భోగలాలసత్వము బాధించును గావున, పుష్టి బలముల నిచ్చి భోగవాంఛలను గాకుండ, దైవభక్తిని జ్ఞానమును ప్రసాదింపుమని కోరవలెను.

179. కోపమెవరిపైనను జూపనవసరము లేదు. మనకు గోపముకలిగించునట్లు ప్రవర్తించు వారందరును దైవసంకల్ప ప్రేరణచేనట్లు చేయుచున్నారు. వారు కర్తలుగారు. ఇంక గర్తయైన దేవునిపై గోపము చూపుదుమా? మనకోపము వలన దేవునికి నష్టములేదు. దేవునిపై గోపము చూపిన దైవద్రోహ దోషము వలని ఫలితము మనమే అనుభవింప వలసియుండును. అందుచే, ప్రాణులపైం గాని, దేవునపైం గాని కోపమునకు దావు లేదు. మనపై మనమే కోపగింప వలెనా? మనమును దైవసంకల్ప ప్రేరితులమే కావున గోప మునకు స్థానము లేదు.

180. రిక్షాలో బోవుచుండగా, నడచి, వివిధ వాహనములలో స్త్రీలు, పురుషులు తాపత్రయములచే వికాసము లేని ముఖములతో నటునిటుతిరుగుచుండు జనమును జూడగా, నందరును కామకాంచన వాంఛా బద్ధులై. రుద్రభూమికి బరుగులిడుచున్న వైఖరిని ప్రదర్శింతురు. వాహనము

లన్నియు శ్మశాన వాటికకు మోసికొనిపోవు శవవాహనముల వలెనే గోచరించును. ఇట్టి అనిత్యము సుఖహీనమునైన ప్రపంచములో జన్మించి, దైవకృప నార్జించు నఖండ కృషి నతి వేగముగాఁ జేయని అజ్ఞానము దైవకృప లేనిదే విడువదు.

181. ఈ ప్రపంచములో నెంత పదవి లభించినను, ఎంతకీర్తి, ధనము, పరివారము, భూమి, భవనములున్నను ఏదియోరూపములో మన శాంతిని జెడఁగొట్టి కన్నీరుపెట్టించు దుస్థితి కలిగి తీరును. ఏలన కీర్తిపదవీధనాదులన్నియు నస్థిర, ములు, పరిపూర్ణత లేనివి. పరిపూర్ణత వీనిలో లేదు, పరిపూర్ణ తలోఁగాని స్థిర శాంతి సౌఖ్యములు లేవు. పరిపూర్ణతయనగా ఁబరిపూర్ణ జ్ఞానము లేక బ్రహ్మజ్ఞానము. బ్రహ్మజ్ఞానమనగా ఁబరమాత్మ రహస్యమును జూపునది. అందుకే ప్రాచీన మహర్షులు, గృహకీర్తి ధనాదికమునేగాక, ప్రపంచ సార్వ భౌమత్వాదికమును తృణ ప్రాయముగా విసర్జించి, తపోధ నులై బ్రహ్మత్వమును సాధించిరి.

182. కర్మయోగమనగా జ్ఞానయోగమే. కర్మచేయు నది నేను గాదనియు, నీశ్వరుఁడే కర్తయై చేయించుచున్నాఁడ నియు ఁదెలియుటే జ్ఞానయోగము. సర్వమీశ్వరమయమై, యీశ్వర కర్తృకమైనదని యెరిగి ప్రవర్తించుటే భక్తి యోగము. నిజమైన కర్మయోగములో జ్ఞాన భక్తి యోగములు కలిసియున్నవి. అటులే భక్తిలో జ్ఞాన కర్మయోగములు, జ్ఞాన ములో భక్తి కర్మయోగములు కలిసియున్నవి. మూఢులు

వీనిని వేరుగాభావింతురు. దేనికదే సంపూర్ణమై, యితర యోగములతో సంబంధము లేకున్నచో—భక్తి ఉద్రిక్తోన్మాదము, కర్మ స్వార్థదూషితము, జ్ఞానము తర్కతాండవమునై మోసగించును.

183. భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుఁడేమి బోధించెను? "నేను నీవే; నీవు నేనే" యని బోధించెను. తక్కిన బోధలన్నియు దాని కంగములు. సర్వరూపములు నావేయని పెక్కురీతుల భగవానుఁడుపదేశించెను. భగవానుఁడు సర్వమై, సర్వత్ర నిండియుండి, సర్వము చేయుచున్నాఁడు. బహురూప చరాచర ప్రకృతియంతయు భగవానుని సంకల్ప బాహ్యరూపములే, ఇఁక నేను, నీవు భగవానుని రూపములుగాక వేరేమగుట కవకాశమున్నది? మనము కన్నులు తెరచి, భగవానుని ఉనికిని బుద్ధిచే గ్రహించి, ప్రకృతిసంతతను భగవానుని దివ్యతేజ స్స్వరూపముగాఁ జూచి, లోఁజూపుచే నాత్మయే మన మనియు సర్వవ్యాప్తమైన పరమేశ్వర స్వరూపమే ఆత్మ యనియు ననుభవసిద్ధి గాంచవలెను.

184. జీవితసమస్య నర్థముచేసికొనకుండ జీవించువారి అత్యధిక వర్గమువారితోడనే ప్రపంచము నిండియున్నది. బ్రతుకుటయే పరమావధియని తలఁచి శిశ్నోదర పరాయణులై వర్తించువారికి వేదాంతోపదేశ మేమిరుచించును? శరీరము ముఖ్యము దానికి వలయుసామగ్రి—అన్నవస్త్రగృహాదికము, కామ సంతృప్తి—ఇవియే లక్ష్యములు. వాని సంపాదన నిమి

త్తముఁజేయు కృషిలో జీవితశక్తులన్నియు వ్యయమై జీవిత రహస్యము నెఱుగుట కేమాత్రము శక్తియుమిగులదు. కావలసిన దేమోయెఱుఁగ యితరవాంఛలు మోసగించును; నమ్మిన దేహము దగాచేయును. ఫలితము మితిలేని దుఃఖము ముఖములపైఁ దాండవించుచుండును. భగవానుని దివ్యలీల !

185. దేహపోషణము, దేహ భోగావసరములు కాలహరణము నంగీకరింపవు. వానిని వెంటనే ఆర్జించి అనుభవింపఁ బురికొల్పును. ఒకసారి అనుభవించుటవలన సంతృప్తి కలుగునా? మరణకాల మాఁకోర్కె యెముకలనుబట్టి పీడించుచుండును. తాత్కాలిక దేహ సంతుష్టినిచ్చు భోగ్యవస్తువుల స్థిరాస్థిరత్వములఁ గూర్చి పరిశీలన జరుపుటకుఁ దావీయవు. అవియెల్లపుడును తొందరను, తొట్రుపాటును గలుగఁజేయుచుండును. అట్టి ప్రవృత్తిలోఁ గోటిసమస్యలుత్పన్నములై మృత్యువున కొప్పగించును. ఈ దురవస్థనుండి దైవానుగ్రహ మొక్కటే రక్షింపఁగలదు. అట్టిదైవానుగ్రహ ప్రాప్తికి దైవారాధనము తప్ప మార్గాంతరము లేదు.

186. దుఃఖ సమ్మిశ్రితమగు సుఖలేశ మొకవైపునఁ బెట్టి, నిరవధిక శాంత్యానందముల నింకొకవైపున నుంచి, మీకేదికావలయునో దీసికొనుఁడని భగవానుడు పలుకుచున్నాఁడు. చిల్లిగవ్వ కావలెనా, అమూల్యరత్నము కావలెనా? యని అడిగినచో రత్నమే కావలెనని బాలురుకూడఁ జెప్పఁగలరు. చిల్లిగవ్వ యనగా సాంసారిక జీవితములోఁ, గాంతా

కాంచన భవన వాహనాదికము. రత్నమనగా జరామరణ రహిత శాశ్వత శాంత్యానంద సమృద్ధమగు మోక్షపదవి. లోకులందరు రత్నమును విడిచి, చిల్లిగవ్వకై పరుగులిడుచు నెంతదుఃఖ మనుభవించుచున్నారో !

187. మానవులొక ప్రశ్న వేసికొని దానికి యుక్తమైన సమాధానమును నిర్ణయించుకొని అట్లు నడచుకొన్నచో ధన్యులగుదురు. క్షణికానందము+స్థిరదుఃఖము కావలెనా? స్థిరానందము+తాత్కాలిక శ్రమ కావలెనా? ఇది చిన్న ప్రశ్న. దీనికి సమాధానమునకు. నీవు నిశిత మేధావివికానక్కరలేదు. బాలునకు నిది సుస్పష్టమై గోచరించును. భక్తి వివేకములతో జపసంకీర్తన ధ్యానాదిక శ్రమకోర్చి స్థిరమైన మోక్షానంద సంపాదనమునకై జీవిత శక్తుల నన్నిటి నుపయోగింపవలెనని స్పష్టము. నీవు తరింపఁ గోరుదువా? ఈ ప్రశ్నయు సమాధానమును దినదినము మనస్సులో నుంచికొని ప్రవర్తింపుము.

188. త్యాగమే సుఖము, త్యాగమే మోక్షము; త్యాగమే శాశ్వతానందము, త్యాగమే సుస్థిరమైన పరమశాంతి. తల్లితన ఆరోగ్యమును, శక్తిని త్యాగముచేసి పుత్రుని గాంచి సంతసించును. స్త్రీ పురుషులు తమతమ తనుసారమును త్యాగముచేసి, క్షణికసుఖ మనుభవింతురు. తనదేహ మనోబుద్ధిశక్తుల నన్నిటి నుపయోగించి, ధనికుఁడు తన ధనరాశిని గాంచి ఆనందించును. ఉన్నతోద్యోగి తన బలశక్తులను

వ్యయించి కొంత సంప్రాప్తి గాంచుచున్నాఁడు. వీరందరును తమకు భగవానుఁ డిచ్చిన సర్వ శక్తులను వ్యర్థమొనర్చి తాత్కాలిక సుఖము నందుచున్నారు. కాని వీరికిఁగలుగు సుఖము క్షణికమే, మఱియు ననేక క్లేశములతో నిండియుండును. అహంకార త్యాగముచేఁ దనజీవితము నీశ్వరార్పిత మొనర్చి భగవానుఁడిచ్చు ననంత శాంతి సౌఖ్యముల నార్జించుట తెలివికాదా?

189. సంసార సంబంధమైన ధనకనక వస్తువాహనాదులనుసంపాదించుట కెంతశ్రమమైనను లెక్కచేయక మానవులు పాటుపడుదురు. భగవంతుని కృప సంపాదించుటకు మాత్రము తృణప్రాయమైన అల్పశ్రమతో నదిలభింపవలెనని కోరుదురు. దానికొఱకు విశేష కాలమునుగాని శక్తినిగాని వ్యయింపనిచ్చగింపరు. వారి స్వల్ప కృషికి దైవకృప కలుగలేదని నిరాశకలిగి, కృషియేమానుదురు. మనయందెన్ని లోపములున్నవో తెలిసికొని వానిని సవరించుకొని, భక్తితో నారాధించు టవసరమని యేల తెలిసికొనరో !

190. భగవంతుని నమ్మితిమను వేలకొలఁదిమందిలో నొకరిద్దరు మాత్రమే నిజముగా నమ్మినవారుండ వచ్చును, భగవంతుని నమ్ముటంత తేలికపనికాదు. తెరచాటున నున్న వ్యక్తి యెట్టివాఁడో వాని లక్షణములేవో తెలిసికొనుట కష్టమే, ప్రకృతియను తెర వెనుక భగవానుఁడు పరోక్షముగా నుండుటచే వాని గుణగణాది మహిమను గ్రహించుటకు తీవ్ర

కృషి యవసరము. కాని, వేదశాస్త్రములు, మహర్షులు, జ్ఞానులు, భక్తులు ప్రకృతి వెనుకనున్న భగవానుని ప్రత్యక్షముగా దర్శించి, మాటాడి, వాని మహిమలను గుర్తించి మనపై దయతోఁ బ్రకటించియున్నారు. వారి వాక్యముల నమ్మి, వారు తెల్పిన మార్గములను ననుసరించి కృతార్థులము కావలెను.

191. పరమేశ్వర కృపా సంపాదన కృషి లేక బ్రహ్మజ్ఞాన కృషి చాలవిచిత్రమైనది. దేహముతో దేహమును నమ్మని భగవదారాధనము; చలించు మనస్సుతో నిశ్చల ధ్యానము; పరిమితబుద్ధితో బుద్ధ్యతీతమగు పరమాత్మ తత్త్వ జ్ఞాన సముపార్జనము, మాయచేఁ గప్పఁబడి, మాయను జయించి, మాయాతీత పరబ్రహ్మసాధనము, చావుగల జన్మమెత్తి చావులేని మోక్షసంపాదనము మిక్కిలి విచిత్రవిషయములు, విచిత్ర విషయములే గాక, శ్రమాన్వితములు, కాని మార్గాంతరము లేదు, శ్రమకోర్చి, భగవత్కృప సంపాదించుటొక్కటే తప్పనిసరియైనపని.

192. ఆదర్శకుటుంబ మనగా యజమాని, గృహిణి సంతతి – దైవకృప లభించు పద్ధతిలో జీవించువారై, దానికే ప్రధానస్థానమిచ్చి తక్కిన విషయముల నప్రధానముగాఁ జూచువారై యుండుటయే, గృహయజమాని, నిరాడంబర జీవియై వ్యసనములకు లోఁబడక, జగమంతయు నీశ్వరాజ్ఞాపాలితమై యున్నదని యెరిగి, అప్రమత్తభక్తి భరితుఁడై,

ధర్మకర్మాచరణ శీలముఁ గలిగి, తన భార్యకు, బిడ్డలకు, బంధు మిత్రులకు, సేవకులకు, (జేయూతనిచ్చి సన్మార్గమున నడపు వాఁడే. అట్టి సత్కుటుంబము లధికముగానుండు దేశమును దేవుఁడే కాపాడి, యెట్టి విపత్తులు కలుగకుండఁ జేయును, విపత్తు లధికముగా (దటస్థించు చున్నవనగా, సత్కుటుంబ ముల సంఖ్య తగ్గినదని తెలియవలెను.

193. సత్పురుషుఁడనగా సత్ సత్యము నారాధించు టకై జీవించువాఁడు. సత్యమనగా భగవానుఁడు లేక పర మాత్మయే. పరమాత్మయనగా, త్రికాలాబాధ్యుఁడు, సర్వ పరిపూర్ణతలుగలవాఁడు. అట్టి పరమాత్మ నెరిగి పూజించు టకు, (దరించుటకు నుపయోగించు జ్ఞానమును, సాధనములను మనకు సమకూర్చినవే వేదములు, ఉపనిషత్తులు మున్నగు నుత్తమగ్రంథములు, వానిలోని సారాంశములను గ్రహించి, వానిని జీవితములో నాచరించు నిష్ఠగలిగి, యెన్ని అవరోధ ములు కలిగినను, లెక్కగొనక, విజయము సాధింపఁ బూను వాఁడే సత్పురుషుఁడు.

194 నీవు భక్తుఁడవు కాఁదలచుకొంటివా ? కామ క్రోధాది దోషములను దరిజేరకుండఁ జూచికొనుము. కామ వశుఁడైన వాఁడు సక్రమముగా భగవంతునారాధింపఁ జాలఁడు. ఏలనఁ గామకలుషితమైన హృదయము, పరమ పావనమూర్తియగు భగవానునికి సమర్పించుటకుఁ బనికిరాదు. కామమునుండియే క్రోధాదు లుద్భవించును. కామక్రోధ

వశుఁడైనవ్యక్తి ధర్మమును తృణీకరించి, భగవానుని నిరసించును. ఇఁక భక్తి కవకాశమేది? కావున భక్తుఁడు కాఁగోరు నాతఁడాత్మ పరిశీలనముచే నిత్యము హృదయమును మలిన పరచు కామక్రోధాది దోషములన్నిటిని తుడిచివేసి, పరిశుద్ధ మొనర్చుకొను చుండవలెను.

195. మన్మథుఁడు విష్ణుమూర్తి కుమారుఁడని పురాణ గాథ. కాని విష్ణువే సర్వసౌందర్యనిధి అతఁడే మన్మథులు కోటిమంది కంటె నధిక సౌందర్యరాశి. మన్మథుఁడందులో నొకయంశామాత్రుఁడే. మృత్యువు లేక యముఁడెవరు ? విష్ణువే. దేవేంద్రుఁడు, దిక్పాలకులు, దేవతలు విష్ణురూప ములే. మన్మథరూపములో మనకు మోహము, కామము నుదయింపఁజేసి, విష్ణురూపములో జ్ఞానామృతమిచ్చి, మృత్యు రూపములో మనకు మరణమును కల్పించుచున్నాఁడు. పర మాత్మయగు విష్ణువునర్చించుచో, మన్మథ మృత్యువులు అదృశ్యులై, దైవకృప, జ్ఞానసిద్ధి లభించును.

196. భగవత్కృప నార్జించు కృషిలోఁగూడ విశేష శ్రమాన్విత మార్గములను విడిచి అత్యల్ప శ్రమమాత్ర ముచేతనే విజయము సాధించు విధానములున్నవి. వేయి రకముల పూజలు, లక్షవిధముల కర్మకాండలు, తీర్థయాత్రలు, కోటిపారాయణములు, ఉపవాసాదికములు – ధన, కాల, బల ముల నధికముగాఁ గోరి, పెక్కు జన్మములను వ్యర్థ మొన ర్చును. అట్లుగాక, నిర్వక్రము, నిత్యశుద్ధమునైన మనస్సుతో

నిరవధిక దీక్షతో భగవానుని మఱువకుండఁ గొన్ని క్షణములు మాత్రమే ధ్యానించినను, అమోఘ ఫలితములు గలిగి, యీజన్మములోనే ముక్తి పొందుశక్తి లభించును.

197. మృత్యుంజయత్వములేక అమర్త్యత్వము నార్జించుటే భారతజాతి కనాదిగా సంక్రమించిన దివ్యాదర్శము. మృత్యువును జయించుటనగా నకాలమృత్యువు రాకుండుటే. దేహమునకుఁ బతనముతప్ప దేలన నది పంచభూత కల్పితము; జననమరణములు దాని స్వభావములు. దేహపాతములో పునఁ బ్రహ్మజ్ఞానసిద్ధిచే జనన మరణాదికములేని మోక్ష పదవి నార్జించుటే భారతీయులకు సంప్రదాయ సిద్ధమైవచ్చిన గమ్యస్థానము. దేహముపకరణము, దేహము దైవాధీనమొనర్చి, దేహము పడిపోవులోపున దైవకృప నార్జించి, పునర్జన్మావసరము లేకుండఁ జేసికొనుటే అమర్త్యత్వము.

198. ప్రపంచములోఁ దెలివితక్కువ లనేకరకములుగా నున్నవి. పరమేశ్వరు నాశ్రయించినచో సకల శుభములు చేకూరునని నమ్మకుండు తెలివి తక్కువతో సమానమైన దింకొకటిలేదు. సర్వశుభప్రదాత, ఆశ్రిత కల్పవృక్షమునైన భగవాను నాశ్రయించి, సకల దుఃఖ దోషపరిహారము చేసికొని, నిత్యశాంతి సౌఖ్యములు సంపాదించి హాయిగా ననుభవించు బుద్ధిపుట్టకుండుట కంటె దౌర్భాగ్యము, తెలివితక్కువ మరేముండును. అట్టి తెలివితక్కువ గలిగి, మేమెంతయుఁ దెలివైన వారమని చెప్పుకొనుట నేమనవలెనో తెలియదు.

199. పరమాత్మ సంకల్ప మాత్రమున సకల ప్రపంచము నుదయించినది అంనుచే నీ సర్వప్రపంచము నందలి సకలము భగవానుని రూపములే. ఉన్నదంతయు భగవానుని బాహ్యాభ్యంతర స్వరూపమే. మొదట బాహ్య స్వరూపమైన ప్రకృతిని, దానియందలి చరాచరములను జూచి భగవంతు నందు దర్శించుట నేర్చి, తరువాత భగవాను నంతరంగ స్వరూపమును భజించుటకుఁ బూనుకొని తరింపవలెను. సగుణము మొదట నిర్గుణము నా వెనుక నారాధించుట సులభము, అస లేదోవిధముగా నీశ్వరారాధన తత్పరుఁడైన వానికి సగుణ నిర్గుణ భేదము లనుభవముచేఁ దెలియును.

200. లోకమంతయు, జీవితము లన్నియు విషాద ప్రమాద దుఃఖములపుట్ట. "నీవేమి సంపాదించితివ"ని మూర్ఖ లోకము ప్రశ్నించును. "నీవు దేవునాశ్రయించితివా" యని ప్రశ్నింప వలెను. "నేను భగవానుని పాదపద్మము లాశ్రయించి నాజీవిత సర్వస్వ మందర్పించు నభ్యాసమును సంపాదించినా"నని నిక్కముగాఁ జెప్పగలవాని పాదరేణువులు శిరమున ధరించి లోకమంతయుఁ బవిత్రత గాంచఁగలదు, అట్టి మహాత్ముని జీవితమే లోకకళ్యాణ ప్రదమైనది.

201. నీవు బ్రాహ్మణుఁడవని పూజింపఁ గోరుదువా? బ్రహ్మజ్ఞానమను తాళముచెవిని సంపాదించి జందెమునకుఁ గట్టుకొని అఖండధైర్యము, శాంతి, ఆనందములతో జీవించుచు నీ యునికివలననే లోకకళ్యాణమును సాధించుశక్తి నార్జించినచో

నీవు నిజమగు బ్రాహ్మణుఁడవు. ఈ తాళముచెవి లేనివాఁడెంత విద్వాంసుఁడైనను తృణప్రాయుఁడే. పెట్టెనిండ ధనముంచి, తాళము వేసి, అవసరము వచ్చినపుడు వాడుకొను రీతిగా బ్రహ్మజ్ఞానముచే దైవకృపాధనము నార్జించి సకల దుఃఖములను దొలగించుకొని, సర్వశుభములను సంపాదించు శక్తియే బ్రాహ్మణత్వము. అట్టివారి సంఖ్యఅల్పమే యైనను లోక కల్యాణము సాధింపఁబడఁగలదు.

202. ప్రతినిమేషమునను యముఁడువచ్చి మానవులను జుట్టుపట్టి యీడ్చుకొని పోవుచున్నాఁడు. ఇట్లీడ్వఁబడుచున్న మానవులీవిధముగా నాక్రందించుచున్నారు; "మాకు పెండ్లి కావలెను, పిల్లలు కావలెను, ధనము కావలెను; గృహ వాహనాదికములుకావలెను!" యముఁడు వారిజుట్టువిడువఁడు; ఈడ్చుట మానఁడు. అందుచే మానవులిట్లేడ్వవలెను; "హే భగవాన్! రక్షించు, శ్రీరామప్రభో! కాపాడు, శ్రీకృష్ణ ప్రభూ! దయచూపు," ఇట్లేడ్చినచో యముఁడు జుట్టువిడిచి పారిపోవును!

203 మనకు శత్రువులు చాలమంది గలరు. మన కపకారము, నవమానము చేయఁగోరుదురు. ఏమిచేయుటయని కంగారు పడనవసరము లేదు. ఏలన భగవానుఁడున్నాఁడు. ఎవరియాటలు సాగనీయఁడు. ఎవరి నెట్లుచూడవలెనో యెరిగినవాఁడు. వాని సంకల్పశక్తు లప్రతిహతములని యెరిగి, స్వచ్ఛ భక్తితో నిండిన హృదయముతో నాభగవానుని

స్మరించుచు, హిమవత్పర్వతమువలె నిశ్చలధైర్యముతో నుండి, మనకెవ్వఁడు హాని యేవిధముగాను చేయఁజాలఁడని చిద్విలాస వదనారవిందుఁడవై సుఖింపవచ్చును.

204. దేవుని నమ్ముటనగా, భగవానుని పాదపద్మము లాశ్రయించి జీవించుటనగా, వజ్రకవచము ధరించి. శ్రీరామ ప్రభువు ప్రక్కనునిలుచుట; శ్రీకృష్ణుని రథములోఁ గూర్చుండుట; ఇఁక నిన్నెవఁడేమి చేయఁగలఁడు? యముఁడే దరిచేరఁజాలఁడు ఇఁక మానవమాత్రులేమి చేయఁగలరు? దేవుని పూర్తిగానమ్మి స్మరించుటతోఁ దుల్యమైన మహోన్నతరక్షణ మింకొకటిలేదు. నమ్మవా? నీప్రారబ్ధము!

205. మనకు శుభముకానిది భగవానుఁడు జరుగనీయఁడు. మనకు శుభముగాఁదోఁచి జరుగకున్నచో, మనము భక్తులమైనచో నెన్నఁడును విషాద మందరాదుసరికదా,జరుగకుండుటే శుభమని ఆనందింపవలెను. అంతేకాదు, శుభముజరిగినప్పటి కంటె నధికముగా నానందింపవలెను. జరుగని దశుభమైనందున నే జరుగలేదని మనకు దెలియదు. మనయెడ దయగల దేవునికి దెలిసి దానిని జరుగకుండఁ జేసినాఁడన్నమాట. అందుచే మనమధికముగా సంతసింపవలెను. ఇఁక నిజముగా మన కశుభమే జరిగిన యెడల మనము భక్తులము కామని గ్రహింపవలెను.

206. దైవభక్తి నీకున్నదనగా సర్వకాల సర్వావస్థలలో భగవానుఁడు నీతోనుండి అమోఘ రక్షణమిచ్చుటేగాక, సర్వ

శుభములను సమకూర్చును. దైవభక్తి నీకున్నదనగా దేవు నఖండశక్తి నీకండయై నిల్చునన్నమాట, దైవభక్తి నీకున్న దనగా దైవశక్తి నిచ్చునది; అనగా దైవత్వము నిచ్చునది; మానవత్వము దుఃఖ దూషితము, అల్పశక్తి మాత్రము; దైవ త్వము నిర్దుష్టసుఖప్రాప్తి సాధనము, జరామరణ రహితానంద నిలయము. దానియెడ నీకుఁగోరిక గలదా, నీజీవితమంతయు దపస్సాధనలచే దైవమయమై ప్రకాశింపవలెను. దైవలక్షణే తరమేదియు నీయందుండ రాదన్నమాట. అంతపరిశుద్ధుఁడవు నీవుకావలెను. పరమేశ్వరారాధనము కంటె బవిత్రమైన ద్చన దింకొకటిలేదు.

207. ప్రకృతి శక్తులు దేవుని మహిమలో నొక అత్య ల్పాంశమును మాత్రమే చూపును. ప్రచండ మారుతము, భూకంపము, మున్నగునవి భగవంతుననంతశక్తి నణుమాత్ర ముగా సూచించును, అందుచే వానిని దిలకించినపుడు భగ వానుని దివ్యమహిమను గుర్తించి, భయవినయ భక్తిభావము లతో భగవాను నారాధించుట నేర్చికొనవలెను. భక్తునికి గర్వించి విఱ్ఱవీగుట కవకాశము లేదు. ఎల్లప్పుడు తలవంచి చేతులుజోడించి వినయప్రపూర్ణ శుద్ధాంతరంగముతో దేవుని పాదములకు మ్రొక్కుటయే భక్తుని విధి.

208. ఒకవస్తువునుగూర్చి తెలిసికొనుట యనగా నావ స్తువే మనమగుటకాదు; ఆవస్తులక్షణములను సరిగా గ్రహిం చుట. పటిగబెల్లము తియ్యగానుండును; చింతకాయ పుల్లగా

నుండును, కాని బ్రహ్మవేత్త బ్రహ్మమేయగునని చెప్పఁబడెను. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అనగా బ్రహ్మమును తెలిసినవాఁడు బ్రహ్మమే యగును. ఇది విచిత్రముగాఁ దోచును. మనము భగవానుని నెఱిగినచో మనమును దేవుఁడే యగుదుము, అనగా పరమాత్మ లక్షణములన్నియు నదివఱకే మనలోనుండి, జ్ఞానముచే నావిష్కృతములగుచున్నవి. అపుడా పరమాత్మ మనమేయని బోధపడును. ఇది ఉపనిషద్వాక్యము.

209. పరిపూర్ణ జ్ఞానము, శాశ్వతానందము, అఖండ శాంతియు నివిపైనుండివచ్చునవికావు. అవి అదివరకే మనలోనున్నవి; ఆచ్ఛాదింపఁబడియున్నవి; మేఘావృతమైన సూర్యబింబమువలె. మేఘములు తొలగిపోయినంతనే సూర్యుఁడు సహస్రకిరణములతోఁ బ్రత్యక్షమగును. అనగా జ్ఞానము, జ్ఞాత జ్ఞేయమునొకటే. పరమాత్మను పరమాత్మేతరమైన దేదియు దెలిసికొనఁజాలదు. దేవుని పరిపూర్ణత యెంత ఆనంతమైన దనగా దేవుఁడంతటి వానికిఁదప్ప దేవుఁడు సంపూర్ణముగా దెలియఁబడఁడు. జ్ఞానమనగా మానవుని దేవునిఁజేయునది; అది అజ్ఞానాచ్ఛాదనమును దొలగించుశక్తి; అది దేవునిదే! అనగా దేవుఁడే దేవుని దెలిసికొనుచున్నాఁడు!

210. "గతాసూనగతాసూంశ్చనానుశోచంతి పండితాః" గీత; బ్రతికియున్నవారిని గూర్చికాని, చనిపోయినవారిని గూర్చికాని పండితులు (జ్ఞానులు) విచారింపరు. వచ్చునవి

పోవునవి శరీరములుకాని శరీరులుగారు, శరీరియనగా నాత్మ; దానికి రాకపోకలు, జననమరణములు, సుఖదుఃఖములు లేవు. శరీరము నాదికాని నేను శరీరముకాదు నేను శరీరమునను కొనుట, అదిపోవుటకేడ్చుట-అజ్ఞానము, నేనాత్మస్వరూపినని గ్రహించి, ఖేదమోదములు విడిచి బ్రహ్మాత్మానుభవసిద్ధి గాంచుటే కర్తవ్యము.

211. భక్తుఁడైన వాఁడొకానొక సమయమున తనకు నపకారము జరుగునేమోయని భావించి, "భగవాన్! అట్టి విపత్తు రాకుండ రక్షింపుమ"ని ప్రార్థించును భక్తుని బాధ్యత వహించిన పరమదయానిధియగు భగవానుఁ డదివరకే, అనగా భక్తునికంటె ముందుగనే తనభక్తునికి రానైయున్న ఆపదను గ్రహించి దానిని నివారించును. తనబిడ్డకెట్టి కష్టముకాని, అనారోగ్యముకాని రాకముందే పలయు సదుపాయముల నొనర్చి, కాపాడుతల్లివలె భగవానుఁడు ప్రవర్తించును భక్తుఁడైన వ్యక్తి, భగవానుని మర్యాద లెట్లుండునో గ్రహించు దృష్టి గలిగి, తెలిసికొని ఆనందించి, తనభక్తి నినుమడింపఁ జేసికొను చుండవలెను.

212. నీకు సంశయము కలిగినప్పుడు మానవుల నెవరి నైన ననుమానించుట తప్పులేదు. భగవాను నెన్నఁ డను మానింపకుము. భార్య, పుత్రులు,మిత్రులు బంధువులు-అందరు ననుమానింపఁదగినవారే, ఏలన వారికి స్వార్థములున్నవి. వారి బుద్ధులు కామక్రోధాది దోషములకు నిలయములు, అందుచే

వాఁడు నీయెడఁ గొంత ప్రేమ చూపినను నొకప్పుడు వైరము బూనవచ్చును; నీకపకారము చేయఁ బూనవచ్చును, భగవానునికి స్వార్థము లేదు; నిశ్చల పవిత్ర ప్రజ్ఞాన్వితుఁడు భక్తరక్షణైక దీక్షా బద్ధుఁడు. అందుచే భగవాను నెన్నఁడను మానింపరాదు. నిస్సంశయ బుద్ధితో భగవాను నాశ్రయించి సుఖింపుము.

213. అహంకారమే ప్రపంచము; సంసారము. అజ్ఞానమను తల్లికి ముద్దుబిడ్డ; ఇది గ్రుడ్డిది; ఏది సత్యమో ఏది అసత్యమో యెరుగదు, గర్వము, పోగరుబోతుతనము, ధర్మద్వైవద్రోహచింత, పరహింస ముఖ్యలక్షణములుగా గలది. అందుచే నది కుటుంబములలోఁ గలఁతలు; సంఘములో వైరములు, దేశములోఁ బరస్పర ద్వేషములు, ప్రపంచములోఁ గొట్లాటలు కలిగించుచుండును. అహంకారమును విడిచి, వినయ వివేకము లభ్యసించి జ్ఞానియు భక్తుఁడునై మానవుఁడు తరింపవచ్చును.

214. నీకమితముగా దాహము కలిగినప్పు డొక్క నీటిబొట్టును త్రాగినచో దాహ ముపశమింపదు. ఒక పెద్ద పాత్రనిండుగా నిచ్చిన త్రాగి తృప్తినందుదువు. మానవులకు, ప్రాణులందరకు నున్న సుఖానుభవదాహమట్టిది, ఇహ లోకములో సౌఖ్యమను నొక నీటిబొట్టు మాత్రమే మనకు లభించును, కాంతా కనకములిచ్చు నానందమట్టి బిందువే, అదియు దుఃఖ గర్భితమైనదనఁగా నొక్కటైనను సుఖజల బిందువు పది

శుద్ధమైనదిగాదు; రాగ ద్వేష కలుషితమైనది. ఇక దానివలన సుఖ దాహము తీరుటెట్లు? సర్వేశ్వర పాదస్పర్శచే, గంగా స్రవంతి ప్రవహించి, మన దాహమును సంపూర్ణముగాఁ బోఁగొట్టి, ఎడతెగని సంతుష్టినిచ్చును. దాహము తీర్పఁజాలని సంసార కలుషిత జల బిందువునకై తడవులాడుదు వేల?

215. ఎవనిని భగవానుఁడు బాధింపఁదలఁచునో, వానికి సదుపదేశమునందహితము కలిగించి, వక్ర మార్గము పట్టించును. సదుపదేశము చేసినవ్యక్తి తన ఉపదేశము వ్యర్థమయ్యెనని విచారింప నవసరము లేదు. భగవత్కృప లేని వ్యక్తి సదుపదేశములను తృణీకరించుటలో నసహజమేమున్నది.? కాని సత్పురుషులు, దైవభక్తులు చేయవలసిన దేమనగా, నజ్ఞానులందర పక్షమునఁ దామే భగవంతుని క్షమింపుమని ప్రార్థించుటయే సముచితకర్తవ్యమై యున్నది. మఱియు సదుపదేశము నర్థముచేసికొని పరమేశ్వరునారాధించుటకు బూనుకొనిన భక్తులు. తాము గాంచిన సదుపదేశము నెన్నఁడును మఱువకుండ నుండుటకు బూనుకొనవలెను.

216. సుఖము కొఱకు సంసారవృక్షము నాశ్రయించుట, పచ్చగడ్డి కొఱకుఁ గొబ్బరిచెట్టు నెక్కుట వంటిదే. కొబ్బరిచెట్టుపైఁ బచ్చిక లేనటులే, సంసార విషవృక్షముపై సుఖమనునది లేదు సరికదా, కష్టములు, దుఃఖములు సమృద్ధిగా నున్నవి. పచ్చగడ్డి పచ్చికబీడులో దొరకును; అటులే సుఖము పరమేశ్వరుఁడను కల్పవృక్షము నాశ్రయించిన లభించును.

ఏవస్తువెచట దొరకునో తెలిసికొనకుండ జీవించు నవివేకు లందరు చీకటిలోఁ దడవులాడి, దుఃఖమను ఫలిత మనుభ వించుచున్నారు.

217. సర్వవస్తుమూలము పరమేశ్వరుఁడు. ఏవస్తువును నీవు సమగ్రపరిశీలనము చేసినను, అది పరమాత్మయను ననంత శక్తిచేఁ గల్పింపఁబడెనని తెలియును. ఒక గడ్డిపరక యెట్లు మొలచి పెరుగుచున్నది? దానివిత్తన మెచటనుండి వచ్చినది? "బీజాంమాం సర్వభూతానాం విద్ధిపార్థ సనాతనమ్" అనిగీత పలుకుచున్నది. అన్నిటికి బీజము దేవుఁడే! గడ్డిమొక్క పెరుగు టకు భూమి, జలము, వాయువు, సూర్యరశ్మి కారణము లగు చున్నవి; భూజల వాయుసూర్యాదికము వెనుక భగవాను నప్రమేయ శక్తి నిలిచి పోషించుచున్నది. అనగాఁ గన్ను తెరచి నీవెద్దానినిఁ జూచిన నది యీశ్వర నిర్మితమని బోధ పడును. అనగా నీశ్వరస్వరూపమే. నీవునొక వస్తువే. నీవు నీశ్వరస్వరూపమే, అనగా సరిగాఁ బరికించినచో నీవే యీశ్వ రుఁడవని స్పష్టమగును.

218. ఆకలితో బాధపడుచున్నావా? నీయింటినిండ బియ్యము, పప్పులు, కూరలు, పాలు మున్నగునవి సమృద్ధిగా నున్నవి. అనుకూలవతి యగు భార్యయున్నది. ఆమెచే వండిం చుకొని, రుచికరమైన అహారము కడుపునిండఁదిని సుఖింపక, ఆకటిబాధ యెట్లుపోవునని యేడ్చెదవేల? సర్వప్రాణుల సౌక ర్యమునకై భగవంతుఁ డందరలోను, బయట నంతటవ్యాపించి

పరమకృపామూర్తియై అందర కందుబాటులోనున్నాఁడు. ఆ భగవానుని పాదములుపట్టి భజించి ఆయన కృపామృతమును కడుపునిండఁద్రాగి, జన్మజరామృత్యు దుఃఖము లన్నిఁటిని పోనాడి, ముక్తుఁడవై సుఖింపవేల?

219. నీకత్యంత సన్నిహితమై నీవే దేహమని నమ్మి యుండగా నీ దేహము ముదిరి ముదుసలి వై, నశించుటకంటెఁ జిత్రమేమున్నది? అతిమృదువుగా పెరిగిన కూరగాయలను తోటనుంచి కోసితెచ్చి నిలువయుంచినచో నెండి కుళ్ళి నశించును. వెంటనే వానిని వండి భుజించుట, సద్వినియోగము కాదా? అటులే దేహము నవనవోన్మేష కళాసుందరమై యున్నప్పుడే దానిని భగవానుని పాదసేవలో వినియోగించి, ముక్తి సాధించి, ముదుసలితనము చావురాకముందే తరింపవలదా? ఆలస్యముచేఁ గూరలు కుళ్ళును; దేహము చచ్చును.

220. నీకునీవే అక్కఱ లేదా? నీబాగుకొఱకు నీవేమి చేసికొనుచుంటివి? నీకు బాధలు, బెంగలు భయ దుఃఖములు లేకుండఁ జేసికొంటివా? నీకు భయాందోళన దుఃఖములు పెచ్చు పెరిగిపోయి బాధించు క్షుద్రక్షణిక వస్తు సంపాదనములోఁ బుణ్యకాలమంతయు వ్యర్థమొనర్చుకొనుట నీకు నీవపకారము చేసికొనుటకాదా? చావు దుఃఖమునులేని పదవి ననగా నమరత్వము నార్జించు తీవ్రకృషి చేయుటకు నీవుపూనుకొన్నచో నీకు నీమీఁదఁగొంత అభిమాన మున్నదని చెప్ప వచ్చును. ఎందరిని చూచినను, నీ యభిమానమున్న వారెచ

టను గోచరింపరే! అనగా లోకులు తమకుఁ దెలియకుండ దుఃఖమును గోరుచున్నారు. స్థిరసౌఖ్య మక్కరలేదు!

221. ఒక సత్యమును మనము మొదటిసారి వినినప్పుడు మన కమితోత్సాహము, నుత్తేజము కలిగి, మన వ్యక్తిత్వమంతయు నందుఁ బాల్గొనును. కాని దానినే ప్రతిదినము వినుచుంటిమేని అది తేలిక యగును; దాని నవ్యత్వము, పూజ్యత్వము తగ్గిపోవును. ముఖ్యముగా భగవానుని గూర్చిన సత్యములను జెప్పు నుపనిష త్పురాణ వాక్యములను విని, మహోత్సాహ పూరితులమై వానినాచరణలోఁ బెట్టి, అనుభవ సిద్ధి పొందవలెను. పెట్టెలోని సొమ్ము దినమున కొకసారి లెక్క పెట్టుచు, భద్రపరచుటలో నేమి సుఖమున్నది? దానిని సద్విని యోగ మొనర్చి అనుభవించినపుడే ఆనందమిచ్చును, వినినదే, దినదినము, యావజ్జీవము వినుచుండుటే కాని, దాని నాచరించి అనుభవసిద్ధికిఁ దెచ్చికొననివారి అలసత్వము దుఃఖ హేతువగు నని చెప్పవలెనా? దానినే పురాణ వైరాగ్యమని నిందించిరి.

222. మనము జీవితములో నెంతకాలమును వ్యర్థముగా వ్యయమొనర్చితిమో, మరణకాలమందుఁ దళుక్కున మన దృష్టియెదుట మెరసి, దురంత సంతాపమును గలిగించును. ముందే యీసంగతి గ్రహించి, కాలమును ధర్మకర్మాచరణ మునందు, దైవకృపా సంపాదనము నందును వినియోగించి కొనినచో, మనము నిర్విచారముగా, సంతోషముతో దేహ త్యాగముచేసి, పుణ్యలోకములకుఁ బోయి సుఖింపఁగలము,

కాలమును ధనముకంటెం, ప్రాణములకంటె నధికమైన విలువ గలదానినిగా వాడుకొనుట నేర్చికొని, వ్యర్థప్రసంగములు, కామక్రోధ మోహముల నుద్రేకింపఁ జేయు గ్రంథ పఠనములు, పత్రికా పఠనములు, చలన చిత్రదర్శనములు, విడిచిపెట్టి బుద్ధిమంతులు తమ జీవితములను నడుపుకొనవలెను.

223. ఒక్క నిముసముచాలు; ఏకాగ్రతతో, నిష్కళంక చిత్తముతో భగవానుని పాదపద్మములపై మనస్సు నిలిపి, "తండ్రీ; ఇదే సర్వము నీపాదపద్మములపై నుంచితిని; స్వీకరించి, నన్నుఁ బరిశుద్ధునొనర్చి, నీకృపామృతమునిచ్చి రక్షింపు"మని ప్రార్థింపవలెను. ఏకాగ్రచిత్తముతో నొక క్షణమాత్రమట్లు ప్రార్థించినచో, పరమేశ్వరునుండి తప్పకుండ మనకు జవాబువచ్చితీరును. సాక్షాత్కారముగాకున్నను, మనలను పీడించు సమస్యలన్నియు దొలఁగిపోయి, చిత్త శాంతి, ఆనందము, జ్ఞానము, మనకులభించి, తరింపఁజేయును, ఇది దినదినము భక్తుఁడుచేసి, ఫలితములను బరికింపవలెను.

224. మనము ప్రతిక్షణము భగవానుని కృపామృతమువలననే జీవించుచు భగవానుని స్మరింపని వారి మందబుద్ధి నేమనవలెను? ఏక్షణమున భగవానుని దయ మనకు లేకుండునో ఆక్షణమున మనము జీవింపము; ఒకవేళ జీవించినను మనజీవితము దుర్భరదుఃఖముతో నిండినదగును. అందుచే మన మెప్పుడో యొకప్పు డేదో మ్రొక్కు దీర్చికొనునట్లు భగవంతుని స్మరించుటకాక, సర్వకాల సర్వావస్థలలో, దేవుఁడు

ఏకాగ్రత నార్జించి, శ్రద్ధా భక్తులతో నీశ్వరారాధనము జప ధ్యానాదికములు, చేసినచో (బూర్వ కర్మములు పూర్తిగా దగ్ధములగును; నేను కర్తనుగాను, సర్వకర్త పరమేశ్వరుఁడే; నే నుపకరణమును మాత్రమే యను జ్ఞానముచే నేకర్మలఫలిత ములు నంటవు. "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్ తమాహుః పండితమ్ బుధాః" భగవద్గీతావాక్యము.

227. లెక్కించుటకు శక్యముకాని అనంత ప్రాణికోటికి వలయు నవన్నియు భగవానుఁ డనుగకయే యిచ్చుటలేదా? విశ్వకర్తయు (బరిపాలకుఁడునగు భగవానుఁడెవరికేమి కావల యునో యెఱుఁగఁడా? మఱియు భగవానుని కోరి భజించు భక్తుల హృదయములలో నెట్టికోర్కెలున్నవో, వారికేవి ముఖ్యము లైనవో భగవానుఁడెఱుఁగును. భగవానుఁడనగా ననంతప్రజ్ఞ; అనంతైశ్వర్యము; అనంతకారుణ్యము; అట్టి దివ్యమూర్తి మహత్వము గుర్తించి, మన మాశ్రయించినచో మనకు లోటేమికలుగును? పరమేశ్వరు నాశ్రయించుటలో నెంత అఖండ సౌఖ్య శాంతులున్నవో తెలిసి, నమ్మి, భజించి ధన్యులము కావలెను.

228. నీవు నీకన్న బాధలు, కోర్కెలు భగవానునితోఁ (జెప్పికొంటివా? చాలు! నీవుచెప్పుటకు (బూర్వమే నీసంగతు లన్నియు భగవానుఁడెరుగును. అంతే! ఆగొడవవిడిచిపెట్టు." ఇదియే చేయఁదగిన ఉపదేశము, ఇఁక నీవు దానినిగూర్చి ఆలోచింపవలసినది, చేయవలసినది, శంకింపవలసినది, విచా

ఏకాగ్రత నార్జించి, శ్రద్ధా భక్తులతో నీశ్వరారాధనము జప ధ్యానాదికములు, చేసినచో (బూర్వ కర్మములు పూర్తిగా దగ్ధములగును; నేను కర్తనుగాను, సర్వకర్త పరమేశ్వరుఁడే; నే నుపకరణమును మాత్రమే యను జ్ఞానముచే నేకర్మలఫలిత ములు నంటవు. "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణమ్ తమాహుః పండితమ్ బుధాః" భగవద్గీతావాక్యము.

227. లెక్కించుటకు శక్యముకాని అనంత ప్రాణికోటికి వలయు నవన్నియు భగవానుఁ డనుగకరయే యిచ్చుటలేదా? విశ్వకర్తయు (బరిపాలకుఁడునగు భగవానుఁ డెవరికేమి కావల యునో యెఱుఁగఁడా? మఱియు భగవానుని కోరి భజించు భక్తుల హృదయములలో నెట్టికోర్కెలున్నవో, వారికేవి ముఖ్యము లైనవో భగవానుఁడెఱుఁగును. భగవానుఁడనగా ననంతప్రజ్ఞ; అనంతైశ్వర్యము; అనంతకారుణ్యము; అట్టి దివ్యమూర్తి మహత్వము గుర్తించి, మన మాశ్రయించినచో మనకు లోటేమికలుగును? పరమేశ్వరు నాశ్రయించుటలో నెంత అఖండ సౌఖ్య శాంతులున్నవో తెలిసి, నమ్మి, భజించి ధన్యులము కావలెను.

228. నీవు నీకన్న బాధలు, కోర్కెలు భగవానునితోఁ (జెప్పికొంటివా? చాలు! నీవుచెప్పుటకు (బూర్వమే నీసంగతు లన్నియు భగవానుఁడెరుగును. అంతే! ఆగోడవవిడిచిపెట్టు." ఇదియే చేయఁదగిన ఉపదేశము, ఇఁక నీవు దానినిగూర్చి ఆలోచింపవలసినది, చేయవలసినది, శంకింపవలసినది, విచా

రింపవలసినది మరేమియును లేదు. సర్వపరిపూర్ణతలు గల సమర్థుని దరిఁజేరితివి; చేయువలసినదంతే! నీస్వల్పావసరము లాయనకొకలెక్కా ? ఆగొడవ యిఁక విడిచిపెట్టి, సమగ్ర ధైర్య చిద్విలాస వదనారవిందుఁడవై జీవింపుము.

229. కఠోరసమస్యలు చుట్టుముట్టనిది మానవజీవితము కాదు. వానికి బరిష్కారములు లభింపకున్నచో మనస్సులు వికలములై తాపాగ్ని దగ్ధములగు చుండును. పరిష్కరింపఁబడని ప్రతిసమస్యయు మనస్సను మందిరములోఁ జేరి బుసలు కొట్టు విషసర్పమే అనేక విషసర్పములు సంచరించుచుండు మానసమందిరములు గల మానవాళికి శాంతి సౌఖ్యము లేవి? భగవానుని భజించుట కారంభించినంతనే సమస్యలను సర్పములు పారిపోవును. అంతియకాదు, భగవంతుఁడందు ప్రవేశించి, సకల శుభసౌఖ్యములనిచ్చును. నమ్మిచూడుము.

230. "యోమాంపశ్యతిసర్వత్ర, సర్వంచమయిపశ్యతి, తస్యాహంనప్రణశ్యామి, సచమే నప్రణస్యతి." గీతామృత వాక్యము. "ఎవఁడు నన్ను సర్వత్రచూచునో, సర్వములో నన్నుఁజూచునో, అట్టివారికి నేను లేకుండుటయు, నాకట్టివాఁడు లేకుండుటయు నెన్నఁడు జరుగదు. అనగా నంతటనన్నిటిలో దేవుని, దేవునిలో సర్వమును జూచునభ్యాసము చేయవలెను. ఈ అభ్యాసములో సిద్ధిగాంచుటయు, దేవుని సాక్షాత్కారము నేకకాలముననే జరుగును; అంతేకాదు; నీవే దేవుఁడవగుదువు; వేలన నింకొకఁడు లేఁడు. ఇదియే పూర్ణజ్ఞానావస్థ.

231. భగవానుఁడు భక్తులను కాపాడుటలో నత్యంత వేగమును, అమితమైన పుణ్యమును జూపి అనుగ్రహించును. భక్తులకు దప్పనిసరిగా ననుభవింపవలసిన దోషమున్నచో వానికై నామమాత్ర శిక్షనే యిచ్చుచు, నిచ్చుటలో గూడ మందగతితో దనకే యిష్టములేని రీతిగా జేయును. దృఢముగా నమ్మిన భక్తులను జూచి భగవానుఁడు ప్రదర్శించు కృపకుహద్దులులేవు. ఆపత్తుల నసలురానీయఁడు. పరిపూర్ణ భక్తికలుగుటకు వలయు స్వల్పశిక్షణ రూపమున నాతఁడు భక్తులతో నెల్లప్పుడుండి పనిచేయును.

232. లోకములో రహస్యములు చాలగలవు. అన్నిటిని దలఁదన్ను రహస్యమొకటియున్నది. అదియేమనగా, దేవునిలో సర్వమున్నవి. సర్వశబ్దమున కిచట మినహాయింపులేదు. సర్వసద్గుణములు, సర్వైశ్వర్యములు, సర్వసంపూర్ణతలు, సర్వసంపూర్ణ ప్రజ్ఞా విజ్ఞాన వైభవములు, సర్వసమగ్రకృపాదృష్టి, సర్వశాశ్వతానంత శాంత్యానందములు, సర్వశుభములు, సర్వనిరుపమానశక్తి సామర్థ్యములు, శౌర్యధైర్య ప్రతాపములు, సర్వానర్థ నిర్మూలనదక్షత, సార్వకాలికాభయప్రదానదీక్ష, మున్నగునన్నిటికి భగవానుఁడే నిలయము. ఈ రహస్యమెఱిఁగి, భగవాను నాశ్రయింపకుండ నెట్లుండఁగలవు ?

233. యజ్ఞోపవీతమనగా నేమో తెలిసికొని వాడుకొనవలసియున్నది. నూతన యజ్ఞోపవీతము ధరించునపుడు చెప్పు

కొను వాక్యము లిట్లున్నవి; "పరమంపవిత్రం, ఆయుష్య మగ్ర్యం...బలమస్తుతేజః" తాళముచేవి మొలలోఁ గట్టు కొందురు, ధనపేటిక నదితెరచి ధనమిచ్చును. అటులే యజ్ఞో పవీతము దైవశక్తి ధనమునకుఁ దాళముచెవి. హృదయములో జనార్దనుఁడున్నాఁడు. జందెమును కుడివైపునుండి హృద యముమీఁదుగా భుజముపై ధరింతుము. అనగా యజ్ఞోపవీ తము యజ్ఞ పురుషుఁడైన భగవానునికి మనకు బంధము. గాయత్రీజపమువలన దేవు ననంతైశ్వర్య పేటికనుదెరచు తాళముచెవివంటిది. ద్విజులనగా నీతాళముచెవిచే ఁబరమే శ్వరుని స్వవశము చేసికొనువారు. ఇది మఱచిన ద్విజులు గార్దభతుల్యులు.

233. నీకుఁ దోచినపనులు చేయుటలో నీతప్పేమియు నులేదు. నీవుచేసినపనులన్నియు ఁబరబ్రహ్మప్రభువు నాజ్ఞ ననుసరించి చేయుచుంటివని త్రికరణశుద్ధిగా నమ్మి, ఫలిత మెట్టిదైనను, నీయోగక్షేమము నిమిత్తము భగవానుఁడిచ్చునని నమ్మి, నిశ్చలానందముద్రిత వదనముతో సుఖింపుము, ఒక వేళ నీవేపనినైన నిచ్చగింపక మానితివా? ఈశ్వరు నాజ్ఞలేదని నిశ్చయముగానమ్మి, నిర్విచారముగా నుండుము. చేయుము, మానుము; చేయుటయు మానుటయు నీచేతిలో లేదని స్పష్ట ముగా నెరిగి, చేసియు, మానియు నొకేవిధముగా నానంద పరవశుఁడవై జీవింపుము. అపుడు నీకెట్టి క్లేశములునుండవు.

235. పశ్చిమ దేశప్రకృతి శాస్త్రజ్ఞులు నేడు నిర్మించి పోషించుచున్న నాగరకత చెప్పునదీ లోకమున మనము స్థిమితముగా దిష్ఠవేసి భోగములనుభవింపవచ్చుననియే. బాహ్యదృష్టికి ప్రాధాన్యమిచ్చి, అస్థిరములైన దేహాదులు స్థిరములను వ్యామోహము గలిగించి, భోగపరాయణత్వమునే ముఖ్యాదర్శముగా బెంపొందించి, పోషించుచున్నది. ఈవిధానముచే దాము లోకమునకు మహోపకారము చేయుచున్నామని తిరుగులేని గర్వాహంకారములు పెంపుచేసికొనుచున్నారు. ఇది దురంత దుఃఖ మార్గమని యేనాడో భారతీయ మహర్షులు, రాగముకాదు విరాగమే, భోగముకాదు త్యాగమే శాశ్వత సౌఖ్య సాధనమని బోధించియున్నారు. దీనిని భారతీయులైనను తొందరగా గుర్తించి అనుసరించి, లోకమునకుపదేశింపవలెను.

236. రజస్తమో గుణాధికులై అత్యధిక సంఖ్యాకులైన భారతీయులు నేడు మునుగడ సాగించుచున్నారు. జాతిలో రాజసిక తామసిక శక్తులు పెంపుగాంచి గర్వాహంకారము లుద్రిక్తములై నీతి ధర్మదైవభీతి దిగజారి, అశాంతి, అంతఃకలహములు, చెలరేగి, దేశమును దుస్థితికి దోడ్కొని పోవుచున్నవి. విద్యాధికులు అధికారులు, స్త్రీలు, యువకులు. స్వార్థపరమైన స్వేచ్ఛనాదర్శము గాగొని, జాతిధర్మమును ధ్వంసముచేయు బూనుచున్నారు. కానియిది సాధ్యముగాదు. భారతజాతిని నేటికిని కాపాడుచున్న పరమపావనమైన బ్రహ్మర్షి తత్త్వము

జాతిరక్షణ్కై వలయు మార్గములను నిలఁబెట్టి, విశ్వకళ్యాణ మును సాధించు ననంతశక్తి గలదని బుద్ధిమంతులు గ్రహింప వలసియున్నది.

237. కలఁతచెందని మనస్సు, దిగులులేనిహృదయము, పరామాత్మ జాడనెఱుగు సుసూక్ష్మబుద్ధి. ఎన్నఁడు దుఃఖ మెఱుగని యానందము, తిరిగిపుట్టని, చావని మోక్ష పదవి— ఇవి మానవజాతికివలయు దివ్యధర్మములు. ఏజాతిలో నీలక్షణ ములు క్షీణించునో, ఆజాతికి దారుణమద్దశ కనిపెట్టుకొని యున్నదన్నమాట. ఈ లక్షణములకుఁ బ్రాధాన్య మిచ్చి ప్రోత్సహింపని నాగరికత, పేకముక్కలతోఁ గట్టిన మేడవలెఁ గూలిపోవుట తథ్యము ఈ లక్షణములులేని జాతులను దేశము లను ప్రకృతికోపముచే భూకంపములు, జాడ్యములు, ఘోర యుద్ధములు సంభవించి తుడిచివేయును. వేదములలోని సార మిదియే.

238. భగవానునికి నీజీవిత మర్పించిన వెనుక, నీవు భగవాను నేక్షణమందును మఱువకుండ నుండుటయే చేయ వలయు దివ్యసాధనము. నీవు భగవానుని మరచిన వేళలు నీకు నిజముగా భరింపలేని మనఃక్షోభను కలిగింపవలెను. కాని యిందొక విచిత్రమున్నది. నీవెక్కడ మఱచిపోదువో యని పరమేశ్వరుఁడు నీకంటె నధికముగా శ్రద్ధవహించి, నీవు మఱువలేకుండు పరిస్థితులు కల్పించును. అవియే నీకుఁ దట స్థించు కార్యవైకల్యములు, ఆశాభంగములు, అవమాన

ములు మున్నగునవి. అవి భగవానుని కృపాకిరణములే యని గ్రహింపవలెను. దేవుని కంకితమైన నీవాతని మరచినను, నిన్నా తఁడు మరువకుండి, నీవు మరువఁజాలని రీతులు కల్పించును.

239. సేవకుఁడు తనయజమాని పనులన్నియు సకాలమున, సలక్షణముగా నెరవేర్చి ఉత్తమసేవకుఁ డనిపించుకొనఁ గోరును. పనులు శ్రద్ధతోఁ జేయక తిట్లుతినుచుఁ జేయునాతఁడు సామాన్యసేవకుఁడు. అటులే భక్తుఁడైన భగవత్సేవకుఁడు, భయభక్తి శ్రద్ధలతోఁ దన ప్రభువు హృదయము నూహించి, ప్రభువు సంతరించురీతిగాఁ బ్రవర్తించి, ఉత్తమ సేవకుఁడగును. లోపములుచేసి, శిక్ష లనుభవించుచు వర్తించువాఁడు సామాన్యుఁడు; భక్తునికి నిజమైన లక్ష్యమెట్టి శిక్షయు లేకుండ భగవానుని సేవించుటయే, అది మహోన్నతభక్తి, భగవానుఁడట్టి భక్తు నత్యంత ప్రేమతో రక్షించును. అట్టిభక్తునికి శిక్షలుండవు; భగవత్కృపామృత సాగరమున నీదులాడుటయే.

240 వర్షపు చినుకులలో దేవునిఁజూచు టభ్యసింపవలెను. అతివృష్టి. అనావృష్టి దోషములు కలుగకుండ నవసరోచితవృష్టి గలిగినచోట పంటలు సమృద్ధిగాఁబండి సకల ప్రాణులకన్న సమృద్ధిలభించును. వర్షమనగా అన్నమే; అన్నమనగాఁ బ్రాణమే; ప్రాణమనఁగా దేవుఁడే; అందుకే "అన్నం బ్రహ్మ" యని వేదవాక్యము. అదేవిధముగా నాకసమునందలి మేఘము దేవుఁడే. మేఘమునకు నేత్రములున్నవి. ఎచటనెంత వర్షింపవలెనో చూచి, పరిశీలించి, అచట వర్షించును. ప్రజల

పుణ్యాపుణ్యముల ననుసరించి వర్షప్రమాణ ముండును. ఈ భావముతో వర్షమునుజూచి, దేవుని దర్శనముగా భావించి, నమస్కరించి, భక్తిచూపుచోట, అతివృష్టి, అనావృష్టి దోషములుండవు.

241. 'సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్సఉచ్యతే". అనగా సర్వప్రయత్నములు విడచువాఁడే గుణాతీతుఁడని గీతా వాక్యము. సత్త్వ రజస్తమో గుణములలో సత్త్వము జ్ఞానము నిచ్చును. కాని అదియుఁ బరిపూర్ణముగాదు. సత్త్వమునుగూడ నతిక్రమింపవలెను. "నిస్త్రైగుణ్యోభవార్జున."యనియు గీతయే చెప్పినది. సత్త్వమిచ్చు జ్ఞానము నేను జ్ఞానిని, నేను సుఖినియను నహంభావమును కలిగించుటచే, దాని నతిక్రమింపవలెనని చెప్పఁబడెను. త్రిగుణాతీతమైన బ్రహ్మైక్య భావమును సాధించుట ముఖ్యమని స్పష్టమగుచున్నది. అన్ని ప్రయత్నములు మానుటనగాఁ జేయుటయును, చేయించుట, మానిపించుట శ్రీకృష్ణప్రభువు కరగతమై యున్నదని భావము.

242. అటుగోయ్యి, యిటునుయ్యి అనుసామెతగలదు. అనగాఁ బ్రమాదము తప్పనిసరియగు పరిస్థితి. జనన మరణము లట్టివే; మరియు జీవించి యిహలోకమున నుండు కాలములో భయంకర కష్టప్రమాదము లెన్నియో సంభవించుచుండును. మానవు లట్టివేళల అపరిమిత క్లేశవశులై, పలవింతురు. ఈ లోకమున నందరకు నిట్టిసందర్భములు కొలదిగనో, ఎక్కువ గనో తటస్థించుటయు, నార్తులై విలపించుటయు జరుగు

చున్నది. ఇది దైవభక్తి దృఢముగాలేని దీనుల దురవస్థ. సుదృఢ నిశ్చల దైవభక్తిగలిగి, నిలిచినచో, గొయ్యి నుయ్యి రెండును సదృశ్యములగును. దేవుని మఱచుటయే ప్రమాద హేతువని తెలిసి వర్తింపవలెను.

243. శ్రీకృష్ణ ప్రభువు సంకల్పమే అమోఘ శాసనమై, అఖండ బ్రహ్మాండమును నడపుచున్నది అనంతకోటి బ్రహ్మాండములు, అనంతకోటి వైవిధ్యముగల జీవరాశులు, శ్రీ కృష్ణప్రభువు శాసనబద్ధములై నడచుచున్నవి "భీషాస్మా ద్వాతః పవతే, భీషోదేతిసూర్యః" అని వేదవాక్యము. ఆ పరమాత్మభయముచే వాయువు వీచుట, సూర్యుఁ డుదయించుట మున్నగు సర్వకార్యములు జరుగుచున్నవి శ్రీ కృష్ణప్రభువు ప్రజ్ఞ ఆద్యంత రహితము, పరిపూర్ణతకంటె నధికము, వాగతీతము, అమోఘమునైనది. ఈవిధముగా నిరంతర వ్యాపారియై నిర్వ్యాపారియైన శ్రీ కృష్ణప్రభువు సర్వాతీత సౌందర్య మూర్తియై ప్రకాశించుచున్నాఁడు. ఆతఁడేకము ననేకము, కర్త, అకర్త, దృశ్యుఁడు అదృశ్యుఁడునై, భక్తులకు, జ్ఞానులకు దుఃఖాపనోదనము. నిర్మల నిత్యానంద ప్రదానముచేయు చుండును. ఈ కీలక మెరిగి, ధన్యుఁచవు కారాదా?

244 పతివ్రతయగు భార్య తనకేమైనఁ గోర్కెలున్నచో రాత్రి యేకాంత సమావేశమున, లజ్జావినయ విధేయతలతో, హృదయమువిప్పి లేశమాత్రమైన దాపరికము లేకుండ, భర్తతో రహస్యముగాఁ జెప్పికొనును. ఆమె తన

భర్తయే పరమేశ్వరుఁడని నమ్మును. ఆమె కోర్కెల నాతఁడు ప్రేమ పూర్వకముగా నెరవేర్చును, కాని కొన్నిటిని (జేయ కుండవచ్చును, చేయనివానికి (బతివ్రత తనభర్తను నిందింపదు. భక్తుఁడు భగవాను నదేరీతిగా నారాధింపవలెను; ఏకారణ ముచేతను నిందించుట, సంశయించుట, అపార్థముచేసికొనుట భక్తుఁడు పూర్తిగా విడిచిపెట్టి సేవింపవలెను.

245. సంభాషణము – సహవాసము – సమైక్యభావము నెవరితోఁ జేసిన సంపూర్ణసంతృప్తి, మరపురాని యానందము, తిరుగులేని మనశ్శాంతినిచ్చు ననునది ముఖ్యమైనప్రశ్న. మన కతిసన్నిహితులు భార్య, బిడ్డలు, బంధువులు, మిత్రులు మున్నగువారు. వీరికందరకు స్వార్థములున్నవి; అందుచే వారిచ్చు సంతృప్తి కొంత కలుషితముగాక తప్పదు. ఇఁక సమగ్ర సంతృప్తి, సంపూర్ణ సౌఖ్యమునిచ్చుశక్తిగలిగి, స్వార్థ మేమియు లేనివాఁడు భగవానుఁ డొక్కఁడే. అందుచే భగ వానునితో సంభాషణము, సహవాసము నభ్యసించి, అందు సిద్ధిగాంచి, సమైక్యమును సాధించుటయే వివేకఫలము.

246. "జగత్ప్రభూ! నిన్ను నేను నమ్మితిని. నాయోగ క్షేమములు నీవు నిరంతరము దయతో నిర్వహింతువనియు నమ్మితిని. అట్లు తప్పక నిర్వహింతుననియు నీవు స్వయముగా (బెక్కుసారులు వాగ్దానములు ప్రకటించి యుంటివి. నాయోగ క్షేమములకుఁ గావలసినవేవో నాకంటె నీకే బాగుగా (దెలి యును, నీవు నాకిచ్చినవి, మరియు నాకు నీవీయనిచ్చగింప

నివి–రెండును నాకు శుభప్రదములే యని నమ్ముదును. నీవేమి చ్చితివి, లేదను ప్రశ్నకే తావులేదని విశ్వసింతును "

247. "భక్తోసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్" అని భగవానుఁ డర్జునునితోఁ బలికినాఁడు. అర్జునుఁడును మన వంటివాఁడే. కొన్నివిషయములలో మనకంటె గొప్పవాఁడు. శ్రీకృష్ణుఁడు పరమాత్మయేయని అర్జునుఁడు నమ్మి, అప్పుడ ప్పుడు నమ్మకము లేనివానివలె ప్రవర్తించెను. అందుకే, యుద్ధము చేయుమని రథముత్రోలుచుండగా, నేమైనను నేను యుద్ధము చేయనని గాండీవము క్రిందపారవేసెను. శ్రీకృష్ణ భగవానుఁ డప్పుడు పదునెనిమిదధ్యాయములు బోధించి, అదియుఁ జాలక, తనస్వస్వరూపమును జూపవలసి వచ్చెను. తనరహస్యములన్నిటిని జెప్పెను. అర్జునుని మహాయోగినిజేసి, అనగాఁ బరిపూర్ణ బ్రహ్మవేత్తనొనర్చి, యుద్ధముచేయించెను, జయమిచ్చెను. అర్జునుఁడు యుద్ధముచేయుట సత్యముకాదు కృష్ణుఁడే చేయించెననగాఁ జేసెనని యర్థము, మనము సడలని భక్తితో నాశ్రయించినచోఁ, దనరహస్యములనన్నిటిని మన కును జెప్పి, తరింపఁజేయును.

248. సకల జాడ్యములకు మందు భగవానుని పాదముల నాశ్రయించుటే. లోకములో జీవితమంతయు అంపవుకోతయే. ప్రకృతి, దేహము, వస్తువులు–వీనిని గూర్చిన అజ్ఞానము, మన లను గాయపరచి బాధించుటకేర్పాటైనవే. గాయపరచునవి గాయములను మాన్పునా ? కత్తిదెబ్బవలని గాయమును

మఱొకకత్తిదెబ్బ పోఁగొట్టునా? భోగవాంఛలు అజ్ఞాన జన్యములు-అవి అజ్ఞానమును బోఁగొట్టునా ? ఈగారడీ సృజించి నడపుచున్న భగవానుఁడే అజ్ఞాన దోషము లను గాయములను, దుఃఖములను బోఁగొట్టి, రక్షింపఁగలఁడు. భగవానునాశ్రయించుచో గాయములే తగులవు.

249. భగవానుని నామము స్మరించి, సంకీర్తన, ధ్యాన జపాదికము చేయుటనగా, దహనకర్మ చేయుటయే. అనేక జన్మాంతరములలోఁ జేసిన మన పాపరాశి కుప్పలుతిప్పలుగాఁ గొండలవలెఁ బెరిగియున్నది. దేవునిగూర్చి జపమనగా నాపాపరాశులను దహనమొనర్చులే; పాపరాశి బూడిదయగుచో దానివలనవచ్చు దుఃఖరాశియు భస్మమగును. వానితోఁబాటు జన్మజరామృత్యు దోషములును దహనములగును. దహనకర్మపూర్తియగుటకుఁ గొంతకాలముపట్టును. భక్తిశ్రద్ధలతో మాటలాడకుండ విసరుచుండవలెను. దహనకాండ ముగిసిన వెనుక, బ్రహ్మానంద మోక్షసామ్రాజ్య కిరీటాధిపత్యము హస్తగతమగును.

250. అపసవ్యము, అక్రమము, అధర్మముగాఁ బ్రవర్తించు వారందరజ్ఞానులే. జ్ఞాని అజ్ఞానుల నెన్నఁడును దూషింపఁబూనుకొనఁడు. అజ్ఞానిని నీకు జ్ఞానము లేదనుట, నిష్ప్రయోజనము. జ్ఞాని చేయనగు పని, వారిని ప్రేమించి, ఉన్నత జ్ఞానమార్గములను మృదుమధురభాషలో సూచించి, దయతో నుద్ధరింపఁ దొడ్పడవలెను. అజ్ఞానిని దూషించు

జ్ఞానియు నజ్ఞానియేయగును. మరియు జ్ఞానియు నొకప్పుడజ్ఞాన దశనుండి జ్ఞాన సమున్నత స్థితికివచ్చిన వాఁడేకదా!

251. ప్రపంచమంతటికి భారతదేశము యజ్ఞశాల; గృహమున బూజామందిరము, సకలదేశములకేకాక, సకల లోకములకు బుణ్యక్షేత్రము. కారణమిచట జన్మించిన మానవులకు మోక్షము సాధించుట సులభము. మహర్షులచే నీభూమిలో మానవులు తరించుట కనేకసులభసాధనములుగా బాటలు వేయఁబడియున్నవి. దేశమందలి సాహిత్య సంపదలు భగవానుని మహత్త్వము నుగ్గడించినవి; పుణ్యతీర్థములు, దేవాలయములు, లక్షలకొలఁది నిర్మింప బడియున్నవి; దేశములో నేమూలకుఁబోయినను, పండితులు, పామరులు అప్రయత్నాభ్యాసముచే దైవసంకీర్తనములు వినిపించుచుందురు; సర్వసంగత్యాగముచేసిన పుణ్యపురుషులు నలుమూలల నేటికి నున్నారు. అందుచే నిచటి మానవులకోర్పు, దేవునారాధించునేర్పు సహజముగా లభించి తరింపఁ జేయును.

252. దేహమునకుఁగాని, మనస్సునకుగాని, యేవిధమగు ననారోగ్యము వచ్చినను, నాతఁడు బ్రాహ్మణుఁడు గాఁడు, ఏకులమువాఁడైనను భక్తుఁడుగాఁడు. భక్తునకు, జ్ఞానికి ననారోగ్యమెన్నఁడు గలుగరాదు. బ్రాహ్మణుఁడు నిత్యమనేక పర్యాయములు, "ఓమ్ కేశవాయస్వాహా, నారాయణస్వాహా, మాధవాయస్వాహా యని బ్రహ్మతీర్థము లోనికి బుచ్చుకొనును; వేదమంత్ర పఠనముచేయును; ఏకులము వ్యక్తి

యైనను భక్తుఁడైనచో భగవన్నామ సంకీర్తనముచేయును. దానికంటె నమృతమెచటనున్నది? అమృతముకంటె నారోగ్య మిచ్చు మందెచటనున్నది?

253. ధనము, పదవి, సవ్యములైన భావములను గలుగ నీయవు. గర్వాహంకారముల నుదయింపఁ జేసి పెంపొందించును. సత్య ధర్మ దైవద్వేషములను గలిగించును. తను మర్యాద, తమగౌరవములే ప్రధానములుగా భావించి, యెంత సత్పురుషులనైనను దృణీకరింపఁ జేయును. ఉన్నతపదవులను, అధికారములను, అధికధనమునుగల వారిని దర్శించుట, భక్తునికి, జ్ఞానికి నమితమనః క్లేశ హేతువగును. అందుచే వారిదయ నార్జించు యత్నమునకుఁ దిలోదకములిచ్చి, భగవాను నాశ్రయించుటవలన నెట్టి యవమానములులేని శాంతిసౌఖ్యములు లభించును.

254. భక్తునౌన్నత్యము నిస్తులౌన్నత్యముగలది. సాటిలేని మేటి పరమేశ్వరుని సాన్నిధ్యము నాతఁడెల్లప్పుడనుభవించుచుండును. ఇహలోకమందలి ధనికులు, అధికారులు, ప్రభువులు, పూర్వపుణ్యమున్నవారు మాత్రమే మహనీయులగు భక్తులను, జ్ఞానులను దర్శించు భాగ్యమును గాంతురు. భక్తుఁడట్టి వారిరాక నెన్నఁడుకోరఁడు; కోరరాదు. జగదీశుని సాన్నిధ్య భాగ్యము ననుభవించు భక్తులకు జ్ఞానులకు నితరుల దర్శనము వలనిప్రయోజన మేముండ గలదు? అట్టి దర్శన

భాగ్యము నిచ్చు జ్ఞానులు, భక్తులు కోరికల విడిచిపెట్టిన పూజ్యులు గావున వారిని దర్శించిన వారికే లాభము.

**255.** భగవద్భక్తు నితరులు తృణీకరించుట వలన భక్తునికే లాభము. భక్తుఁడు తనకాలములో నొకక్షణమునైనను భగవద్ధ్యానేతర విషయములో వ్యయించుట కిష్టపడఁడు. సంసార వాసన లను త్రాళ్లచే బద్ధులైనవారితో నాతఁడు కాలము గడుపుట కిచ్ఛగింపఁడు. పైగా సంసారబద్ధులు, కామాదివ్యామోహావశులై సద్భక్తులను తృణీకరింపఁ బూనుదురు. వారి తృణీకారము వారికి నష్టము, భక్తులకు లాభము, పవిత్రమైన గోక్షీరముండగా, పందిపాలు గాడిదపాలు నెవఁడు త్రాగును. గోక్షీరమనగా భగవత్సంకీర్తనామృతము. అది సర్వశాంతి సౌఖ్యము లిచ్చి భక్తుని ఁదరింపఁ జేయును. గార్దభవరాహాది క్షీరములు—క్షణిక సాంసారిక దుఃఖ సమ్మిశ్రిత సౌఖ్యములు.

**256.** ఏమి జరిగినను భగవానుని విలాసముగా, లీలగా స్వీకరించి, ప్రసన్న చిత్తముకలిగి, నిర్వికారానందముతో ఁగూర్చుండుట తేలికపనికాదు. కాని ఎంతకష్టమైనను, దాని నభ్యాసబలముచే సాధించి కృతార్థత చెందుటతప్ప, మానవునకు గత్యంతరములేదు. కాని యీసాధనములో నొక రహస్యమున్నది. ఇది కష్టమైనదని భయపడక్కర లేదు. భక్తుఁడు కాఁగోరు నాతఁడు చిత్తశుద్ధితో సాధనచేయుట కారంభించినచో నన్నిదశలలో భగవానుఁడు దయచూపి, చేయూత

నొసగి, సులభముగా నున్నతదశలకు దోడ్కొనిపోయి, పసిబిడ్డను తల్లివలె, రక్షించి కృతార్థుని జేయును. అభ్యాసము, చలింపని నమ్మకము, ఓర్పు భక్తుని సంపదలు కావలెను.

257. దృష్టి నీవు దేవునిపై నిలిపినచో సృష్టియంతయు నీకనుకూలమై వర్తించును. లోకము ననుకూలము నొనర్చుకొనుట కిదియే రహస్యము. సృష్టికర్తయు, నధిపతియు, భగవానుడై యున్నాడని నీవర్చించుచుండగా, నందుచే భగవానుడే నీకనుకూలుడై వర్తించుచుండగా దేవుడు కల్పించిన లోకము నీకేల అనుకూలముగాదు? దేవుని విడిచి, అనుకూలతకై లోకము నాశ్రయింతువా, నీకు వ్యతిరేకత, తత్ఫలితమైన దుఃఖమును తప్పవు. ఈ కీలకమెరిగి వర్తించువాడే జ్ఞాని, భక్తుడును.

258. "భగవానుని నేనెఱుగుదును. అనగా భగవంతుని సంగతి నాకు దెలియు"నని చెప్పు వానికేమియు దెలియదని నిశ్చయముగా జెప్పవచ్చును. కాని భగవానుని నేనెరుగనని పలుకువాడనగా భగవంతుని సంగతి నాకేమియు దెలియదను వాడును నిందార్హుడని చెప్పవచ్చును. ఈభావము నుపనిషత్తు చెప్పినదే. అనగా నీవు చూచినది, విన్నది, తెలిసికొన్నది అంతా దేవుని రూపమే. ఏలన దైవేతరమేదియును లేదు. అనగా నీకు దేవునిసంగతి తెలియదనుటేమిన్యాయ్యము. కాని దేవుని రూపమనంతమైనది. దేవునెఱుగుదుననుట దేవుననంతరూపము నెఱుగుదుననుట విరుద్ధప్రలాపము; నీఅల్ప

బుద్ధి కనంతదైవ స్వరూపమెన్నటికిని దెలియదు. ద్వైతేతరము లేదు గనుక దేవుఁ డందరకుఁ దెలియును; దేవుని రూపమనంతము గనుక దెలియుట కవకాశము లేదు. ఈసంగతి నెఱుఁగుటే దేవు నెఱుగుటయని గ్రహింపవలెను.

259. నామరూపములు తీసివేసినచో నంతయును పరమాత్మ స్వరూపమే. అదియేకము, నద్వితీయము అనగా నీవు, నేను, సర్వము పరబ్రహ్మమే ఆసంగతి అనుభవపూర్వకముగా దెలిసిన వెనుక తెలియుట యనుశబ్దమర్థరహితమగును. ఏలన బ్రహ్మమనగా జ్ఞానమే, జ్ఞానము జ్ఞానమును దెలియు టర్థరహితము నామరూపములు మాయాకల్పితములు. అవియున్నంతకాలము తెలియుట కవకాశము లేదు. అవిపోయిన వెనుక తెలియుటయను ప్రశ్నకే స్థానము లేదు. ఏలన ఁబరబ్రహ్మమేకము, నద్వితీయమునైనది. అనగా ఁదెలియుట యనుశబ్దము నిరర్థకశబ్దము.

260. చంటిబడ్డ తల్లిప్రక్కలో ఁబరుండి నిద్రించును. అప్పుడప్పుడు కలతనిద్రలో మెలకువ వచ్చి తడుముకొని, తల్లి స్పర్శతగిలి, నిర్భయముగా మరల ఁబరుండి నిద్రించును. ఉదయము లేవగానే, ఒక్కసారి "అమ్మా"యని పిలిచి, అమ్మ వచ్చి లేవఁదీయువరకు నేడ్చుచునే యుండును. భక్తుఁడా బిడ్డననుసరింపవలెను. తనప్రక్కలో విశ్వమాత యెల్లప్పుడు నున్నది. ఆమె లేనిచోటు లేదుగదా! మెలకువ (జ్ఞానము) తెచ్చికొని ఆమె స్పర్శనుగాంచవలెను. నిద్రనుండి మెలకువ

రాగానే, 'అమ్మా'యని జగన్మాతనే పిలువవలెను. అమ్మ పలుకు, స్పర్శ లభించువరకు బిలుచుచు నేయుండవలెను.

261. దయ్యముపట్టినవ క్తి, జ్వరసంధిలోనున్న వ్యక్తి ఎవడో యొకడు దనకు గనిపించుచున్నాడని పలుకును. భక్తుడైనవ్యక్తి తానారాధించుచున్న రాముడో, కృష్ణుడో, శివుడో తన్నన్ని వేళల, నన్నిచోటుల ననుసరించుచున్న సత్యమును జూచు టభ్యసింపవలెను. కృష్ణుడుగాని, రాముడు గాని, శివుడుగాని ఒకే పరమాత్మ సర్వత్రనిండియున్న రూపములే, అందుచే భక్తుడు నమ్మిన దేవుడు తనలో, దనప్రక్కలో, నన్నిచోటుల సర్వసమయములలో నున్నమాట పరమసత్యము కావున ఆయనను జూచి, స్పృశించి, పలుకరించి, అనుభవింపవలెను.

262. ఈలోకములో జీవిత మత్యంత భయంకరమైనది. ఎప్పుడే ప్రమాదము, బాధ, దుఃఖము సంభవించునో తెలియదు. కాని బుద్ధిగలిగి, నిరంతరము చిత్తశుద్ధితో తపస్సాధన చేయు జీవితము సర్వదుఃఖ నిర్మూలన మహాయజ్ఞము, దుఃఖ నిర్మూలనము, అవ్యయానందామృత పానము, రెండు ముఖ్యములైనవి. భగవదారాధనముచే నీరెండును సిద్ధించును. తదితర మార్గములేదు. కావున మానవుడీశ్వర సేవ వెంటనే యారంభించి భగవానుని కృపామృతము లభించువరకు దీక్షబూని తరింపవలెను.

263. "దేహమ్నాఽహమ్, బ్రహ్మైవాహమ్", "నేను దేహమునుగాను, నేను పరబ్రహ్మనే" యను వాక్యార్థము నామూలాగ్రముగ, సరహస్యముగా దెలిసికొని, తరింప వచ్చును. మృతిచెందు శరీరము నేనుగాను; నేనా శరీరము నుప యోగించిన ఆత్మ స్వరూపమును. ఆత్మకు బుట్టుక, చావును లేవు. ఈ విషయమును దినదినము ననుభవసిద్ధి కలుగువఱకు బరిశీలించి, కృతార్థతచెందుట ముక్తిమార్గములలో నొక మార్గము. మనకన్నులయెదుట మృతిచెంది, దహనముచేయ బడు దేహములను మనము నిత్యముచూచుచుండియు, దేహ ములనే నమ్మి జీవితములను వ్యర్థమొనర్చికొనువారు శిక్షా ర్హులుకారా? మితిలేని దుఃఖమే వారికి శిక్ష.

264. ఇహ లోకమొక పూజామందిరము. అందుచే నీలోకములో జన్మించినవాడు భగవాను నాశ్రయించి, భగ వదనుగ్రహము కలుగు వఱకు నారాధించుటే కర్తవ్యము. పూజామందిరము నందింకేమి చేయుట కధికారమున్నది. పూజాగృహములోననగా దేవాలయమునందు భోగములనుభ వింప బూనుట దైవ ద్రోహమగును. ఈశ్వరవాణి యిట్లు పలుకుచున్నది; "కూర్చుండి, దేవుని పాదపద్మములు పట్టుకొని పూజించు, మరేపనిచేసినను దుఃఖముతప్పదు. నన్నుగూర్చి తపస్సుచేసి జనన మరణములను జయించి, దుఃఖసాగరమును దాటి, మోక్షానందపదవి నార్జించు కృషిచేయు నిమిత్తమే నిన్నిచ్చట జన్మింప జేసితిని. ఈశ్వరాజ్ఞ నతిక్రమించితివా? దుఃఖాగ్ని కాల్చి వేయును."

265. "నేను నీలో, నీచెంత నుండగా రాగములు పెట్టెదవెందుకు? ఆకలా? పాలు త్రాగు"మని స్తనము నోటఁ బెట్టి లాలించు కన్నతల్లివలె, శ్రీకృష్ణ భగవానుఁడు మనతో నిత్యము పలుకుచున్నాఁడు. చెవులు లేవా? చెవుడా? కృష్ణుని మధుర దివ్య వాగమృతమును త్రాగి, మత్తిల్లి అఖండానంద సౌధమున స్వేచ్ఛగా విహరింపక భయమంది యేడ్చెదవేలా? నీవు కృష్ణ భగవాను నొడిలో గూర్చుంటివి! చూచుకో!"

266. గట్టిగా జుట్టు పట్టుకొని యముఁడు శ్మశానమున కీడ్చుకొని పోవుచుండగా, త్రోవలో దేహమునకు గాయము లగుచుండగా, చదువు, పెండ్లి, పిల్లలు, ఉద్యోగములు, ధన సంపాదనము, భోగాభిలాషలు! ఎంత విచిత్రమైనదీ మాయ! అందరకు దెలిసిన విషయమే, అందరు చూచుచున్నదే! తెలియనట్లు, చూడనట్లు వ్యవహారము! ఈమాయ నుండి యెవఁడు బయట పడఁగలఁడు? బయట పడవలెనని కోరిక ముముక్షుత్వము గలవాఁడు తప్పక మార్గములు వెదకును; వెదకుటారంభము, దైవానుగ్రహము కలియుట నీరెండు నేక కాలమందే జరుగుచుండును!

267. కృష్ణప్రభువు సాక్షాత్కారము. నా రెండవ పుత్రిక విజయలక్ష్మిని జంధ్యాల వెంకటేశ్వర్లుగారి కుమారు నకు తాంబూలము లిచ్చు నిమిత్తము బూరుగుపూడి కారులో ప్రయాణమై వెళ్లుచుంటిమి. కృష్ణప్రభువు మాతో గూడ నుండి తాంబూలము లిప్పించి తీసికొనివచ్చెను. రెండు విష

యములలో శ్రీకృష్ణప్రభువు సాక్షాత్కరించెను. ఈ సంబంధము జరుగదని విడిచిపెట్టివేసిన తరువాత నీసంబంధమే నిశ్చయింపఁజేసెను. ప్రళయమేఘముపట్టి, రాకపోకలు కష్టమగునని భావించితిమి. రాకపోకలలో నొక్క చినుకుపడలేదు. ముందు, తరువాత బరువుగా వర్షముపడెను.

268. నీవు భక్తుఁడవేనా? అయినచో, లేక భక్తుఁడవు కాఁగోరుచో, నొక విషయమును గుర్తులోనుంచి కొనుము. నీకుఁగష్టముగలుగఁజేయు తాటస్థ్యము లెన్నియో సంభవింప వచ్చును. కాని నీకు భగవత్కృప గలదని తెలిసికొనుము. లేకున్నచో నీకుఁ గలిగిన కష్టములకంటె వేయిరెట్లెక్కువ ప్రమాదములు కలిగియుండును. ఇంకొకటి, అసలు కష్టసందర్భము లెందుకుఁ గలుగవలెను? నీభక్తి అసమగ్రము; కొన్ని దోషములింకను నీయందున్నవి. ఇది నీవు గ్రహింప లేకుండుట నీకుఁ గల దోషములలో నొకటి. అందుచే వచ్చిన కష్టములు "భక్తిని సమగ్రమొనర్చుకొమ్మ"ను పిలుపులేయని గ్రహింపుము.

269. నమ్మిన వారందరు తోడ్పడుటకు బదులూరకుండుటో, యెదురు తిరుగుటో, జరుగును. ముఖ్యముగా జరుగవలెనని అనుకొనిన పనులు జరుగవు. ఏప్రక్కనుండియు నాశారేఖలు గోచరింపవు. అట్టితరుణములో భక్తుఁడైన వానికిఁజుట్టుముట్టిన అంధకారమే గోచరించును; మతిచలించి దుఃఖముదయించును. ఇట్టి స్థితిలో భక్తుని గతియేది? భక్తుఁడు

తాను నమ్మిన భగవానుని మఱచినాఁడని స్పష్టము, భగవానుని దృష్టిలో నుంచికొనిన వానికంధకారమెన్నఁడు కలుగదు. ఏలన నట్టి దుస్థితిలో, భక్తుఁడు మనస్సు భగవత్పాదపద్మములపై ప్రసరింపఁజేసి చెవులొగ్గి విన్నచో, "నన్ను నమ్మి యుండుము; ఇటుచూడుము; ఎంత దివ్యకాంతియో" యని దేవుఁడు పలుకును.

270. భగవానుని క్రీడాహస్తమును గుర్తించుటనఁగా, మనబుద్ధి శక్తి దానికి జాలదని తెలిసికొనవలెను. భగవానుననుగ్రహమున్నప్పుడు మాత్రమే మనమది గుర్తింపఁగలము. విశ్వమంతయు, విశ్వములోని సకల వస్తువులును దేవునిగుర్తులే; చిహ్నములే; విశ్వకర్త దేవుఁడేయను సాక్ష్యములు. కాని దైవశక్తిని గుర్తించు నంతలో, మన మనస్సు మాయామేఘావృతమై అంధకారము వ్యాపించి, నిర్వీర్యమగును దయతో గుర్తించు శక్తినిమ్మని భగవానునే ప్రార్థింపవలెను.

271. జ్ఞానదృష్టి ననుసరించి, లోకులందరు చంటిబిడ్డలే. అందరు నజ్ఞాన తమస్సులో మున్గియున్నారు. వారి బాగోగులు, యోగక్షేమములు వారికేమి తెలియును? తెలియదనియు దెలియని దజ్ఞాన స్వరూపము. కాని తల్లివలె భగవానుఁడు లోకములోని ప్రాణులందర యోగక్షేమములు చూచుచునే యున్నాఁడు. అందుచే మనము పురిటి బిడ్డలమనియే గ్రహింపవలెను. జగన్మాత మనరక్షణ కర్తవ్యమును నిర్వహించును. పురిటి బిడ్డకు గర్వము, అహంకారము,

కామక్రోధాది దోషములు నుండవు. ఏది కావలసిన నేచ్ఛ టొక్కటే వానికి ఁదెలియును. మనము గర్వాదికము విడిచి జగన్మాత యెదుట నేష్పట నేర్చినచో నామె కృపజూపి రక్షించును.

272. భగవంతుని కృప నార్జించు టెంత సులభమో నీకు ఁదెలియదు. ఇది స్పష్టము. కాదందువా, నీకు నిజముగా ఁదెలిసినచో భగవత్కృప నార్జించుటకేల పూనుకొనవు ? నీ సుఖమునకు, శాంతికి, ఆనందమునకు, ఁబునర్జన్మ లేకుండుటకు 'అనవరతము దేవుని మనస్సులో నుంచికొని అఖండ వినయ గౌరవములతో నారాధింపుము. నీవీపని యెంత వేగముగా ఁజేయుదువో అంతవేగముగాను, సులభముగాను దైవ కృపాసిద్ధి లభించును. ఈపనిచేసి సుఖింపక దుఃఖమునిచ్చు కార్యక్రమములలోఁ గాలము దుర్వినియోగ మొనర్చెద వేలా? అవి సులభమా? అవియే కష్టములైన పనులు.

273 'కాకతాళ న్యాయ మందరెరిగినదే. తాటిపండు రాలుటకు సిద్ధముగా నున్నప్పుడు దానిపై ఁగాకి వ్రాలినది. పండు పడినది. కాకి వ్రాలకున్నను పడును. కాని పండుపడు క్షణమే కాకి దానిపై వ్రాలుక్షణము. ఏకకాల తాటస్థ్యమే. తాటిపండు దేవుఁడు; మనము కాకులము. దేవుఁడు పనిచేయుచున్నాఁడు. దేవుఁ డొకపని చేయుటకు సంకల్పించుటయు, మనమాక్షణమందే ఆపనిచేయ నారంభించుటయు జరుగుచున్నది. దానివలనఁ గాకి తాటిపండును పడఁగొట్టెననుట

భ్రాంతి మాత్రమే. పని దేవుఁడు చేయుచుండగా మనము చేయుచుంటిమను భ్రాంతికలిగి భ్రాంతి జనితమగు దుఃఖము ననుభవించుచున్నాము.

274. లోకులు కష్టమైన కామినీకాంచనాది భోగములను సముపార్జించు దురంత కష్టములతోఁ గూడిన పనులు చేయుటలో గిజగిజకొట్టుకొని, నిరంతర దుఃఖముల ననుభవించుటకు సంశయింపరు. అత్యంత సులభమైనది భగవత్కృపామృతము; దానిని సంపాదించుట మిక్కిలి శ్రమలేనిది. దానిని సంపాదించు సాధన మారంభించినంతనే, చిత్తశాంతిని, ఆనందమును ప్రవహింపఁజేయు సామర్థ్యము గలది. అట్టి పుణ్యసాధన మెట్టయెదుట నుండగా దానిని తృణీకరించుచున్నారు. స్వచ్ఛమైన గంగాజలమును విడిచిపెట్టి, మలినకూపోదకమును త్రాగుచున్నారు. కన్నులు విప్పి సరిగాఁ జూడుఁడు.

275. ప్రపంచ వ్యాపారమంఁతయు భగవంతుఁడెట్లు నడపుచున్నాఁడు. ఒక చిన్న తమాషాచేసి, అత్యంత సులభముగా నడపుచున్నాఁడు. సకల ప్రాణులు, క్రిమికీటకాది పర్యంతము తాముకానిది తామని, తమదేహాదులతోడను, నితర వస్తువాహనాదికముతోడను తాదాత్మ్యమును బొంది వర్తించుచున్నవి. నేను కాని దేహమును నేనేయను భ్రాంతి; తదనుగుణ ప్రవర్తనము. ఈమాయా కల్పితమైన భ్రాంతి మయప్రవృత్తిచే, నిరాఘాటముగా విశ్వరాజ్యపరిపాలన లీల నమోఘముగా నిర్వహించుచు భగవానుఁడు నవ్వుచున్నాఁడు!

276. జగత్ప్రభువు నేను కోరిన పని చేయఁదలఁచి కొన్నచో, నే ననుకొనినవ్యక్తి ద్వారముననే చేయవలెనా? మనమనుకొనినవ్యక్తి వ్యతిరేక భావము ప్రదర్శింపవచ్చును. అ-తమాత్రమున నిరాశోపహతుఁడను గావలెనా? అక్కర లేదు. మనము భగవాను నాశ్రయించుట నిజమేయైనచో, భగవానునికి మన పని జరిగించుట కుపకరణమే యవసరము లేదు. ఒకవేళ నవసరమైనచో, గణనాతీత సంఖ్యలో నెవని చేత నాతఁడు దనసంకల్పము జరిగింపలేఁడు. వ్యతిరేక భావమును ప్రదర్శించు వ్యక్తికా వ్యతిరేక భావము నుదయింపఁ జేసిన దాతఁడుగాఁడా? ఆతఁడే ఆవ్యక్తి కనుకూల భావమును గలిగింపలేఁడా? నీవు చేయవలసిన పని జగత్ప్రభువును చిత్త శుద్ధితో నమ్ముటే; అవసర కార్యములెట్లు నెరవేరునని శంకించుట దౌర్భాగ్యము. ఆగాడవ దేవునికి విడిచి, నీవు కోరినపుడే నీపని జరిగెనని నమ్ముము ఎట్లో నీకెందుకు ?

277. "దేవుని రాజ్యములో దుఃఖమా?" దేవుఁడైనా అసత్యము కావలెను; లేదా దుఃఖమైన నసత్యము కావలెను! సత్యవ్రత బద్ధులైన భక్తులు, జ్ఞానులు, యోగులు, మహర్షులు, శ్రుతులు, పురాణములు వేయి గొంతుకలెత్తి, "దేవుఁడున్నాఁడు; మేము చూచితిమి; చూచుచున్నాము; సర్వ మానందమయము"ని పలికిరి, అందుచే దేవుఁ డబద్ధముగాదు; ఇఁక దుఃఖమబద్ధము కావలెను. దుఃఖమనగా, దారిద్ర్యము, రోగము, జనన జరామరణాదికము మన కన్నులయెదుట

ప్రత్యక్షము గోచరించి, మనకును దటస్థించుచున్న సత్య సంఘటనలే! దేవుఁడు సత్యమైన నివి అసత్యములై తీరవలెను. ఎట్లో తెలియుటే జ్ఞానము.

278. దేవుఁడు, దుఃఖము, వెలుతురు చీఁకటి కలియవు. ఎట్లు? సూర్యభగవానుఁ డుదయించి, నిర్మేఘమగు నాకసమున విహరించుచుండగా ఁజీకటి యెట్లుండఁగలదు? అటులే సచ్చిదానందమూర్తియై సర్వత్ర వ్యాపించి, సర్వమయుఁడై యుండగా, దుఃఖించువాఁడు, దుఃఖము నెచటనుండుట కవకాశమున్నది? దుఃఖించు నీవు, నీవనుభవించు దుఃఖము రెండును సంపూర్ణముగా అసత్యములే. వెలుగుఁజూచి, చీకటియని భావించుటవలన, వెలుతు రంధకారమగునా? అనగా సత్యముగానున్న దానందమయాత్మ స్వరూపమొక్కటే. అది సర్వత్రనున్నదనగా, నీవు, నేనునదే. తక్కిన పుట్టుక, చావు రోగ జరాదుఃఖాదులన్నియు, అసత్యములే, వెలుగును జీకటిగా ఁజూచు భ్రాంతి అసత్యమని దెలిసి భ్రాంతివిడిచి, సుఖింపవలెను.

279. బుద్ధిమంతుఁడు జీవితముయొక్క కీలక మెరిగి జీవిత దుఃఖ జాడ్యమునకుఁదగిన వాతపెట్టవలెను. భగవానుఁడు వినా, ప్రాణులకు ఁగర్మస్వాతంత్ర్యమున్నదని నమ్మటయే పెద్దజాడ్యము, మహామారి, సర్వేశ్వర చైతన్యము సకల ప్రాణులలోనుండి, తన సంకల్పములనమోఘప్రజ్ఞతో నెరవేర్చుచున్న విషయము పరమసత్యము, అహంకారము

నంటించివేసి, 'నేను'కు దహనకర్మచేసి, భగవాను నాశ్ర యించి, ఆతనితో నైక్యము సాధించులే మానవుఁడు చేయ వలయు తపస్సు, దీనితో సకల జాడ్యపరిహార మగుటయు, అవ్యయానంద శాంతి లభించుటయు, జరుగును.

280. లోకుల సకల దుఃఖములకుఁ గారణము, సత్య మును సత్యముగాను, అసత్యము నసత్యముగాను గ్రహింప కుండులే; గ్రహించులే జ్ఞానము, బ్రహ్మత్వము, మోక్షము. సత్యము నసత్యమైన లోకముగా గ్రహించుటయే అజ్ఞానము. బంధము, దుఃఖమును. "సర్వమ్ ఖల్విదంబ్రహ్మ", "నేహనా నాస్తికించన" మున్నగు నుపనిషద్వాక్యములు అంతయు బ్రహ్మ పదార్థమేయనియు, రెండవది లేదనియు ఁబలుకు చున్నవి. ఏకమనగా నద్వితీయమగు సత్యమని ఉపనిషత్తు పలుకుచుండగా, అనేకమనగా లోకములు, ప్రాణులు, వస్తు వులు సత్యమని తలచుటెంత అజ్ఞానమో! అజ్ఞానమే దుఃఖము. జ్ఞానము సౌఖ్యము నొకటే. ఏది కావలెనో చూచికొనుము.

281. అతివృష్టి యొకచోట, అనావృష్టి మఱొకచోట, సమవృష్టి యింకొకచోట! లోకములో మనము చూచు చున్నాము. అతివృష్టి పంటలను నాశనమొనర్చి, దారిద్ర్య మును రోగములను దుఃఖములను గలిగించును; అనావృష్టి తినుటకేకాక, త్రాగుటకును లేకుండఁజేసి పీడించును; సమ వృష్టి, పంటలను నిర్మలోదకమును, సుఖశాంతులనిచ్చి సంత సింపఁజేయును. వర్షమునకు ఁగారణములు వాయుమేఘములు;

సూర్యుఁడు, రవి వాయు మేఘము లెవరు? భగవానుని సేవకులు; భగవానుని సంకల్పముల ననుసరించి వర్తించును. భగవానుఁ డెవరు? నీతినియమములు, దాన దయాధర్మములు పరమేశ్వరారాధన పరతంత్రతయుఁగల వారి నెల్లప్పుడు సమవృష్టిని, సముచిత సౌఖ్యములనిచ్చి రక్షించువాఁడు. ఇవి లోపించినందుననే అతివృష్టి అనావృష్టి బహువిధ పీడనములు కలుగును.

282. దోమ నలుసంత, నిద్రచెడఁగొట్టును. ఈఁగ పిసరంత దేహముపై వ్రాలి గులగుల కలుగఁ జేయును. వానికి తెక్కలు, ఎగురుశక్తి-మనకు లేవు. ఎర్రచీమ, పట్టుపట్టికుట్టి మంటలెత్తించును. పక్షులు మనము పెంచి పోషించిన చెట్ల పండ్లు మనకు లేకుండఁ దినివేయును. ఎలుకలు, కాకులు, గొద్దింకలు, పెక్కు రకముల పురుగులు, ఎన్నివిధములనో బాధించును. పెక్కు రూపులుగల విషక్రిములు, తేళ్లు, పాములు, మర్కటములు-ఏడ్పించును. ఈ లోకములో మన తాత్కాలిక జీవితములకు శత్రువులై హింసించుట-దేహమును నమ్ముకొని కూర్చుండక దేవునారాధించి తరింపుమని బోధించుటకే.

283. ఎవఁడేమనినను నీవు చలింపకుము; అందర జిహ్వలపై నిలిచి పలికించు వాఁడీశ్వరుఁడే. అటులే ఎవఁడేమి చేసినను, నీవు చలింపరాదు; ఏలన ప్రతిప్రాణిలో నుండి క్రియలన్నిటి నాపరమాత్మయే చేయుచున్నాఁడు. సకల ప్రాణులు, వారిపలుకులు, తలపులు, చేతలు అన్నియు భగ

వంతుని స్వీయ సంకల్ప వ్యాపారములే. నీవు చలించి, కోప తాపములు చూపుచో నవి దేవునిపై (జూపినటులేయగును. నీవు భజించు భగవానుని యెడ( గోపతాపములు చూపుట తప్పుకాదా? అందుచే నిర్మల చిత్తు(డవై, మౌనివై, అచం చలు(డవై, ఆనంద తరంగ డోలికలపై నూయెలలూగుచు, "జై భగవాన్. జై పరమాత్మా! జై మహాదేవ" యనుచు (బరవశు(డవై సంకీర్తనము చేయుచుండుటే కర్తవ్యము. మనదేశమందలి సన్యాసులందుకే, అన్నిటికి, "నారాయణ, నారాయణ"యని చిరునవ్వుతో (బలుకుచుందురు.

284 భగవానుని నీ బంటుగా (గొంమటనగా సామాన్య విషయముగాదు. లోకములో మానవు(డైన వానిని నీబంటుగా నియమించికొని, వానితో జీవితమును గడపుట కెన్నియో కష్ట ములున్నవి. వానితో నప్పుడప్పుడు కలిగిన చికాకులను సర్దు కొని, (బతుకవలెను. నీభావమెఱిగి, నీసేవకు (డెల్లప్పుడు వర్తిం పలే(డు. సేవకునిలో నవివేకము, పొరపాటు, పొగరుబోతు తనము, మున్నగు లోపములు నిన్ను బాధించును. భగవాను(డు నిజమైన తనభక్తులకు బంటుగా సేవచేయుదునని వాగ్దానము చేయుటేకాక, పెక్కుమంది భక్తుల కట్లుచేసిచూపినా(డు. భగవాను(డు సర్వజ్ఞు(డు, పరిపూర్ణు(డు. లోపరహితు(డు గావున నీకు సంపూర్ణ సంతుష్టి నీయ(గల(డు. నీవెట్టి లోపము లేని దేవుని బంటువైనచో, దేవు(డెట్టి లోపములేని నీబంటుగా వర్తించి, సర్వ సదుపాయములు చూచి రక్షించును.

285. "ఓమ్ నమశ్శివాయచ, శివతరాయచ" యని వేదమైన నమకములోని వాక్యము. శివశబ్దమునకు మంగళ ప్రదమని యర్థము. సత్పురుషుఁడే శుభంకరుఁడని చెప్పాచుండగా, దేవుఁడు శుభప్రదుఁ డనుటలో విశేషము లేదు, అన్నము ఆకలిని, నీరు దాహమును దొలగించును వలె సామాన్యార్థమే. అందుచే వేదము "శివతరాయచ" యని పలికెను అనఁగా శుభముకంటె నధికమిచ్చునని భావము. అనఁగా శివుని శుభత్వమనంతమైనదని యర్థము. శివుఁ డీయఁజాలనిది లేనిదే; శివుని శుభప్రదాన శక్తి అనంతమైనది; వాగతీతమని భావము. మోక్షమే అట్టి శుభము.

286. దేవుఁడనగా నర్థము తెలిసి భజించుట ముఖ్యము. దేవుఁడనగా సకలవిధ పరిపూర్ణతలు, అనంతముగాఁగలవాఁడు, భగవానునికిఁ దెలియనిది, భగవానునికి లేనిది లేదు. భగవానునౌదార్య దాతృత్వము లవధులులేనివి. తనభక్తుఁ డేమియడిగినను లేదనవలసిన అవసరములేని అఖండ సంపత్సమృద్ధి గలవాఁడు, తనభక్తుని కోర్కె లేవియైనను వెన్వెంటనే యిచ్చుటకు సంసిద్ధతగల పరమ కారుణ్యానిధి. నీయోగక్షేమము నీ వెఱుఁగవు, అందర యోగక్షేమము లాయన సమగ్రముగా నెఱుఁగును. ఎఱుగుటయే కాక, అత్యంత వేగముతో నీకోర్కె తీర్చు సామర్థ్యము, దయ పరిపూర్ణముగాఁ గలవాఁడు. అట్టి భగవానుని నమ్ముటెంత అదృష్టమో!

287, ప్రకృతి విజృంభించినచో సకలవిధ నష్టములు, బాధలు కలుగును; భూకంపము, సముద్రప్రవాహంగు, తుపాను, కొండలు విరిగిపడుట మున్నగునవి. వానినెవరాపఁ గలరు? ప్రకృతి శాస్త్రవేత్తలు, ప్రకృతి వెంద్రుక తెంపలేరు. ఇఁకఁ బ్రకృతి వైపరీత్యములుచేయు విపత్తులనుండి రక్షణ లేదా? ఉన్నది. ప్రకృతినాథు నాశ్రయించుటే, ప్రకృతియనగా భగవానుని బాహ్య రూపము. భగవాను నర్చించినచోఁ బ్రకృతి అత్యంతానుకూల్యము చూపును. పంచభూతములు పరమేశ్వరుని పంచబాహువులు, అందుచే విశ్వాధిపతిని వినయముతో విశ్వసించి భజించుటే వివేక లక్షణము.

288. సర్వప్రాణులలోఁ బరమాత్మ నివసించుచున్నాఁడని వేదవేదాంతములు ఘోషించుచున్నవి. నీవు. పరమాత్మవలె సర్వములోఁ బ్రవేశింపఁ గలిగినచో సంపూర్ణానందము కలుగును. శరీరముతో మనమితరులలోఁ బ్రవేశించుట కవకాశము లేదు. భార్యభర్త పీపణ్మాత్ర మన్యోన్య దేహములలోఁ బ్రవేశించి క్షణికానంద మందుచున్నారు. మనస్సుతో నితరులలోఁ బ్రవేశింపవచ్చునుగాని, అదియు క్షణికము నసంపూర్ణమును; అయినను మనస్సులు కలసిన చోట సుఖమున్నది,ఇఁక నాత్మనన్నిటిలోఁ బ్రవేశింపఁగలదు. ప్రవేశశబ్ద మిచట నన్వయింపదు. ఆత్మ అన్నిటిలో నిదివరకే యున్నది. అంతేకాదు. కనఁబడునదంతయు ఁబరమాత్మ స్వరూపమే; అదియేకము నద్వితీయము. అందుచే నాత్మ

స్థాయికి దపశ్శక్తిచే బ్రవేశించి అవ్యయానందము ననుభవింపవచ్చును. ఆత్మయే ఆనందము, సంపూర్ణము, సర్వమును. ఆత్మ సాక్షాత్కారమే పరమసౌఖ్యము, మోక్షమును.

289. బాగా జబ్బుచేసి, ప్రమాదస్థితిలో నున్నవానిని జూచి తుదిగడియలు వచ్చినవని ప్రజలు చెప్పెదరు. కాని నిజమాలోచించినచో నందరకు దుదిగడియలే! గడియ గడియకు బ్రతివ్యక్తికి నాయుర్దాయము తరిగి, తరిగిన ఆయుర్దాయ భాగము మృతుఁడగుచునేయున్నాఁడు. పూర్ణాయుర్దాయక్షయమగు కాలమెపుడో తెలియకపోవచ్చునుగాని, యేగడియలోనైన నదిరావచ్చును. కావున బ్రతివ్యక్తియు నిదియే తుదిగడియ యనుకొని, తీవ్రనిశ్చయ వేగములతో నీశ్వరధ్యానమొనర్చి, కృపనార్జింపవలెను.

290 అజ్ఞానమయ దృష్టికి తుదిలేని సమస్యలు, దుఃఖములుగల లోకముపై నొక తృణము నిర్ల్యముపెట్టి, శ్రీరామ ప్రభుస్మరణ సంజాతానందామృత ప్రవాహములో నీదులాడుచు సుఖించు. అప్పుడు లోకము నిన్నేమియు జేయలేదు. పైగా, నీకనుకూలమై నీ సేవచేయును. ఏలనగ, నిజముగా లోకమనఁగా దేవుఁడే; అది ఆయన బాహ్యస్వరూపము. అది అజ్ఞానదృష్టికి వేరై కనపడును. నీవు దాని మోసములోఁబడి, మోహబంధములలో దగుల్కొని, దుఃఖింప నవసరములేదు. ద్వైతేతరముగా లోకమును విలోకింతువా, నీజీవితము భ్రష్టమై నశించును, లోకమును దేవుఁడుగాఁ జూతువా, అది సత్యమగుటచే రక్షించి సర్వసుఖములిచ్చును.

291. దేనినిఁజూచి మోహింపవలెను. అందమైన వస్తువులు, సుందరాంగులు, ఫలపుష్పములు, మణులు, రత్నములు. మనహృదయము నాకర్షించి, మోహావశులఁజేయును. అన్నిటిలోని యందము భగవానుని దివ్యకళయే. అందుచే దేవుని మోహింపవలెను. సౌందర్యము, వ్యక్తులది, వస్తువులదని, భ్రమించి, వ్యక్తులను వస్తువులను మోహింతుమా, అవి మనలను సకల దురవస్థలలో ముంచి దుఃఖింపఁజేయును భగవానుని దివ్య చైతన్యమే, సుందరాంగులకు, సుందర వస్తువులకు సౌందర్యమిచ్చి పోషించుచున్నది. అందుచే నీవు సౌందర్యము వ్యక్తులకు, వస్తువులకు చెందునని భావించుట, దైవ ద్రోహమగుచున్నది. సర్వ చైతన్యరాశి, మూలమునగు దేవుని మోహించి పూజించి, తరింపుము.

292. మనశ్శాంతి స్థిరముగా నెన్నఁడు చలింపకుండు రీతిగా నిలుచునట్లు సంపాదించుటకు వీలగునా? అతి సులభముగా వీలగును? శాంతియే పరిపూర్ణ లక్షణముగాగల వస్తువును మనస్సులోఁబెట్టుకొనవలెను. పరిపూర్ణశాంతిస్వరూపి భగవానుఁడే. భగవానునిపై మనస్సు చొప్పించి నిలుపుట, లేక భగవానుని నీ మనఃపీఠమున నిలుపుట-ఆసాధన స్థిరముగా నభ్యసించుట చేయువలయుపని. ఎప్పుడు నీవు పరమేశ్వరుని పాదములను చిత్తమందుఁజేర్చితివో ఆక్షణమునుండి. కామక్రోధాది దోషము లెవ్వియు నందుఁజేరకుండ భగవానుఁడే చూచి నీ శాంతిని పోషించును.

293 లోకములో నన్నియు రిక్తహస్తములే. ధనికులు, దరిద్రులు-అందరు దరిద్రులే. ఎవరి చేతులలో నేమీ లేదు. చేతిలో నొక నాణెమైన లేని వారివద్దకేగి యాచించినచో వారేమి చేయఁగలరు? వట్టిచేతులు చూపుదురు. చేతినిండ పైకమున్నవాఁడు దేవుఁడొక్కఁడే! సృష్టి, అందలి ధనమం తయు దేవునిదే; దారిద్ర్య నిర్మూలనమునకుఁ బోయి, దేవుని యాచింపవలెను. లోకులందరు దరిద్రులే. దరిద్రులను యాచించుట, సుందరాంగి నపుంసకుని కౌగిలించికొనుటే! సర్వవస్తు ధనపరిపూర్ణుఁడైన దేవునారాధించి, సంపూర్ణముగా దారిద్ర్యమును దొలగించికొని సుఖింపవలెను.

294 దేవుఁడు, 'నేను దేవుఁడనుగాను, జనన మరణ ములు దుఃఖములుగల అల్పవ్యక్తినని మొత్తికొని యేడ్చు చున్నాఁడు. ఏడ్చుచున్నది దేవుఁడే! కాని దేవుఁడేడ్చునా? ఏడ్చువాఁడు దేవుఁ డెట్లగును? అనగా నీయేడ్పు నిజమా. అబద్ధమా? అబద్ధమనియే చెప్పవలెను. లేకున్న దేవుఁడేడ్చుట నిజమే యనిచెప్పుటవలన దేవుఁడే అబద్ధమగును. ఏలన దేవు నికేడ్పుండునా? అనగా నీయేడ్పు దొంగనాటకము, పిల్లలా టలో దొంగయేడ్పు చూపుట మనమెఱుగుదుము. అటులే లోకములోని సకల దుఃఖములు దేవుని నాటకము లేక లీల!

295. నీవు భక్తుఁడవా? ముష్టియెత్తు దౌర్భాగ్యుఁడవు నీ వెన్నఁడును గాకుందువుగాక. ఈ అనంత సృష్టియు దానితోఁ బాటు నిన్నును సృజించి, బాధ్యత వహించి, యీషణ్మాత్ర

దోషము కలుగకుండ రక్షించుచున్న భగవానుడు – కోటి నేత్రములతో నీ యోగక్షేమమును జూచుచున్నాడు. ఆయన కుంగల శక్తి బలము, దయ, సర్వజ్ఞత్వము నూహాతీతములైనవి. ఇంక నీకర్మకాలినదా? చిప్ప చేతంబుచ్చికొని బిచ్చమెత్తుదువేల ? "నా తండ్రియగు పరమేశ్వరుడున్నాడు. నాకెట్టి లోపము నెన్నడును గలుగదు." అని మీసముదువ్వి, తొడగొట్టి, గంతులువేయుచు నిత్యానందములో గేరింతలు గొట్టుచుండక నీకేమిలోటు? నమ్ము, చాలు!

296, భగవానునియందు భక్తునికి నమ్మకము నిలుచుట, చిరకాలాభ్యాసముచేతనే లభించును దేహము, దేహాకాంక్షలు, లోకము, లోకములోని వస్తువులు ఆకర్షించి, తమ్ము నమ్మి భోగింపుమని ఆహ్వానించుచుండును. భక్తుడు వాని లోని లోపములను గనిపెట్టి "నాకు మీరువలదు. నాకు భగవానుడే కావలెననునా ? దేహాదులకు, ఇంద్రియములకు, నింద్రియార్థములకు, మితిలేని కోపమువచ్చి, వానియెడ ప్రబల శత్రుత్వముబూనును. వానిలోని దుఃఖమిచ్చు లక్షణములను గనిపెట్టువాడే భక్తుడు. ఇంద్రియార్థ దోషములను గమనించి, వానిని దృణీకరించెనా, వానితో విరోధము; వానిని భోగించునా? దోషదుఃఖములు తప్పవు, కాని భగవానునాశ్రయించినచో, సకల శత్రువులు మిత్రులై సేవింతురు. చేసిచూడు.

297. పాపాత్ములకు—అశ్లీలవాక్కు; దురహంకారము, క్రోధము, దుర్వృత్తి మితిమీరియుండును, వానినెవఁడు తొలగింపఁగలఁడు, అట్టివారికి వేలకొలఁది జన్మపరంపరలు. వానితో దుఃఖపరంపరలు తప్పవు. వారిమాటలలో మాధుర్యముగాని లాలిత్యముగాని, ఔచిత్యముగాని పిసరంతయు గోచరింపవు; పైగా వారెవరితో భాషించినను, వారి నవమానించుతీరు విశేషముగా గోచరించును, దైవారాధన తత్పరులై, దైవ కృప లభించినవారికే సరళసత్య మధుర వాక్కు లభించును.

298. దేవునిపలుకులు వినఁగుతూహలమున్నదా? పక్షుల కూతలు, మృగముల అరపులు, మనుజుల మాటలు వాయు చలన శబ్దములు, మేఘగర్జనము,సముద్ర ఘోష,—ఏశబ్దములు వినపడిన నవి దేవుని పలుకులే! ఇన్ని రూపములలోనుండి, ఇన్ని విధములుగా దేవుఁడే పలుకుచున్నాఁడు. శబ్దమంతా దేవునిదే. అందుకే 'ఓమ్' అను ప్రణవము పరమాత్మ స్వరూపమని వేద ఘోష. అందుకే 'ఓమితిబ్రహ్మ—ఓమితీదగ్ంసర్వమ్' "అని ఉపనిషత్తు పలుకుచున్నది. ప్రణవజపము సరిగా నమ్మిచేయుచో విశ్వమంతయుఁజలించును; ఏలన నది విశ్వస్వరూపమే. భగవ న్నామములన్నియు నట్టివే. కేశవ, నారాయణ, మాధవ, గోవింద అనునామముల నోంకారముతోఁ గలిపి భక్తితో నుచ్చరించుచో, లోకమంతయుఁ బవిత్రమైపోవును.

299. నీకుఁ బరమాత్మ నెఱిఁగించు గురువుకావలెనా? నీవు గురువుకై వెదుక నవసరములేదు. విశ్వమంతయు గురు

స్వరూపమే. సృష్టియంతయు నీ కుపదేశమిచ్చును. ప్రకృతిలోని ప్రతిప్రాణియుఁ బ్రతి జడపదార్థమును భగవానుని జూపును. ఎక్కడకో పోనేల? నీ యింటనున్న నీభార్య,బిడ్డలు, సేవకులు-అందరుగురువులే. నీమనస్సుకుఁ గష్టముగలిగించు రీతిగా మాటాడుట, పనులుచేయుటయు భగవానుఁ డేర్పాటుచేసిన మహాగురూపదేశములే! నిన్నెవరు నిందించినను, అవి గురు దేవుని వాక్యములేయని నిశ్చయించికొనుము. "తెలిసికో! వారినిగాదు నీవు నమ్మవలసినది. నన్ను నమ్ముకొ"మ్మని దేవుఁడే వారినోటినుండి పరోక్షముగాఁ బలుకుచున్నాఁడు. నిన్ను నిందించువారిపై నెట్టిద్వేషము చూపక, వారు గురువులని గమనించి, భగవానుని నమ్మి ముక్తినొందఁగలవు.

300. భారతభూమిలో జన్మించిన వారందరకు ముక్తి మార్గము కరతలామలకము. ద్విజులకు గాయత్రీ మంత్రము, తదితరుల కందరకు శివ, రామ, కృష్ణాది నామజపము- ఇహ పరముల రెంటిని, ముక్తిని ప్రసాదించును. అసత్యము, అధర్మము నందరకు బాపహేతువులే. దానదయా సేవలందరకు సమానమే.ఇంతసులభ మోక్షమార్గములుగల పుణ్యభూమియే భారతదేశము. ద్విజులు గాయత్రీ విమానమును, తదితరులు రామ, శివ, కృష్ణాది నామ దివ్య విమానముల నధిరోహించి, నూటిగా బ్రహ్మలోక ప్రాప్తినంది, మోక్షపదవి సాధింప వచ్చును.

301. భగవంతుని జాడలు, కృపాహస్తము కనిపెట్టుట నీ తరమా? దయతో భగవానుఁడే నీకాయన జాడలు చూపఁ

గోరి, నీకట్టిదృష్టిని ప్రసాదించి ననేగాని, నీస్వీయశక్తి నిరుప యోగము. అట్లు నిరుపయోగమని తెలియుటే బ్రహ్మాండమైన ఉపయోగము, నాకెట్టి సామర్థ్యమును లేదనిగ్రహించు విన యమే నిజమైనసామర్థ్యము. ఏలన నట్టివినయముగల వానికి భగవానుడే తోడ్పడి, తన్ను గ్రహించు మార్గములను సూచించి, తన్ను గ్రహించు శక్తిసామర్థ్యముల ననుగ్రహిం చును. కాని తన అసమర్థతను, దేవుని సామర్థ్యములను తెలి సిన భక్తుడు, "నేను తెలిసికొంటిని, నేను పరమేశ్వరుని స్వరూప స్వభావములను గ్రహించితిన"ని యెన్నఁ డంగీకరిం పఁడు, నిరహంకార నిగర్వ చూడామణియే భక్తశిఖామణి యగును.

302. ఎచటికిఁబోయి యెవరితోడను పలుకరించుట కిష్టములేక మానివేసితిని. కారణము సకల పరిపూర్ణుఁడైన భగవానుఁడు నాకత్యంత సమీపస్థుఁడై యుండగా, నెచటికేగ నవసరమున్నది. పలుకరించుచో నమృతధారలు కురిపించు పర మేశ్వరునితో మాటాడవలెనుగాని రసహీనులగు మానవులను బలుకరించి యేమిలాభము? సర్వకాల సర్వావస్థలలో, లోపల వెలుపల నాతోఁ గలిసియున్న భగవానుని సాన్నిధ్యము; మంచిచెడ్డలన్నియు నాయనతో మాటాడు కొనవచ్చును. జవాబు వివిధ రూపములలో వినపడును. దేవుఁడు మాటా డునా? మాటాడ కేమి? ఆయనకు మాటలురావా? వినుటకు నిశ్చయించికొనుము. వినపడితీరును. ప్రయత్నము చేయుట కారంభింపుము.

303. చంటిబిడ్డలు సర్వరక్షకురాలైన తల్లియొడిలోఁ గూర్చుండి, సమృద్ధిగాఁ బాలుత్రాగుచునే అప్పుడప్పుడేడ్చుచుందురు. మనకుఁ దెలియని కారణములేవో యుండనగును. మనమందరమట్టి చంటిబిడ్డలమే, జగన్మాత, అనగా భగవాను నొడిలోఁ గూర్చుండి అప్పుడప్పు డేడ్చుచున్నాము. కారణము సర్వవిధముల రక్షించు భగవాను నొడిలోఁ గూర్చుంటిమని యెరుగము. చంటిబిడ్డలు నటులే తల్లియొడిలో నుంటిమని యెఱుగరు. దేవునొడిలోఁ గూర్చుండి యేడ్పెందుకు?

304. ఆకలివేయుచున్నచో విస్తరిలోబెట్టిన యన్నము భుజించుటవలన నుపశమించును. శాశ్వత శాంతి అవ్యయానందముల కాకలివేయుచో, నవిదైవారాధనవలన లభించునని చెప్పఁబడెను. నిజమే, దేవుని ప్రార్థించుటవలన, దేవుని దర్శనము మనకు లభించి దేవుఁడు తన కృపయను నన్నమును మనకుఁ బెట్టినచో, నిత్యశాంతి, అఖండానందము, జన్మరాహిత్యము అను పిండివంటలతో వడ్డించును. ఆపిండివంటలతో భగవంతుఁడు వడ్డించిన భోజనమును కడుపునిండఁ జేసినవుడే మనము దైవారాధనచేసిన సాక్ష్యము. ప్రార్థనకు సాక్ష్యము భగవంతుఁడిచ్చు కృపామృతపానమే, భగవంతుఁడు మనలను పలుకరించుటే; ముక్తినిచ్చుటే. మనకు భక్తియున్న సాక్ష్యము చూచుకొనక్కఱలేదా?

305. ఎన్నిటినైన చూడవచ్చును. విశాల ప్రపంచములో లక్షలకొలది వింతలున్నవి. ఈవింతలనుజూచి యానం

దించుటకై ధనికులు, తీరికగలవారు, తోఁచనివారు, వివిధ దేశ పర్యటనములు సల్పుచున్నారు. ప్రపంచములోని వన్నియుఁ జూడఁదగినవే; మహోన్నత పర్వత శిఖరములు, మహాసాగరములు, లోయలలోని ప్రకృతి సౌందర్యములు, రకరకముల వన్యమృగ పక్షిజాలములు, విభిన్న జలచరములు—వివిధ మానవజాతులు, వారి జీవిత పద్ధతులు, ఆచారములు—అన్నియుఁ జూడవలసినవే, కాని ఒక జన్మముచాలదు. అనంతమైన సృష్టిలోని అనంతములైన వింతలన్నిటిని జూచుట కనంత సంఖ్యగల జన్మము లెత్తవలెను. కాని అన్ని వింతలను దలదన్ను నొకగొప్ప వింత గలదు. దానినిఁ జూచుట నేర్చినచోఁ, దక్కిన వింతలన్నియు నందులోఁ గనఁబడును. వ్యయప్రయాసలు, కాలహరణము లేదు. ఇన్ని వింతలను సంకల్పమాత్రముచే సృజించి వాని వెనుకనిలిచి నవ్వుచున్న పరమాత్మతో సమానమైన వింత లేదు. పరమాత్మనుజూచి, శాశ్వత సౌఖ్యము నందవచ్చును.

306. కామినీ కాంచనములను పూర్తిగాఁ దిరస్కరించి సన్యసించు మార్గము పిఱికితనమును ప్రదర్శించును. వానిని భగవంతుని దర్శించు కార్యక్రమములో నడ్డురాకుండగనే కాకుండ, సహాయకారులుగ నుపయోగించుకొనవచ్చును. ధర్మమునకుఁ గట్టువడి వానిని స్వీకరించి తరించునాతఁడే గృహస్థుఁడు. గృహస్థులందరు ధర్మమునకుఁ గట్టువడి వర్తింపఁగలరా? సన్యాసులందరు సన్యాసిధర్మమునకుఁ గట్టుపడి యుండగలరా?

సకలాశ్రమములలో దోషములకుఁ దావున్నది. దోషములు ఆశ్రమములలో లేవు; వ్యక్తులలో నుండును. కామినీ కాంచనములును బుద్ధిగలవానికి బ్రహ్మజ్ఞానము నిచ్చును.

307. మితిలేని పాపములు చేసినవానికిఁ దరించుట కవకాశమున్నదా? నన్ను భజించు పాపులను, వారిపాపములను దొలగించి రక్షింతునని భగవానుఁడు వాగ్దానము చేసి యున్నాడు. దేవుఁ డున్నాఁడని, దేవునారాధించి తరింపవలెనని యెఱుగని అజ్ఞానులే పాపకార్యములఁ జేయుదురు. అజ్ఞానమే పాపము. అది అంధకారము; భగవానుఁడను ననంతకోటి సూర్యకాంతిలోని కేగుటయే పాపమను నంధకారము పటాపంచలై పోవుటకు మార్గము. బురదలోఁ గాలుంచి, బురదయైనదని యేడ్చిలాభమేమి. కాలుపైకిఁదీసి, శుద్ధోదకముతోఁ గడుగుకొని నిర్మలుఁడవు కావలెను. దైవధ్యానమే శుద్ధోదకము. దేవుఁడగ్ని; పాపము చెత్త; అగ్నిలోఁబడి భస్మమగుట వింతయగునా?

308. నీకు సంబంధించిన సర్వవిషయములలో నేను గలుగఁ జేసికొని అన్నిటిని సవ్యముగాను, సరసముగాను, జయప్రదముగాను, నీకెట్టి లేశమాత్ర క్లేశమును గలుగకుండ గాను జరుగునట్లు చూచుటకు నే నెల్లపుడు సిద్ధముగా నుండగా, నేనారీతిగాఁ జేయుట నిస్సంశయ పరమ సత్యమని నీవే వ్రాసి, మరల నీవే కంగారు పడుదువేల ? నిశ్చంచలముగా, సంతోష తరంగితాంత రంగుఁడవై మృదుమధుర

దరహాసముద్రిత వదనారవిందుఁడవై కూర్చుండుము. ఎంత అద్భుతముగా నీ కార్యములు జరుగునో చూడుము. ఇదిగో, నీయెట్ట యెదుటనే నిలిచి పలుకుచున్నానుసుమీ!" యను నమృత వాక్యములు నిత్యము చెవుల బడుచున్నవి.

309. కర్మయోగమనగా, లోకములో సత్కర్మ లాచరించుచు, ఫలితములు భగవంతుని హస్తములలో విడిచి, నిష్కామ కర్మ చేయుటయని గీత బోధించుచున్నది. కాని కర్మలలో బాహ్యకర్మ, ఆంతరంగిక కర్మయని రెండురకము లున్నవి. రెంటికి సంబంధ ముండునుగాని, భిన్నాంతరువులలో నుండును. భక్తి, జ్ఞానము ధ్యానము నాంతరంగికములే. వారి అంతరంగములలో ప్రచండమగు కర్మ జరుగుచుండును. పరమాత్మయను మహోన్నత లక్ష్యముపై నేకాగ్రచిత్తమును నిశ్చంచలముగ నిలుపుకొను కర్మ, పైకేమియు గనపడని కర్మ; కాని సాటిలేనిది. అంతకష్టమైనది, అంతసుఖమిచ్చునది వేఱొకటిలేదు. సకలక్రియా శక్తులకు కేంద్రమై పరమాత్మ యందు మనస్సును చలింపకుండ నిలుపు జపము, తపస్సు, ధ్యానాదికములో ననంత క్రియాబల మిమిడియున్నది. అందుచే దపస్సు, ధ్యానము, యోగము, భక్తి - యివి సాటి లేని కర్మ యోగములే.

310. 'నేను' అనునది నిజముగా లేదు. అద్వితీయ బ్రహ్మమొక్కటే సత్యము. ద్వితీయముగా గన్పట్టు నదంతయు నసత్యము లేక మిథ్య, అనగా మాయా కల్పితము,

అసత్యమైన జగత్తులో భాగములుగా 'నేను' 'నీవు' కూడ మిథ్యయే. అయినచో, నేను, నీవు, మనము నేమి కావలెను? నేను, నీవు, మనములో నశించున దంతయు నసత్యము. అందు నశింపక మిగులున దా పరమాత్మయే. అనగా నిజముగా నేను, నీవు, తదితరముగా గన్పించు సర్వము పరబ్రహ్మమే అది తెలియుట, తెలిసి, అదియే అగుట, జ్ఞానసిద్ధివలన గలుగును. జ్ఞానసిద్ధికి ముందు సగుణారాధన మవసరము. "సర్వమ్ విష్ణు మయమ్ జగత్" అనగా నంతయు విష్ణువే; నేను, నీవు, సర్వము భగవానుడే, నిజము కాని 'నేను' 'నీవు' బాధపడుచున్నాము. భగవానునారాధించి, సర్వము భగవానుడని తెలిసి, తరువాత జ్ఞానసిద్ధి కలిగి బ్రహ్మైకత్వమును గాంచవలెను.

311. భార్యా పుత్రులకొఱకు, బంధువులకొఱకు, భోగ భాగ్యములకొఱకు నేడ్చువారున్నారుకాని, కాలము కొఱకేడ్చు వారులేరు. లోకులెంతకాలము లోక వ్యవహారములలో వ్యర్థమైనను విచారింపరు. కాని భక్తుడు, జ్ఞాని కాగోరు నాతడు కాలమునకై పరితపించును. ఒక క్షణమైన వ్యర్థముగా బోవుట నాతడు భరింపలేడు. జన్మ జరామరణ దుఃఖములను నిర్మూలించు ప్రచండ కార్యదీక్షలో నున్న భక్తుడు, జ్ఞానియు నొక నిమిషార్ధ వ్యయమును సహింపడు. పోయిన నిముసము తిరిగిరాదని దుఃఖించును, దేవుని మఱచు క్షణము నాతడు భరింపజాలడు.

312. సాధకావస్థ చాలదుఃఖకరమైనది. తా నారాధించు భగవానునిజాడఁ దెలియదు; జన్మాంతర పాపములు ఫలావస్థకువచ్చి వేధించుచుండును; ఎదుటఁగన్పట్టు భోగముల మోసము నెఱిఁగి యున్నందున వాని ననుభవింపలేఁడు, దైవేతరవిషయములు రుచింపవు; రుచించు దేవుఁడు సులభముగా గోచరింపఁడు. భక్తులకు, జ్ఞానులకు నన్నియు బాధలే. అందుచే, సాధన విడిచిపెట్టుట యుక్తమా? కాని వివేకము గలవాఁడు, సాధనావస్థలోని బాధలకంటె సంసార బాధలు వేలకొలది రెట్లు దుర్భరమైనవని గ్రహింపవలెను. సాధన బాధకమే; కాని బాధలు పోవుటకే సాధన.

313. ప్రార్థన మిట్లు చేయవలెను; "హే కృష్ణప్రభూ! నీ వనంత బ్రహ్మాండకోటిని సృజించి నడపుచుంటివి. ప్రళయవేళ వానినిఁ దీసివేయుదువు. అది నీవిలాసము. నన్ను ను సృజించితివి. నాకుఁగల బాధలకుఁ గారణమునీవే, వానిని నీవే తీసివేయఁగలవు. నీవంతటనున్నావు; అన్నియుఁజూచు సాక్షివి; అన్నిటిని నడపు క్రియాశక్తివి. నాచిత్తశాంతిని చెడఁగొట్టు పరిస్థితులు నీవే కల్పించితివి; వానిని నీవే పరిష్కరించి, శాంతినిచ్చు కర్తవ్యము, సామర్థ్యమునీదే. వానిని పరిష్కరించుశక్తి నాకులేదు. లోకములో నెవ్వరికినీ లేదు; వలన వారిసమస్యలతో వారే కృంగికృశించుచున్నారు. ఇఁకనీవే పరిష్కరించి, దయతో చిత్తశాంతిని ప్రసాదింప వేడుచున్నాను".

314. సకలప్రాణులచే ననుకూల వ్యతిరేక సంభాషణ ములు, కర్మలుచేయించు వాఁడీశ్వరుఁడే. అదిఆయన విలాసము. శ్రీరామప్రభువు లోకరక్షణార్థ మవతరించినాఁడు. లోకములోని దోషములను, దుర్మార్గులను నాశమొనర్చుట కాయన అవతరింపవలెనా? సంకల్ప మాత్రముననే, ఆపని చేయఁగలఁడు. కాని అవతరించు టాయన విలాసము. పట్టాభిషేకమునకు వ్యతిరేకముగాఁ గైకచే బలికించినాఁడు; సీత నెత్తుకొనిపోవు బుద్ధి రావణున కాతఁడే కల్పించినాఁడు. యుద్ధము చేయించినవాఁడు రాముఁడే, తన్నుఁ జెఱసాలలోఁ బెట్టించిన కంసుని సృజించి వానిని జంపినవాఁడు, దుర్యోధనునొద్దకు రాయబార మేగి వానిచేఁ దప్పుమాటలాడించి, తప్పుపనులు చేయించి భీమునిచేఁ జంపించినవాఁడు కృష్ణుడే, రథములో నర్జునునిప్రక్కనే కూర్చుండి, వానినజ్ఞానముచేఁ గప్పి, హితోపదేశముచేసి, జ్ఞానమిచ్చి, నీవు నిమిత్తమాత్రుఁడవని పలికి యుద్ధము చేయించినది కృష్ణుఁడే. ఇట్టివన్నియు భగవానుని దివ్యలీలలు!

315. పుణ్యమును లేదు, పాపమును లేదు; మంచియును లేదు, చెడ్డయును లేదు; సుఖమును లేదు, దుఃఖమును లేదు,— దేవుఁడొక్కఁడే యేకైక కర్తయై తనమాయాశక్తిచే లోకమును, జీవులను, జడములను సృజించి, అందుఁబ్రవేశించి, ఆడుకొనుచున్నాఁడు. నిజమునకంతయు నీశ్వరస్వరూపమే; ఈశ్వరుఁడు తప్పమఱొక టేమియును లేదు. జీవు లసత్యము;

అసత్యజీవులకు సుఖదుఃఖ పుణ్యపాపాదిక ప్రవృత్తియుండునా? మిథ్యాసృష్టి; అందలి దొంగనాటకము; అందలి వివిధఘట్టములు, ప్రదర్శనములు అన్నియు భగవానుని లీలలే! జీవులు తాముున్నామని తలచుట—భ్రాంతి, భ్రాంతిలోఁ బుట్టుకలు, చావులు,సుఖదుఃఖములు! నిర్దుష్ట పరమాత్మయొక్కమేసర్వము.

316. ఈ లోకములోఁబుట్టి, ఉన్న జీవితపు గడువులో సంపాదింప దగినదేది? ఏది యెప్పుడుండునో, మార్పులు వికారములు పొందదో, లేశమాత్రమైనను ఖేదమును గలిగింపక, పొందినకొలఁది అధికానందమును, నిశ్చలశాంతిని ప్రసాదించునో, అట్టిదే సంపాదింపఁదగినది. అదియే పరమేశ్వరకృప; అదియే సంపూర్ణ సంతుష్టినిచ్చు బ్రహ్మజ్ఞానము అదియెట్లు లభించును? నిరంతర భగవదారాధనము వలననే. అది లభించినచో నన్నిశుభములు, సౌఖ్యములు, మోక్షమిచ్చు భక్తిజ్ఞాన వైరాగ్యములు లభించును. ధనధాన్యములు, గృహారామాదులు, పుత్రపౌత్రాదికము, కీర్తి పదవులు - అప్రయత్నముగా లభించును; వాని విలువలు సమగ్రముగాఁ దెలిసి, భ్రాంతి వశముకాని అనుభవము సిద్ధించును భగవత్పాదారవిందముల విడువకుండ నాశ్రయించి భజించుటే కార్యక్రమము.

317. అస్థిరమైన లోకములో అస్థిరము, అపవిత్రము, రోగనిలయమునగు దేహముతో బ్రతుకుటలో, సుఖమునకవకాశమేమున్నది? అంతయు దుఃఖ కారణమేయైయున్నది. శరీర, వస్తు, భోగానందము క్షణిక మైనదనియు, అక్షణిక సుఖ

మునకైనను నెన్నియో ఆటంకములు, వికల్ప వికారములు, విషాద యాతనలు చుట్టుకొనియుండి బాధించు నన్నియు నంద రెఱిగినదే, మఱియు నీశరీరభోగములకైనను, బాల్య కౌమార యౌవన వార్ధకదశా భేదములు, రోగ విపద్దశలు తీసివేయగా యము( డనుగ్రహించుచో, యౌవనదశలో స్వల్పకాల మవ కాశమున్నది. దురంతా నర్థపరివేష్టితమై, క్షణికానందమందు లగ్నమైన మనస్సు మనచే వేలకొలది జన్మములెత్తించి, చెప్పరాని దుఃఖముల (బాలుచేసినది. ఈమోసములను గమ నించి, స్థిరశాంతి సౌఖ్యముల సంపాదించు నుపాయము లరసి కృషి చేయవలదా? ఈ చిన్న విషయము తెలియకుండు టెంత దురవస్థ ?

318. స్త్రీ పురుషుల జన్మములలో స్త్రీలకు( గల కష్ట ములు పురుషులకు లేవు. పురుషులు బీజప్రదాతలు, స్త్రీలు క్షేత్రములు, వీరిలో నెవరధికులనునది వేఱు విషయము. బీజ ప్రదానము సులభము; దానిని భరించి, తొమ్మిది నెలలు పోషించి, బిడ్డలనుగని పెంచి రక్షించు కార్యక్రమముచే స్త్రీలు వహించు బాధ్యత దుస్సహయాతనలతో (గూడినది. ఆసంగతి నెఱిగియే భగవానుఁడు స్త్రీలకు సులభతరమైన ముక్తి సాధ నము చెప్పెను. అది భర్తృ సేవయే. పతివ్రతయగు కాంత కింకే జపములు, పూజలు, యాత్రలు నవసరములేదు. భర్తను భజించు టెట్లును తప్పదు. భర్తను భగవానుఁడని భజిం చుచో ముక్తి కరతలామలకము. పతివ్రతకు (గల ప్రభావము

మహాత్ములకును దుర్లభము, పతివ్రత తానుతరించి, భర్తను, బిడ్డలను, బంధువులను దరింపఁజేయఁగలదు. సూర్యచంద్రాదుల గతినరికట్టు శక్తి, యముని తృణీకరించు సామర్థ్యము పతివ్రతలు చూపియుండిరి.

319. మనజీవితములు తీర్థయాత్రలవంటివి. ప్రయాణములో నొకపురమో, గ్రామమోచేరి, అచట విశ్రాంతిగైకొని తరువాత నింకొకఘట్టమునకుఁ జేరవలసియుండును. స్వగృహ సౌకర్యములు, సదుపాయములు యాత్రాఘట్టములలో నుండవు, ఎటులోవండుకొని, తిని, పరుండి, కాలము గడుపవలెను. ఇహలోకయాత్రా ఘట్టమునట్టిదే, కొలదికాలమిచటనివసించి, ముందుకుఁబోయి, నూతనఘట్టము చేరవలసియున్నది. ఈ కొలఁదికాలములోఁ గావలసినవన్నియు లభింపవు, ఉదరకుటుంబ పోషణార్థ మెన్నియో యిక్కట్లకు లోనై, జీవితమంతయు గడపవలసి యుండును, తీర్థయాత్రలోవలె నలుగురితోఁ గలసిపోవుట కుదురదు. "ఎవఁడికివాఁడే యమునాతీరే" ఎవరును తోడుండరు, ఇట్టి దురవస్థలోఁ గోర్కెలు, సంపాదనములు, భోగములు! భక్తిజ్ఞానములే తోడగును.

320. హేమంతఋతువులో విపరీతమగు చలిబాధ; వర్షర్తువులో నతివృష్టిప్రమాదము; మండువేసవిలో దుస్సహతాపము మున్నగునవి ప్రకృతిలోఁ గాలము మార్పుచేఁ గలుగు దుఃఖములు. అటులే, బాల్యమున బాధ్యత నెఱుఁగని అజ్ఞత; యౌవనములోఁగామాంధత; వార్ధక్యములో నిరాశ,

పరాధీనతలు – బాధించును. అటులే దేహమున కేనాఁడును పరిపూర్ణారోగ్య ముండకుండుట, భార్యా పుత్రాదులతో సరి పడని యిక్కట్లు, బంధుమిత్రాదులతో వైషమ్యములు–అన్ని టిని మించి భయోత్పాత హేతువగు మృత్యువు; ప్రాణికోటిని పీడించునట్లు కల్పింపఁబడెను. ఇట్లు కల్పించిన భగవానుఁడు, పరమదయానిధి యగుటచే నిర్దయుఁ డనుటెట్లు పొసఁగును ? అనంత శాంతి సౌఖ్యనిలయమైన తన ప్రాసాదము నతివేగ ముగాఁ జేరుకొను యత్నము చేయుటయే మానవకర్తవ్యమని బోధించుటకుఁ జెప్పరాని యీదుఃఖ పరంపరలను గల్పిం చెను. ఐనను, వాని కలవాటుపడి, బయటపడు కృషి కందరు విముఖులై వర్తించుట విచిత్రముకాదా!

321. కోరికలన్నిటిని సమూలముగాఁ ద్రవ్వి తగులఁ బెట్టుము; భగవాను నెఱిఁగి దర్శించు కార్యక్రమ దీక్ష యందలి కోర్కె నొక్కదానికి నీ మనస్సు నిచ్చివేయుము. కోర్కెల వలన రాగద్వేషములు, వానివలన గణనాతీత మనస్తాపములు బాధించును. నీవు నిండుమనస్సుతోఁ జేయవలసిన దీవిధముగా నుండును; "భగవాన్! నన్ను దయతో రక్షింపుము" ఈవాక్య మును నెమరువేయుచు, భగవానుని పాదములు గట్టిగాఁ బట్టు కొని కూర్చుండుటే నీపని. భగవదితర విషయమేదైన కోరుట కారంభించితివా, నీ జీవితమను కొంపకు నీ స్వహస్తములతో నిప్పు పెట్టుకొనుటే యగును.

322. నిన్నెందరు నిందించి, మోసగించి, ద్వేషించినను, వారినెన్నఁడును దిరిగి నిందించుట, మోసగించుట, ద్వేషించుట చేయకుము. అందరలో భగవానుఁ డుండుటచే, నెవరిని ద్వేషించినను, భగవానుని ద్వేషించుటే యగును. నీహృదయ మందును, సకల హృదయములందును భగవానుఁడున్నాఁడని గుర్తించి, పరిశుద్ధ చిత్తముతో భజించుచుండుము; నిన్ను ద్వేషించి, దూషించిన వారిలో నెంత అద్భుత పరివర్తనము కలుగునో తిలకింపుము, నీ పూజ్యతను భగవానుఁడు వారికిఁ దెలియునట్లుచేసి, నీ కెట్టి లోపములు గలుగకుండఁ జూచి, నీ శత్రువులకు నీ యెడ నమిత ప్రేమానురాగములు కలుగునట్లు చేయును.

323 దుఃఖ మయమైన దీయిహాలోక జీవితము. దీనిని సుఖమయము చేసికొను మార్గములు మహర్షులు చెప్పియున్నారు. వారు చూపిన మార్గములత్యంత సులభమైనవి. నీకు నచ్చిన రీతిగా భగవంతు నాశ్రయించుటే వివిధ మార్గముల సారాంశము. నీవు మహర్షిప్రోక్తమగు నేమార్గమును బట్టినను, నది నీకుఁగల దుఃఖములనన్నిటఁ దుడిచివేసి, నీవిచట బ్రతికి యున్నంతకాలము సర్వ విధముల రక్షించి, తరువాత శాశ్వతానంద రూపమగు ముక్తినిచ్చి, భగవానుఁడు రక్షించును. నీ పని దేవుని నమ్మి భజించుట; అంతే. ఈ చిన్న పనియుఁ జేయలేవా ? దుఃఖమే బాగున్నదా ? నీ కెవఁడు చెప్పఁగలఁడు ?

324. భగవానుఁ డనంత నైపుణ్య పుణ్యరాశి; అఖండ కృపామృత సాగరము. నేఁడు నాకట్టి లక్షణములు దయతోఁ బ్రదర్శించెను. ఒక కార్యము నాకనుకూలముగా జరుగవలసి యున్నది. అది చెడిపోవుట కవకాశములు చాలగలవు. అనేక క్లిష్టసమస్య లందిమిడియున్నవి. నేను మొరపెట్టితిని; "హే కృష్ణప్రభూ! ఇది నీవెఱుఁగుదువు. నాయెడ నీకపారమైన దయ గలదు. నాకెట్టిశ్రమయు మర్యాదలోపము లేకుండ నొక నిముసములో దీనిని నాకోరినరీతిగా జరిగింపఁగలవు. నీ యను గ్రహమునకై యెదురుచూచుచుందును." నిన్న నిట్లు మొర పెట్టితిని. మొరాలించి, నేఁడునాకార్యము నతిమనోహరముగా నెరవేర్చెను. నేను గోరినదానికంటె నెక్కువ సంతుష్టి కరముగా జరిగించెను; కృష్ణప్రభువు దయకింతకంటెఁ బ్రబల సాక్ష్య మేమికావలెను?

325. కాంక్షలు పెట్టుకొనవద్దు; త్రోసిపుచ్చనువద్దు ఇట్లు కృష్ణప్రభువుతోఁ జెప్పకొనుము; "దేనినైనను, నేను గోరుటకుఁగాని, మానుటకుఁగాని కర్తనుగాను. ఏపని చేయు టకుఁగాని మానుటకుఁగాని నాకుఁ గర్తృత్వము లేదు. నాకుఁ బ్రత్యక్షముగా గన్పట్టుచున్నది అశాంతి, విషాదము, బాధ, దుఃఖమును. కృష్ణప్రభూ! నీవు నన్నేవిధముగా నడపినచో నాజీవితము దుఃఖమయము గాకుండ నిరంతర సుఖప్రదమై గడచునో ఆవిధముగా నడపుమని నిన్ను వేఁడుచున్నాను, నేను నీకు సంపూర్ణముగా నధీనుఁడను. నీవులేని నేనులేను దయతో

రక్షింపుము." ఏమిజరిగినను భగవానుఁడగు కృష్ణప్రభు సంకల్పమేయని నమ్ముము. అన్నియు శుభములే జరుగుట దర్శింతువు.

326. నాకేమిలోటున్నది? ఏమియులోటులేదని తెలిసికొనకుండుటే లోటుగాని నిజముగానేమియు లోటులేదు. నేను భక్తుఁడను కాఁదలచినచో నాతండ్రియైన భగవానునికి సర్వలోకాధిపత్యమున్నదని తెలిసికొనవలెను. నాతండ్రికిఁ గలయైశ్వర్య మనంతము. నేనువినయ ప్రపూర్ణుఁడనై భక్తితో మెలగినచో నాతండ్రి నాకు లోటేలచేయును? ఇఁక నేను తత్త్వము నెఱిఁగిన జ్ఞానినికాఁగోరుచో, నేను నిజముగాఁ బరమాత్మనే ఉన్నదంతయునేనే. లోటుశబ్దమున కవకాశమే లేదు అందుచే నేను భక్తుఁడనో, జ్ఞానినో కాఁగోరుచో,లోటున కవకాశమే లేదు. పై రెంటిలో నేదోయొక సాధనచేసి విజయ మందుటే లోటులేకుండుట.

327. సాధారణముగా భగవంతునిఁ జేరి, భక్తులు తమ కెప్పటి కేదికావలెనో దాని ననుగ్రహింపుమని ప్రార్థింతురు. వారడిగినదానిని భగవానుఁ డిచ్చును. కాని మన జీవితములు వివిధ పక్షములు గలవి; వందలకొలఁది గదులుగల మందిరముల వంటివి. ఏగదిలో దీపమారినను చీకటి తడుములాట తప్పదు. కొన్నివిషయము లనుకూలముగా నుండి, కొన్ని వ్యతిరేకములై బాధించుట జరుగుచుండును. బహుముఖమైన మానవజీవితములో సర్వతోముఖమైన సమన్వయ సౌభా

గ్యము, సౌఖ్యము లభించుట ముఖ్యము. అందుచే భక్తులైన వారు భగవానుని అనంత సామర్థ్యమును గుర్తించి, యేదో యొకరంగములో సానుకూల్యమును, పెక్కు రంగములలో వ్యతిరేక పరిస్థితులను గల్పించినచో పూర్ణశాంతి సౌఖ్యములు లోపించునుగావున, సర్వరంగ సర్వతోముఖ సౌభాగ్యమిమ్మని భగవాను నర్థించుట నేర్చికొనవలెను.

328. శరీరమే బంధము; బంధువులనగా భార్యాపుత్రాదు లాబంధము పైబంధము. ఈ బంధములు సులభముగాఁ బోవునవికావు. పరమేశ్వ రారాధనచే నాతని కృపవలన నవితొలఁగును. కాని యీ బంధము లున్నంత వరకుఁ దరుగని దుఃఖము తప్పదు. అందుచే జగదేక బంధువైన భగవాను నాశ్రయించి బంధముల బాధలేకుండఁ జేసికొనవలెను. ఇదియే మానవజీత రహస్యము. దీనిని బోధింపనివిద్య, దీనికిఁ దోడ్పడని రాజ్యాంగ పరిపాలనము, దీనిని మూలధర్మముగాఁ బోషింపని నాగరికత దుఃఖహేతువే యగును. ఈ దివ్యాదర్శనమును బోధించి ఆచరింపఁజేయుని విజ్ఞాన మజ్ఞానమే. యుగయుగములనుండి భారతభూమి యీ విజ్ఞానమునకుఁ బ్రాధాన్యమిచ్చి, నేటికిని సజీవముగా నిలిపి యున్నది.

329 సంసార జీవిత, ముగ్రతాప నిలయము, భగవంతునిఁదెలిసి చేరయత్నించు భక్తులయు, జ్ఞానపిపాసువులయు మానసము లతి కోమలములై యుండవలెను, వారికి సంసార మధిక తాపహేతువగును, సాధారణముగా నట్టికోమల

హృదయము చాలతక్కువ మందిలో మాత్రమేయుండును, అధికసంఖ్యాకులు, సన్నిహిత బంధుమిత్రులైనను స్వార్థకలుషితులగుటచే, భక్తులకు, జ్ఞానులకు మార్దవము, మాధుర్యమునకు బదులు, కాఠిన్యము, కాలుష్యమును జూపుదురు. వారియెడఁ గఠినముగా వర్తించినచో శత్రుత్వము వహింతురు; లాలిత్యము చూపినచో, బలహీనత నంటఁ గట్టుదురు, అటునుయ్యి; యిటు గొయ్యి, అందుచే భక్తులు, జ్ఞానులు సంసారమును బట్టుకొని యుండలేరు; విడువనులేరు; ఏమిచేయుట? సన్న్యసించినచో మరల నట్టి గృహస్థుల సేవలే కోరవలసియుండును. కావున భక్తులు, జ్ఞానులు పూర్ణజితేంద్రియులై, రాగద్వేష రహితులై భగవదారాధనము నకే ప్రాధాన్యమిచ్చి జీవింపవలెను.

330. బ్రహ్మజ్ఞానముతో సాటియైన జ్ఞాన మిఁకొకటి లేదు; కారణము పరమాత్మతోఁ దుల్యమైన వస్తు వింకొకటి లేదు. "అధ్యాత్మ విద్యా విద్యానామ్" అని గీతయు, "సర్వ విద్యాప్రతిష్ఠా బ్రహ్మవిద్యా"యని ఉపనిషత్తును బలికినవి. తెలియనిది మిగులకుండ జెప్పునది బ్రహ్మవిద్య. సర్వవిషయములఁ గూర్చియు సర్వమును జెప్పునది; ఫలితమనంత శాంతి, అవ్యయానందమునిచ్చు ముక్తావస్థ; అనగా పరబ్రహ్మాత్మసిద్ధి. సర్వములో నేకొలఁది విషయములనో గూర్చి చెప్పునవే యితర విద్యలు. అనగా ఁగాంతితక్కువ, చీకటి యెక్కువగానుండును; మఱియు భిన్నవిషయములగూర్చిన జ్ఞాన మన్ని విషయముల

సంపూర్ణ జ్ఞానముతో సంబంధించియుండును. కావున బ్రహ్మ జ్ఞానేతరములైన శాస్త్రములు, విద్యలు మనకు బాహ్యికము, సంశయాస్పదమునైన జ్ఞానమునే చూపఁగలవు. మనకు దెలియనిది చాల మిగిలియుండుటే దుఃఖహేతువు. అందుచే బ్రహ్మజ్ఞానసిద్ధి లేనిదే దుఃఖముతప్పదు.

331 ఒకనాడు కొన్ని వ్రాతలు వ్రాసి కలముజేబులో బెట్టికొంటిని. సాధారణముగా బల్లపై నుంచుట మామూలు. కలముకొరకు బల్లపై వెదకి, కనపడక బల్లపైనున్న పుస్తకములు, క్రిందనున్న సామగ్రి విడదీసి వెదకి, కానరాక, యింటిలో వెదకి వేసారి, యెవరోతీసిరని అందరను ప్రశ్నించి, లాభములేమి. చాలచికాకు పడితిని. అనంతరము జేబులోని కలము చేతికిఁ దగిలినది. జేబులోఁ గలముండగా నిల్లంతయు వెదకు శ్రమకు లోనై ప్రయాసపడితిని. ఈచికాకునకుఁ గారణము స్మృతిబలము (జ్ఞానము) లోపించుటే. మనమందరము భగవాను నొడిలోను, భగవానుఁడు మనయొడిలోను గూర్చుండి యుండినది పరమ సత్యము. బలమైననమ్మకము, విశ్వాసబలము, లోపించుటచే, భగవానునిఁ జూచుటకు వివిధ క్షేత్రములకు, ఆలయములకుఁ బోయి వెదకుచున్నాము. మనతోఁ గలసియున్న భగవానుని వెదకుటెంత విచిత్రమైన అవివేకమో!

332. సకల తాటస్థ్యములలో భగవానుని దివ్య హస్తమునుజూచు నభ్యాస యోగమొక రాజయోగప్రక్రియ. ఈగ, మనదేహముపై వ్రాలుటమొదలు, లోకములో జరుగు

సర్వక్రియలలో భగవానుని హస్తముద్ర యున్నది. నిజముగా భగవానుఁ డేకైక కర్త; అయ్యు ననేకుల కర్తృత్వరూపమునఁ బ్రవర్తించును, అనేకులనగాఁ జేతనాచేతనములన్నియు నందుఁ జేరును. భగవానుఁడు సర్వక్రియలు దాను జేయుచు, జీవులు, జడములు చేయుచున్నవను భ్రాంతినిఁ గలుగఁ జేయును. మనము భగవానుని హస్తమును దిలకించుట నేర్చినచో, భ్రాంతి నశించిపోవును. దీనికోర్పు, భక్తి, నిర్మలచిత్తము, పరిశీలనచేయు సూక్ష్మదృష్టి కావలెను. బ్రహ్మానందమే ఫలితము.

333. జ్ఞానికి లేక భక్తుని కొకలక్షణ మత్యంత పూజ్యమైన దుండితీరవలెను. ఏమిరానీ, పోనీ, నిర్మల ప్రశాంత చిత్తము చెక్కుచెదర రాదు. అట్టి నిర్మల చిత్తములో మితిలేని యానందము ప్రవహించుచుండును. ఈ లక్షణములేనివారు భక్తులుకారు, జ్ఞానులుకారు. భక్తుఁడట్టి నిర్మల చిత్తమును నిలుపుకొను నొక సాధనమున్నది. జలుబుచేయుట మొదలు, జన్మమృత్యు యాతనల వఱకుఁగల సర్వదుఃఖములఁ దొలగించు బాధ్యత నాభగవానుని పాదపద్మముల కర్పించి కూర్చుండుట నేర్చికొనవలెను. భగవానుఁడు సర్వలోక భారములను తృణప్రాయముగా నిర్వహించును. ముఖ్యముగా భక్తుని కానుకూల్యము ఘటించుటలో భగవానుని కృప మితిలేనిది. దీనిని మాటలతోఁగాక, ఆచరణచేసిచూడవలెను. జ్ఞాని యింకొకఅడుగు ముందుకుఁబోయి తానే పరమాత్మగా ననుభవసిద్ధిగాంచి తరించును.

334. నేటియుగము కామినీకాంచన యుగముగా నడచుచున్నది. ఇది పశ్చిమ ప్రకృతిశాస్త్రముల వలన నిర్మింపఁబడి ననాగరకత, కాంచనము (ధనము) వస్తువులనిచ్చి, సుఖమిచ్చునట్లు భ్రాంతిని గలిగించి, మితిలేని కాంక్షాదోషముచే దుఃఖము నిచ్చును మానవుని సకలశక్తులు దానినార్జించుటలో వ్యయమై పోవుచున్నవి. ఇఁకఁ గామినీ కాంక్షలేక శారీరిక భోగకాంక్ష, సకలావధుల నతిక్రమించి ప్రాణుల చైతన్య శక్తినంతను మ్రింగివేయును, సంభోగ కాంక్ష సర్వ నియమముల నతిక్రమింపఁ జేయును. కామినీ కాంచనములు సంసార బంధముల బిగించి, తుదిలేని దుఃఖకూపమున మానవులను నెట్టివేయును. ఈ సంగతిని గ్రహించు శక్తిని లోపింపఁ జేయునదే నవ్యనాగరికతా లక్షణము.

335. భగవంతుని నమ్ముట, భక్తితో నారాధించుట యననేమో తెలియునా? అమృతరసపానముచేసి, సర్వరోగ దుఃఖబాధా నివృత్తిసిగాంచుట! జన్మజరా మృత్యువులఁ గాలి క్రిందఁ ద్రొక్కివేసి. అమర్త్యత్వముకంటె నధికమగు మోక్ష సామ్రాజ్య కిరీటధారివై, నిరవధికానంద శాంతిసౌఖ్యముల నెల్లవేళలఁ గనుట. లోకములో మనముచేయు నితర కార్య క్రమములన్నియు దుఃఖము నిచ్చునవే కాని తొలగించునవి కావు సత్కార్యాచరణమైనను జన్మాంతర సౌఖ్యమిచ్చును, గాని మోక్షమీయఁజాలదు. తీరికదొరకినపుడెల్ల, భగవంతుని స్మరించు టేమికష్టము? తీరికసంపాదించి జపముచేయవలదా?

వ్యర్థవినోదములు, నిరర్థక కాలక్షేపములు కట్టిపెట్టి, యముని శాసింపగల సామర్థ్యమిచ్చు నీశ్వర సేవ యెంతగొప్పదో!

336. భగవంతుఁడు లోకమును, జీవులను సృజించి, ఎట్టి ఆయుధసామగ్రిచే వానిని బరిపాలించుచున్నాఁడు? అవియే కామము; కాంచనము. కోట్లకొలఁది స్త్రీపురుష రూపముల సృజించి, పరస్పరాకర్షణము, పరస్పరసంయోగము నందలి వ్యామోహమును గలుగఁజేసి, తిరుగులేనిరీతిగా సృష్టి రథమును నడపుచున్నాఁడు. స్త్రీపురుష సంయోగ కాంక్ష దుర్జేయమైనది. మిడతలగుంపు దీపమునుజూచి, మహావేగ ముతో నందుదూకి మృతిచెందురీతిగా జీవులు కామదగ్ధు లగు చున్నారు, కాంచనము, కామమునకు భిన్నమైనదికాదు. కాంచనమనగాఁ గామమే, రెండింటికి విడఁదీయరాని సంబం ధముగలదు. రెండును విడిగానుండవు. ఈ రెంటికి వశులై జీవులు, పుట్టుట గిట్టుట—ఎన్నిమారులు — లెక్క లేదు — ఇది నాటకము, భగవానుఁ డిదిచూచి, చిరునగవుతో రాజ్యము నిర్వహించుచున్నాఁడు. కాని భగవాను నాశ్రయించిన వాని నీరెండు నేమియుఁ జేయఁజాలవు,

337. బ్రహ్మజ్ఞాన సంపాదనము గృహశోధన కార్యము వంటిదే. ఇల్లు శుద్ధిచేసిన రీతిగనే, త్రిదేహశుద్ధిని నిర్వహింప వలెను. ఇల్లు, పాడయినచోట సిమెంటుపెట్టి, ప్రతిభాగము నకు దుమ్ముదులిపి, వెల్లవేయుటవసరము. ఇంటిలో నన్ని సామగ్రులు దుమ్ముతో నిండియుండును. అన్నిభాగములను

వస్తువులను బూజులు తుడిచివేసి, వెల్లలయిన వెనుక, మరల సామగ్రిని యథాస్థానములకు జేర్చవలెను. దేహమను గృహమునకు నిట్టి శుద్ధియే కావలెను. స్థూల సూక్ష్మ, కారణ దేహములు మూడున్నవి. అనేక జన్మములనుండి చేసిన పాపరాశి సంస్కారములను బూజులు కుప్పలుగాఁ బట్టియున్నవి. ఆత్మజ్ఞానకాంతి నవి కప్పివేసి అంధకారమును వ్యాపింపఁజేసి, సకల దుఃఖములకు గారణములై పరిణమించుచున్నవి. త్రిదేహ మందిర శుద్ధివలన బ్రహ్మత్వసిద్ధి లభించును. తపస్సనగా నీశుద్ధి కార్యమే.

338. బుద్ధి సవ్యముగా బనిచేయువారికి, భగవత్కటాక్షసిద్ధి అత్యంత సులభము. భగవానుని కృపామృతములోఁగాని, యింకెందు నేవస్తువులో నిజమైన సుఖములేదను దృఢనిశ్చయమే భగవత్కటాక్షసిద్ధి నిచ్చును. సుఖములేని చోట నిలిచి, సుఖము లభింపక యేడ్చుచు, భరింపరాని దుఃఖమయ జీవితములను గడపుటే కాక, తిరిగి తిరిగి జనన మరణాదిక చక్రములోఁబడి నలిగి దురవస్థ ననుభవించు టేమి తెలుపుచున్నది? మానవుని బుద్ధి సవ్యముగా బనిచేయుట లేదని తెలుపుచున్నది. నిశితమేధావి చక్రవర్తులుగూడ నీచిన్న విషయమును గుర్తింపక సంసార లంపటమునఁ దుదిలేని తాపములఁబడి నలుగుటాశ్చర్యము! సత్పురుష సహవాసమే దీనికి మందు; సత్పురుషులు దైవ విశ్వాసదాన సమర్థులు.

339. భగవంతుఁ డనంత విశ్వ పరిపాలన నిమిత్తము అనంతకోటి సూత్రముల ననుసరించి కార్యక్రమములు నడపు రీతి, మానవబుద్ధి కందరానిది. కాని భగవానుని యొక్క నియమము భక్తులకు, సత్పురుషులకు సులభముగా దెలియునదున్నది. తనభక్తుఁ డేకారణముచేనైనను కంట నీరు పెట్టి దుఃఖించుట భగవానుఁడు చూడలేఁడు. భక్తునికట్టి దుఃఖావసరము కలుగకుండ ముందే రక్షించును. భక్తుఁడొక్క విషయములోఁ గన్నీరుపెట్టుట దేవునికిష్టము. భక్తుఁడు భగవానుననంత దయామృతము నాస్వాదించి, మత్తిల్లి ఆనందాతిశయముచేఁ గన్నీరు కార్చుటఁజూచి భగవానుఁ డానందించి. మైమరచును.

340. ఓర్పు, మితహిత మృదుమధుర భాషణము, మార్పులేనిదైవభక్తి, యీమూఁడు నుండినచో లోకమును జయింపవచ్చును, ఓర్పు, పవిత్రవాణి, మానవునకు దివ్యాభరణములు. ఈ రెండును, మూఁడవదగు భగవద్భక్తిలేనిదే లభింపవు. పరమేశ్వర పాదార్పిత సర్వస్వుఁడైన వానికే సహిష్ణుత, చిత్తప్రసాదమును గలుగును. భగవానుఁడు మన రక్షకుఁడు; భయమున కవసరములేదను దృఢసంకల్పముతో జీవించువానికోర్పు, మధుర సంభాషణము లభించును, సత్యమే పలుకుట, హితముగాఁ బలుకుట సత్పురుష సేవ, భగవత్కృప వలననే కలుగును. అట్టివ్యక్తి సర్వజన పూజ్యుఁడై జగత్కళ్యాణ దాతయగును.

**341.** "నహిజ్ఞానేన సదృశమ్ పవిత్రమిహావిద్యతే" గీతావాక్యము; అనగా జ్ఞానముతో సమమైన పవిత్రతగల దింకొకటిలేదు. జ్ఞానమనగానేమి? పవిత్రత యనగానేమి? జ్ఞానమనఁగా బ్రహ్మజ్ఞానమే; అదియే పరిపూర్ణమైనది; సర్వ తోముఖ సంపూర్ణతగలది. ఇతరమంతయు నజ్ఞానసమమని చెప్పవచ్చును, ఏలన నితర విషయజ్ఞానమంతయు స్వల్పము. నసంపూర్ణము, పాక్షికము. సంపూర్ణతగల బ్రహ్మజ్ఞానమందలి లేశమాత్రము. సంపూర్ణజ్ఞానము తెలియనిదే, అందలి లేశ ములకు దానితోనెట్టి సంబంధమున్నదో తెలియదు కావున నితరజ్ఞాన మజ్ఞానతుల్యమే, అదియే వేదవాక్య రహస్యము. సత్యమును సర్వదృక్పథములనుండి సమగ్రసమైక్యత గలదిగా నెఱుఁగుటే పవిత్రత; సందేహమునకుఁ దావులేనిజ్ఞానమే పవి త్రమైనది. బ్రహ్మజ్ఞాన మట్టిదే.

**342.** ఆహా! తెలిసినది; కామినీ కాంచనములులేనిదే, భగవానుఁడు లోకమును నడపుటదుస్సాధ్యము,కాంతాకనకము లదినాభావసంబంధముగలవి. "కాంతపైనాశ, కనకంబుపైనాశ, లేనివాఁడు పుడమి లేనివాఁడ"ని చెప్పిన వేమనయోగి పలుకు లెంతసత్యములో! ఆభరణములు కాంతకాంతికి మెఱుఁగుపెట్టి సౌందర్యము నతిశయింపఁజేసి పురుషు లను భ్రమిసందోహము నాకర్షించును. కాంతాసంబంధమైన తళుకు, కనకమిచ్చు అద నపుకాంతి యెచటినుండి వచ్చినవి? ఆతళుకు, కాంతి దేవునిది; కాంతదికాదు, కనకముదికాదు. అన్నివిధములైన కాంతులకు

మూలస్థానము దేవుఁడే. ఈ సంగతి గ్రహింపక, మానవులు మిడతల దండువలెఁ గామినీ కాంచనాగ్ని జ్వాలలోఁబడి, దహనమగుచు, చర్వితచర్వణముగా జనన మరణ ప్రవాహములోఁ గొట్టుకొని పోవుచున్నారు. సకలవిధ ప్రకాశములకు మూర్తియగు భగవాను నర్చించుటెరిగి తరింపవలెను.

343. వస్తు సంగ్రహణము, వస్తు భోగానుభవమును తప్పు లేదు. కామినీ కాంచనములయెడ ద్వేష మవసరము లేదు. వానివిలువ నెఱిఁగి అనుభవింపవచ్చును. ఏవస్తువున కెంత విలువగలదో, తెలిసికొనకుండ ననుభవింపఁ బూనుటయే తప్పు. అట్టితప్పువలన మోసమునకు, దానిఫలితమైన దుఃఖమునకుఁ బాల్పడుట మూర్ఖుల లక్షణము. కాంతాకనకములు, గృహ వాహన వస్త్రభూషణాదులు, పదవీ కీర్తి భోగములు, స్వతః దోషరహితములే, వానిస్వరూప స్వభావములు, అవిసుఖ మీయఁగల కాలపరిమితి, అవియిచ్చు సౌఖ్యపరిమితి, తెలిసికొనకుండఁ గోరుటయే దుఃఖకారణమగును. అది చీకటిలోఁ జూచికొనకుండఁ బాడునూతిలోఁ బడుటవంటిది. వస్తువులు కొలదికాలముండి పోవునవి. వానియెడ వ్యామోహ మువి పోయినను పోదు. అదియే దుఃఖము. అందుకే కాంతాకాంచనాదిక భోగమస్థిరము, అల్పము, నందుచే దుఃఖమూలము, వానికి వన్నెనిచ్చిన పరమాత్మ నారాధింపవలెను.

344. నీవేమి సంపాదించుటకై నీబ్రతుకంతయు వ్యయ మొనర్చుచున్నావు? ధనమా, గృహమా, భూములా? పద

వులా? కీర్తియా? క్షణమాత్ర శాంతిలేని నీచిత్తమునకు వస్తు లక్షణములను గూర్చి తెలిసికొను తీరిక యేది? చిత్త శాంతి లేనిదే దివ్య భవన మందలి హంసతూలికా తల్పమున శయనించినను నిద్రపట్టునా ? మనశ్శాంతి లోపించి యుండగా బంగారుపాత్రలోఁ బరమాన్నము సంతుష్టినిచ్చునా? శ్మశాన భూమికిఁ బోవలయు నీవు, భూముల నార్జించి లాభమేమి? చిత్త క్షోభ పిశాచివలెఁ బీడించుచుండఁగా, నున్నత పదవి, మూర్ఖుల మెప్పులు సుఖమిచ్చునా ? కోటి మంది నీ పేరు ప్రయోగించి, సన్మానించినచో, నీవికలమైన చిత్త మకలంక మగునా? దేనివలన నెన్నడు చెడని చిత్తశాంతి, ఆనందము లభించునో తెలిసికొని బ్రతుకుట మంచిదికాదా?

345. నఖశిఖ పర్యంతము జీవునికి దేహముతోఁ దాదాత్మ్య భావముండును. అందుచే నేభాగమునకుఁ బిసరంత అపాయము కలిగినను, మానవుని మనశ్శాంతి నశించును. దేహము నేను గానను భావము సులభముగా లభించునా? అనేక జన్మముల దీర్ఘ తీవ్రకృషిచే దైవకృపకలిగినచో లభింపవచ్చును. ఇది జ్ఞాన విషయమగుట క్లేశతరమైన సాధనము. పరమేశ్వరునందు భక్తియోగముచే నిది సులభ సాధ్యమగుటచే నందరకాచరణ యోగ్యమైనది. దుస్సహ బాధ లెవ్వియు రాకుండ భగవంతుఁడు భక్తులను రక్షించును. జన్మాంతర దోషములు, ప్రస్తుత జన్మపాపములు, బాధలను, గలిగించుచునే యుండును. ఈశ్వరారాధన దీక్షయే దేహాభిమాన నిర్మూలనమునకు సరియగు దివ్యౌషధము.

346. ఈశ్వరాజ్ఞయను ననంత సాగరములో నున్నాను. ఆసాగరమున కొడ్డులేదు. ఎంతసే పీదుచు (గొట్టుకొనుచున్న నొడ్డు చేరుట కవకాశమే లేదు. మనకేదో కర్తవ్యమున్నదను కొనుట బుద్ధిమాంద్యము. ధర్మాధర్మములా కొట్టుకొనువాని కుపన్యసించు టున్నాదక్రియ. "హే ప్రభూ! నీవేదిక్కు; నన్ను రక్షింపుము; రాప్రభూ! ఇఁక నీవిధముగా బ్రతుకలేను, వచ్చి, చేయిచ్చి, కరుణించి గట్టెక్కించు" మని భగవానునికి మొఱ పెట్టుకొనుటే చేయవలసినపని. అదియే జపము, తపము, ధ్యానము, యోగము, చతుర్వేదసారము; ఉపనిషద్రహస్యము, గీతా-సారామృతము. ఎందుకు వేయిగ్రంథములు, చదివి చర్చించుట. పట్టుకో! దేవుని పాదములు పట్టుకో! ఇదే వినఁదగినపిలుపు. ఒడ్డు చేరితివే! చేయిపట్టుకొని తటము చేర్చిన దివ్యహస్త మెవరిది? కన్నులులేవా? నీమొఱ విని వచ్చి తీరముచేర్చి నవ్వుచున్నది జగత్ప్రభువే. ఆయన పాదములు విడువకు; విడిచితివా, మరల సాగరమునఁబడిపోవుటే! జాగ్రత్త!

347. అన్నిరకములగు చికాకులకుఁ గారణము పాపమే. పాపమనగాఁ బరమేశ్వరుని మరచుటయు భజింపకుండుటయు. మనము పరమేశ్వరు నత్యధిక దీక్షతో నిరంతర మారాధింపవలెను. గతములోని పాపరాశి భస్మమగుటకును, ముందెన్నఁడు పాపమొనరించు నవకాశము రాకుండుటకును, మన మనంత పుణ్యరాశి నార్జింపవలెను. నిరంతర భగవత్సేవ

వలననే తరుగని పుణ్యరాశి లభించును. కావున భక్తునికిఁ జికాకు గలిగినదన్నచో, నాతని భక్తిలో లోపమున్నదన్న మాట. దేవుని పాదములు పట్టుట, చికాకు సంభవించుట, వ్యతిరేక విషయములు, భగవానుని మఱచు మనస్సుతో సమానమైన ప్రబలశత్రు వింకొకటి లేదు.

348 మనదృష్టికి గనిపించు నవన్నియు మార్పునకు లోనగునవే. అవియెల్లప్పుడుండునని భావింతుము. అవి అదృశ్యములై మనల మోసగించును. ఈ మోసము నెఱుఁగని వారికి దుఃఖము తప్పదు. పరమ సత్యమగు పరమాత్మ కన్నులకు గోచరింపదు. దాని నెఱిగిన దుఃఖముండదు. లేలన నది మూడు కాలములలో నుండును. దాని వలన, స్థిరశాంతియు సౌఖ్యమును లభించును. కాని కనపడుచున్న వానిని విడిచి, కంటికగపడని పరమాత్మను దర్శించుట కెవ్వరును యత్నింపరు. ఇదియే అజ్ఞానము. ఇచట ప్రశ్న, కనపడుట, కనపడకుండుటయేకాదు. అది స్థిరమా, అస్థిరమా, సుఖమిచ్చునా, దుఃఖమిచ్చునా? యనునదే ముఖ్యప్రశ్న. కనపడని పరమాత్మ సుఖ స్వరూపము, కనపడి మారిపోవునది దుఃఖ స్వరూపము సుఖ స్వరూపమెరిగి ఆశ్రయించుటే తెలివికాదా!

349. తాను బాగుపడకుండ నీలోకమును బాగుచేయ గోరునాతఁడు, గ్రుడ్డివాఁడంధులకు మార్గము చూపుదునను నట్టివాఁడే; కాలుసేతులు లేనివాఁడు సాగరమును దాటుదు ననునట్టివాఁడే. ప్రతి వ్యక్తియు ముందు దాను పరిశుద్ధుఁడై,

మీరును శుద్ధులుకంటెని చెప్పుట సరసమైన పద్ధతి. పరోపకారము తాము చేయుచున్నామని చెప్పికొనువారు, తమ్ముఁదాము బాగుచేసికొని చెప్పుకొనుట, యుక్తము. దాహము గల వానికి (గశ్మల హస్తముతో నుదకము నీయరాదు. చేతులు తోమి కడిగికొని, అప్పుడు శుద్ధోదకము నిచ్చినచో దప్పిగొన్న వారి దాహము తీరును. నదిలో నీదుట చేతకాని వాఁడు పరునికీఁత నేర్పుచో నిద్ధరు మునిగి మృతిచెందుదురు.

350. లోకములో నెన్నియో స్తోత్రార్హములైన పనులు చేయు వారుగలరు; కొన్ని పనులు నిందార్హములై యున్నవి. కొందరు లోకోపకారార్థము చేయుపనులు స్తుతి పాత్రములే. కాని భగవంతు నాశ్రయించి భజించుట యనుపని సకల సత్కర్మల కంటె నత్యంత స్తుతి పాత్రమైనది. సత్కర్మలు పుణ్య లోకములనిచ్చును; అచట ఉన్నత భోగములు లభించును. కాని పుణ్య క్షీణమైన వెనుక తిరిగి యీలోకమున జన్మించుట తప్పదు. భగవద్భజనమనుకర్మ జన్మరాహిత్యము నిచ్చి శాశ్వతానందమును ప్రసాదించును; మరియు నదిపూర్ణ జ్ఞానమును, మోక్షమును లభింపఁ జేయును. భగవానునితో నైక్యసిద్ధినిచ్చును. కావున భగవద్భజనమను కర్మ సాటిలేనిది.

351. లోకములో నేవిషయమును గూర్చి యైనను సందేహము కలుగుట తప్పు లేదు. దానిని (బరిశీలించి తోలగించు కొనవచ్చును. కాని భగవానుని గూర్చికాని, భగవంతుని భజించుట వలన సర్వపాప విముక్తియు, శాశ్వత

శాంత్యానందములతో ముక్తియు లభించునను వేదోక్త విష యములలో సందేహము కలిగినచో, నది సర్వవినాశకారియై, శాశ్వత దుఃఖహేతువగును. అందుకే "సంశయాత్మావిన శ్యతి"యని భగవద్గీతా వాక్యము. అందుచే సంశయించు భక్తి ప్రమాదకరమైనది. దేవుఁడున్నాఁడు; భక్తులను రక్షిం చుటలో నమేయకృపా పరిపూర్ణుఁడు; ఆశ్రితులకు సర్వకాల సర్వావస్థలలో అమోఘ రక్షణమిచ్చునను విషయములను శంకించుట, మహాపాతకమే కాక, దురంత దుఃఖ హేతువు.

352. ఏకష్టము, విషాదము, భయము, అశాంతి కలిగి నను, కలుగనున్నను వానికన్నిటికి విరుగుడు పరమేశ్వర ధ్యాన జపాదికమే. ఏసుఖము, శాంతి, సంపద, శుభము కావలసినను దానికి సాధనము పరమేశ్వరారాధనమే. ఈసంగతి తెలిసినచో ప్రజలు భగవంతుని సేవించి సకల సౌఖ్యములేల పొందరు? అత్యధిక సంఖ్యాకులు దుఃఖ మనుభవించుచున్నారనఁగా, భగవత్సంకీర్తన మందలి తిరుగులేనిశక్తి నెరుగరన్నమాట. మరియు, భక్తిలేనిదే భక్తుల మనుకొనువారు, భగవంతుని భజించుట వలన లభించు నఖండ శుభ సౌఖ్యముల గూర్చి విని విననట్లుపేక్షించువారు, సంసార తాపములకు గురియై దుఃఖించుచున్నారు. సుఖమెరుగని వాఁడు భగవాను నెఱుఁగ డన్నమాట. దుఃఖమెఱుఁగని వాఁడెన్నఁడు భగవానుని మఱువఁడన్నమాట.

353. పరమేశ్వరుఁడున్నాఁడు, సర్వత్ర వ్యాపించి యున్నాఁడని నమ్మి, పరమేశ్వర పాదపద్మములకు జీవిత మంతయు మినహాయింపు లేకుండ నర్పించి కూర్చుండుట కంటె నీకఁ జేయువలసిన దేదియును లేదు. అయినచో మన నిత్య జీవిత కార్యకలాపములు చెడిపోవా? పోవు! మనము దేవు నాశ్రయించినచో, మనపనులు దేవుఁడు చేయును. మనకు జరుగవలసిన సర్వమును కరుణించి, సకల శుభ ప్రద ముగా జరిగించును. మన పనులలో నిమగ్నులమై దేవుని విస్మరించితిమా, మనపనులు జరుగవు; దేవుని కృపయు నుండదు. ఉభయ భ్రష్టత్వము సంభవించును. లోకులందరు దైవ భక్తులా? వారి సాంసారిక కృత్యములలో నిమగ్నులై వారు చెడిపోయిరా? యనునది ప్రశ్న. సూక్ష్మదృష్టితోఁ జూచినచో, దేవుని మఱచియో, విడిచియో, వర్తించు సంసా రుల జీవితముల లోని వైకల్యములు, అపజయములు, క్లేశ ములు, పర్వతములై యుండుట గాంచవచ్చును.

354. భగవంతుని నమ్ముట-చెడుట; నమ్ముట, కోర్కెలు సఫలత నందకుండుట; నమ్మకుండుట, దుఃఖములు కలుగ కుండుట; సుఖ ప్రాప్తి-యివి అసంభవ విషయములు. శివుఁడు కావలెనా, యముఁడు కావలెనా? శివునినమ్మి భజింతువా, యముఁడు నీదరిఁజేరఁడు; చేరినచో, నీకాలిక్రింద వానిని నలిపి వేయు శక్తి నీకు శివుఁడనుగ్రహించును. అందుచే దేవుని నమ్మితివా? బాగుపడుదువు; సకల వాంఛలు సిద్ధించును;

నమ్మితివా, సకల దుఃఖరాశి భస్మమగును; నమ్మితివా, స్థిర సౌఖ్యశాంతి మోక్షములు కరతలామలకము లగును. అందుచే నమ్మకమే సాధనము, జపము, తపస్సు, ముక్తి, నమ్మకమే అభయము.

355. శరీరమును శ్మశాన ధూళిలోఁ గలిపి వేయక తప్పదు. ధూళియగు శరీరమునకై, దాని సుఖమునకై, దాని భోగములకై జీవితము నంతను వ్యయమొనర్చుట వలన నేమి లాభము? శరీరివైన నీవు శరీరముండుటవలనఁ గాని, పోవుట వలనఁగాని యెట్టి దుఃఖము కలుగకుండు నుపాయమును గని, సాధించి, సుఖింప వలదా? సర్వకాల సర్వావస్థలలోను శరీరమును 'నేను' గానను మహామంత్రమును జపింపవలెను. "ఈ దేహము నేను గాదు కాదు, కాద" ననదే మంత్రము. దీనితోఁ బాటు "నేను జన్మమృత్యు జరా వ్యాధులు లేని ఆత్మను;" ఆత్మయనగా ఁబరమాత్మయే. "శివోఽహమ్; బ్రహ్మైవాఽహమ్" అను మంత్రము నెఱిగి స్మరింపవలెను. ఇదియొక పూజ్యమైన తరణోపాయము.

356. భగవంతుని నమ్మి, చెక్కుచెదరని మనస్సుతో ఁగూర్చుండుటే తపస్సు. ఈతపస్సువలన లభించుశక్తి యెదుట వజ్రాయుధము తుత్తునియలై పోవును. ఇది పరిపూర్ణము, నమోఘమునైన దైవశక్తి; అప్రతిహతము. ఇట్టి విశ్వాసముతో వర్తించు వానిలో నున్న భగవానుఁడు తన దివ్యశక్తి నమేయ ప్రభావముతో ప్రజ్వలింప ఁజేయును. అప్పుడా

భగవానుఁడను నగ్నిజ్వాలలో సర్వపాపరాసులు నుసియగును. దానితో దుఃఖ కారణములన్నియు నశించును. మిగులున దవ్య యానందము. అదియే యెడతెగని బ్రహ్మానుభవము; మోక్షము.

357. దుఃఖము లేకపోవుటే సుఖము కానక్కఱలేదు. దుఃఖము, సుఖము లేకుండవచ్చును. కావున దుఃఖము లేకుం డుట, సుఖమేయుండుట కావలెను. అదియుఁజాలదు. ఎన్నఁడు చెడని సుఖము కావలెను. సుఖమెట్టిదై యుండవలెను? దుఃఖ మునకుఁ గల కారణములన్నియు సమూల నాశనముకావలెను. సుఖమెల్లప్పుడుండునది; సర్వ రహస్యములను దెలుపు నఖండ జ్ఞానము నిచ్చునది; పరాధార మవసరములేని, సంకల్పమాత్ర ముచే సర్వ కార్యముల నమోఘముగా ఁజేయఁగలుగునది, సర్వతో ముఖ పరిపూర్ణతగలది, అచంచలశాంతి నిచ్చునది యైయుండ వలెను. క్షణిక సుఖము సుఖమే; కాని దానితో సంతుష్టి చెందు నాతఁడెట్టి మూర్ఖుఁడనగా, విస్తరినిండ వడ్డిం చిన అన్నము, కూరలు, పిండివంటలు విసర్జించి, క్రింద ఁజారి పడిన మెతుకులను దిని సంతసించు వాఁడు, దానితోఁ గడుపు నిండునా ? ఆకలి తీరునా ? బలము కలుగునా ? కావున క్షణిక సుఖలాలసులగు మానవులు తాము చేసికొనుచున్న ఆత్మద్రోహమును గమనించి, బుద్ధి మార్చుకొనవలెను.

358. "సర్వంవస్తు భయాన్వితమ్ భువినృణామ్, వైరా గ్యమేవాఽభయమ్మ"ని భర్తృహరి మహాకవి పలికెను, భయ

మనగా నేమి ? బాధ కలిగించునది భయము కరిగించును. లోకములోని వస్తువులు, జీవులు, అనిత్యములగుటచే, అదృశ్య ములై బాధ కలిగించునను భయము. మఱియు నదియున్న కొలఁదికాలములోఁ గూడ నసంతుష్టిని, అశాంతిని, అసుఖ మును కలిగించి, పెక్కు విధముల బాధించును. కావున భయ స్వరూపమును, భయ కారణములను గమనించి, వస్తువుల ప్రదర్శకుఁడగు భగవానుని నమ్మి యారాధించి, దుఃఖాపనో దనమును జేసికొనవలెను. ఈ పని తత్క్షణమే చేయవలెను. ఏలన ఁదీరికగా నాలోచించుటకు ఁగాలము చాలదు

359. ప్రాణికోటికి వచ్చిన దురవస్థ అజ్ఞానములో నుండియే అజ్ఞానమును బోఁగొట్టు కొనవలసియున్నది. ఇది అసాధ్యముగా గోచరించును. చీకటిలో నుండి చీకటిని బోఁగొట్టుకొన వలెను. కాని ఒక గొప్ప విషయమున్నది. మనము అజ్ఞానమను చీకటిలో నుంటిమని గుర్తించుటే జ్ఞానా రంభ దశయగును. అజ్ఞానములోనుండి, అజ్ఞానములో నుంటి మని తెలియకుండుట గాఢమైన అజ్ఞానము. పైగా నజ్ఞానములో నుండి జ్ఞానుల మనుకొనుట గాఢత మాజ్ఞానము. చీకటినుండి వెలుతురులోనికి వచ్చుట వలన సుఖము, శాంతి, ఆనందము లభించును. విచిత్రమేమనగా ఁబ్రతిప్రాణిలో నీశ్వర చైతన్య మను తేజోరేఖ వెలుగుచున్నది. అది అజ్ఞానాచ్ఛాదితమై యున్నది. పవిత్ర గ్రంథ పరిచయము, సత్పురుష సాంగ త్యము, జ్ఞానుల సంపర్కము, భక్తుల సహవాసము, కప్పును దొలగించి కాంతిని ప్రసరింపఁజేసి, చీకటిని దొలగించును.

**360.** భగవానుని (గోరవలసినవి భక్తుని కనేక విషయము లుండవచ్చును; "ఆరోగ్యమిమ్ము; ముఖ్యావసరములకు వలయు నైశ్వర్యమునిమ్ము; సత్సంతతిని, సత్కార్యానుష్ఠాన సామర్థ్యము ననుగ్రహింపుము" మున్నగు నవెన్నియో కోరినచో, నతిసులభముగా వానినన్నిటిని భగవానుఁ డనుగ్రహించుటలో సందేహము లేదు. కాని భక్తుఁడైన వ్యక్తి నిరంతరము కోరుకొనవలసిన విషయమొకటి యున్నది. "భగవాన్! నిన్ను మఱచిపోవు క్షణము లేకుండ నుండునట్లు దయచూపుము; నీపాద పద్మములు సేవించుటతోఁ దుల్యమైన కార్యక్రమ మింకొక టేదియు లేదను నచంచల విశ్వాసము నిమ్ము"ను నదే నిజముగా (గాంక్షింపఁదగినది. భగవానుని మఱువకుండు టనగా నేమియో సరిగా గ్రహింపవలెను. భగవంతుని మఱువని వానికి, సర్వాపదలు నశించును; ఘోర సంసార యాతన తొలగును; సర్వ శుభములు చేకూరును; ముక్తి లభించును. ఇంకేమి కావలెను?

**361.** భాగ్యవంతుఁడనగా నెవఁడు? మఱపు, విసుగు, లేకుండ వినయ భక్తి భయములతో భగవాను నారాధించుటలో నతిశయానందమందు వాఁడు; కీర్తిమంతుఁ డెవఁడు? పరమేశ్వరుని నిరంతరము కీర్తించువాఁడు; ఉత్తమ మానవుఁ డెవఁడు? సర్వోత్తముఁడగు దేవ దేవు నత్యంత ప్రేమతో (బూజించువాఁడు. మహాత్ముఁ డెవఁడు? జీవాత్మయు బరమాత్మయు నభేదములని జ్ఞాన శక్తిచే ననుభవ సిద్ధిగాంచిన

వాఁడు. మహానుభావుఁడెవఁడు; పరమేశ్వరునికి సర్వమర్పించి, యాతనితో నేకత్వము ననుభవించు పరమపుణ్యాత్ముఁడు. బుద్ధిమంతుఁడెవఁడు? తనబుద్ధి నాజగన్నాథు ననంత కల్యాణ గుణ పూర్ణ విజ్ఞానము నార్జించుటకై వినియోగించి కృతార్థుఁడగువాఁడు. పూజ్యుఁడెవఁడు; అనవరత భగవత్పాదారవింద పూజా నిమగ్నుఁడు; పుణ్యాత్ముఁడెవఁడు? అనంత పుణ్యరాశియైన లోకైకనాథు నాశ్రయించు దీక్ష గలవాఁడు. విని సంతసింపకుము; ఇందాక మార్గ మవలంబించి ధన్యత నందు కృషి సల్పుము.

362. జగద్రహస్య మెఱిగిన వాఁడే యెఱిగిన వాఁడు. జగద్ర హస్యము పరమాత్మయే. ఆపరమేశ్వరుని ప్రత్యక్ష దర్శనముచే నమేయానంద పాథోధినోలలాడు వాఁడే వివేకము గలవాఁడు; పండితుఁడని వానినే పిలువవలెను. అనగా నాతఁడే బ్రహ్మవేత్త; బ్రహ్మవేత్త బ్రహ్మయే. భగవాను నెఱిఁగిన వాఁడు భగవానుఁడే. బ్రహ్మజ్ఞాన మొక్కటే సంపూర్ణ జ్ఞానము; సర్వతో ముఖ సర్వవిషయ, సంపూర్ణ సరున్వయ స్వరూపమే అది. అది ఆద్యంత రహిత సాగరము వంటిది. తక్కిన వన్నియు నసంపూర్ణములు, పాక్షికములు. ఇతర కళా శాస్త్ర విద్యలన్నియు నా సాగరమందలి నీటిబొట్టులు. సాగరమందలి అలలే వేదములు, అలల నెఱుగుట సముద్రమును సాంతముగ నెఱుగుట కాఁజాలదు. సాగరము నెఱిఁగినచో, నందలి సకల తరంగములు, జల బిందువులు నన్నియు

దెలియును. కావున బరమేశ్వర సాక్షాత్కారసిద్ధి లేక బ్రహ్మజ్ఞాన సిద్ధి గలిగిన వానికి దెలియ వలసినది మిగులదు. అందుచే బ్రహ్మ విదుఁడు బ్రహ్మయే.

363. శరీరము నగ్ని కర్పించుట తప్పదు. అది యేక్షణములోనైనను జరుగవచ్చును. ఇంత అధ్రువమైన శరీరమునందు మితిలేని వ్యామోహము పెట్టుకొని బ్రతుకుట కంటె నవివేక మేముండును? సత్కర్మ చేయుటకుఁ బుణ్యమార్జించుటకు, బ్రహ్మజ్ఞాన సాధనకు నుపకరణము దేహమే. బ్రహ్మజ్ఞాన సంపాద నోపకరణ మగు దేహమును క్షణిక భోగోపకరణముగా వినియోగించి, దుఃఖ కూపమున బడి అలమటించు వారు వివేక హీనులు. ఆరంభమున నమృతోపమానముగా గన్పట్టి, అనంతరము విషతుల్యమై పరిణమించి పీడించు భోగము భోగమెట్లగును ? అది మోసమని చెప్పవచ్చును. క్షణకాలమైన వ్యర్థ మొనర్పక భగవత్కటాక్షమునకై దీక్ష బూను నాతఁడే వివేక వంతుఁడు.

364. ప్రపంచ మంతయు భగవానుని స్వంత సొత్తు, మనమున్న యీలోకము, నందు నివసించు మనము భగవానుని సొమ్మే! భగవానుఁడు నిర్మించి తదధిపతిగానున్న యీలోకమున జన్మించి, భగవానుని గుర్తింపకుండ బ్రతికి జూచుట పశులక్షణము. ఒక యింటి యజమానిని గుర్తింపక వాని యింట భుజించి, పరుండుట వంటిదే. మంచి చెడ్డ లేమి తటస్థించినను దానికి బాధ్యత వహించు నాతఁడు గృహ యజ

మానియే, ఆతనిని గుర్తించి, గౌరవించి, సకల విషయములలో నాతని తోడ్పాటుతో సుఖముగా జీవింపవచ్చును. భగవానుని కాదని వానియింటఁజేరి, భగవాను ననుమతిలేని రీతిగా బ్రతుకఁజూచుట సర్వదుఃఖములకుఁ గారణము. విశ్వాధ్యక్షు నాశ్రయించి జీవించుట సకల శుభప్రదము కాదా ?

365. రోగి వైద్యునొద్దకేగి, మందు ద్రమింగి, రోగ నివారణము చేసికొనవచ్చును. అట్లుగాక, రోగి, మిఠాయి దుకాణము నొద్దకేగి, లడ్డులు, జిలేబీలు కడుపునిండఁదిని, రోగము ముదిరి, శీఘ్రముగా మృత్యువు నోటఁబడఁడా ? అట్టివ్యక్తి పిచ్చివాఁడో, మూర్ఖుఁడో కాక మరేమగును? మన మందరమట్టి ఉన్మాదులము, మూర్ఖులముగా వర్తించుచు మనము బుద్ధిమంతులమని నమ్మి, మోసమునకు గురియై దుఃఖతప్తులమగుచున్నాము. మనకుఁగల దజ్ఞాన జాడ్యము, దానికి వైద్యుడు బ్రహ్మవేత్త; బ్రహ్మవేత్త చూపు జ్ఞానము దానికి మందు. దానితో జన్మ జాడ్య విముక్తియగును. మనము సత్యమెరిగిన సత్పురుషుల నాశ్రయించి, రోగ నివారణ చేసికొని సుఖించుట కర్తవ్యముకాదా?

366. మంచి రోజులెప్పుడు వచ్చును ? చిత్తశుద్ధితో భగవాను నారాధించుటతో మంచి దినము లారంభమగును. మానవుఁడు పరమేశ్వరు నర్చించుటారంభించిననాఁడు మొదలు, పరమేశ్వరుఁ డాతనిభక్తి క్రమాభ్యున్నతినంది, దృఢమగుటకు వలయు సకల సదుపాయములను కలుగఁజేసి రక్షించును.

చిత్తశుద్ధి, సుదృఢ సంకల్పములతో నీశ్వర సేవచేయు వారిని సర్వకాల సర్వావస్థలలో నిస్సంశయముగా భగవానుఁడు దయచూపి సర్వశుభ సౌఖ్యముల నిచ్చును. ఇది మెట్ట వేదాంతమని పలుకు వదరుబోతుల మాటలు తృణీకరించి, పైనఁ జెప్పిన సాధనచేసి ఫలితములను పరీక్షించు కొనుట యోగ్యుల లక్షణము.

367. ఏప్రాణియు శ్రమపడుట కిచ్ఛగింపదు; సుఖపడుటే కోరును. కాని శ్రమపడు వారందరు గత్యంతరము లేదని, నమ్మి, శ్రమ కలవాటు పడి, అశాంతి క్లేశములతోఁ గాలము గడపుచున్నారు. ఈశ్రమ నంగీకరించు నభ్యాసము సహజమై పోయినది. అందుచే వారికిది క్లేశమని తెలియుట లేదు! దుఃఖము దుఃఖమని తెలియక పోవుట విచిత్రము! విషమని తెలిసినచో దానినెవఁడు మ్రింగును? క్లేశము, శ్రమ, దుఃఖము లేని జీవితమున కవకాశమున్నదని తెలియుటతో నా క్లేశ దుఃఖాదుల పటుత్వము సడలును. వానిని దొలగించు కొను సాధనమైన పరమేశ్వర ధ్యాన జపాదిక సాధన మారంభించుటతో దుఃఖములోని కఱకు దనము సన్నగిల్లి, సాధన తీవ్రమైన కొలఁదియు, దాని పటుత్వము తగ్గి, సాధన విజయము నందుటతో నదృశ్యమగును.

368. మన గృహములలో జరుగవలసిన నిత్య కృత్యములు, అప్పుడప్పుడు చేయవలసిన వివాహాది శుభ కార్యములు, మనమే చేయు చుంటిమా? అది స్వప్న తుల్యమైన

అసత్యము. అన్నియు భగవానుఁడు స్వయముగా స్వహస్త ములతోఁ జేయుచున్నాఁడు. నాద్వితీయ పుత్రిక విజయలక్ష్మి వివాహ విషయములో నిట్లు శ్రీ కృష్ణప్రభువుతో మొఱ పెట్టితిని; "నాన్నగారూ! ఈ కార్యము శుభ ప్రదముగా జరిగించి నన్ను రక్షింప వలెను. మీరు పూనుకొన్నచో నమిత శోభాయమానముగా జరిగింపఁగలరు. నాకు మీరే దిక్కు. అనుగ్రహింపుఁడ"ని ప్రార్థించితిని. నేను కుర్చీలో నుండి కదలకుండ వివాహ మతి శోభాయమానముగా జరిగెను. జన, ధన, వస్తు వాహనాదిక సౌకర్యము, సర్వజన సంతుష్టి కరముగా జరిగెను. కన్నీటితో కృష్ణప్రభువు వైపు తిలకించితిని; కృష్ణప్రభు విట్లు స్పష్టముగా ఁబలికెను; "ఏమి! బాగా జరిగినదా? సంతృప్తి గాంచితివా? ఏమి కావలసిన నిటులే అడుగుము. మొగమోటపడకు. నన్ను మఱువకుము."

369. కన్యా ప్రదాన మహాభాగ్యము గృహస్థునకే లభించును. సాక్షాద్విష్ణుమూర్తి వరుఁడని నమ్మి పాదప్రక్షా ళనముచేసి సాలంకృత కన్యాదానము చేయుట జరుగును. పుత్రిక నిచ్చినవాఁడు విష్ణుమూర్తియే. తిరిగి విష్ణుమూర్తికే కన్యకనిచ్చి వివాహ మొనర్తుము. ఇందు సందియ మిసుమం తయు లేని భావముతో వివాహముచేయు గృహస్థు లెంత ధన్యులో! జననీ జనకులలో నిట్టి అచంచల విశ్వాసము న్నచో, నూతన వధూవరుల జీవితములు పావనములు, నిరా మయములునై, సకల శుభ సంపత్సమృద్ధములై, భగవ దను

గ్రహ పాత్రములై ప్రకాశించును. శ్రీమహావిష్ణువునకు పిల్ల నిచ్చి పెండ్లి చేసిన గృహస్థులకు శాశ్వతబ్రహ్మ లోకనివాసము, మోక్షమును భగవానుఁ డనుగ్రహించుటలో గష్టమే ముండును?

370. దారిద్ర్యము ననుభవించు వారు లోకములో నసంఖ్యాకులున్నారు. మానసిక విజ్ఞాన దరిద్రుల సంఖ్యయు నధికముగానున్నది. అన్నిటికంటె మించిన దారిద్ర్యము భగవంతు నారాధింప ఁగోర్కె లేకుండు దారిద్ర్యము. భౌతిక, మానసిక దారిద్ర్యముల కంటె నాధ్యాత్మిక దారిద్ర్యము (Spiritual poverty) భరింపరానిది. భౌతిక దారిద్ర్యము మనుజుల మనస్తత్త్వముపై నాధారపడి యుండును. లభించిన దానితో సంతృప్తి పొందువారు దరిద్రులుగారు. వారతి నిరాడంబరముగా జీవించి, లేనిదానికొఱకు మనస్సు నొప్పగింపరు, మిక్కుటమగు సంపదగలిగి, తృప్తిలేని దరిద్రుల దౌర్భాగ్యము హేయమైనది. ఆత్మజ్ఞాన ధనమే ముఖ్యమైనదని నమ్మి తపస్సాధనలందు నిమగ్నులైన వారికి నిజముగా భౌతిక దారిద్ర్యముండదు; వారికి భగవానుఁడే సర్వము లోపములేకుండ సమకూర్చును. స్వార్థపరులకు విజ్ఞాన హీనులకు, దుర్దమాహంకార గ్రస్తులకు భౌతిక దారిద్ర్యము నేత్రాంజనమై, క్రమముగా సత్యము నెఱిగించును.

371. భగవంతు నాశ్రయించి దివ్యానందమయ జీవితమును గడుపక, దిక్కులేని దరిద్రునివలె నహోరాత్రములు

దీనుఁడవై దుఃఖించెదవేల? సర్వలోకైక శరణ్యుఁడగు భగవానుఁడుండగా, ఆశ్రితులను సర్వదా అనంతకృపామూర్తియై రక్షించి అవ్యయ శాంతి సౌఖ్యముల నిచ్చు వాఁడుండఁగా, దన్నుఁ బిలిచి, అడుగు వాఁడెచ్చట నున్నాఁడని వెదకికొనుచు నెదురుచూచు పూజ్యతముఁడై యుండగా, మానవుఁడేల బరితాప మందవలెను? రక్షణోపాయము, రక్షకుఁడు నుండగా. అరక్షితునివలె విలపింపనేల? మృష్టాన్న భోజన ముండగా జస్తుండి ఆకలిబాధ పడనేల? కన్నులకు గంతలు కట్టుకొని చీకటి యని అరచెదవేలా?

372. "ఇప్పుడైనా నన్ను నమ్ముట మొదలిడి, భజించుట కారంభింపుము. నీ సర్వ సమస్యలు పరిష్కారమగును. క్రొత్త సమస్య లెవ్వియు గలుగకుండ జేయుదు"నని భగవాను నుపదేశమైయున్నది. ఈసమస్యలను భగవానుఁడే పెట్టి, మానవులను భక్తులనుజేయ సంకల్పించినాఁడు. భగవద్భక్తుఁడైన వానికేసమస్యలునుండవు; ఉన్నను బాధింపవు. సమస్యలు పైబడి బాధించుచున్నచో నాతఁడు భక్తుఁడు కాఁడని యర్థము. భక్తియనగా అభ్యాసనిష్ఠ. సంసారికన్నీ సమస్యలే; అభ్యాస బలముచే వానిని భగవానుని కర్పించి పరిష్కరించి, రక్షింపుమని ప్రార్థించుటే దీక్ష; ఈదీక్ష దిగ్విజయమగు వఱకు సాగించుటకు బూనుకొని, పరమేశ్వరు ననంత కృపామృత మెట్లు నీకు దోడ్పడునో దర్శింపుము.

373. భగవానుఁడు తన భక్తులను రక్షించుటలో వాగతీతమగు దయ, ఉత్సాహము, వేగము ప్రదర్శించును. కాని భక్తుఁడొక్క దినముననే పూర్ణ భక్తుఁడు కాఁజాలఁడు. భక్తియు నన్నిటివలెనే క్రమపరిణామ మందుటకుఁ గొంత కాలము పట్టును. అదియే భక్తి సాధన కాలము. ఈ సాధన కాలములో భక్తి సమగ్రముగానుండదు. భక్తుఁడు చేతులు జోడించి భగవత్పాదారవిందములు పట్టుట కారంభించుట తోడనే, భగవానుఁడు వాని భక్తి పరిణతినందుటకు వలయు సందర్భములు సృజించి తోడ్పడును. భక్తిసాధకునకుఁ గొన్ని వేళలందు భగవానుఁడు కార్య వైకల్యములు కలిగించును; అనారోగ్యావమానములు, కాంక్షించిన వానికి వ్యతిరేక ఫలితములు సమకూర్చి, హృదయమును పూర్తిగాఁ దనకిచ్చి వేయుమని ఆహ్వానించును. అట్టి పరీక్షా సమయములలో భక్తి సాధకుఁడు నిశ్చంచలముగా నిలిచి, తనలోని లోపములను సవరించి కొనుచు, భగవంతుని మఱువక, నిందింపక, యథా ప్రకారము భక్తిని నిలుపుకొనుట నేర్వవలెను. కాని భగవానుఁడు భక్తిసాధకున కపకారమెన్నఁడు జరుగనీయఁడని దృఢ విశ్వాసముతో భక్తుఁడుండవలెను.

374. ఏక్షణమం దేజీవి యెచట నెవరితోనుండి యెట్టి జీవితమును గడుపవలెనో అది పరమేశ్వర కార్యక్రమమై యున్నది. పరమేశ్వర సంకల్ప కార్యక్రమ స్వరూప స్వభావముల నామూలాగ్రముగ నెఱుగుట స్వల్పవిషయముకాదు.

భక్తులకు జ్ఞానులకు వారిభక్తి జ్ఞానపరిణామ దశల కనుగుణముగా నేకొంతయో తెలియుట కవకాశమున్నది. అనగా భక్తి జ్ఞాన తత్పరులై, పరమేశ్వరార్పిత సర్వస్వులై జీవించు ధన్యాత్ములకు బరమేశ్వర సంకల్పిత కార్యక్రమములో శాంతి సౌఖ్య జ్ఞానములు సమున్నతస్థాయి కలవై యుండును. అందుచే వారు నిరంతర తపశ్చర్యాలోలురై, అఖండ ధైర్యముతో భగవాను నెన్నడు విడువక, చెక్కుచెదరని దీక్ష గలిగి విజయమును సాధింతురు.

375. నాస్థితి గతులను నేనారాధించు భగవానునితో జెప్పుకొనవలెనా? నాజీవితమును శ్రీకృష్ణప్రభువు చేతిలోనుంచి, మరల జెప్పుకొనుట దేనికి? సర్వ ప్రపంచ వ్యాపారముల నడపు భగవానుడు నాకోర్కెల నెఱుగడా? నాకు గోర్కెల బుట్టించువాడు, సిద్ధింపజేయువాడు, భగవానుడే కదా. అన్నియు దెలిసిన వానికి జెప్పుటెందులకు? అందుచే శ్రీకృష్ణప్రభువు నెదుట నిలిచి ప్రణతుడగుటే చేయవలయు పని. కాని బిడ్డలు, తల్లిదండ్రులతో దమ వాంఛితములజెప్పుకొనుట తప్పుగాని తప్పు, చెప్పుకొనుటయు జెప్పుకొనకుండుటయు సమానమైనపు డేమి చేసినను తప్పులేదు. మన అజ్ఞతను జూచి, పరిహసించి, ప్రభువురక్షించుట, భక్తుడైనవాడు నిత్యము జూడవచ్చును.

376. విశ్వముయొక్క కీలకము భగవంతుడు. కీలక మెరిగి విశ్వములో జీవించు నాతడు బుద్ధిమంతుడు, వానికెట్టి

ప్రమాదములు నెన్నఁడును తటస్థింపవు. మన శరీరమునకుఁ గీలకము గుండెకాయ. అది కొట్టుకొనుట మానినచో శరీరము పడిపోవును. అటులే యీ ప్రపంచ హృదయము భగవానుఁడు. భగవాను నెఱిగి సక్రమాశ్రయము గాంచినచో విశ్వమంతయు సుఖ హేతువై వర్తించును. భగవానుని గుర్తింపక విశ్వములో సంచరించుట, గాఢాంధకారములో నుగారణ్య మధ్యమందు సంచరించుటే; సింహసర్ప వ్యాఘ్రాదులను మృత్యువు మీదఁబడి మ్రింగివేయును. అందుచే సృష్టి కేంద్ర కారణ శక్తియగు భగవానుని గుర్తించి తత్ప్రీతికరముగా బ్రతుక నేర్చుట, వివేకము, సుఖప్రదము; ప్రమాద రహితము.

377. జరుగుచున్నవి జరుగవలసినవి కావుననే జరుగుచున్నవి. జరుగవలసినవి కాకున్న నవి జరుగవు. అనగా జరుగుచున్న వీశ్వర సంకల్పము లేనిదే జరుగుట సంభవింపదు. భక్తుఁడీశ్వర సేవకుఁ డగుటచే, జరుగుచున్న, జరుగనున్న వానిచేఁ జకితుఁడు గానవసరము లేదు. ఏలన నేమిజరిగినను, భక్తులకెట్టి చికాకును గలుగని రీతినే భగవానుఁ డన్నివిషయముల జరిగించును. భక్తుల యెడ భగవానుని దయ కవధులు లేవు. అందుచే భక్తులు భయ మందవలసిన దేదియు జరుగకుండఁ జూచుటే దేవుని ప్రప్రథమ కార్యక్రమ సూత్రము. కావున నేమి జరుగునను బాధ భక్తుని కెన్నఁడుండ నవసరము లేదు.

378. మానవ జీవితమనగా, చిత్త సంక్షోభము నుదయింపఁజేయు లెక్కకు మించిన వైకల్యముల సంపుటి యని చెప్పవచ్చును. నేటికి పరిస్థితులన్నియు జక్కఁబడినవనుట కెవనికి నవకాశముండదు. అందుచే నే మానవుని బలుకరించి నను, స్థిమితము లేదని పలుకును. నిజముగా నందరకు గావ లసినది స్థిమితము, శాంతి, సుఖము. అదియెట్లు లభించునో తెలియక, క్షణికములైన వస్తు భోగములకై తహతహలాడు దురు. ఇహలోక వస్తు తత్త్వము నామూలాగ్రముగ బరిశీ లించి, తద్రహస్యమును గనిపెట్టిన మహర్షి పుంగవులు, సకల దుఃఖములనుండి విముక్తినిచ్చు భగవాను నర్చించి, తరింపుఁ డని మహోపదేశములను చేసియున్నారు. వారి మాటలువిని, నమ్మి సాధనచేసి, ధన్యులగుటే మానవుల కర్తవ్యము.

379. సుఖ మెచ్చట నున్నది? అన్ని విషయములు భగవానునికి విడిచిపెట్టి, హాయిగా గూర్చుండుట లోనే యున్నది. ఏవిషయమైనను మనపై బెట్టికొంటిమా, ఆక్ష ణమే దుర్దశారంభ కాలము; దాని కంతముండదు. కారణ మేమనఁగా నిజముగా మనకులేని బాధ్యతను, కర్తృత్వమును మనపై బెట్టుకొను నేరము చేయు చుండుటచే దానికి శిక్ష ననుభవింపక తప్పదు. ఎవనిసొత్తో నేను దొంగిలించినచో బట్టుకొని శిక్షింపరా? సర్వ జీవులబాధ్యతలు స్వహస్తమందు గల భగవానుని గుర్తింపక, నేను భక్తుఁడనని చెప్పుకొనుట వలని అసత్య దోషము, తత్ఫలితము ననుభవింపకతప్పదు.

380. దేవునియందు నమ్మక ముచ్ఛ్వాస నిశ్వాస ములతో నేకమైపోవలెను. నమ్మకమనగా నొకరు చెప్పిన మాటలో విశ్వాసము; అనగా సిద్ధపురుషుల వాక్యప్రమాణము నంగీకరించుట. కాని అట్టివిశ్వాసము సత్యదర్శనముగాదు. పరోక్షమగు నంగీకారము. అది ప్రత్యక్ష దర్శనముగా మారవలెను. విశ్వాసము పరోక్షమై యున్నంతకాలము, ఫలితమును పరోక్షమై యుండును. భోజనము లభించునని విశ్వాసముండ వచ్చునుగాని భుజింపనిదే కడుపునిండునా? భుజించుట జరిగినపుడు ప్రత్యక్షానుభవ మగును. దేవునియందు విశ్వాసము దేవుని ప్రత్యక్షముగా దర్శించునపుడే పూర్ణఫలిత మిచ్చును.

381. పరమేశ్వర సాక్షాత్కారమును సాధించుట మిక్కిలి సులభమైన విషయముగా మీరు వ్రాయుచున్నారే! అదిఅంత సులభమైనదని ఋజువుచేయుదురా? ఇం దసత్యమేమాత్రమును లేదు. మనకిచ్ఛ లేకుండుటవలన భగవత్సాక్షాత్కారసిద్ధి మనకు సాధ్యముకానిదివలె గోచరించును. సంసారము దుఃఖమయమని స్పష్టముగాఁ దెలిసినచో, దుఃఖవిరహితమగు సౌఖ్యము నిచ్చువాఁ డీశ్వరుఁడని బోధపడును. జగమంతయు నీశ్వరమయమై యుండగా, నీశ్వరుని వెదుక నవసరములేదు. కడుపునొప్పి బాధించుచున్నదని యెఱిగినచో, నదిపోవుటకు వలయు మాత్ర మ్రింగుటకు సంశయమెందుకు? కడుపునొప్పి సంసారదుఃఖము; మాత్రయే దేవుఁడు. దేవుని నమ్మి ఆరాధించుటే మాత్రమ్రింగుట – కడుపు నొప్పివలె

సంసారదుఃఖము తొలగుట, సౌఖ్యము లభించుటయే భగవ ద్దర్శనము. ఎంతచిన్న విషయమో! ఎంత తేలికైన మందో! చేసిచూడు.

382. సకల సమస్యలను సృష్టించు వాఁడు, పరిష్క రించువాఁడు పరమేశ్వరుఁడే. మానవ జీవితము దేవునిలీల, సృష్టిని జీవులను సృజించి, సమస్యలు కల్పించి, పరిష్కరించి తనక్రీడ నీశ్వరుఁడు సాగించు చున్నాఁడు కాని యిందొక రహస్యమున్నది. "ఈ నాటకములో మేము పాత్రధారులుగా వ్యవహరింపఁజాలము, మాకు భరింపరాని కష్టము కలుగు చున్నది. మాకీవృత్తి తప్పించి రక్షింపుమ"ని మొఱపెట్టుకొన్న వారిని నాటకములోని పాత్రధారిత్వమును దీసివేసి, ప్రేక్షక వర్గములో గూర్చుండఁ బెట్టును. భక్తితో దేవుని మహిమలను గుర్తించి, పూర్ణహృదయమిచ్చిన పూజ్యభక్తులకు ప్రేక్షక వర్గములో నున్నతాసనములనిచ్చి సంతసింపజేయు దయా సాగరుఁడు పరమేశ్వరుఁడు. అందుచే భక్తుని, జ్ఞానిని నెదు ర్కొను సమస్యలు సమస్యలేగావు. వారికిఁ బరిష్కారము లతో జోడించిన సమస్యలిచ్చి, భగవానుఁడు కృపజూపును.

383. ఎన్నివిధములుగా నాలోచించినను భగవానుని పాదపద్మములే యెదుట గోచరించి, "ఆశ్రయించి సుఖింపు" మను పిలుపే వినవచ్చుచున్నది. భగవత్పా దాశ్రయమే విశ్రాంతి, శాంతి, కాంతి, పుష్టి, ధైర్యము, బలము నానంద మును. అదిమాని కోటిపనులుచేసి, సుఖింప ప్రయత్నింపుము;

కాని గింజులాట, ఖేదము, అశాంతి, భయదుఃఖములు తప్పవు, చతుర్వేద వేదాంత పురాణశాస్త్ర బ్రహ్మర్షి వాక్యముల సారామృత మిదియే. ఇది చూపని విద్యలన్నియు గారడీ విద్యలే.

384. అశాంతి భయాందోళనాది రాక్షసబృందము నెడమకాలిక్రిందఁ ద్రొక్కి నలిపివేయు ధైర్యసాహసములఁ గలిగియుండుటయే మనకుఁ గావలిసినది. కాని లోకులందరు నారాక్షసుల పాదములక్రిందఁబడి నలిగిపోవుచున్నారు. ఎందుచేత? ఆరాక్షసులను జయించు సులభోపాయ మున్నదని వారెఱుఁగరు. చెప్పినను నమ్మరు; ఒకవేళ వినినమ్మినను, సాధనకుదిగరు. సర్వభూతములలో నెల్లవేళల నివసించుచు, "సుఖశాంతులివిగో! రండ"ని యాహ్వానించుచున్న భగవాను ననంత కారుణ్య మయాహ్వానమును విని తరించుటేమి కష్టమైనపని.

385. భగవాను నద్భుత సంకల్పములు లోకములో నెల్లవేళల, విచిత్రముగా నెరవేరుచున్న ప్రత్యక్షసాక్ష్యములు కుప్పతిప్పలుగా గోచరించుచుండుట దర్శించి భగవద్విలాస మహిమ కానందపాథోధి నోలలాడుచున్నాను. మనము జడములవలెనే, ప్రాణములుగల ఉపకరణమాత్రులమని తెలిసి, భగవానుడు సర్వకర్తయని బోధపడినచో లభించు నఖండానందశాంతి ధైర్యాభయములు వర్ణనాతీతములైనవి. అట్టి వ్యక్తి కాభగవానుఁడనంత కృపామృత పానముచే, లభించు

జ్ఞానము, భక్తి సమాధ్యవస్థనిచ్చి, త్రిగుణాతీత పదవిని ప్రసాదించును.

386. అనంతచిత్తశాంతి నిత్యమై వారాధకునకు దైవప్రసాదముగా లభించును. దేవుఁడు సర్వము నడపించుచున్నాఁడు; దేవుఁడు తప్పుచేయఁడు; తప్పు చేయువాఁడు దేవుఁ డెట్లగును? భక్తుఁడైనవాని కెట్టికీడు, బాధ, దుఃఖము సంభవించుట కవకాశములేని విధముగా విశ్వవ్యాపారమును భగవానుఁ డప్రయత్నముగా శాసించినపుడును. ఈచిత్తశాంతియను నమృత కాసారములోఁ గామక్రోధాది రాక్షసులు ఱాళ్లు, పుడకలు, చెత్త, అశుద్ధపదార్థములు విసరుటకు యత్నించు చుందురు. భక్తుని చిత్తామృత సరస్సున కెట్టి దోషము తటస్థింపకుండ, నెల్లవేళల ముక్కోటి దేవతలు, దిక్పాలకులు, బ్రహ్మవిష్ణు మహేశ్వరులు కాపుందురు. జయము భక్తునిదే!

387. భగవద్భక్తునికి, జ్ఞానికి - మాయాకల్పిత జగత్సంబంధ మెట్టిబాధలను, దోషములను కలిగింపఁ జాలవు. భక్తుఁడు సర్వత్ర చూచుచు, దేవుని పాదపద్మములను విడువని అఖండ దీక్షయను బ్రహ్మాస్త్రమును చేతఁబూని సంచరించును. జ్ఞాని, మాయావరణమును తుత్తునియ లొనర్చి తానే సాక్షాత్పరమాత్మయను సత్యసందర్శనము చేతను, శివుని త్రిశూలమును ధరించి అజేయుఁడై నిలచును. వారిద్దరకు విషమమృత మగును, నిప్పు మంచిగంధ మగును; దుఃఖ

మానందమగును. భక్తుఁడై సులభముగా జ్ఞానియగును. ఇద్దర కభేదము. ఈ రెంటిలో నేదోయొక ఆయుధము చేఁబూన కున్నచో మానవుఁడు దుఃఖమునుండి తప్పుకొనఁజాలఁడు.

388. రోగము, ముదిమి, మరణము శరీరమును వశ మొనర్చుకొనును; తమతమ స్వార్థములకై దేహబంధువులైన భార్యపుత్రాదులు-పెక్కురీతుల దేహపాటవమును దినివేయు దురు. కామకాంచన పదవీ కీర్తి కాంక్షలు-మానవుని దేహ మనోబుద్ధులను కొఱికివేయును. నూటికిఁ దొంబదిమంది జీవితమిది; సర్వక్లేశములను దొలగించి, పూర్ణశాంతి సౌఖ్య సమృద్ధినిచ్చు భగవానునిఁ దలపోయరు. ఏమివిచిత్రమో! మోసగాని నమ్మి సత్పురుషుని తృణీకరించుట; అమృత కలశ మెదుటనుండగా, విషపానముచేయుట; పతివ్రతయగుభార్యను విడచి, వెలయాలి పొత్తునాశించుట; మరియునిట్లు ప్రవర్తిం చుచుఁ దమ తెలివిని స్తోత్రము చేసికొనుట, అన్నియు విచిత్రములే!

389 సంయోగ వియోగములీ లోకములోని వారికిఁ దప్పవు. సంయోగము సుఖమును, వియోగము దుఃఖమును కలుగఁజేయును. అతి సన్నిహితులైన వారితోఁ గలసి చిర కాలము జీవించి, పరస్పర ప్రేమబంధములచేఁ గట్టుపడి యుండగా, వియోగము సంభవింపఁగా దుఃఖము నెవఁడాపఁ గలఁడు? కాని దుఃఖించి, వియోగము నాపఁగలఁడా? మఱియు దుఃఖముచే మానవులు నిర్వీర్యులగుదురు. దీని బారిపడకుండ నొక మార్గమున్నది. ఎన్నఁడు వియోగమును కలిగింపని

వాఁడున్నచో, వానితో బంధుత్వము దుఃఖ హేతువగుట కవకాశము లేదు. వియోగమున కవకాశము లేని రీతిగా మనలో నుండి. మనతో నేకమై భగవానుఁడున్నాఁడు. "హృదయస్థో జనార్దనః" అట్టి కాలత్రయాబాధ్యుఁడగు భగవానునితో బంధుత్వము పెట్టుకొని, శాశ్వతానందము నందవచ్చునే.

390. దుఃఖమునకు దావు లేదని, నిరూపించుశక్తి, పరమేశ్వరారాధనచే లభించు పరమేశ్వరుని కృపలోను, అంతయు బరబ్రహ్మమేయని నిరూపించు బ్రహ్మజ్ఞాన సిద్ధి లోను మాత్రమేయున్నది. ఇఁక వేరెచట దానికై వెదకినను దుఃఖము నినుమడింపఁ జేయునే కాని తొలగింపఁ జాలదు. పరమేశ్వర కృప యున్నచో దుఃఖ కారణములన్నిటిని దొల గించి, నిత్య శాంత్యానందములనిచ్చు పరిస్థితులనే కల్పింపఁ గలదు. బ్రహ్మజ్ఞానము దుఃఖ మసత్యమని నిరూపించును. కాని అజ్ఞానబద్ధులై లోకులందరు దుఃఖ కారణముల దొల గించుకొనుయత్నము నటుంచి, మితిమీరి పెంపు చేసికొను నెడతెగని కృషిలో నిమగ్నులైయున్నారు. నశించు ద్రవ్య సంపాదన కాంక్ష, అది నశించుటతో నేడ్పు, అది సుఖమిచ్చు నని దుఃఖమిచ్చు మోసము ప్రాణులను పీడించుచున్నవి.

391. భగవానుఁ డనంత శక్తి స్వరూపముగదా! సర్వ కల్యాణగుణ పరిపూర్ణుఁడుగదా! కల్యాణ గుణములలోఁ దన్నాశ్రయించిన భక్తుల కభయప్రదానమిచ్చి, ఆప్రకారము రక్షించు పరిపూర్ణతయు నొకటికదా! ఇఁక భగవద్భక్తునికి

గ దాపము, అశాంతి, అలజడి మున్నగు బాధలు కలుగవలసిన హేతువేమున్నది! కాని పూర్వ పాప సంస్కారము లొక వైపునను, భగవద్విశ్వాస సంస్కార మింకొక వైపునను పర స్పర మెదుర్కొని పోరాడును. భగవదాశ్రయ సంస్కారబల మమోఘశక్తి కలదగుటచే, గబాప సంస్కారముల దహన మొనర్చి, భక్తుని పరిరక్షించి సర్వ శుభములిచ్చును. సాధ కావస్థలో నీ పోరాటము, సిద్ధి పొందుటతో విజయము లభించును.

392. శ్రీకృష్ణప్రభువు వేణు వినోద మధురనాదముతో గబలికిన వాక్యములు నాకిట్లు వినుట జరిగెను; "నీవెన్ని విధ ముల గబరిశీలించినను, నీకు శాంతి, సుఖము, ముక్తి కావల యునన్నచో, నన్ను గదెలిసికొని నిశ్చల భక్తితో నన్నాశ్ర యించి, స్మరించుచుండు టొక్కటే మార్గము కాని వేరుగతి లేదని తెలిసికొనుటే క్షేమము. నన్నాశ్రయించు టొక్కటే పరమ గతియని ప్రవర్తించు వాని తెలివే నిజమైన తెలివి. తక్కిన వారెంత మేధావులైనను అల్పమతులే! నాభక్తుడే మహామేధావి చక్రవర్తి; నన్నాశ్రయించు వాడే మానవ శ్రేష్ఠుడు."

393. శ్రీరామ నామ సంతత సంకీర్తనమనగా, నగ్ని జ్వాలను చేతబట్టి, పాపములను దూది కొండలను దహన మొనర్చి, భస్మము నొనర్చు మహాయజ్ఞము; అంతియకాదు, పాపములన్నియు దగ్ధమగుటేకాక, భక్తుడు పవిత్రుడై,

భగవత్తుల్యుఁడై, భగవంతుని వలె సంకల్ప మాత్రమున నేది కావలసినను చేయఁగల సమర్థుఁడగును; తిరిగి యాతని కెన్నఁడు పాపమంటదు; ఏలన నాతఁడేది చేసినను భగవానుఁడు చేసినట్లే! శ్రీరామప్రభు స్మరణమనగా శ్రీరామ ప్రభువగుటే.

394. నేను కర్తనను నహంకార జాడ్యమెవ్వరికిని పట్టఁగూడదు; అనగా నేపనియుఁ జేయరాదనికాదు; అన్నియుఁ జేయుచు, "నాఽహమ్; నమమ" నేనుగాదు, దేవుఁడేయని నమ్మవలెను; "తస్య కర్తారమపిమామ్ విద్ధ్యకర్తారమవ్యయమ్" అని కృష్ణప్రభువే తన కర్తృత్వము నిజము కాదనెను. కర్మలు బంధనములు కారాదు; చేయుట, చేయకుండుట నొకటే కావలెను; ఈశ్వరుఁడే కర్తయని తెలియుటే దానికి మార్గము. ఇది భగవద్భక్తుఁడు నేర్చి చేయవలసిన సాధనము. జ్ఞానికి, పరమాత్మేతరమేలేదు. భక్తునికి సర్వమీశ్వర కర్తృకము. అందుచే భక్తునికి, జ్ఞానికి, పుణ్యపాపములు సుఖ దుఃఖములు, మున్నగు బాధించు ద్వంద్వములు లేవు. అంతయు సంపూర్ణానందమయము!

395. ప్రపంచ సార్వభౌములకు లభింపని అఖండైశ్వర్యము కావలెనా? అతిసులభ మార్గమున్నది. అది అందరకుఁ దెలిసినదేకాని, అందరు దుర్భరదారిద్ర్య దుఃఖమునే వరించుచున్నారు! సర్వసృష్టి కారకుఁడు, సర్వాధారభూతుఁడు, సర్వజ్ఞానానంద పరిపూర్ణుఁడు, అనంత కృపామృతసాగరుఁడు

నగు భగవానుఁ డంతట వ్యాపించి, మనహృదయ మందిర మున నివసించియుండి, సర్వసాక్షియై యుండగా, నట్టి భగ వాను నాశ్రయించుటయు, భజించుటయు వలన ఁగలుగు నఖండైశ్వర్యము నెవ్వఁడు తొలగింపలేఁడు; ఇహలోక సార్వభౌమత్వము చేతులు మారుచుండును.

396. సర్వము పరమాత్మ స్వరూపమే, మనము చూచునవన్నియుఁ బరమాత్మ లక్షణములే. మనమేది చూచి నను పరమేశ్వరునే చూచు చున్నామన్నమాట; మారుపేర్లు పెట్టి పిలుచుచున్నాము. చెట్టు, పుట్ట, సాగరము, సూర్యుడు, వాయువు, జలము,నిప్పు,మట్టి, మనుజులు,మృగములు, పక్షులు, కీటకపశులు,ఇవన్నియు దేవుఁడే! ఇవి దేవుని మారుపేర్లు, "ఈశా వాస్య మిదగ్ంసర్వం" ఉపనిషత్తు చెప్పుచున్నది. ద్వైతేతరము లేదు. నిత్యమీశ్వరునిఁ జూచుచుఁగాదని పొరపడుచున్నాము. దేవునిఁ జూచి కాదందుమే! అన్నియు దేవుఁడే యని చూచు సాధన చేయవలదా?

397. భగవానుఁడున్నాఁడు; సర్వత్ర, సర్వములో, సర్వమయుఁడై, యున్నాఁడు. నమ్మిన భక్తుల కింకరుఁడు; పరిమితిలేని దయాంభోనిధి. ఇఁక భయము, ఆందోళనము, బెంగ, తాపత్రయము, ఎందుకు? కాపాడునో? కాపాడఁడో యని సంశయమా? భక్తిలేని వైధవ్యలక్షణమే సంశయ రూపము దాల్చును. భగవానుఁడుండుట, వాని పాదపద్మము లాశ్రయించుట, అమోఘరక్షణము గాంచుట - పరమసత్య

నుండు — ఇందు దేనిని సంశయించినను మహాపాపము, సంశయము పాపపర్వతముల నవలీలగా దహనమొనర్చు నగ్నిజ్వాలయే భగవన్నామ సంకీర్తనము, అంతరంగిక నిరంతర సంకీర్తనాభ్యాసము కర్తవ్యము.

398. ఎప్పుడో మరణాత్పూర్వము భగవత్సాక్షాత్కారముగాంచి, ముక్తినందవలెనను నిర్ణయము మంచిదే కాని అందుఁ గొన్నిచిక్కులున్నవి. మరణ మేక్షణములోఁ దటస్థించునో తెలియదు. ఈలోపున ననగా నెప్పుడు? ఇది కాలహరణ హేతువు. అందుచే వెంటనే, యిప్పుడే భగవంతుని దర్శనభాగ్యము గాంచవలెనని దృఢదీక్షతో సాధన చేయవలెను. నాకిప్పుడే దర్శనమిచ్చి రక్షింపుమని పవిత్రహృదయముతోఁ బ్రార్థించినచో భగవానుఁ డిప్పుడే సాక్షాత్కరించునాయను సంశయమే సాక్షాత్కారమున కాటంకము, సంశయింపని ప్రార్థనకు సమాధానము సద్యః ఫలితమై లభించును.

399. మన మెక్కడికిఁ బోవుచున్నాము? శ్మశానభూమికి; మన మేపని చేయుచున్నాము? ఉద్యోగములు, వృత్తులు కోటి సాంసారిక సంబంధ కార్యక్రమములలో నిమగ్నులమై యెచటి కేగుచున్నను, నిరాఘాటముగా మన శ్మశానయాత్ర, ఆగకుండ జరుగుచునే యున్నది. పుట్టిన క్షణము మొదలు ప్రతిక్షణము శ్మశాన యాత్రయే. మనమందరము మన దేహములను దహన మొనర్చుటకుఁ బోవుచున్న జీవచ్ఛవములమే. కాని మనమందరము గర్హింపఁదగిన కాంక్షలను

బెట్టుకొని మనకుఁగల అల్పాయుర్దాయ కాలమును, మనయందే మనసు దయాలేశము లేనివారమై, వ్యర్థ మొనరించు కొనుచున్నాము. పైగా మనము గొప్పవారమని, స్తుత్యర్హులమని భ్రమించుచున్నారము. ఎంత వెఱ్ఱియో! దైవప్రార్థనతోఁ గలసిపోయి బ్రతుకు టారంభింప వలదా?

400. రోగకారణములను సరిగాఁ గనిపెట్టి చెప్పఁగల వైద్యుఁడు సగమురోగమును కుదిర్చినట్లే; ఏలన సరియైన రోగ కారణమునకు సరియైనమందు నీయవచ్చును. సంసార రోగ మట్టిదే. మనమే స్థితిలో నుంటిమో యెఱుఁగని అజ్ఞానమను చీకటిలోఁ బ్రదుకుచున్నాము. ఏక్షణములో మృత్యువుపైఁ బడునో, రోగములు బాధించునో, గణింపఁజాలని యితర తాపములు వేధించునో, యెఱుఁగని దారుణ దురవస్థలో నుండి, పెండ్లి. పిల్లలు, ధనము, గృహము, కీర్తి మున్నగునవి కావలెనను కోర్కెలతోఁ గాలము నంతను వ్యయించుచున్నాము. ఎప్పుడో మంచిపనులు చేయవలెను, జ్ఞానము నార్జింపవలెనని తలచుటేకాని, ప్రయత్నముచేయము, మన దుస్థితి దెలిసి, "ఉత్తిష్ఠత, జాగ్రత," యను నుపనిషత్సింహ నాదమును విని అనుసరింప వలెను.

40: సృష్టి, అందలి. సర్వజీవులు, జడములు నన్నియు భగవానుని దివ్యహస్తములలో నున్నవి. సృష్టి, అందలి సర్వమాతని కాటవస్తువులు, వినోదార్థము కల్పించెను. ఆత్మ సమర్పణము చేసికొమ్మని బోధింతురు. ఆత్మ సమర్పణ

ప్రశ్నయే లేదు. ఆయనచేతిలోఁ గీలుబొమ్మలమై యుండి, ఆత్మార్పణము చేసికొంటిమని గొప్పగాఁ జెప్పికొందుము, అది అసత్యము. ఆయనచేతిలోనే యుండి, సమర్పణ మేమిటి? ఈ సంగతి అనగా, భగవానుని హస్తములలోనే యుండి, ఆయన సంకల్ప ప్రభావముచేఁ కీలుబొమ్మలవలె వర్తించు చున్నామని తెలియుటే ఆత్మార్పణము.

402. సర్వమునాన్నగారే! నేనులేను; నేనున్నానను భ్రాంతిని నాన్నగారే కల్పించిరి. ఏలకల్పించినారను ప్రశ్నకు ఁదావులేదు. అందుచే నది నాన్నగారి విలాసమనిరి. అందుచే నేమిచేసినా, ఏమిచూచినా, సర్వము నాన్నగారి, మనకు బోధపడని,విలాసమని గ్రహించి, జీవితము గడుపుచో భ్రాంతిని నాన్నగారే తొలగించి, నేను నాన్నగారు నొకటేయని తెలియ ఁజేయును. దేవుఁడను నాన్నగారు పెట్టిన యీభ్రాంతి నింకె వరును తీసివేయఁజాలరు. నాన్నగారొక్కరే తీసివేయఁగలరు. అందుచే నాన్నగారైన పరమేశ్వరుఁడే సర్వమని నమ్మి వర్తించుటే మార్గము. "వాసుదేవస్సర్వమి"తి యనిగీత.

403. ఆపదలు, దుఃఖకారణము లెన్నడు కలుగకుండఁ జేయుటేకాక, సర్వవేళల నానందశాంతి సౌఖ్యముల సమకూ ర్పఁగల వానినే ఆశ్రయించుటకంటె వివేకమేముండును? అట్టి వాఁడెవరు? జగన్నాథుఁడగు పరమేశ్వరుఁడే. అందుచే భగవ దాశ్రయమే, సర్వవిధముల, సర్వవేళల సర్వోత్తమమైన ఆశ్రయము. భగవానుఁడు మనకు ఁదోడునీడమై, "నన్ను నమ్మి

సుఖింపు(డను" వాక్యములే పరమ ప్రమాణములని పలికి యున్నాఁడు. ఇంతకంటె సులభమైన తరణోపాయముండునా?

404. "యత్రయోగీశ్వరః కృష్ణోయత్రపార్థోధనుర్ధరః తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ" గీతకు (దుది వాక్యము. కృష్ణుడు, అర్జునుఁడు నున్నచోట జయము నైశ్వర్యము నుండి తీరునని భావము. కృష్ణార్జునులనగా దేవుఁడు, భక్తుఁడు. భక్తుఁడున్నచోట దేవుఁడు, దేవుఁ డున్నచోట భక్తుఁడు నుందురు. దేవుఁడున్నచోట జయము నైశ్వర్యము, సకల శుభములు నుండుననుటలో నాశ్చర్య మేమున్నది? దేవుఁడే జయము సుఖము, నైశ్వర్యము నన్నియును, దేవు నాశ్రయించిన భక్తుని కాలక్షణములు సంక్రమించును. ఏలన దేవునికి భక్తునికి భేదములేదు.

405. మాటలో మృదుత్వము, మాధుర్యము, సత్య నిష్ఠ, చేతలలో మర్యాద నతిక్రమింపని యుక్తత్వము, ఒరుల కెట్టి కష్టమును గలిగింపని యుక్తి, ధర్మదీక్ష; పరమేశ్వర ప్రీతి కర ప్రవర్తనము, కాలుష్య లేశమునకుఁ దావులేని పరిశుద్ధ హృదయము, రాగద్వేష రహితమై, నిశ్చల శాంతిదీప్తిగల చిత్తము సర్వకాల సర్వావస్థలలో భగవాను నాశ్రయించి, భజించు నిశ్చల మానసము, భగవానుఁ డిచ్చిన దానితో సంతుష్టి, శక్తి కనుగుణమైన పరోపకార ప్రవణత్వము, సత్పు రుషుల సంసర్గమునే కోరు సద్బుద్ధి, పూర్వానేక జన్మములలోఁ జేసిన పుణ్యరాశి ఫలితమే.

406. కామమనగా, స్త్రీ పురుషుల సంయోగకామము, సర్వేశ్వరునితో సంయోగ కామము, మూలములో నొకటే. కామకారణము సుఖాపేక్ష; ఆనందాభిలాష, స్త్రీ పురుషులు పరస్పరము కామించుట, సాంగత్యము వలన సౌఖ్యము లభించుటయు నిజమే, ఆత్మకాముఁడు లేక పరమేశ్వర సాంగత్యమును గోరుభక్తుఁడు ఆనందమును గోరియే భజించు చున్నాఁడు. దేవుఁడానంద స్వరూపియే. ఎట్టియానందము? సార్వకాలికము, సంపూర్ణము, నైన యానందము. కాని అది లభించువరకు నెట్టి యానందలేశము లేకుండ జీవించుట అసాధ్యమని ఉపనిషత్తే చెప్పుచున్నది. "కోఽహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో నస్యాత్" ప్రతివ్యక్తి హృదయాకాశములో నీ యానందము లేకున్నచో, నెవఁడు జీవించును.?" లోకములోఁ గాంతాలింగ నానందముతోఁ దుల్యమైన దింకొకటిలేదు. కాని వచ్చినచిక్కు కాంతాలింగన సౌఖ్యము దుఃఖ సమ్మిశ్రితము, క్షణికము, బహుసమస్యాపూరితము. భగవత్కృప వలన, లేక పరమాత్మ జ్ఞానము వలన లభించు నానందము నిర్దుష్టము, శాశ్వతము,పరిపూర్ణము.

407. లోకములోని సకల విషయములు మానవుల మనశ్శాంతిని కూకటివేళ్ళతోఁ బెల్లగించి వేయుటకే కల్పింపఁ బడినవిగాఁ దోఁచును. ఇంటిగొడవలు, ఒంటి పరిస్థితులు, బంధుమిత్రుల వ్యవహారములు, సాంఘిక కల్లోలములు, వివిధ దేశములందలి అలజడులు మానవ మనశ్శాంతికి శత్రులై

కఠోర దీక్షతోఁ బలిచేయునవిగాఁ గల్పితములైనవి. నానాత్వము నాటకము, హుళక్కి; దృశ్యాదృశ్యత్వములు గలిగి అశాంతి హేతువగుచున్నది, ఇదంతయు నద్వితీయము, నేకమునైన పరమాత్మతో నిండి యున్నదని ఆంతరంగిక కాత్మదృష్టితోఁ జూచినవానికే శాంతియు సౌఖ్యము నున్నవి, ఇతరులకు లేవని ఉపనిషత్తు వక్కాణించు చున్నది. అందుచే శాంతిని గోరు మానవుఁడు బాహ్యరూపములఁ జూచి భ్రాంతి వశుఁడుగాక, ఆంతరంగిక దృష్టితో నాత్మావలోక నాభ్యాసముచేసి, శాంతిని గాంచవచ్చును.

408. "ప్రకృతింయాంతి భూతాని నిగ్రహఃకింకరిష్యతి" యని గీతా వచనము. మానవ ప్రకృతి బాహ్య ప్రకృతిలో భాగము. అందుచే మానవుఁడు ప్రకృతి దృశ్యములచే నాకర్షింపఁబడి, వర్తించు చుండఁగా నిగ్రహించు టెవనితర మగునని భావము. ప్రకృతి వస్తురూపములయెడ మోహ వశులగు వారిలో విద్వాంసులు, విజ్ఞానధనులు కూడఁ జేరియున్నారు. సామాన్యులమాట లెక్కయేమున్నది. ఇంద్రియ నిగ్రహ మసాధ్యమని కృష్ణపరమాత్మయే ప్రకటించి యున్నాఁడు. కాని ఒక రహస్యమున్నది. ప్రకృతి యెవరు? భగవానుని బాహ్యరూపమే. ప్రకృతిలోని వస్తువులు ప్రాణుల నాకర్షించి బంధించు శక్తి నిచ్చినవాఁడు భగవానుఁడే, భగవాను నాశ్రయించి, ప్రకృతిని దర్శించినచోఁ, ప్రకృతి ప్రాణుల బంధింపఁజాలదు. ప్రకృతి, ప్రకృతి మూలమైన దేవుని జూపవలెను, అట్టిచూపును పెంపొందించు కొనుటే తపస్సు.

409. అన్ని వ్యవహారముల నత్యంత సూక్ష్మముగా, క్షణమాత్ర కాలములోఁ దనభక్తుని కనుకూలముగా సవరించి చక్కబెట్టఁగల సర్వశక్తి సంపన్నుఁడే భగవానుఁడగు రాముఁడు లేక కృష్ణుఁడు లేక శివుఁడు. ఏ చిన్న, లేక పెద్ద వ్యవహార మెదురు కానున్నను. "రామప్రభూ! అదిసీవే చూడవలెను. నేనేమి చేయఁగలను. అంతా నీదే భారముసుమీ" యని పరిశుద్ధ హృదయముతోఁ, బరిపూర్ణ విశ్వాసము మేళవించి, భగవానునితోఁజెప్పి, సాన్నిధ్యముననే యుండి వినుచున్న భగవాను నద్భుత పరిష్కారమునకై, భక్తివినయములతో వేచియుండుట సాధన చేయవలయును. ఈ సాధనలో నఖండ శాంతిసౌఖ్యము లున్నవి; సంపూర్ణ కార్యసిద్ధి; శాంతి ఆనంద ములున్నవి. చేసిచూడు!

410. సకల జీవులు చేయు సకలకార్యములు - ఆనంద మను వస్తువును సంపాదించుటకే ఉద్దేశింపఁబడినవి. బ్రహ్మ పదార్థమనగా భగవానుఁడే, ఆనంద నిలయము. అన్ని వృత్తు లలో నున్నవారు సౌఖ్యము లేక ఆనందము తమకు లభించు నను నాశతోఁ బనులు చేయుచున్నారు. గుప్పెడు బియ్యము బిచ్చగానికి సంతోష మిచ్చును. పనిచేసి అలసినవాని కొక కునుకు సుఖమునిచ్చును; ఉద్యోగి కున్నతస్థాయి వచ్చిన సంతుష్టియగును; నీవు వివేకివనిన మూర్ఖుఁడును సంతసించును. భార్యాపుత్రుల ఆలింగన మట్టిదే కాని యివన్నియు క్షణిక సంతోషమునే యిచ్చును; మరలరాని, లేనిసుఖమునుగూర్చి

దుఃఖము, మనమల్పుల మగుటకుఁగారణ మల్ప సంతుష్టుల మగుటయే. ఉపనిషత్తులు చెప్పునదేమన, మనము స్థిరపూర్ణ సౌఖ్యసంతోషములకై యత్నింపవలెననియే. ఎన్నడుచెడని, దుఃఖకలుషితముకాని ఆనందమును మనము కోరవలెను. అది సత్యములో, ఆత్మలో, దేవునిలో, ఁబరమాత్మలో నున్నది. మఱెచ్చటను దొరకదు.

411. పనసపండు పరబ్రహ్మము; దానిలో జీవుల నిమిత్తము తియ్యటి తొనలుపెట్టి, వానిని క్రిమికీటకాదుల బారి నుండి రక్షించు నిమిత్తము పైన ముళ్లతోఁగూడిన పెచ్చులు, లోపల ప్రతితొన చుట్టును పీచుకాడలతో బిగింపు, వంశోద్ధరణకై తొనలలో గింజలు, మరల గింజలను ప్రత్యేకముగా ఁగాపాడుటకై దానికొక చొక్కావంటి కూసము తొడిగి, ఎంత అద్భుతరక్షణ మేర్పాటు చేయఁబడెనో! పరమేశ్వరుని హస్తనైపుణ్యము ప్రత్యక్షము. ఇదేవిధముగా నన్నిటిని పరికించి, దేవుని హస్తలాఘవమును గమనించవలెను. పనస పండు భగవానుని సంకల్పశక్తి ప్రదర్శనము. అన్నియునంతే.

412. ప్రకృతి మానవులను మోక్షమార్గించు కృషి చేసి, తరింపుమని బోధించుచున్నది. అది దేవుని బాహ్య స్వరూపము; మాయాకల్పితము. ప్రకృతిని దిలకించి, దాని అసలు రూపమగు పరమాత్మను దెలిసికొనవలెను. ఇదియే ప్రకృతికాంత పిలుపు. ప్రకృతి వికారములకు లోనగునది. మాయా కల్పితమగుటచే నదృశ్యమగు లక్షణము కలది.

కొంతకాలముండి, అదృశ్యమగుటజూచి, అజ్ఞానియగు మానవుఁడు దుఃఖించును. దుఃఖమును జయించుటకు ప్రకృతి వెనుకనున్న భగవానునిసేవించి, దర్శించుటే. అసలు ప్రకృతి భగవానుఁడే. ఇది విశ్వరహస్యము.

4 3. మనుష్య దేహముల ధరించువారికి స్త్రీపురుష రూపములఁబెట్టి, పశుపక్ష్యాదులందు, సస్యాదులందువలెనే, సంతతి బీజముల వారిలోఁగల్పించి, సృష్టి కార్యక్రమమును భగవానుఁడమోఘ ప్రజ్ఞతో నడపుచున్నాఁడు. పశుపక్ష్యాదులకు, వృక్షలత సస్యాదులకు దమ్ముఁ కల్పించిన దివ్యపరమాత్మశక్తి పరిశీలన భావములు లేవు. మనుజులకు మాత్రమే, సంతతి బీజములతోఁబాటు, తమ్ముఁకల్పించిన పరమేశ్వరు నెఱిగి తరించు విజ్ఞాన బీజములనుగూడ ఁగల్పించెను. కావున సర్వప్రాణులలో మనుజులే భగవంతు నెరుగుటకు, జన్మజరామృత్యుదుఃఖములు లేకుండు మోక్షపదవి నార్జించుకొనుటకు వీలగు నుచ్ఛస్థితిలోనున్నారు. మనుజుని పై మెట్టే భగవానుఁడు; అనగా దేవుని క్రిందిమెట్టే మనుజుఁడగుట, మహాభాగ్యము. ఇట్టి భాగ్యమును దుర్వినియోగమొనర్చు కొనుట దుస్సహమైన ప్రారబ్ధము.

4.4. శరీరముతోడి సాంగత్యము చాలకష్టములతోఁగూడినది. శరీరమే నేనని భావించుటకంటె దురవస్థ మరొకటిలేదు. ఏలన శరీరముపై నఖండమమకార మేర్పడి, శరీరమునకుఁదటస్థించు సకల దోషములు తనవేయని భ్రమించి,

మితిలేని దుఃఖము ననుభవించుచుండవలెను. ఇఁక శరీర పోషణము క్లిష్టమైనది. దానికిఁదగిన సపర్య, ఆహారాదికము, ఆరోగ్యము వేయికన్నులతోఁజూడవలెను. జిహ్వాచాపల్యము, మానసికవాంఛాదాస్యము, రోగాదిక బాధలు, కోర్కెలు - శరీరము మనదాస్యమును గోరును. తుదకు మృత్యువశమై బూడిదలోఁగలిసిపోవును. అందుచే శరీరముతోడి సాంగత్యము, భగవానునితో సాంగత్యమునకై వినియోగించికొని తరింపవలెను.

415. వైదికకర్మకాండ చిత్తశుద్ధిసాధనము. యజ్ఞయాగములు, అన్నవస్త్ర భూగోహిరణ్యదానాది సత్కార్మానుష్ఠానము, పుణ్యలోకములను, మంచిజన్మములను కలుగఁజేయును. జన్మవిచ్ఛేదమొనర్చు ముక్తినీయఁజాలవు. చిత్తశుద్ధి నార్జించి, భగవద్దర్శనానుగ్రహసిద్ధికై, తపోధ్యానాదికము చేసినఁగాని మోక్షప్రాప్తిలేదు. కావున కర్మకాండ జ్ఞానసాధనకవసరమగు చిత్తశుద్ధి నార్జించుట కుద్దేశింపఁబడెను. అనగా కర్మలుచేయుట, కర్మలన్నియు మానివేయుట కొఱకే. కర్మచేసి, కర్మాతీతమగు పరమాత్మ జ్ఞానమార్జించుట ముఖ్య కర్తవ్యము. అట్లుగాక కర్మనేపట్టుకొని కూర్చుండువాఁడు తానుచేయు కర్మకర్థమునెఱుఁగని అజ్ఞుఁడే.

416. 'రక్షణ' పదమునకర్థము నూహించినచో, భగవానుని కొక్కనికే ఆపదమన్వయించును. రక్షణము దేనినుండి? జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాదులనుండి రక్షణమునిచ్చు

శక్తియేకాక, అనంతశాంతి సౌఖ్యములనిచ్చు సామర్థ్యము చూపునదే రక్షణశక్తి. అట్టి రక్షణశక్తి దేవునికొక్కనికే గలదు. నీకు నిజమైన రక్షణము కావలెనా? భగవంతునినమ్మి ధ్యానజపాదికములచే నాతని నిరంతర రక్షణమునందుటే మానవుని ప్రధాన కార్యక్రమమై యుండవలెను.

417. ఏమి యెవరితో నెంతసేపు మాటాడవలెను? ఎచట నెంతసేపు కూర్చుండుట, పరుండుట, నడచుట, తినుట, త్రాగుట, వ్రాయుట, చదువుట మున్నగు సర్వకర్మలు, దేవుఁడు చేయిపట్టి, అన్ని జీవులచేతను చేయించుచుండగా, నేను చేయుచున్నా నను నహంభావమును పెట్టుకొనుట భ్రాంతి కాక సత్యమెట్లగును? సూర్యుఁడుదయించుట, గాలివీచుట, పక్షులు కూయుట, చీమలు ప్రాకుట, పువ్వులు పూయుట మున్నగున వన్నియు నీశ్వరుని తిరుగులేని శాసనము వలని భయము చేతనే జరుగుచున్నవి. ఇది ఉపనిషద్వాక్యమే. భగవానుఁడు చండశాసనుఁడు. ఈశ్వరశాసనము నెదుట భయముచే వణకుచు, పంచభూతములు, దేవతలు, గ్రహనక్షత్రాదులు, పనిచేయుచున్నవి. ఇఁక, 'నేను', 'వారు', 'వీరు' చేయుట దారుణాసత్యము, లోకమంతయు నీశ్వరలీల; ప్రకృతి భగవానుని 'గారడీ'; ఇది గుర్తించుటే భక్తి.

418. "నేను గొన్ని భావములు గలిగి కృష్ణప్రభూ! నీతో వానినిగూర్చి చెప్పికొనుచుందును. వానిని నీవనుగ్రహించుట వలన నాకు క్షేమమో, నష్టమోనాకుఁ దెలియదు.

ఆసంగతి నీకంటెఁ దెలిసిన వారెవరు? నిన్నాశ్రయించినందుకు నాక్షేమ సంరక్షణ బాధ్యతనీపైనున్నదిగదా. నేను నిన్నాశ్రయించిన కారణమున, నేనేమడిగినా లేదనకుండ నీవిచ్చుటకు సమర్థుఁడవు. వానిలోనేవైన దోషములున్నచో, వానిని దోషరహితములు చేయఁగలవు, నేనడుగుట నీవు లేదనుట జరుగరాదుకదా! కాని నాకు దోషము పాపము, దుఃఖము కలిగించుట నీకిష్టమగునా? కావున నేమడిగిన నిచ్చి, నాక్షేమ పరిపూర్ణతను కాపాడుము. నాతర్కమందలి దోషమును తొలిగించి, నన్నురక్షింపుము"ని ప్రార్థింపవలెను.

419. మానవజీవితము చాల క్లిష్టము, క్లేశకరము నైనది. ఆయుర్దాయము సంశయాత్మకమైనది. సంసార తాపములు చాల కాలమును, మ్రింగివేయును. దేహాభిమాన కాంక్షలు, పెక్కువిధముల బలమును దినివేయును. నిద్ర, రోగము, అవమానము ప్రబల శత్రువులై బాధించును. పరమేశ్వరు నారాధించి తరించు శక్తి వేలకొలదిమందిలో నేకొలదిమందికో సాధ్యమగునని కృష్ణప్రభువే గీతలోఁజెప్పియున్నాఁడు. ఇఁకఁదరణోపాయమేది? మనుజులు పుట్టుచు, గిట్టుచు తుదిలేని సంసారయాత్ర సాగించుచు, దుఃఖాగ్ని తప్తులై జీవించుచున్నారు. తప్పించుకొను మార్గము లేదా? సజ్జనసాంగత్యముచే భగవానుని నమ్మి, ఆరాధించుట కారంభించుటయు, భగవానుఁడనుకూల పరిస్థితుల (గల్పించి, మార్గము సుగమముచేయుటయు నేకకాలమున జరుగును.

నిర్భయముగా నీశ్వరుని సేవించి, దుఃఖనిర్మూలనము చేసి కొనవచ్చును.

420. దేహములో నేరూపమున నేమాత్రపు బాధ వచ్చినను మనస్సుచెడి, విషాదము, దుఃఖముకలుగును. ఒక వేళ దేహము సక్రమముగా నడచుచున్నను మనస్సులో రాగ ద్వేషాదికము, కామక్రోధాదికము జేరినచో, అశాంతి క్లేశ ములు కలుగును. ఇట్టి దేహ మానసములను నమ్మి వాని ద్వారమున సుఖమునపేక్షించుటకంటె నవివేకమేముండును? భగవద్భక్తియను నగ్నిలో వానిననగా శరీరమానస కల్మష ములను దహనమొనర్చి, పరిశుద్ధతగాంచినచో, నట్టి చిత్త ములో దైవకృప ప్రవేశించి, శాంత్యానందములనిచ్చును. దైవప్రార్థనమే దేహమనశ్శుద్ధికిఁగారణములు, మనశ్శుద్ధియే శాంతిసౌఖ్యకారణము.

421. అజ్ఞానము మనదుఃఖములన్నిటికిఁగారణము. అజ్ఞానమనఁగా నిత్యమైనదేదో, అనిత్యమైనదేదో, సుస్థిరశాంతి సౌఖ్యములనిచ్చునదేదో, క్షణికానందమును సుస్థిరాశాంతి దుఃఖములనిచ్చునదేదో తెలియకుండుటే, పరమేశ్వరుఁడు లేక పరమాత్మయే నిర్వికార శాంత్యానంద నిలయము. దేహ మనోబుద్ధీంద్రియములచే మన మనుభవింపఁజూచు కాంతా కనక సౌఖ్యములు, క్షణికములు, చెడునవి యగుటచే దుఃఖ హేతువులు. క్షణికములై మోసగించు లక్షణములు గల

వానిని తృణీకరించి, సుస్థిరశాంతి సౌఖ్యములనిచ్చు, పరమాత్మానుసంధాన సాధనము నతివేగముగా చేపట్టుట కర్తవ్యము.

422. ఇహలోకములో జీవితము బాగుగనే ఉన్నదనుకొను వారు మందబుద్ధులని దయచూపవలెనే కాని నిందించి ప్రయోజనములేదు. కొన్ని కష్టములున్నను సుఖముగనే యున్నదనుకొనువారిన్నిమందబుద్ధులలోఁజేర్పవచ్చును జన్మమృత్యుజరావ్యాధి దోషములు దుర్భర దుఃఖహేతువులని గుర్తించినవారికే మన ముపదేశము చేయవచ్చును. జననమరణములు ప్రబల దుఃఖములు; చర్వితచర్వణముగా వానిననుభవించుటకు దలొగ్గుట తుదిలేని దుఃఖము. దుఃఖములేనివి రెండే కలవు. నిరంతర భగవదారాధనచే మహాభక్తులైనవారితో సహవాసము; ఆత్మ, పరమాత్మల లక్షణముల నెఱిగించు జ్ఞానము. భగవత్కృపనార్జించి దుఃఖరాహిత్యమును గాంచుట; బ్రహ్మజ్ఞాన సిద్ధిచే నిత్యానందమును సాధించుట యీప్రక్రియలు.

423. నీచత్వమున కవధులులేవు. రజస్తమోగుణములు కొందరు వ్యక్తులలో మితిమీరి విహరించుటచే నట్టి నీచులు, నీతినియమములను, ధర్మసూత్రముల నన్నిటిని దమ దురాలోచనలకు, దుష్టచేష్టలకు బలియిచ్చుటకెన్నడు శంకింపరు. అట్టి నీచులకు హితోపదేశములు గాని, సత్సహవాసములుగాని రుచింపవు. పందులదృష్టి పీతికుప్పలపై నుండు

రీతిగనే, వారిదృష్టి, పరకాంతా పరధనాపహారణైక కార్య క్రమములో నిమగ్నములై యుండును. అట్టి నీచులకుఁ దలి దండ్రులు, సోదరులు, సత్పురుషులు తృణీకార యోగ్యు లగుటచే వారిపాపములు వరదలలోనున్న నసులవలెఁ బెల్లు బికి ప్రవహించును. కఠిన శిక్షాస్మృతి శాసనములే వారి నదుపులోఁ బెట్టగలదు.

424. కొన్ని గ్రంథములు చదివి, కొన్ని పూజలుచేసి, కొన్ని పుణ్యక్షేత్రములు దర్శించి, కొందరు భగవానునిగూర్చి తమకుఁ దెలియునని భావింతురు. భగవానునిగూర్చి సంపూర్ణ ముగా భగవానున కొక్కనికే తెలియునని గీతలో భగవాను డే పలికియున్నాఁడు. తెలిసినట్లుకనపడి, యేమియుఁ దెలియ నిదే భగవన్మహిమ; దానికికారణము భగవంతుఁ డనంతుఁడు; భగవంతుని ప్రజ్ఞాసామర్థ్యము లనంతములైనవి. గణింపరాని సంఖ్యలో, లోకములను, జీవరాసులను సృజించి, గణింపరాని పద్ధతులలో నడపు భగవన్మహిమ మానవబుద్ధి కతీతమైనది. ఆయన లోకములను, జీవులను నడపుకొన్ని ప్రక్రియలు పర స్పర విరుద్ధములుగా గోచరించును; కాని భగవానుఁడు పరి పూర్ణ సామరస్యనిధి కావునఁ దర్కము నటుంచి, భక్తితో నమ్మి, నమస్కరించి, ఆరాధించుటే కర్తవ్యము.

425. భగవద్భక్తుఁడు కాగోరు సాధకునకు, లోకమే కాక, భగవంతుఁడును గొంతవ్యతిరేకతను జూపుదురు. లోకులు కామ కాంచన బద్ధులగుటచే భక్తిసాధనలకు వ్యతిరేకు లగు

దురు. భక్తుఁడును దమవలెఁ దాపత్రయాధీనుఁడై యుండక, దేవుఁడనియు ధర్మమనియు నేల ప్రసంగింపవలెనని వారికీర్ష్య కలుగును. భగవానుఁడు నిజముగా వ్యతిరేకికాఁడు కాని, వ్యతిరేకివలె నటించుట కాయనకృపయే కారణము. తనవైపు ముఖము త్రిప్పి, తనకు భక్తుఁడగుట భగవానుఁ డానందించు విషయము. కాని వాఁడు పూర్ణభక్తుఁడగుటకు, సాధనకాలములోఁ దోడ్పడును; కొన్నిపరీక్షలకు గురిచేసి, సాధకుల భక్తి పరిపక్వమగుటకు భగవానుఁడు పూనుకొనును.

426. శ్రీరామప్రభువు రామాయణమందును, శ్రీకృష్ణప్రభువు భగద్గీతలోను, పాపులు తమదోషములకు క్షమాభిక్ష వేడి, రక్షింపుమని శరణు పొందినచో క్షమించి రక్షింతుమని అమోఘ వాగ్దానములను జేసియుండిరి, కాని మనము భగవంతుని వాగ్దానమునకు సరియగు నర్థమును దెలిసికొనవలెను. భగవంతుని వాక్యము తిరుగులేనిది. తన వాగ్దాన పరిపాలనమున కవసరమగుచో నూతన సృష్టిచేసియైన వాగ్దానమును చెల్లించుదయ, సామర్థ్యమును గలవాఁడు, భగవానునకిఁ దానిచ్చిన వాగ్దానమును జెల్లించుట కెట్టి కష్టమును లేదు. అందుచే నెంత పాపాత్ములైనను, దేవుని శరణుపొంది, అనుమానించుటకాని, భయపడుటకాని అవసరము లేదు.

427. అనేక జన్మములనుండి; శరీరము 'నేనే'యని నమ్మిన కారణముచే, శరీరము 'నేను' కాదని నమ్ముట కనేకజన్మముల కృషియవసరము, 'నేను' అనునదాత్మ; చావుపుట్టుకలు, రోగ

జరాదుఃఖములు లేనిది. అనంతశాంతి, అవ్యయానందము, పరిపూర్ణజ్ఞానముగల పరమాత్మయే ఆత్మ. అందుచేఁ బ్రతిదినము, నేను దేహమును కాను; నేనాత్మ స్వరూపమును; దేహసంబంధముచే, అల్పమగు జీవుననిభ్రాంతి సత్యముకాదని పారాయణము చేయుచు నిష్ఠతోఁ నాత్మతత్త్వము నెఱింగి, సర్వదుఃఖములను విడిచిపెట్టవలెను.

428. ఏమి కావలసివచ్చినను, ఏమి తటస్థింపరాదని కోరుకొన్నను, మానవుఁడు చేయునదేమియు లేదు. జగత్ప్రభువు నాశ్రయించు టొక్కటే చేయవలయు పని. మన క్షేమమున కవసరమైనవిచ్చి; వ్యతిరేకమైనవి తొలిగించి, సర్వదా రక్షించు శక్తి, సంకల్పము, దయగలవాఁడు పరమేశ్వరుఁడే. పరమేశ్వరుని నమ్మి, దృష్టి వానియందు నిలిపి నీకేమి చేయవలెనని భగవానుఁడు తోఁపించునో, ఆపనుల నాయా వేళల జరిగించు చుండుటయే మార్గము, నేను చేయుచున్నానను నహంకారము దహనమొనర్చి. నన్నుపకరణముగా భగవానుఁ డుపయోగించి, పనులు చేయించుచున్నాఁడని నిశ్చయించి, లోపల పరమేశ్వర నామమును కీర్తించుచు, పనులఁ జేయుటవలన దుఃఖములు తొలగి, సుఖములు చేకూరును.

429. భగవానునికిఁ దెలియకుండ నేదియు జరుగదు. శ్రీకృష్ణప్రభువు, ఒకదినమున మూఁడు కొండముచ్చుల రూపములలోవచ్చి; దొడ్డిలోని బంగెనపల్లి చెట్టునెక్కి, తిన్నన్ని తిని,

కొన్ని వడగొట్టినవి. నూరుకాయలు వ్యర్థమైనవి. కృష్ణప్రభు నిట్లు ప్రార్థించితిని; "నీవీ రూపములోవచ్చి పచ్చి మామిడి కాయలు తినుచుంటివి. మాకు నష్టము కలిగినది. నీవీ రూపములో వచ్చి, మాచెట్టుకాయలు నష్టపరచినచో నేనేమి చేయఁగలను? దయతో వెళ్ళిపోయి, యీరూపములో నిఁక రావద్దు" వెంనే కొండముచ్చులు తమంతటతామే వెడలి పోయి, మరెన్నఁడును రాలేదు!".

430. చలించు మనస్సును నిగ్రహించుటకు 'అభ్యాసేనతుకాంతేయ, వైరాగ్యేణచ గృహ్యతే". యని కృష్ణభగవానుఁడు గీతలోఁ బలికినాఁడు. అభ్యాసమనగాఁ జలించు వస్తువులపైఁ బెట్టిన మనస్సు చలించును; చలనములేని భగవంతునిపైఁబెట్టిన నది నిశ్చలమగును. అందుచే మనస్సు దేవుని పై నిలుపు నభ్యాసమే కావలెను. ఈ యభ్యాసములో నీవు దేవునివైపు నీమనస్సు ప్రసరింపఁ జేసినచో, దేవుఁడు తన కృపామృత రసమును నీయెడఁ బ్రసరింపఁజేయును. రెండవది వైరాగ్యము. అనగా రాగమును విడచుట; రాగమనగాఁ గోరిక. దుఃఖములేని సుఖము దేనినిగోరిన లభించునో అట్టి భగవానుని కృపనేకోరి, దుఃఖహేతువులగు కామ కాంచనాదిక కాంక్షను విడచుట. చలించు మనస్సు దుఃఖము; నిశ్చల మనస్సు సుఖము; చలించు వస్తువులు దుఃఖము; నిశ్చలుఁడగు భగవానుఁడు సుఖము. ఇది తెలిసి, మనస్సు దేవునిపైనిలిపి, సర్వసుఖములు పొందవలెను.

431. సన్న్యాస మనగా విడిచిపెట్టుట; బాధకలిగించు వానినన్నిటిని విడిచిపెట్టుట; స్థిరసౌఖ్యము శాశ్వత శాంతి నిచ్చు భగవానునాశ్రయించుట. ఇందు ముఖ్యము కోర్కెను విడచుటకాదు; కోరఁదగినదేదో తెలిసికొని దానినే కోరుట. అసలు విషయము పరమేశ్వరుని పాదములకు జీవితార్పణము చేసినచో, దుఃఖహేతువులగు కాంక్షలన్నియు నవియే నశించును. మనకు దృఢనిశ్చయము కావలెను. కోరఁదగిన, స్థిరసౌఖ్యమిచ్చు భగవంతునర్చించి కృతార్థత గాంచవలెనను తిరుగులేని దీక్షయే సన్న్యాసము. మఠజీవితము, కాషాయాంబర ధారణము మున్నగునవప్రధానములు.

432. భోగదృష్టి గలవాఁడంధునితో సమానుఁడే. కనులుండియుఁజూడనివాఁడు; అనఁగాఁజూచియుఁజూడనివాఁడే! భోగదృష్టి అజ్ఞానము నుండి పుట్టినది. భోగ్యములని మనము లోకములోని వస్తువులను సంపాదింప యత్నింతుము. అవి సుఖభ్రాంతినే యిచ్చును, సుఖమీయవు. ఏలన నవి క్షణిక సుఖలేశభ్రాంతిని కల్పించి, మేరుపర్వతమంత దుఃఖమిచ్చును. క్షణిక సుఖదానుఁడవమాన పరంపరలకు, అస్వతంత్రతకు, తుదిలేని కష్టనష్టములకుఁదలనొగ్గి, దుఃఖింపవలసివచ్చును. ఈ దృష్టి యోగదృష్టి; భక్తి, జ్ఞానములు గలదృష్టి యోగదృష్టి; అజ్ఞాన దుఃఖములఁబెంపుచేయునది భోగదృష్టి.

429. అనేక జన్మములనుండి మనతోఁగూడ విడువకుండ వచ్చిన వివిధవాంఛా సంస్కారములు మనకిష్టము

లేకున్నను విడిచిపెట్టవు. కాని వానిని నిర్మూలింపనిదే, దుఃఖ కూపమునుండి, బయటికి వచ్చుట సాధ్యముకాదు. భగవత్సహాయ సంపత్తి లేకుండ నది యెవ్వరికిని లభింపదు. భగవత్కృప యెట్లు లభించును. భగవద్భక్తిసాధన కధిక ప్రాముఖ్యమిచ్చి, దీక్షపూనుటయే. సంస్కారబలముకంటె, దైవభక్తి బలమధికమైనది. భగవదారాధనము నారంభించినది మొదలు పరమేశ్వరకృప భక్తునిపై ప్రసరించుటారంభించి, భక్తి పూర్ణతగాంచి, క్రమగతి భగవత్కృపయుఁబూర్ణతగాఁచుట జరుగును. నమ్మి సాధనచేయవలెను.

434. ఏకాగ్రత సర్వమిచ్చు శక్తిగలది. దేనిపై మనమనస్సును నిలిపి, నిశ్చలమైన యేకాగ్రతనుగాంతుమో, దాని సంపూర్ణరహస్యమంతయు మనకు బోధపడును. ఏకాగ్ర మనోదృష్టియనగా, ఆత్మశక్తి ప్రవేశించు దృష్టి; ప్రపంచ భోగద్రవ్యములపై కేంద్రీకరించిన దృష్టికి, అవి లభించి భోగముల సమకూర్చుచున్నవి. ఏకాగ్రతయనగా చెదరుగు లేని సత్యసందర్శన సామర్థ్యము. దేవునిపై నేకాగ్రతయే సమాధి; క్షణమాత్రమగు నేకాగ్రత దేవుని కృపనార్జింపఁగలదు. దేవునిపై నేకాగ్రత నభ్యసించు భక్తునికి, దైవశక్తులన్నియు సంక్రమించును; జ్ఞాని కేకాగ్రత వలనఁబరబ్రహ్మను సంధానము కలుగును.

435. మనకు మనమే శత్రువులము, లేక బంధువులము. "ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః"

గీతావాక్యము. అజ్ఞానము మన మనస్సులో నీర్ష్యాసూయా దులను, రాగద్వేషములను, కామక్రోధములను ప్రవేశపెట్టి, మనయోగక్షేమమునే భగ్నమొనర్చుకొను శత్రువులుగా మనలను తయారు చేయుచున్నది. మన మనస్సులో నెట్టి దోషములు ప్రవేశింపకుండ, మనస్సుచే మనస్సును నియమించి కొనవలెను. అందుకే మనస్సే బంధమోక్షకారణమని చెప్పఁబడెను. మనస్సు, పరిశుద్ధము గావలెనన్నచో, నీశ్వరభజ నాగ్నితప్తమగునట్లు చేసికొనుటే మార్గము. దేవుని పాద ముల కర్పించి అచట నిలిపిన మనస్సు పవిత్రమై, మోక్ష మీయ సమర్థమగును. అందుకే సత్పురుష సహవాసము, సద్గ్రంథపఠనము, జపధ్యానాదికము, మనస్సు దోషరహిత మగు సాధనలు.

435. భక్తిజ్ఞానములు గలవాఁడెవరిని దూషించుట, ద్వేషిఁచుట, శపించుట చేయరాదు. ఏలన వానివలన పుణ్య ధనము క్షీణించును; మన మనంత పుణ్యధనమార్జించి ముక్తి కిరీటమును సంపాదిఁపవలెను. అందుచే మనము దైవభక్తిజ్ఞాన ములచేనార్జించిన పుణ్యధనమును వేయికన్నులతో రక్షించు కొనవలెను. దుర్మార్గులను, పాపులను భగవానుఁడే శిక్షింప సమర్థుఁడు. భగవానునికి ఁబుణ్యధన నష్టముండదు. భగ వంతు ఁడనంతపుణ్యరాశి. అందుచే నాపని దేవునికి విడిచి పెట్టుటే కర్తవ్యము. భక్తుని జీవితములో రాగద్వేషములకు, శతృత్వములకు ఁదావుండరాదు.

437. సంతత బ్రహ్మాను సంధానములేక నిరంతర పరమేశ్వరభజనము మానవుని ముఖ్యకర్తవ్యము. అందు ముఖ్యముగా వార్ధకదశలో నింకేపనిచేయుటయు దప్పే. కను ఱెప్పవిప్పి మూయునంతసేపుకూడ మఱువని పరమభక్తి విశ్వాసములతో భగవంతుని సేవించినచో, ముక్తితోఁగూడ సర్వవిధరక్షణములిచ్చి కాపాడును. భగవత్కృప మనకు భగవత్కృప చేతనే కలుగును. భగవంతునినమ్మి పూజించు నభిలాష, దీక్షయు భగవత్కృపచేతనే లభించును. ఇందెట్టి విరోధమును లేదు. భగవద్భక్తి, భగవత్కృప కలిసియేక కాలమున వర్తించుచుండును. ప్రశ్నించుట, తర్కించుట వలనఁగాక, నిశ్చలనిశ్చయముతో సాధనచేసి, ఫలితము గాంచుటే విధి.

438. - ప్రతి విషయమునుగూర్చి, ప్రతి వస్తువును గూర్చియు నిది స్థిరమా, అస్థిరమా? యను ప్రశ్న వేసికొని సత్యమును గ్రహించుటే తరించుటకు మార్గము. ఇంకొక రహస్యమున్నది. అస్థిరమైనది, స్థిరమైనదానివలెఁ జూపట్టి మోసగించు లక్షణము గలది. దేహమస్థిరము, స్థిరమను భ్రాంతిని గలిగించి, పతనహేతువగును. అటులే భార్యాసుత గృహధనాదికము, స్థిరమైనది కన్నులకు గోచరించునదికాదు. ఏకాగ్ర బుద్ధికి గోచరించును. అదియే ఆత్మస్వరూపము; అదియే సత్యము, భగవానుఁడు, పరబ్రహ్మము, నశించి యేడిపించునది కావలెనా, యెల్లప్పుడుండి సుఖమిచ్చునది కావలెనా? వెంటనే నిశ్చయమునకు వచ్చి సాధించు.

439. హృదయాకాశ మందిరములో నివసించుచు, నీమనస్సు, నీబుద్ధి, నీయింద్రియములు, నీ దేహము, పనిచేయుటకు వలయు శక్తిని, తెలివిని, బలమును, నిరంతరము సమకూర్చుచుఁ దన్నుఁ దెలిసికొని సుఖింపుమని లోనుండి అంతర్వాణి రూపమున నిరంతరము, మధురాతిమధుర స్వరమునఁ బిలుచుచుండఁగా, మనము శ్రద్ధగా నాపిలుపు వినవలదా? ఇది ప్రతిప్రాణికి భగవంతు నాహ్వానము. దానిని విని సకల శుభాన్వితానందమయ జీవితముగాంచక, అన్యకార్యక్రమమేల? నీలో, లోకైక చక్రవర్తి నివసించుచుండ, నీకేమి క్లేశకారణమున్నది? నీయింటినిండ రత్నరాశులా, బిచ్చమెత్తుటెందులకు? అడుగో నీలో దేవుఁడున్నాఁడు, చూడు, పలుకరించు, తరించు.

440. దేహధారిత్వము సుఖమిచ్చునట్లు భ్రాంతి జనింపఁజేసి, దుఃఖమిచ్చును. దేహమును నిత్యమును పోషించుట, శ్రమ లేనిదా? రోగమువచ్చిన సుఖమిచ్చునా? ఊహింపరాని ప్రమాదములు తటస్థించుట దుఃఖకారణముకాదా? యౌవన దశలోఁ గామము దుఃఖహేతువు. కామసంతృప్తికై, ధనాదిక సంపాదనము, తద్వినియోగము, నందలి సమస్యలు, దుఃఖహేతువులు. పిల్లలఁ గనిపెంచి పోషించుబాధ్యత, కాలమును, శక్తిని దినివేయును. వార్ధక్యము దుఃఖనిలయమని చెప్పనక్కఱలేదు. మరణము, దేహాభిమానికి, దేహ సంబంధమును నిర్మూలించును గావున దుఃఖహేతువు. కావున దేహ

రాహిత్యమనగా, జన్మరాహిత్యము; అనగా సర్వబంధవిముక్తి-యనగా మోక్షము సంపాదింపఁ దగినది.

**441.** ప్రతిమానవునకు జీవితములోఁ గొన్ని పనులు చేసితీరవలసినవి కలుగుచుండును. అవిమంచిపనులు కావచ్చును, దుష్టములు కావచ్చును. వాని మంచిచెడ్డలు నిర్ణయించుట కవకాశము కలుగదు. చేసితీరక తప్పదు. దేవుఁడు నిర్ణయింపని దేపనియు లోకములో జరుగదు. నీవు తప్పనిసరిగాఁ జేయున దీశ్వర నిర్ణయములే. అందుచే, శివసంకల్పముచే నేసి పని చేయుచున్నానని, శివస్మరణము చేయుచుండవలెను. ఎట్టి శంకలు లేకుండ, భగవత్సంకల్పము పైఁబడి చేయించు చున్న దని గ్రహించినచో, నీకెట్టిదోష మీపనులవలన నంటదు. మఱియు నదియొక విలాసక్రీడ యగును. నీవు దైవమును నమ్మి దైవభక్తితో నీవిధముగా నన్నిపనులు చేసికొను టభ్యసించినచో, దేవుఁడు నీచే నెట్టిపాపకృత్యము చేయింపఁడని గ్రహింతువు.

**442.** దూరసామీప్య భేదములు దేవునికిలేవు; ఏలన దేవుఁడు సర్వవ్యాపి; సర్వస్వరూపియు నైయున్నాఁడు. "అతి పరిచయాదవజ్ఞ" యనుసామెత అందరకు వర్తించును. నిత్యము సన్నిహితుఁడైన వాని నవమానించుట మూర్ఖలక్షణము; ఆవ్యక్తియే దూరస్థుఁడైయున్న గౌరవింతురు, భగవానుఁడు సర్వవ్యాపియై యుండియు నరుదుగా భక్తులకు మాత్రమే దర్శనమిచ్చుటకుఁ గారణ మవమానశంకయే. "అవజానంతి

మామ్ మూఢాః మానుషీంతను మాశ్రితమ్" అని కృష్ణప్రభువే పలికెను. సులభముగా నేదివచ్చినను తృణీకరింతురు.; సులభముగాఁ గనిపించినచో దేవుని మర్యాదచెడిపోవును. దాని వలన నష్టము దేవుని కెన్నఁడును లేదుకాని, దేవు నగౌరవముగాఁ జూచువారు నశించుట తప్పదు.

443. "నేను అసత్యము; దేవుఁడు లేక పరమాత్మయే సత్యము. అనగాఁ బరమాత్మ నేనే" ఇది పాండిత్య మవసరము లేకుండ సులభముగాఁ దెలియు పరమ సత్యము. పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణములు, దేహము పనిచేయుటకు స్వతంత్ర శక్తిని కలిగియున్నవా? వీనికి స్వతంత్ర శక్తి లేదని, నిద్రయు, మృత్యువు తెలుపుచున్నది. హృదయ మందిరమున నున్న ఆత్మశక్తి, దేహ బుద్ధీంద్రియాదుల నడపుచున్నది. ఎప్పుడేపని యెట్లెంత చేయవలెనో, భావములఁ గలిగించి, ఆత్మయే వానికి బోధకశక్తియై నడపుచున్నది. అజ్ఞానము, అహంకారము, "నేనుకర్తన"ని నమ్మించి, కర్మ ఫలితము లనుభవింపఁ జేయుచున్నవి. అజ్ఞానము పోవుటే మోక్షము.

444. పరమాత్మకు రెండురూపములు– సగుణ నిర్గుణ రూపములు గలవు. రెండును వేరుగాలేవు, కలిసియేయున్నవి. నిర్గుణమనగా నవ్యక్తోపాసన కష్టతరమైనదని గీతయేపలికి యున్నది. కాని సగుణారాధనము వలన, రెంటిఫలితము లభించుననియు గీతలో భగవానుఁడే చెప్పియున్నాఁడు; "తేషా మేవాను కంపార్థమహ మజ్ఞానజమ్ తమః నాశయా మ్యాత్మ

భావస్థోజ్ఞానదీపేన భాస్వతా", "నన్ను నిత్యము భక్తితో నారాధించు వారియందు దయచే నేను వారి హృదయములో జ్ఞానదీపమును ప్రకాశింపఁ జేసి, వారి అజ్ఞానంధ కారమును నశింపఁజేయుదును." భక్తిచే దైవకృప, ఆ వెనుక అజ్ఞానమును దొలగించి, జ్ఞానప్రకాశమును గ్రహించుట జరుగును.

445. మనమెవరో మనమెఱుగని వారమై జీవించుచున్నాము. మన నిజమైన రూపము కన్నులకుఁ గనపడనిదై యున్నది. పైకిఁ గనపడునది మన ముపయోగించు బాహ్య శరీరము; కొలది కాలముండి బూడిదయగును. లోపలనున్న మనసూక్ష్మ, కారణదేహములు, మరలనింకొక స్థూల దేహ ధారణమునకై నియమిత కాంతా గర్భములోఁ బ్రవేశించి, జన్మించును. ఈ విధముగాఁ బ్రతిప్రాణి, యెన్ని వేల సారులు పుట్టెనో, మృతిచెందెనో—యిఁక ముందెన్ని వేల సారులు జనన మరణములు జరుగునో, తెలియుదు. ఈ దుఃఖ పూరితమైన దుర్దశ పోవలెనన్నచో, జననమరణ రహితమైన, పరమాత్మయే మన స్వస్వరూపమని చెప్పు బ్రహ్మజ్ఞాన మార్జించుటే మార్గము.

446. జిహ్వోపస్థా చాపల్యమునకు మితిలేదు. మితి లేకుండుటయే రోగమునకు, దుఃఖమునకుఁ గారణము. శ్రీకృష్ణ భగవానుఁడు యుక్తాహార విహారములను గీతలో బోధించెను. భోగ్యవస్తువులు మితిలేని చాపల్యమును, అనారోగ్యమును, దుఃఖమును కలిగించును. యుక్తాహార విహారము లనగా, ధర్మ

విరుద్ధముకాని భోగములను గృహస్థు లనుభవించుట కధికార మున్నది. ఇందు దోషము, హద్దులమీరి వర్తించుటలో నున్నది."ధర్మాఽవిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ." గీతావాక్యము. ధర్మపరిధి దాటకుండ రక్షింపుమని మనము భగవంతు నారాధింపవలెను. చాపల్యమును మనము జయింపఁజాలము. జయించు సామర్థ్యము ననుగ్రహింపుమని పరమేశ్వరు నర్థింపవలెను.

**447.** మనము సాధింపవలసిన లక్ష్యమునకు వలయు పని చాల యెక్కువ; మనకుఁగల కాలము చాల తక్కువ. దేహమును విడిచిపెట్టు లోపునైనను, భగవానుని సాక్షాత్కారసిద్ధి, జన్మజరామృత్యు రహితమగు మోక్షసిద్ధి, సంపాదింపవలసినవి, అనేక జన్మముల నిష్ఠ, తపస్సు గలవారికే వానిని సంపాదింప వీలగును. కాని మన మధైర్యము పొందనవసరములేదు. పవిత్రహృదయము, పూర్ణశ్రద్ధ, నిశ్చలైకాగ్రత, మనము చేకూర్చుకొని, భగవంతు నాశ్రయించినచో, భగవానుఁడు పరమకారుణికుఁడగుటచే, నేక్షణములోనైన ననుగ్రహించి రక్షించును.

**448.** అజ్ఞానులపై క్రోధము చూపుట, చీకటిని కొట్టుటవంటిది. గాఢాంధకారములోనున్న వ్యక్తి, దేనిని జూచుట కవకాశము లేనందునఁగొన్నిటిని పగులఁగొట్టును, గొన్నిటిని విసరివేయును; అనగానాతఁడేమి చేయుచున్నాఁడో తెలియక చేయును. అజ్ఞానాంధకారములోనున్న మానవు

లకును దామేమి చేయుచున్నారో, తెలియదు. వారి పైఁగోప గించినచో మనమును చీకటిలోనున్న వారమగుదుము. అందుచే మన మజ్ఞానులయెడ (క్రోధమునకు బదులు, దయా దాక్షిణ్యములనుజూపి, జ్ఞానజ్యోతిచే వారి చీకటిని దొలగింప (బూనుట కర్తవ్యము.

449. ఎడతెరపిలేకుండ (జేయవలసినపని, పరమేశ్వ రారాధనమే. ఆపని సర్వవిధ రక్షణమిచ్చునది. అట్టి సామర్థ్యమింకే పనికిలేదు. కాని దేహయాత్రావసర కార్య క్రమములెన్నియో యున్నవి. సాంసారికచర్యలెన్నో తప్పవు. కాని యిందొక రహస్యమున్నది. ముఖ్యమగు పరమేశ్వర భక్తి విడువకుండ, మిగిలిన తప్పనిసరి పనులన్నియు (జేసికొన వచ్చును. రెండుమూడు పనులొకేసారి నిర్వహించుట మన కలవాటే. భుజించుచు మాట్లాడుదుము; బిడ్డల నూయెలలో నుంచి పాటలు పాడుచు నూపి నిద్రపోఁగొట్టుదుము. అటులే ముఖ్యము మానకుండ, నముఖ్యములన్నిటిని చేసికొనవచ్చును. గుండె అప్రయత్నముగాఁగొట్టుకొనునట్లు. భగవద్ధ్యాన సంకీ ర్తనము లప్రయత్నముగా జరుగవలెను.

450. ఈశ్వరార్పణ బుద్ధితో నన్నిపనులు చేయు మనియు, నీశ్వరాంకితముగా జీవితము నర్పింపవలెననియు (జెప్పఁబడెను. ఈశ్వరార్పణముకంటె యుక్తమైనపని వేరొ కటి లేదు. కాని యిఁదొక రహస్యమున్నది. భగవంతుని స్వాధీనములో లేనిదానిని, భగవంతునికి స్వాధీనమొనర్చుట

మంచిదే. కాని విశ్వమంతయుఁ బిపీలికాది బ్రహ్మపర్యం తము నీశ్వరాధీనమై యిదివరకే నడచుచున్నది. జగమంతయు, సర్వప్రాణి జీవితములు, నీశ్వరాధీనములై, వాని హస్తము లలో నెల్లప్పుడున్నవి. మన జీవితములన్నియు దేవుని హస్త గతములై యుండగా, మనము దేవుని కర్పించుట యను ప్రశ్నయే లేదు. ఈసంగతి గుర్తించుటయే ఆత్మార్పణము. నీకు లేనిదేదియో నేనర్పించుచుంటినని, తెలియక తలఁపోయు దురహంకారము దైవద్రోహము.

451. తన అతిలోక దరహాసామృత కిరణజాలముతో జగమునంతను సమ్మోహితమొనర్చు శ్రీకృష్ణప్రభు పాద పద్మములాశ్రయించి, పలుదోముపుల్ల మొదలు పరిపూర్ణ బ్రహ్మజ్ఞానసిద్ధి వఱకు నేది కావలసినను ప్రభువుతోఁ జెప్పి కొని, భక్తి వినయ భయప్రేమలతో స్మరించుచు హాయిగాఁ గూర్చుండు నిష్ఠనభ్యసించి, లేశమాత్రలోపము రాకుండ నానిష్ఠను రక్షించుకొనుచుండుటే, మనమిహలోకమునఁ జేయఁ గలది, చేయవలసినది యనగా దివ్యకార్యక్రమము. మన స్సులో నెట్టిభారమును కలుగకుండఁ జేసికొని, హృదయ మంది రమున శ్రీకృష్ణప్రభువున కొక్కనికే స్థానమిచ్చి, అనిర్వచ నీయానందమందుటే మోక్షసాధనము.

452. మనకుఁ గర్మలు లేవు, కర్మఫలములు లేవు; కర్తృ త్వమును లేదు; మనమును లేము; ఇదియే పరమేశ్వరుని మాయానాటక ప్రదర్శనశాల. సర్వకర్త, సర్వభర్త,

సర్వవ్యాపి, సర్వరూపి యగు పరమాత్మ విశ్వమును, విశ్వ సంతతిని సృజించి, సర్వభారములను దానేవహించి నడపు చున్న సంగతి గ్రహింపలేక, మనము వేరుగానుంటిమని, మనకుఁగొంత కర్తృత్వమున్నదని, కర్మఫలములు మన మనుభ వించుట తప్పదని, లేని వారోపించికొని యేడ్చుచున్నాము. ఇదే పెద్ద పొరపాటు; మాయావశులమై యిట్టిపొరపాటు చేయుచున్నాము. పొరపాటు దిద్దుకొనుటే మోక్షము.

453. అనేక జన్మాంతర ప్రయాణములు చేయుచు నచటఁగొంతసేపాగి, మరల నింకొక జన్మమునకుఁబోవలయు మనమిచట స్థిరముగా నుందుమను భ్రాంతిని విడువలేకుండుట విచిత్ర విషయము. బుద్ధిగల మానవుఁడు దీనియర్థము నెఱుఁగ యత్నింపవలెను. ఈజన్మాంతర ప్రయాణకార్య క్రమము దురంత దుఃఖములతో నిండినదై బాధించును. భక్తి జ్ఞానసాధనలచే, భగవత్కృప నార్జించి. యీదురంత దుఃఖ మయ ప్రయాణమును పూర్తిచేసికొని, సుస్థిర శాంత్యానంద సమృద్ధమగు మోక్షసామ్రాజ్యాధి పత్యమును సంపాదించు లక్ష్యమునకై అవిరళ కృషిచేయుట, మానవకర్తవ్యము.

454. పిండివంటలతో అన్నమువండి, ఆకలితో నల మటించి, వడ్డించినదాని నంతసించువారుండగా, మనము దానిని పెద్దగోయి తీసి, అందుపారవైచి, మట్టితోఁగప్పివైచుపని మనమందరమును జేయుచున్నారము. పరమేశ్వర కృపామృత మను దివ్యభోజనముచేసి, శాశ్వత బ్రహ్మానందసిద్ధిని పొందు

నవకాశమే, యిహలోక జీవితము, ఆసంగతి మరచి, దుఃఖ మును గొనితెచ్చికొను క్షణికభోగలాలసులమై, మన పవిత్ర మైన యీ యిహలోక జీవితావకాశమును, గోతిపాలు చేసి, మనము తెలివైన వారమని మురియుచు జీవితములను, వ్యర్థ మొనర్చుచున్నారము. అయినను, భగవానుఁడిట్టి యవకాశ ములను దిరిగి తిరిగి యిచ్చుచునేయున్నాఁడు. మనము తిరిగి తిరిగి, దుర్వినియోగము చేయుచునేయున్నారము. మానవ జాతి చరిత్ర సారాంశమిది.

455. నేనేమి చేయవలెనను సమస్య యెవ్వరికి నుండ నవసరములేదు. నీవేమి చేయవలెనని భగవంతుఁడు సంకల్పిం చునో, దానిని నీచేత భగవానుఁడే చేయించును. అయినచో నేనుజేయు తప్పుపనులన్నియు భగవానుఁడు చేయించినవేనా? ఈవిషయమును గూర్చిన సమాధానము మనబుద్ధి కతీతమైన పరమాత్మ లక్షణ విషయము; అందుచేఁ దర్కమున కందనిది. అనగా ననుభవైకవేద్యము. భగవానుని నీవు సంపూర్ణ చిత్త శుద్ధితో నమ్మిచూడుము. నీచే నెన్నఁడు తప్పులు చేయింపఁడు. ఇది తపస్సాధనలో ననుభవదృష్టికి గోచరించు సత్యము.

456. "కుతస్త్వాకశ్మలమిదం ... అనార్యజుష్ట మస్వ ర్గ్యమ్." గీతావాణి. "అర్జునా! ఈకశ్మల మెక్కడినుండి యెందుకు వచ్చినది. ఆర్యులకు నరక హేతువు." ఇది అర్జునుని కేకాదు, భారతీయులందరకు నుపదేశము. సర్వతోముఖ బ్రహ్మజ్ఞాన నిలయమగు పవిత్ర భారతదేశమున జన్మించిన

వానిక్కిట్టి నరక హేతువైన పాపకర్మలము కలుగరాదు. ఈశ్వ రారాధన వలనఁ గలుగు పవిత్రమైన ఆనందమయ జీవిత మనుభవించు నవకాశము ప్రతిభారతీయుని జన్మహక్కు. భగ వానుఁడున్నాఁడు; స్వధర్మ మున్నది. దేవుని నమ్మి, నీకు స్వధర్మమేదియో తెలిసికొని జీవించుటచే, పతనము, నరకము నుండవు; అనగా దేవుఁ డుండగా మనస్సు చెదురు టెందుకు? ఇదియే గీతా ప్రభోధము.

457. ఏమికావలెను? సుఖము కావలెను, ఎటువంటి సుఖము? సుస్థిరమైన సుఖము; దుఃఖ మేమాత్రమునువల దా? నలుసంత దుఃఖము లేని, సుఖమేకావాలి; సంపూర్ణ సుఖము; క్షతి లేని సుఖము; మార్పులేని సుఖము; శాశ్వతసుఖము కావలెను." దీనిపేరే మోక్షము; బ్రహ్మానందమిదియే. పర మాత్మ లేక భగవానుఁ డనగా, హద్దులులేని శాంతి, శక్తి, ఆనందము. అదినీవైనప్పుడే అనగా భగవంతునిలో నీమనస్సు కేంద్రీకృతమై లీనమైనప్పుడే, భగవంతుని లక్షణములైన, స్థిరశాంతి శక్తి సౌఖ్యములు నీవగును, అందుకే ఉపనిషత్తులు, "తత్త్వమసి"యున్నగు మహావాక్యములు పలికినవి. జ్ఞానజ్యోతి ప్రకాశములో నీవే పరమాత్మయని గోచరించును. అదియే బ్రహ్మజ్ఞానసిద్ధి, మోక్షము, నని స్పష్టము.

458. రామరాజ్యమనఁగానేమి? ఎట్టి లోపములు, దోషములు లేని భగవంతుని రాజ్యపరిపాలనము. మనము రామరాజ్యములోనే యున్నామని యెఱుగము. విశ్వ పరి

పాలకుఁడు, రాముఁడనగా దేవుఁడే. లోకములో వివిధ దేశ పరిపాలకులు నిమిత్తమాత్రులు. విశ్వప్రపంచమును భగవానుఁడు, సర్వవిషయములలోఁ బరిపాలించుచున్నాఁడని నమ్మి భక్తులకు రామరాజ్య సుఖము కలుగును; నమ్మకుండు వారికి వివిధ నిమిత్తమాత్ర పరిపాలకుల పరిపాలనములో, దోషములు, లోపములు, దుఃఖములు సంభవించును. నీవుకోరుచో, రామరాజ్యములోనుండి, రాముని నమ్మి, నిర్దుష్ట శాంతి సౌఖ్యముల నొందవచ్చును; నమ్మనిచో, అజ్ఞానులగు తాత్కాలిక ప్రభువుల, సదోషపాలనములోని దుఃఖములు తప్పవు. కావున జగత్ప్రభువగు రామరాజ్యములో సభ్యత నార్జించి. సుఖింపుము.

**459.** నిజమైన భక్తుఁడు, జ్ఞాని, నేను భక్తుఁడను, జ్ఞానినని చెప్పుకొనుట కిష్టపడఁడు; నేనధమాధముఁడ ననియుఁ జెప్పుకొనుటవలన నాత్మవిశ్వాసము నశించును; ఆత్మస్తుతి, ఆత్మ నిరసనము రెండును ప్రమాదకరములే. వినయముతో నాత్మవిశ్వాసమును పెంపొందించికొని, నిరహంకారియై భగవంతు నారాధించి, నిగర్వియై జ్ఞానసంపాదనమొనర్చికొని, మానవుఁడు తరింపవలెను. ఎంతటివానికైనను, దైవానుగ్రహము లభించులోపున, భక్తి, జ్ఞానములు పూర్ణతచెందు వరకు, నేసమయమందైన నెన్నిదోషములైన సంభవించి, పతితునిఁజేయువచ్చును. అందుకే ఆత్మసాధనము కత్తిమీఁద నడచుట వంటిదని ఉపనిషత్తు చెప్పియున్నది.

460. లోకములో మనుజులకు విలువ పలురకము లుగా నుండును. అధికార ధన విద్యాదులనుబట్టి మానవుల విలువను లేక ధరను నిర్ణయింతుము. కాని సత్యమెరిగిన చో మానవుని విలువ నెవఁడు కట్టఁగలఁడు? ఉపనిషత్తులే ఆవిలువను లెక్కవేసి ప్రకటించియున్నవి. "అయమాత్మా బ్రహ్మ; తత్త్వమసి." మున్నగు వాక్యముల ద్వారమున, మానవుఁడు పరమాత్మయేయని ధరను నిర్ణయించినవి. భక్తిమార్గము ననుసరించి, భక్తుఁడు సంపూర్ణాత్మార్పణముచే భగవత్తుల్యుఁడగును; జ్ఞానసిద్ధిచే, దానే పరమాత్మనని దర్శించును. అందుచే దేవుని విలువయే మానవుని విలువ.

461. తనవిలువ నెఱుఁగనివాఁడు మానవుఁడు; తన విలువను పూర్తిగా నెరిగిన మానవుఁడే దేవుఁడు. అజ్ఞానము నశించిన మానవత్వము, దైవత్వమే. మానవు నల్పత్వము కేవలాజ్ఞాన కల్పితము వేదవేదాంతము లజ్ఞానాల్పత్వమును దొలగించి, "నీవు సాక్షాత్పరబ్రహ్మవే; ఇందు నలుసంతయైన నతిశయోక్తి లేదు; కన్నులు తెరచి సరిగాఁజూచికొని. ధన్యుఁడవు కమ్మ"ని బోధించుచున్నవి. "నీవు దేవుఁడవే" యని వేదఘోష.

462. మామిడిపండ్ల రసము చేటలోఁదాఁడ్రగాఁజేసి యెండలోఁబెట్టినది మొదలు ఈగలు కాకులు దానిని మ్రింగవలెనని చేయుసాహసము సాటిలేనిది. ఈగలు పోవలెనని విసనకర్రతో విసరి చూచితిని. ఎన్నిసారులు విసరిన నీగలు

తమ రెక్కలతో జెట్ విమానములవలె నతివేగముగా వచ్చి వ్రాలి, మామిడిరసమందలి తీపినాస్వాదించుటకై, చావుకై నను దెగించి సంచరించును. అటులే కాకులు, వానికెగిరిపోవు రెక్కలనిచ్చినాఁడు పరమేశ్వరుఁడు. కర్రచేతఁబట్టి నిలు చున్నను, కాకి జెట్ విమానమువలె దాడిచేసి ముక్కుతో మామిడితాంద్రను పొడిచి పట్టుకొని పోవును. మానవులకు మామిడితాఁద్ర కామినీకాంచనములు. మానవులకు రెక్కలు లేవుకాని రెక్కల మించిన యుక్తులున్నవి. ప్రాణములను కామినీకాంచనములకై బలియిత్తురు. పరమాత్మ పదార్థ మెంత తీపియో తెలిసినచో, మానవులు విడిచిపెట్టుదురా?

463. ఒకవిషయములోఁ గోర్కెకలిగి, సిద్ధింపమి, భరించుట దుస్సహమై, అదిఅనుచితమని యెఱిగియు శ్రీకృష్ణ భగవానునితోఁ జెప్పికొని, "నీవిచ్చినగాని యది లభింపద"ని ప్రార్థించితిని. వెన్వెంటనే భగవానుఁడతివిచిత్రముగా నా కోర్కెను సిద్ధింపఁజేసి, నావైపుజూచి మందహాసముచేసి నాఁడు. దీనివలన భగవానుఁడు భక్తులయెడఁ జూపుదయకు మితిలేదని స్పష్టమైనది. భగవానుఁడు తన భక్తుల కడిగిన దెల్లనిచ్చి, దానివలన భక్తులకెట్టి దోషమును సంక్రమింప కుండఁజేసి, వారిభక్తినతిశయింపఁజేసి కృతార్థుల నొనర్చును. భక్తిసాధకులు పరిశీలించి, అనుభవింపవలసిన రహస్య విషయము.

464. లోకములోఁ దల్లిదండ్రులు తమబిడ్డ లేమడిగిన నిచ్చుటలో నిర్మలమైన ప్రేమచూపుదురు. కాని బిడ్డలుకోరిన వన్నియు ధర్మయుక్తములు కాకపోవచ్చును. అందుచే నన్నిటి నీయరు; ఇచ్చుటకు సామర్థ్యము లేకుండును. ;కోరఁదగనవాని నిచ్చుట కిచ్చగింపకుందురు. అట్లుగాక, భగవానుఁడు తనభక్తు లడిగిన దేదియైనను, ధర్మాధర్మములతో నిమిత్తము లేకుండ నిచ్చును; ఇచ్చుట కాయన సర్వసమర్థుఁడు; ఇచ్చి భక్తునికెట్టి దోషము సంక్రమింపకుండఁ జేయు సామర్థ్యమును భగవాను నికున్నది. భక్తుని విషయములో 'లేద'ను శబ్దము నెన్నఁడు భగవానుఁ డుపయోగింపఁడు. అనగా భగవత్కృప కెట్టి హద్దులును లేవు.

465. భగద్ధ్యాన మహిమనుగూర్చి వాగ్రూపమున వర్ణింపఁబూనుట రెండవ పక్షము; ధ్యానముచేసి మహిమ నను భవపూర్వకముగాఁ దెలిసికొనుటే మొదటి పక్షము. ఎన్నఁడు విడువకుండ, భగవంతుని భక్తితో ధ్యానించు నిర్విరామ దీక్ష వలన, నీలోని దోషములు, లోపములు, దేహమనో బుద్ధీం ద్రియములు కలిగించు సంక్షోభములు నశించుటేకాక సకల శుభములనగా, శాశ్వత శాంతిసౌఖ్యములు ఆరోగ్య భాగ్య ములు, వివేక విజ్ఞానములు, లభించి తుదకు విముక్తి ప్రాప్తిం చును. భక్తిధ్యాన పరిణతి, ననుసరించి ఫలితములుండును. పూర్ణభక్తి, పూర్ణధ్యానము, పూర్ణభగవ దనుగ్రహము నిచ్చును.

466. నీవు భగవానుని సర్వకాల సర్వావస్థలలో స్మరించుట మానరాదను దీక్ష బూనియుఁ గొన్ని సమయము లలో మఱువ వచ్చును. అంతమాత్రమున ఖిన్నుఁడవై నీవు కంగారు పడనవసరములేదు భగవానుఁ డెంతకృపా మూర్తి యనఁగా, నీవు మరువకుండ భగవానుని స్మరించిన వేళలలోని నీ స్మరణమునకు సంతసించి, నీ వాతని మరచి స్మరింపని వేళ లలో నీ దౌర్బల్యమును గ్రహించి రక్షణమిచ్చి కాపాడును. మరియు నెన్నఁడు మఱువకుండ శక్తినికూడఁ బ్రసాదించును. నీ బుద్ధిదౌర్బల్యమున కాతఁడు నిన్ను శిక్షింపఁడు. నీదురహం కారముచే నీకుఁగలుగు అపవిత్రతను నిరసించును.

467. మనము సత్కార్యముల నొనర్ప నుపక్ర మించి,శక్తివంచన లేకుండఁ జేయుచో,భగవానుఁడు తోడ్పడి కార్యసిద్ధి కలుఁగజేయునని చెప్పుచుందురు. మనకు సత్కార్య ములఁ జేయువలయుననెడి సంకల్పము నిచ్చినవాఁడెవఁడు ? సంకల్పమిచ్చి, దానిని నెరవేర్చు శక్తి, ఉత్సాహము,బలము నిచ్చువాఁడెవఁడు? ఈశ్వరాజ్ఞలేనిదే గడ్డిపరక కదలదు. భగ వానునికిఁ దెలియకుండ నేమియుజరుగదు. సత్సంకల్పమేకాదు, దుస్సంకల్పములు కూడ నీశ్వర సంకల్పములోనివే. పుణ్య పాపకర్మలన్నియు నీశ్వర సంకల్ప సంజాతములే, అందుకే, "తస్కరాణాం పతయేనమః, స్తేనానాం పతయేనమః" యని వేదము పలికినది. నేను నిమిత్త మాత్రుఁడును; భగవానుఁ డేకైక కర్తయను నిశ్చల జ్ఞానమొక్కటే సత్కర్మ.

468. మానవజీవిత దైనికచర్యలు పరిశీలించినచో, గంటకముల వలె గ్రుచ్చుకొని బాధించు విషయములు, చిన్నవి, పెద్దవి, వచ్చి పైఁబడుచుండును. వానివలన మానవుల మనస్సులుచెడి, చెదరి, తికమకలు పడుచుండును. "దుఃఖమయంజగత్తు"ని స్పష్టపడును. కాని 'సర్వం విష్ణుమయం జగత్తు'ని శ్రుతివాక్యము. ఏదినిజము? అజ్ఞానికి, భక్తిహీనునకు మొదటిదే నిజము; జ్ఞానికి భక్తునకు విష్ణుమయమై, ఆనందమయమై జగము గోచరించును. పరమేశ్వరు నాశ్రయించి, దుఃఖ వినాశనము చేసికొనవచ్చును. బ్రహ్మజ్ఞానము సర్వ దుఃఖ నిర్మూలన మొనర్చును.

469. మనమెవరి మాటలు నిస్సంశయముగా నమ్మవలెను? లోకములో స్వార్థపరుల మాటలా? మూర్ఖుల మాటలా? ఆచరణలేని పండితుల మాటలా? భగవద్వాక్యములు నమ్మవలెను, రామకృష్ణాద్యవతార పురుషులమాటలు నమ్మవలెను; వానిని గ్రహించి మనయెడ దయతో మనకిచ్చిన వ్యాస వాల్మీకుల మాటలు శిరోధార్యములు; అటులే వేదోపనిషద్గీతాది పుణ్యవాక్యములు శంకింపనవసరములేదు. ఆయా పుణ్యవాక్య సారాంశమిట్లు చెప్పవచ్చును; అంతఃకరణ శుద్ధి గలిగి, శ్రద్ధతో భగవంతుని నమ్మి సేవించు భక్తుల కెన్నఁడా. భగవానుఁ డెట్టి కష్టములను, దుఃఖములను గలిగింపఁడు. లోకములను, లోకవ్యాపారములను. పంచభూతములను భక్త జనానుకూలముగా నడపి, భగవానుఁడు కృపామృతము ప్రవ

హింపఁజేయును. దేవుఁడు మాటయిచ్చి తప్పుననుకొనువారు దురంత దురితాత్ములు.

470. భగవాను నాశ్రయించి బ్రతుకువారి అఖండ భాగ్యము, ఆశ్రయించుటమాని జీవించువారి దారుణదౌర్భాగ్యము, రెండును వర్ణనాతీతములే. ఈ సత్యమును గృహస్థుఁడు తెలిసికొని,పిల్లలకుఁ బెద్దలకుఁగుటుంబములో నందరకు బోధించి మరియు బంధుమిత్రులకు దాసదాసీ జనులకుఁ దెలిపి, దీక్షతో జీవించుటవలనఁ గలుగు నఖండ భాగ్యమును, శుభములను, దినదినము, క్షణక్షణము దర్శించుచు నవ్యయానందశాంతి సమృద్ధమగు సంపూర్ణ సుఖజీవితమును పొందును. దారుణ దుఃఖ భాజనులై, దేవునారాధింపని మందబుద్ధులను జూచి, అట్టి దౌర్భాగ్యము తమకురాకుండఁ జూచుకొని మనుజులు వర్తింపవలెను.

471. మెలకువగా నున్నంతసేపు అనగా పగలు భగవానుని మనస్సులో నుంచికొని, రాత్రి నిద్రించునపుడు భగవానుని స్మరించి నిద్రింపుము. నిద్రనుండి మేలుకున్నంత నే, భగవంతుని స్మరింపుము. ఏమిచేయువలెనను ప్రశ్న వచ్చునా, దానిని నీపైఁబెట్టుకొనక, భగవానుని హస్తములలో దాని నుంచి. యేమిచేసినను, చేయకున్నను భగవానుని సంకల్పమే జరిగినదని నిశ్చయముగా నమ్మి, నీ మనస్సును నిశ్చింతగా నుంచికొనుము. భగవత్సంకల్పమే సృష్టి; భగవత్సంకల్పమే సృష్టిలో జరుగు సర్వమును, సమస్తలోకభారము, జీవుల

భారము భగవానునిదే. అనుభవ పూర్వకముగా దీనిని గ్రహించి నిర్మలానందము నందుము.

472. ఉదయము లేచునప్పటి కాకసమున మబ్బు దట్టముగాఁబట్టి చినుకులారంభమైనవి. ఇంట మాతల్లిగారి తద్దినము. వంటగది బాగుగాఁగురియును. వర్షము వచ్చినచో నెక్కువ చికాకు గలిగించును. భార్యలేచి, యీరోజున మన కేపనులు సక్రమముగా జరుగవని నిరాశా జనకముగా మాటాడ నారంభించెను. నేనంటిని; "అపశకునములు మాటాడకు. శ్రీరామ స్మరణమొనర్పుము; అన్నియు ననుకూలముగా నుండును." నేను బయటికి వచ్చిచూడగా వర్షమారంభమైనది. వెంటనే భగవానునితో నిట్లు చెప్పికొంటిని; "కృష్ణప్రభూ! మాయింట దద్దినము పూర్తియగువరకు, నెండ రప్పించి, వర్షములేకుండ రక్షింపుము." అంతే! చినుకులు మానెను; ఎండవచ్చెను. దినమంతయుఁదెరపి యిచ్చెను. అన్నియు సవ్యముగా జరిగెను. దీని యర్థమేమి? అడిగిన వెంటనే దయచూపిన కృష్ణప్రభువు భక్తానురాగము నెవఁడు వర్ణింపఁగలఁడు.

473. భగవానుఁడాశ్రిత సులభుఁడు; మరియు నాశ్రిత కల్పవృక్షము. లోకమున సామాన్యాధికారుల దర్శనమే కష్టమగును. ఒకవేళ దర్శనమైనను, మనకోర్కెను వారు నెరవేర్చుటకు విముఖులు గావచ్చును; లేక నెరవేర్చ సామర్థ్యము వారికి లేకుండవచ్చును. భగవానుఁడో! దేవేంద్రాదు

లను తృణప్రాయముగా జూడఁగల అనంత, అమోఘ పరి పూర్ణశక్తి సంపన్నుఁడు. అట్టి భగవానునాశ్రయించుటకు మన కర్హత స్వల్పము. భగవంతునాశ్రయించుటకు వలయు చిత్తశుద్ధి, వినయము, భక్తి, భయము మున్నగు నుత్తమ లక్షణములు మనకు లేవు. కాని భగవానుఁడెంత సర్వాతీతుఁడో అంత అమేయ కృపానిధి; అంతభక్తసులభుఁడు. భక్తుఁడు చిత్తశుద్ధితోఁగోరినంతనే అనంతవేగముతో దయ చూపి రక్షించు నతిలోక సద్గుణ సంపన్నుఁడు. ఆశ్రయించి చూచుకొ!

474. మానవుఁడు దైవదృష్టిని పెంపొందించికొన వలెను. భగవానుఁడు సర్వములోను, సర్వత్ర, సర్వకాలము లలో నున్నాఁడనునది పరమసత్యమని నమ్మవలెను. అట్టి పరమసత్యమును మాటలతోఁగాక, అనుభవ పూర్వకముగా దర్శింపవలెను. అన్నియు నీశ్వర సంకల్పమువలననే జరుగు చున్నవనియు నిశ్చయముగా నమ్మి జీవితములోఁ బ్రతిక్షణము నీ విషయములో జరుగుచుండుగువారి విషయములో, మరియు లోకములో నెన్ని యోజరుగుచున్నవానితో భగవత్సంకల్పము నకు విడఁదీయరాని సంబంధమున్నదని దర్శించు జ్ఞానదృష్టి లేక దైవదృష్టి నభ్యసించి, పరమేశ్వరుని ప్రత్యక్షదర్శనమును పొందవచ్చును. అట్టి నిత్యసాక్షాత్కారమువలన లభించు నానందము, చిత్తశాంతి అవ్యయములైనవి. ముక్తి దాని లోనిదే.

475. సర్వకర్త, సర్వదాత, భగవానుఁడేయని తెలిసినచో నింకేమియుఁదెలియ నవసరములేదు. అదియే మోక్షదాతయగు బ్రహ్మవిద్య. (1) సర్వకర్తయనఁగా భగవానుఁడు తప్ప వేరొక కర్త లేఁడనియర్థము. అన్నియు దేవుఁడే చేయుచున్నాఁడు. అన్నియుననగా నిందు మినహాయింపు లేదు. (2) సర్వదాతయనఁగా సర్వకర్తయగు భగవానుఁడే యగుటచే నీఁకనిచ్చువాఁడింకొకఁడెచట నుండుట కవకాశ మున్నది. నిత్యానిత్య వస్తువులు, అనగా నిహాపరములు, అనగా నశించునవి, నశింపనివి, సర్వము భగవానుఁడొక్కఁడే యిచ్చువాఁడు. ఇది నిత్య మనుభవములోఁజూచు సాధనమే తపస్సు.

476. అఖండబలము; అనంతకృప, అవ్యయానందము మున్నగు పరిపూర్ణ కల్యాణగుణరాశి యగు భగవానుఁడు, నీలో నీకత్యంత సమీపవర్తియై, స్వచ్ఛహృదయముతోఁ బలుకరించినచో, జవాబు చెప్పుట కెల్లప్పుడు సకల ప్రాణులకు, దివ్యాధారమైయుండగా, "నేను నిరాధారుఁడను, దిక్కు లేని దరిద్రుఁడను, నన్నుఁజూచిరక్షించువారెవరును లేరు, నా బ్రతుకంతయు వ్యర్థము"నని పలవించుటకంటె దుర్భరమైన అజ్ఞానము మఱొకటిలేదు. నిజముగా నీవు దేవుని తొడమీఁద గూర్చుండి యేడ్చుచున్నావు! అమృత క్షీరమిచ్చు తల్లి యొడిలోఁగూర్చుండి, యేడ్పెందుకు ?

477. ఒక్కొక్కటే, గడియలు, పూటలు, దినములు, గడచిపోవుచున్నవి. దేహమును విడిచిపోవలయు

కాలము సమీపించుచున్నది. అందరకది సత్యమే; వృద్ధుల కతి సత్యము. ఇది భయంకర పరిస్థితి. తప్పించుకొను మార్గ మున్నదా? లేకేమి! భయభక్తి వినయములతో సర్వమున కధిపతి, కాలమున కధిపతి యునగు భగవానునాశ్రయించి, భయభక్తి వినయములతో, నొకక్షణమైన మానకుండ సేవిం పుము. "భయము లేదు, నీకు జన్మజరామృత్యువులు, తదితర దుఃఖములు లేని అవ్యయానంద పదవినిచ్చెదన"ని పలికి దర్శన మహాభాగ్యమునిచ్చు దేవుని కృపనార్జింపుము. ఈప్రయత్నము చేయు మానవుఁడే, మానవజాతికిఁబూజ్యుఁడు. తక్కిన వన్నియు నిరర్థక కర్మకలాపమే!

478. ఈవిశ్వమంతయు భగవానుని భవనము. అందు మనము నివసించుచున్నాము. ఈభవనములో జీవించు సర్వ ప్రాణికోటి కవసరములగు సదుపాయములు, గృహాయజ మాని యగు భగవానుఁడే అత్యంత శ్రద్ధతోఁజూచి సమ కూర్చుచున్నాఁడు. మనము మన తండ్రియు, నింటి యజ మానియునగు భగవానుని భయభక్తి వినయమర్యాదలతో ఁబూజించు నెడల మనకవసరములన్నిటిని సమకూర్చి, మన లను దనంత వానినిగాఁజేయును. నాన్నగారి యింట, నాన్న గారి పోషణలో బ్రతుకుచు, నాన్నగారికి కృతజ్ఞత, మర్యాద చూపనివారి ఆత్మద్రోహము, దైవద్రోహము శిక్షార్హము లని చెప్పవలెనా?

479. "భగవానుఁడున్నాఁడు; కాపాడఁగల సమ ర్థుఁడు; కాపాడితీరు దయగలవాఁడు. ఆశ్రితమందారుఁడు."

ఇంతకంటె నేమికావలెను? నీ చిత్తశాంతికి, నీయానందము నకు, నీ సకల దుఃఖనివారణమునకు, నీసర్వసమస్యల నను కూలముగఁబరిష్కరించుటకు, నీధర్మార్థకామమోక్ష సంసిద్ధికి భగవానుఁడున్నాఁడు. నోరు విప్పి అడిగిచూడు. మాటలు రావా? కనపడుట లేదందువా? కనపడమని కోరు; ఎంత సులభమైన మార్గమో!

480. నాకు మరణము లేదు; నన్నాశ్రయించినచో నీకు నుండదు. నాకు దుఃఖము లేదు; నన్నాశ్రయించు, నీకు నుండదు. నాలో సర్వజగమునున్నది. నీవు నందులోని వాఁడవే. నాలోనేయున్న నీకాపదనెవఁడు కల్పింపఁగలఁడు? నీవు వేరుగా బలహీనుఁడవై, అల్పుఁడవై, యున్నావని భ్రమించుచున్నావు; అందుచే, నీభ్రాంతిచే, ఆపదలభ్రాంతి, దుఃఖభ్రాంతి కలుగుచున్నవి. నాలోనీవు, నీలోనేను నున్నాము; ఇది గుర్తించు; నీవు వేరని యెవరుచెప్పినను నమ్మకు; ఇది నీవు పూర్తిగా, గట్టిగా నమ్మినచో, నీవు నేను గలిసి యున్నా మని చూడఁగలవు. సర్వాధిపతినైన నాతోఁగలిసియున్న నీకు లోపములు, దుఃఖములు, దోషములు సంభవించుట కవకాశమేది? ఉన్నదనునది వట్టి భ్రమ. భ్రమ విడిచిపెట్టి చూడు. ఇంకొక సత్యమును జెప్పుచున్నాను; భయపడకు; నేనేనీవు, నీవే నేను. అనగా, నేను దేవుఁడను; నీవు నేనే అనగా నీవు దేవుఁడవే. అన్ని దుఃఖములు దీనితో దగ్ధమయి పోవును.

481. పరిపూర్ణ మనశ్శాంతికి బరిపూర్ణ సాధన మున్నది. సర్వబాధ్యతలు భగవంతునివే; మనకే బాధ్యతలు లేవని స్పష్టముగాఁ దెలిసికొని, మనస్సును నీరు పారఁబోసి బోర్లించిన పాత్రవలె నిర్మలముగా నుంచి కొనవలెను. కర్త ఒక్కఁడే; దేవుఁడే; భ్రాంతివశులమై మనము కర్తలమను కొను అకర్తలము. కర్తృత్వములేని బాధ్యతలుండునా? ఇది తెలియుటే తపస్సు, జపము, ధ్యానము. ఏభాద్యత లేనివానికి బెంగ లెందుకు. బాధ్యత అసలే లేదను బెంగ ఒక్కటే ఉండ నగును. బాధ్యత, బెంగ లేనివాని శాంతి, బ్రహ్మానందతుల్యమై, మోక్షమిచ్చునదై తరింపఁజేయును.

482. మనదృష్టిలో లోపమువలన సృష్టిలో దోష ములున్నట్లు గోచరించి మనకు దుఃఖహేతువు లగుచున్నవి. భగవానుఁడు పరిపూర్ణుఁడగుటచే నాతని సృష్టియుఁ బరిపూర్ణ మైనదే కావలెను. అటుగాక, నిజముగా సృష్టిలో దోషము లున్నచో, సృష్టికర్త పరిపూర్ణతకు లోపము సంభవించును. కావున సృష్టిలో వీసమంతయు దోషముండుటకు వీలులేదు. కాని మనకు దోషములు కనిపించుటకుఁ గారణముండవలెను. అది మన చూపులో దోషము. భగవానుఁడు తన వినోదము నకై సృష్టి చేసెను; మన భోగములకై చేసెనని తలచి, విని యోగింపఁగోరుటే దోషము. విశ్వమంతయు నీశావాస్యము; భగవన్మయమని అర్థము.

483. మనకొకపని కలిగినపుడు, మనకంటె బాగుగా దానిని నెరవేర్చు మిత్రుఁడు వచ్చి యీపనిని నేనుజేయుదు

నని పలికినచో, నాపనిని వానికొప్పగించి మనము సుఖముగా గూర్చుండి, ఫలితము ననుభవింపవచ్చును. కాని యెంత మిత్రుఁడైనను, మనయందెంత ప్రేమగలిగిన వాఁడైనను, మనపనులనుగొన్నిటి నాతఁడు చేయలేనివాఁడు కావచ్చును. అట్లుగాక, యెట్టిపనియైనను, అతిసులభముగా నెరవేర్చి, మన కుపకారము చేయు సామర్థ్యము గలవాఁడు భగవానుఁ డొక్కఁడే. అందుచే ప్రతి వ్యక్తికి, సంపూర్ణసమర్థుఁడు, నుత్తమ మిత్రుఁడు భగవానుఁడే. మన పనులన్నిటి నాపర మాత్మ కొప్పగించి, నిర్విచారముగా, గూర్చుండుట కవ కాశముండగా శ్రమపడు టెందులకు ?

484. భగవద్భక్తుఁడగు వ్యక్తి దేనికొఱకెప్పుడు నుద్రేకవశుఁడు కానక్కరలేదు. పూర్ణశాంత చిత్తుఁడై, మెలగవచ్చును; అంతేకాదు; చిత్తప్రసాదముతో బాటుగా నవ్యయానందము ననుభవించుచు, చిత్కళాకాంతి ముద్రిత ముఖారవిందుఁడై, సకల ప్రాణులకు దర్శనీయుఁడై వర్తింప వచ్చును. ఈశ్వర సంకల్ప ప్రదర్శనమే లోకమని గుర్తించి, కామక్రోధోద్రేకము లను నగ్నిజ్వాలలను ప్రశాంత జలధార లచే నార్పివేసి, హాయిగాఁ గూర్చుండవచ్చును.

485. పరిపూర్ణ భక్తి, పరిపూర్ణ జ్ఞానము, పరిపూర్ణ జితేంద్రియత్వము లేనిదే లభింపవు. కామవశుఁడు భక్తుఁడు కాఁడు; జితకాముఁడు శివుఁడు. కాముని సంహరించి, శివుఁడు పార్వతిని వివాహమాడెను. కామము, క్రోధము, మోహము

నుండవచ్చును. కాని మనకవి వశములై యుండవలెను. భక్తులకు, జ్ఞానులకు నున్నచో వారి కామక్రోధములు లోక కల్యాణహేతువులగును. కాని మనవశములోనవి యుండవలెను; వానివశములో మనముండరాదు. భక్తుని భక్తి, జ్ఞాని జ్ఞానము, నిర్దుష్టములు, పరిపూర్ణములు నైనచో జితేంద్రియత్వము వారికప్రయత్నముగా లభించును.

**486.** ధర్మమనగానేమి? విశ్వమును ధరించునదనగా సక్రమ స్థితిలో నిలుపుశక్తి ధర్మము ఆశక్తి యీశ్వరునిదే. ధర్మమనగా నీశ్వరసంకల్పానుగుణమైన ప్రవర్తనము. ఈశ్వర సంకల్పము మనకుఁదెలియదు. వేదములీశ్వర ప్రోక్తములు గావున నీశ్వర సంకల్పాను గుణములైన ధర్మములను ప్రకటించెను. తదను గుణముగా మనువు పరాశరుఁడు మున్నగువారు, వాల్మీకి వ్యాసుఁడు మున్నగువారు, ధర్మశాస్త్రములను పురాణేతిహాసములను రచించి, మార్గదర్శకులైరి. అందుచే ధర్మమనగా దైవమే. ధర్మభీతి, దైవభీతియు నొకటే. కావున మనము ధర్మానుగుణవర్తనులమై జీవించుట ముఖ్యమైనది. ధర్మవర్తన మనగా నీశ్వరుఁడు సంతసించు శీలము. సకల ప్రాణులలో నీశ్వరుఁడున్నాఁడు కావున, సకల ప్రాణికోటి క్షేమమునకు దోడ్పడునదే ధర్మశీలము.

**487.** వేదాంతమనగా క్షణికము, అస్థిరమునైన దానిని విడిచి, స్థిరము, నిత్యమునైన దాని నాశ్రయించుట. కూలిపోవుటకు సిద్ధముగానున్న కుటీరములో బుద్ధిగల

వాఁడెవఁడు కూర్చుండి మృత్యుముఖమునఁ బడుట కిచ్చ గించును? మనదేహ మస్థిరము, బంధుమిత్రులు, భూద్రవిణ గృహారామాదిక మస్థిరము. పోవువానిని బట్టుకొని, ఉండునని భ్రమించుట దుఃఖ హేతువు ఏది స్థిరమైనదో అది ప్రత్యక్ష గోచరము కాదు. తాత్కాలికముగా గోచరించి మరల అదృశ్యమగుదానిని పట్టుకొని వ్రేలాడుచున్నాము. బాహ్య దృష్టికి గోచరింపకున్నను, పరమాత్మ లేక భగవానుఁడు పరమసత్యమని, వేదములు, ఉపనిషత్తులు, నమ్మదగిన ఋషులు, జ్ఞానులు చెప్పినది నమ్మి, అనుభవసిద్ధికై చెప్పఁ బడిన సాధనచేయుటే తెలివైన పని.

488. వేదాంతమనగా వెలుగును చీకటిని, శుభా శుభములను, సుఖదుఃఖములను, ఇష్టానిష్టములను, సమముగా (జూచుటే. కాని వెలుగును చీకటిని, సమానముగా (జూచు టెట్లు? సుఖము దుఃఖము సమానమా? ఇది పెద్ద ప్రశ్న. కాని యిది శ్రీకృష్ణభగవానుఁడు చేసిన మహోపదేశము. దీని భావమెరిగినచో నిందు కష్టముండదు. సూర్యునికి దూర ముగానుండుట వలనఁ గొంతసేపు చీకటి కనిపించును. సూర్యు నితో నెల్లప్పుడున్నవారికి చీకటిలేదు. అదియే ద్వంద్వాతీత స్థితి. ఆస్థితికర్థము దేవుని సామీప్యమునుగాంచుటే. అది అతీంద్రియస్థితి. దైవసాన్నిధ్యముందున్నచో నెల్లప్పుడు సర్వ శుభములు లభించును. దుఃఖదర్శనముండదు. ఇంద్రియస్థితి నుండి, యింద్రియాతీత స్థితికి (బోవుటయే దుఃఖనివార ణోపాయము.

489. వేదాంతమనగా మానవుఁడు చేయవలసిన పనిని చెప్పునది. ఏపనిచేసిన, దుఃఖమెన్నఁడు నుండదో, వేదాంతముచెప్పును. మానవజీవితములో నెన్నడు చెడని అవ్యయానందశాంతులు లేవని వేదాంతము చెప్పును. అవి దేవునియొద్ద నున్నవనియు, దేవునెఱిగి ఆశ్రయించినచో లభించుననియు బోధించును. దుఃఖసమ్మిశ్రితము, క్షణికము కాక, సార్వకాలికము శాశ్వతమునగు శాంతిసౌఖ్యము నీయఁ జాలని కాంతాకనకముల నాశ్రయించి, కాలము, శక్తి వ్యర్థములైపోగా, కాంతాకనకాభిలాష మోసమని తెలిసి, దుఃఖించి మృతినంది, తిరిగి జన్మించి, పూర్వజన్మదోషములకే మరలఁ బాల్పడి చర్వితచర్వణముగా అసంఖ్యాకములైన జన్మము లెత్తియు మానవులు గుణపాఠము నేర్చికొనలేకున్నారు. ఈ సంగతి తెలిపి బుద్ధిచెప్పునదే వేదాంతము.

490. వేదాంతము చెప్పునదేమనగా, మానవుని గమ్యము, గమనమార్గము, గమన విధానములను తేటతెల్ల మొనర్చును గమ్యము మోక్షము; గమనమార్గము బ్రహ్మ జ్ఞాన సంపాదనము, లేక పరమేశ్వరారాధనము, సర్వేతర కాంక్షలను తృణప్రాయముగాఁ జూచుట; గమన విధానము ముఖ్యమైనది. చిన్ననాటి నుండియే బ్రహ్మజ్ఞాన సంపాదన దీక్షప్రారంభమై, వార్ధకదౌర్బల్యము రాకుండగనే బ్రహ్మ వేత్తయై తరించు టవసరము. ఈదీక్షలో వేగము ముఖ్య మైనది. మృత్యువెప్పుడు పైఁబడి మ్రింగునో తెలియదు.

రోగాదిక దోషములడ్డువచ్చి, దీక్షను చెడఁగొట్టవచ్చును. కామకాంచన కీర్తికాంక్షాదులు త్రోవతప్పింప వచ్చును. అందుచే ఁగఠోరదీక్షతో వేగమును జోడించి తరింపుమని పిలుపునిచ్చునదే వేదాంతము.

491. వేదాంతమనగా నెన్నఁడెట్టి భయమును లేకుండఁ జేయునది మన భయముల కజ్ఞానమే కారణము. (1) అజ్ఞానము భయము నొకటియే. మనము నిజముగా అభయ స్వరూపమగు పరమాత్మయై యుండఁగా, జన్మజరామృత్యువులు గల దేహముతోడి అల్పజీవులమను భ్రాంతి నుదయింపఁజేసి బాధించునదే అజ్ఞానము. బ్రహ్మజ్ఞానము నాశ్రయించుటే దీనికి మందు. (2) లేదా, సర్వవ్యాపియై, మనహృదయమందిర నివాసియై, అఖండ కృపామూర్తియైన పరమేశ్వరు నాశ్రయించి, అభయప్రదాన మార్థించుటే చేయువలయు పని. ఆచరణలో రెంటికి భేదముండదు. భక్తి, జ్ఞానములు భయ రాహిత్యమిచ్చి రక్షింపఁగలవు.

492. వేదాంతము మనకు నిజముగా నెన్నఁడు దుఃఖమునకు ఁగారణము లేదని బోధించును. నశించు వస్తువులు నిజముగా నెల్లప్పుడుండుననను భ్రాంతి దుఃఖహేతువు. మన కన్నుల యెదుట నవి తమస్వభావము ననుసరించి నశింపఁగా మనమెందుకు దుఃఖింపవలెను? చెట్ల ఆకులెండి రాలిపోయి ధూళిలోఁ గలిసిపోయినవని యెవరైన నేడ్తురా? అటులే మనము నమ్మిన దేహము, భార్యాపుత్ర బంధుమిత్రాదులు

మృత్యువశులై నశింపఁగా మనము కన్నీరుపెట్టి విలపించుట, వివేకమని వేదాంతము ఘోషించుచున్నది.

493. వేదాంతము సమత్వమనగా సరియగు నర్థము చెప్పును. ఆత్మస్థాయిలో సకల జీవ, జడములు సమానములే. అపుడు సమానత్వము నిజమాయను ప్రశ్నయే లేదు. ఏకము, అద్వితీయమునగు సత్పదార్థము లేక పరబ్రహ్మము సత్యమైయుండగా సమానత్వ ప్రశ్నయేమున్నది? రెండు సంతకంటె నధికముగా నున్నచో, వస్తువులకు, సమత, భిన్నత సమస్య కలుగును, ఉన్నదొకటే పరమాత్మ అయినప్పుడే ప్రశ్నయు లేదు. దేహబుద్ధీంద్రియ స్థాయిలో భేదములు తప్పవు. అవి పరిమితములు, పరిణామవశములునై, భిన్న దశలలో నుండక తప్పదు. ఈభేదము జీవులలోను, జడములలోనుగూడ ననంతముగా నున్నది. దేహములు, బుద్ధులు, పరిణామదశననుసరించి భిన్నములుకాక తప్పదు.

494 వేదాంతము నిన్ను నీవు పరిశీలించికొని నీనిజ స్వరూపమేమో తెలిసికొమ్మని బోధించును. వికారము పొందునది నీవుకావని బోధపడును. దేహమునీవుకావని నిద్ర చెప్పుచున్నది. నిద్రలో దేహమును విడిచి, పెక్కు చోటులఁదిరుగుదువు. గాఢనిద్ర లేక సుషుప్తిలో మనోబుద్ధీంద్రియము లుండవు. మేల్కాంచి, సుఖమైన నిద్రపట్టినదని చెప్పుదువు. లోనుండి, నిర్వికారమైనదే ఆత్మయని పలికిరి. నీవు నీనిజస్వరూపమగు నాత్మజ్ఞానము నార్జించినచో, దేహ

మనోబుద్ధీంద్రియాదులన్నియుఁ దాత్కాలికోపకరణములని తెలిసి, అవి మార్పుచెంది చెడినప్పుడు విలపించుట విడిచి ఆనందము ననుభవింపుమనియే వేదాంతోపదేశము.

495 వేదాంతము మానవసేవయనగా మాధవసేవయేకాక, ఆత్మసేవయనియు బోధించును. ఆత్మసేవయనగా, నీకు నీవే సేవచేసికొనుట యని వేదాంతార్థము. విభిన్న పరిణామ దశలలోనున్న జీవరాశి కంతర్గతమై ఒకేపరమాత్మ నిలిచియున్నదనియు నందుచేఁ బరోపకార మనగా ఆత్మోపకారమనియు ననగా, నీసేవ నీవుచేసికొనుటే యనియు వేదాంతము ఘోషించుచున్నది. చంటిబిడ్డలకు స్తన్యమిచ్చి. చంకబిడ్డకన్నపుముద్దలు పెట్టి, కౌమారములోనున్న బిడ్డకుఁజదువు చెప్పించి, యుక్తవయస్కురాలైన కన్యకు వివాహమొనర్చుటయే నిజమగుసేవ. ప్రేమసమానము; సేవలో భేదమున్నది వర్ణాశ్రమ ధర్మముల భావమిదియే. రాగద్వేషములవిడిచి,ఆత్మాభిమానముతో నన్నిదశలలో నున్నవారికిని సేవచేయుటయు స్వీయసేవయగును. అదియే మాధవసేవ. నీవు మాధవుఁడవే; అందరలో నీవుండి, నీకేనీవు సేవచేసికొను చున్నావని వేదాంతము ప్రకటించు చున్నది. ఆత్మస్థాయిలో నేకత్వము, సమానత్వము, పరిణామ దశాంతర్దశలలో అనేకత్వము, అసమానత నుండగాలేవని ప్రచురించినచో నసత్య ప్రకటనమగును.

496. "అన్నం బ్రహ్మేతివ్యజానాత్" అని ఉపనిష ద్వాక్యము అన్నమనగా మనము బ్రతుకుట కుపయోగించు పంచభూతములు, దానివలన జనించు సకల ద్రవ్యములు సకల ధాన్యములు, కాయలు, దుంపలు, పండ్లు, అన్నియు నన్నమే. అవి లేకున్న మనము బ్రతుకఁజాలము. జీవాహారమై, పోషణ రక్షణములు, సంతతినిచ్చు నన్నము బ్రహ్మస్వరూపమే మన మన్నము తినుచున్నామనగా భగవంతుఁ డిచ్చిన ప్రసాదమని భక్తితోఁ దినవలెను. అన్నము నెన్నఁడు నిందింపఁరాదు; దుర్వినియోగ మొనర్పరాదు. ఏలన నది దైవదూషణ మగును. మరియు భుజించునపుడు పరమాత్మను స్మరించుచుఁ బరమాత్మ ప్రసాదమును స్వీకరించుటచే, బల విజ్ఞాన స్థైర్యములు లభించును.

497. భగవంతు నారాధించుటనగా భగవంతుని కిష్టములైన పనులను జేయుటే. మాధవసేవ యనగా, మాధవ సంతతిసేవ, అనగా సర్వప్రాణిసేవ. ఏప్రాణికి సేవచేసినను, దానిని పరబ్రహ్మ భావముతోఁ బూజించి చేయవలెను. ఏలన సర్వ ప్రాణులలో భగవానుఁడున్నాఁడు. నీలోను, సకల ప్రాణులలోను నిండియున్నవాఁడు మాధవుఁడే. ఆ మాధవుఁడు నీవే యని వేదములు పలుకుచున్నవి. సర్వప్రాణికోటి సౌఖ్యమునకై నీవు పనిచేసినచో, నీకు నీవు నిజమగు సేవచేసికొనిన వాఁడ వగుదువు. అదియే పుణ్యము; పుణ్యఫలము ముక్తియే; భగవంతునితో నేకత్వము; అదియే జన్మ రాహిత్యము;

అనిర్వచనీయానందము, ఆనందమయాఖండశాంతి; శాంత్యా నందమయామోఘానంత శక్తి, బలము, తేజస్సు, సర్వమును. భగవదారాధనముతోఁదుల్యమైన దింకొకటిలేదు; కారణము భగవత్తుల్యుఁడింకొకఁడు లేఁడు.

498. సకల సాగరములలోని జలబిందు సంఖ్య, నక్షత్రముల లెక్క, ఇసుక రేణువుల పరిగణనము, సర్వ ప్రపంచ వృక్షలతా పత్రముల లెక్కగట్టుట, యెవ్వనికి సాధ్యముకాదు. వీని నన్నిటి నిచ్ఛామాత్రముచేఁ గల్పించి, తొలగించు సామర్థ్యముగల భగవానుని పరిపూర్ణ శక్తి సామర్థ్యములఁ బంచేంద్రియములచేతను యంత్రసాహాయ్య మునను నెఱుఁగఁగోరి అన్వేషణ మారంభించిన ప్రకృతి శాస్త్రవేత్తల కార్యక్రమము వ్యర్థమైనది. గణనాతీత వస్తు గణన యత్నము బుద్ధిమాంద్యమును చూపును.

499. అప్పడము లు నిప్పులపైఁ గాల్చునపుడు, వాని నొకవైపు కాలినవెనుక, తిరుగవేసి రెండవవైపు కాల్తురు. రెండు వైపులఁగాల్చినచోఁదినుట కనుకూలించును. భక్తుఁ డప్పడము వంటివాఁడే. భగవానుఁడు తన భక్తుఁడు కదా యని సుఖమిచ్చినచో, నందుమరగి, కొంతకాలమునకు భగ వానుని మఱచి వర్తించుట కారంభించి, భ్రష్టుఁడగును. అందుచే భగవానుఁడు భక్తుని జీవిత మను అట్టు లేక అప్ప డము తిరుగవేసి కాల్చును. అనగా, నప్పుడప్పుడు కొన్ని చికాకులు, క్లేశములు కలిగించి, వేధించుటవలన భక్తుఁడు

దేవుని మఱువఁజాలఁడు. బాధలు, భక్తునికి భగవంతుని జ్ఞాపకముచేసి రక్షించును. ఇది భక్తి పరిణామ దశ; పూర్ణ భక్తుఁడు పరీక్షలన్నిట కృతార్థుఁడై పట్టములు పుచ్చుకొన్న వాఁడే.

500. మనకు దేహమును దేవుఁడిచ్చినాఁడు. మన మెంతకాలము జీవింపవలెనో, ఏదినమునేది యెంత తినవలెనో త్రాగవలెనో, నిద్రింపవలెనో, తుమ్ముట, దగ్గుట, త్రేన్చుట మున్నగు నత్యల్ప క్రియలుగూడ నీశ్వరచోదితము లై నడచు చున్నవను నది పరమ సత్యము. పాపమనగా నాసత్యమును శంకించుటే. నేఁడు మాతల్లిగారి తద్దినము నూరు రూప్య ములు వ్యయమైనది. ఇంటనున్నవాఁడు నాల్గవ పుత్రుఁడు మాత్రమే. ఆతనికి 102° జ్వరము. ఏ పదార్థమును భుజిం చుట కీశ్వరాజ్ఞ లేదు. నాభార్యకు జ్వరము; నేను చారు నన్నము స్వల్పముగాఁ దింటిని. వండినవన్నియుఁ బనిచేయు దాసీజనము తినిరి. ఒకగ్లాసు మంచినీరు త్రాగుట కీశ్వరాజ్ఞ కావలెను. సూక్ష్మ బుద్ధితో నన్నిటిని పరీక్షించు భక్తుని కీశ్వర సంకల్పము ప్రత్యక్షమగును; అనగా దేవునన్నిటిలోఁ జూడవచ్చును.

501. దేహభోగమునకు, రోగములు, నిర్వీర్యత్వము పన్నులుగాఁ జెల్లింపవలెను. దేహపటుత్వము వ్యయము కానిదే, యిహలోక భోగములు లభింపవు. దేహపటుత్వ సంపదనిచ్చి దేవునియొద్ద, ముక్తియను పటికబెల్లమును తెచ్చి

కొనవలెను. అదియే బ్రహ్మచర్య దీక్ష. కఠోర నియమముల ననుసరించు గృహస్థదాంపత్య జీవితము రెండవరకము బ్రహ్మచర్యము. ఇఁక స్వైరవిహారభోగ లంపటుల దౌర్భాగ్యములు కడు నికృష్టములు. అస్ఖలిత బ్రహ్మచర్యదీక్ష దైవభక్తితో మేళవించిన పుణ్యాత్ములకిఁక జన్మముండదు. మన మట్లు చేయలేక పోయినచో బ్రహ్మచర్యమును నిందింప రాదు. మన దౌర్బల్యము సుగుణమగునా ?

502. మానవజీవితము మొదటినుండి చివరవరకు నెట్టి యొడిదుడుకులు, బాధలు లేకుండ, సుఖశాంతి సంతోషములతో నడచుట, యిహలోకమున దుర్లభమైనది. పుణ్యపాపముల సాంకర్యమే మానవజీవితము. ఫలితము సుఖదుఃఖముల సాంకర్యము తప్పదు. మనకేల కష్టములు రావలెనని అనుకొని ప్రయోజనములేదు. అందుకే పాపమును వృద్ధి చేసి, పుణ్యమును తగ్గించు నాలోచనలు, కర్మలు మానుటకును, పుణ్యమును వృద్ధిచేయు భావములను, కర్మలను విశేషముగాఁజేయుటకును సూత్రములను గృహస్థ ధర్మములలో మేళవించి, హిందూధర్మప్రణాళిక జాతిని నడపినది. దానిని విడనాడఁజూచుట వినాశ హేతువు.

503. ఆద్యంతములు లేనిది ప్రపంచము, అది ఆద్యంతములు లేని భగవంతునినుండి వచ్చినది. ప్రకృతి శాస్త్రవేత్తలాద్యంతములు లేనిదాని కాద్యంతములు కనుగొనవలెనని ప్రయత్నించుచున్నారు. అనగా వారిబుద్ధి పెడత్రోవ

పట్టినది. పెడత్రోవపట్టిన వీరి కృషివలన మానవజాతి మను గడకే ప్రమాదము తెచ్చు మారణాయుధములు తయారు చేసిరి. రజస్తమోగుణాధిక్యముగల వివిధదేశాధిపతులు, పరి పాలకులు నిగ్రహ లోపముగలిగి లోకవినాశ కారకులు గావ చ్చును. ఇది లోకమునకుఁగల భయంకరప్రమాదము, భగ వానుఁడే యీప్రమాదమునుండి లోకమును రక్షింపవలెను.

504. మనహృదయములలో భగవానుఁడున్నాఁడు; పిశాచము లున్నవి. పిశాచములనగా గతజన్మలలోని సంస్కా రములు. అవిమనలను విడిచిపెట్టక, తలయెత్తి స్మృతిపథమున ఁదిరుగుచునేయుండును. పుణ్యాపాప సంస్కారములు రెండు నట్టివే. పుణ్యసంస్కారములు దైవారాధనమునకుఁ బ్రోత్స హించును. పాపసంస్కారములు దుష్కర్మకలాపములకు ఁబ్రోత్సహించును. తపస్సనగా ఁబాపసంస్కారముల సమూ లముగా, సంపూర్ణముగా నశింపఁజేయు కృషియే, లోనున్న హృదయ మందిర నివాసియైయున్న భగవానుని మఱువక, పూజించి, వాని కృపనార్జించినచో పాపసంస్కార పిశాచములు పారిపోవును. ఈ దైవారాధన కృషిలో ఁగృతార్థుఁడగు నాతఁడు తిరిగి జన్మింపనవసరము లేని ముక్తుఁడగును.

505. అమితమగు పాపముచేసి, అల్పమైన జపముతో దానిని పోఁగొట్టుకొనఁజూచుట లెక్క తెలియని మూఢబుద్ధిని సూచించును. "నేను జపముచేయుచుఁ జిరకాలమునుండి భగ వానునాశ్రయించితిని. నాకింకను కష్టములు, బాధలు, యాత

నలు కలుగుచున్నవి. భగవంతుని కృపకలుగలేద" ని విడ్డూరముగా నట్టి మూఢబుద్ధులు చెప్పికొనుచుందురు. నీ భగవదాశ్రయ దీక్ష, నీ జపధ్యానాదికము వలని పుణ్యధనము చాలదని స్పష్టము. చాలినచో నెట్టిబాధలు కలుగరాదు. కష్టము వచ్చి "యింకను పాపము మిగిలియున్నద" ని ఘోషించుచున్నది. గర్వమువిడిచి, అహంకారము తగులఁబెట్టి, భక్తితో భగవాను నాశ్రయించినచో, పాపక్షయము, దానితో గష్టరాహిత్యము; సంపూర్ణ సౌఖ్యప్రాప్తి లభించును.

506. కొందరు మనుజుల మైత్రి నెన్నఁడు శంకింపము. భగవానుని మైత్రినిగూర్చి మనకనేక శంకలు కలుగును. మనము భక్తులమనియు, మనకు భక్తి గలదనియు భావించి, కొన్ని సమయములలో భగవానుని మిత్రునికంటె దక్కువగా జూచుట జరుగుచున్నది, మిత్రుఁడెక్కడ ? భగవంతుఁడెక్కడ ? భగవంతుని మిత్రునికంటె నల్పదృష్టితో జూచుట పాపముకాదా? పైగా మనము భగవద్భక్తులమని చెప్పికొనుచున్నాము, శంకింపఁదగనివాఁడు, భగవంతుఁడొక్కఁడే. దేవునితో మైత్రి ఎంత పవిత్రమైనదై యుండవలెనో తెలిసికొనుము.

507. దుఃఖమును సంపూర్ణముగా నిర్మూలించికొను కృషిలో సర్వప్రాణికోటియు నిమగ్నమైయున్నది. ఏప్రాణి యేమిచేసిన నుద్దేశము దుఃఖాపనోదనమే కాని ఒక విచిత్ర పరిస్థితిని భగవానుఁడు సృష్టితోఁబాటు కల్పించియున్నాఁడు.

భగవానుని కృపామృత వృష్టి లేనిదే దుఃఖాగ్ని చల్లారు సాధన మింకొకటి లేదు. ప్రాణికోటి యెన్ని ప్రయత్నములు చేసినను, నెంత తెలివి, పట్టుదల చూపినను, భగవానుని కృపా లేశము లేనిదే, అవన్నియు వ్యర్థములే. ప్రపంచ జీవ నిర్మాణములోనే, తన్నాశ్రయించిన వానికిఁగాని దుఃఖము తొలగు మార్గము లేకుండఁ జేసినాఁడు. అనగా, కష్టము, దుఃఖము దేవుని జూపు బంటులు.

508. ప్రతి మానవుఁ డేకాంతమున గూర్చుండి, తనలోఁ దాను సూటిగా నిట్లు ప్రశ్నించుకొను చుండవలెను : "నాకు నిజముగా నేమి కావలెను ?" ఇదియే నిత్యము జపింపవలయు దివ్యమంత్రరాజము. దీనికి వివేకవంతుఁడైన వానికి సమాధానము త్వరలోనే లభించును "నీకునిజముగా దుఃఖము లేని స్థిర సౌఖ్యము కావలెను. అది దేవుని యొద్దనేయున్నది. అందుచే దేవునాశ్రయించి దానిని పొందవలెను. అది మరెచ్చటను లేదు." ఇదియే వివేకముగలవానికి లోనున్న పరమాత్మ యిచ్చు దివ్యసందేశము.

509. అసాధ్యములు సాధ్యము లేకాక, సుసాధ్యములగుట కవకాశమున్నదా ? తపశ్శక్తిచే సర్వము సాధ్యమని మనువు చెప్పినాఁడు. తపశ్శక్తి యనగా పరమేశ్వరారాధనముచేఁగలుగుశక్తి; అనగా పరమేశ్వరుని శక్తి యనియే భావము. జన్మజరామృత్యురోగ సమ్మిశ్రితమగు సంసారమే సకల దుఃఖ హేతువు. దానినిఁదొలగించుశక్తి పరమాత్మకే గలదు. లోకములో జబ్బులేనివాఁడెవఁడును లేఁడు. సంసార

ములో (దిరుగుటయను జబ్బుచే సకల జీవులు రోగులే, భోగ కాంక్షలు మితిమీరిన నేటి నవనాగరతలో నాజబ్బు దీర్ఘ కాలిక వ్యాధియే గాక, కుదరని గడ్డురోగమై అందర నేడ్పించు చున్నది. అసాధ్యరోగ నిర్మూలనమున కుత్తమ వైద్యుఁడు దేవుఁడొక్కఁడే. సర్వదుఃఖములకు మందు దేవుఁడే.

510. అజ్ఞాన జీవితము చీకటిలోఁ దడవులాట. ఎన్నఁడు చెడని శాంతి, ఆనందము నెచట నుండునో తెలియక మన మంధకారయాత్ర చేయుచున్నాము. ఆనందము శాంతియు బ్రహ్మపదార్థములు. అనగా శాంతి కర్థము భగ వానుఁడే; ఆనందమనగాఁ బరమాత్మయే. అందుచే మనము, పూర్ణనిశ్చలభక్తి లేక పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము నను దివ్వెను చేతఁబట్టి. చీకటిని పోద్రోలి, భగవత్తత్త్వమును గాంచి నచో, నెనలేని యానందము శాంతియుఁ గలుగును. మొదట మనము చీకటిలో నుంటిమని తెలిసికొనుట ముఖ్యము; భక్తి జ్ఞాన దీపములు వెలిగించినచో సత్యము దర్శింపఁబడును.

511. ఏది తటస్థించినను కంగారు పడకుము. ఎవరిని నిందింపకుము ; ఆత్మనిందయు వలదు. ఏపనిచేసిన నీచిత్తశాంతి తృణమాత్రమైనను సడలకుండునో అదియేదియో తెలిసికొని చేయుట నేర్చికొనుము. బాధించు తాటస్థ్య మసలు భక్తునికిఁ గలుగదు; ఒకవేళ నేదైనఁ గలిగినచో వెంటనే, భయవినయ భక్తిభావములతో, "భగవాన్ ! ఈ తాటస్థ్యము నాకు దుస్స హమైనది; దయతో దీనినిఁ దొలగించి రక్షింపుము"ని భగవ

త్సంకీర్తనముచేయుచుఁ గూర్చుండి యేమిజరుగునో చూడుము. నీవనుకొనిన తాటస్థ్యము సడలి, నీరసించి, అదృశ్యమగును. చేసిచూడుము ! అనంత కారుణ్యసాగర మీశ్వరుఁడని బుజువగును.

512. హ్రాస్వదృష్టి, దూరదృష్టి మందదృష్టి మున్నగు దోషములు కన్నులకుండవచ్చును.; కంటియద్దముల జోడు నుపయోగించినచో నాదోషములు పోవును. కాని మనోదృష్టి దోషములకు కంటిజోడువంటి జోడున్నదా ? ఉన్నది పరిశీలనమే ఆజోడు. అనగా వివేకము. ఉదయము పూచి, సాయంకాలమున కెండి రాలిపోవు పువ్వులను జూచి ఏడ్చుట హ్రాస్వదృష్టి; నిత్యము లక్షలకొలది మానవదేహములు రుద్రభూమి జేరి దహనకర్మకులోనై బూడిద యగుచున్నవి. దానికేడ్చుట మనో హ్రాస్వదృష్టి. దేహాదిక వస్థిరమని తెలియుట సవ్యదృష్టి; భగవదారాధనముచే సత్యమునుజూచు శక్తి గలిగి తరించుట సక్రమ. సమదృష్టి. వివేకము, లేక జ్ఞానమే యీదోషముగల మనస్సునకుఁ దగిన అద్దములజోడు, సంపాదించి ఉపయోగించుకొని సత్యవస్తువగు భగవత్తత్త్వమెరిగి, సుఖింపవలెను.

513. జపతపో ధ్యానాదులచే లభించు పరమేశ్వర కృపామృతరసా స్వాదనమువలన జనించు వాగతీతమగు నానందము, నెన్నఁడును చెడని చిత్తశాంతి ననుభవించుటకు— నిష్కల్మష చిత్తము, ధైర్యము, ఏకాగ్రత, భక్తిజ్ఞాన వైరా

గ్యములు అవసరములు. ఎన్ని జన్మములెత్తిన నెప్పుడో యొక ప్పుడు వీనినార్జించు కృషి చేసినం గాని. మానవుల దుఃఖములు పోవు. అందుచే నెంతశ్రమమైన నాకృషి చేసితీరవలెను. ఎట్టెదుటం గనపట్టు భోగాను భవావకాశములు, బ్రహ్మజ్ఞాన కృషి కడ్డువచ్చి బాధించును. కాని యీకృషి చేసి, తరించుట తప్ప గత్యంతరము లేదు. దీనికొక ముహూర్త మక్కర లేదు. వెంటనే ప్రారంభింపవలెను.

514. అన్ని గొడవలు విడిచిపెట్టి భయభక్తి వినయ ధైర్యములతో భగవానుని స్మరించుచు బ్రతుకుటయే అఖండ వివేకము, ఏలన నేసంసార సమస్యను దీసికొని పరిశీలింప దలచినను తీగలాగిన డొంకంతయుం గదలు రీతిగాం గొన్ని వేల యితర సమస్యలు వచ్చి, మనము చర్చించుచున్న సమస్యలో ప్రవేశించును. సాంసారిక సమస్యలాద్యంతములు లేనివి. మన అల్పబుద్ధి శక్తిచే వానిని బరిష్కరింప జూచుటవలన మన కాలము శక్తియు వ్యర్థములై, సమస్యలటులే వెక్కిరించును. పరమేశ్వర సంకీర్తన ధ్యానాదికము సకల సమస్యలను రూపుమాపి, శాంతిసౌఖ్యము లీయంగలదు. అందుచే నహంకారము, గర్వము విడిచి, శ్రీహరి పాదములాశ్రయింపుము.

515 పెద్దప్రయాణమనగా మరణము. అది యెప్పుడో తెలియదు. తెలియకుండుటొక దౌర్భాగ్యము. మన మరణ తిథి నిశ్చయముగాం దెలిసినచో, మేల్కొని, ప్రయాణ సన్నా

హాము చేసికొనుట కవకాశముండవచ్చును. కాని బుద్ధిగల వాఁడు ప్రతి దినము మృత్యుదివసమేయని నమ్మి, సంసిద్ధుఁడు కావలెను. మనము చేసిన పుణ్యపాప కర్మల ననుసరించి, మన మార్జించిన జ్ఞానధనము ననుసరించి, మనప్రయాణ సౌకర్యములను, మనము చేరవలసిన స్వర్గనరకాదులను నిర్ణయించి యీశ్వరాజ్ఞ నడపుచుండును. పుణ్యధన మత్యధికముగా నార్జించి, నిరంతర పరమేశ్వరారాధన పరుఁడైన వానికి సుఖమైన ప్రయాణము, స్వర్గాదికపుణ్యలోకప్రాప్తి, దైవకృపచే సర్వసౌఖ్యములు సిద్ధించుటయు జరుగును మానవులు సుఖప్రయాణ మార్గములు చూచికొనవలెను.

516. భగవంతు నస్తిత్వము శంకించువాఁడు తన బాగుతానెఱుఁగనివాఁడు; భగవానుని భక్తజన పరిరక్షణ దీక్షను శంకించునాతఁడు దురదృష్టవంతుఁడగు నల్పభక్తుఁడు. నిజమైన భక్తి యిట్లుండవలెను; "భగవానుఁ డున్నాఁడు; అంతట నిండియున్నాఁడు) మనోవాగతీతములైన సర్వపరిపూర్ణతలుగలవాఁడని పలుకుటయు సూచనప్రాయమే. భగవంతుని కారుణ్యదాక్షిణ్యములు, భక్తజనాధీనత్వమును అనుభవైకవేద్యములు, పరమేశ్వరుని కృపానుభూతి గాంచుట, శాశ్వత బ్రహ్మానంద శాంతి సౌఖ్యము లనుభవించుటే.

517. "అశాంతస్యకుతస్సుఖమ్." గీతావాక్యము. ప్రసన్న చిత్తములో దుఃఖములు ప్రవేశింపఁజాలవు. వ్యాకుల చిత్తమునకు ఁజిత్తోద్రేకముల సడలించు శాంతిసాధ నౌషధ

ములు (Tranquilizers) నేడు లోకమున విరివిగా వాడుచున్నారు. అవి చిత్తసంక్షోభము నణఁచివేసి, మఱికొన్ని రోగముల నుదయింపఁజేయును. భగవంతునియందు లగ్నమైన చిత్తమునకే ప్రసాద (శాంతి) లక్షణము జనించును. అట్టి చిత్తములో నెట్టి విషాదములు, కలతలు, ఖేదములు ప్రవేశింపఁజాలవు. నిశ్చలమగు భగవద్భక్తి తాపత్రయాగ్నుల నన్నిటిని చల్లార్చి, శాంతిని సమకూర్చు పరమౌషధము. దేవుని నమ్మి భజించువానికి వైద్యులు, మందులు నవసరము లేదు.

518. సర్వమీశ్వరాజ్ఞావశమై జరుగుచుండగా, నెవరు దోషులు, ఎవరు నిర్దోషులని నిందాస్తుతులు చేయుట కవకాశమున్నది? కర్తృత్వములేని వారికిఁ గర్తృత్వ మంగీకరించి, వారిచే జరుగు కర్మలకు ధర్మాధర్మ నిర్ణయములు చేయుట, వ్యావహారిక ప్రపంచమునఁదప్పదు. కాని ఉత్తమ భక్తుఁడు; జ్ఞానియునగువాఁడు సత్యము నెఱిగి యేప్రాణియెడ ద్వేషమును జూపఁడు. అజ్ఞానులకు ధర్మాధర్మములు, పుణ్యపాపములు నున్నవి. జ్ఞానికి రెండును లేవు. పరమార్థ దృష్టియే పరిపూర్ణ దృష్టి.

519. తపస్సులు మూఁడు విధములు; కాయిక వాచిక మానసికములు. సజ్జన పూజ, శౌచము, సత్యశీలము, కాయిక తపస్సు; మౌనము, ఆత్మనిగ్రహము, భావశుద్ధి, చిత్త ప్రసాదము మానసిక తపస్సు; హితమృదు వచనము, స్వాధ్యా

యము, వాచిక తపస్సు. పోడిమాటలలో (జెప్పికొన్నచో, సకల ప్రాణుల క్షేమమును గోరుట, పవిత్ర వాక్కు, మృదు మధుర సత్యసంభాషణము, సజ్జనసంగతి, భగవదితర విషయ వైముఖ్యము, నిరంతర భగవత్సాన్నిధ్య నివాసమునందు విశ్వాసము నివి మానవుని దేవునిగామార్చు సాధనములు.

520. "నమశ్శివాయచ శివతరాయచ" అని వేదము నందలి నమక వాక్యము. శివశబ్దమునకు శుభమునిచ్చు వాఁడని యర్థము. భగవంతుఁడు శుభము నిచ్చువాఁడను టత్స్వల్ప విషయము. భగవంతుఁడను నామములో సర్వ శుభము లిమిడియున్నవి. సూర్యుఁడు కాంతినిచ్చును; మేఘ ములు వర్షించును మున్నగువానిలో విశేషమేమియును లేదు. సర్వజ్ఞుఁడు, సర్వపరిపూర్ణుఁడు నగు భగవానుని కొక్కనికే సర్వశుభములిచ్చు అనంతశక్తి సామర్థ్యములు గలవు. మఱె వ్వరికిని లేవు. కాని వేదము 'శివతరాయచ' యని పలికినది. అనగా శివుని శుభప్రదానశక్తి అనిర్వచనీయమని యర్థము. మాటలకందని దని భావము.

521. నీకు భగవంతుని యందు నిర్దుష్టమైన భక్తి యున్నట్లు సాక్ష్యము, నీకు భగవదనుగ్రహము లభించిన ఋజువులు- నిత్యము చూచికొని- నీభక్తియెట్టిదో తెలిసికొన వలయును. నీ వుత్తమభక్తిగల వ్యక్తివైనచో – నీ విషయ ములోను, నీవు కోరు నితర విషయములలోను, భగవానుఁడు నీ కనుకూలముగా జరిగించుచున్న గుర్తులు గమనింపవలెను. నీకు నిజముగా భగవత్కటాక్షమున్నచో నీ జీవితములో నెట్టి

అశాంతియు, సంక్షోభము జనింపరాదు; జనించినచో భగవానుఁడు దానిని త్రుంచివేసి నిన్ను రక్షించిన సాక్ష్యములు నీవు పరిశీలించి కొనవలెను. దేవునికి నీవు వ్రాయులేఖయే నీభక్తి; నీలేఖ అందినట్లు, లేఖలోని విషయములు గుర్తించి, నీవాంఛితముల నెరవేర్చుచున్నట్లు నీకు సమాధానలేఖ దేవునొద్దనుండి రావలెను. అందు దేవుని సంతకమున్నదో లేదో చూచికొనుము.

522. నేత్రములతోఁ జూచుశక్తి; చెవులతో విను శక్తి మున్నగు నింద్రియశక్తులు, మనస్సుతో నాలోచించు శక్తి; కరచరణాద్యవయవములతోఁ బనులుచేయు క్రియాశక్తి యివి యెక్కడనుండి వచ్చినవి? దాని అధిపతి యెవరు? శరీర దహనమైన వెనుక నాశక్తులేమైనవి? శ్రీకృష్ణ భగవానుఁడే గీతలో దీనికీవిధముగా జవాబు చెప్పినాఁడు; "ఇంద్రియాణిపరాణ్యాహురింద్రియేభ్యః పరమనః, మనసస్తుపరాబుద్ధిర్యోబుద్ధేః పరతస్తుసః" "ఇంద్రియశక్తికిఁ బరమైనది మనస్సు, మనశ్శక్తికిఁ బరమైనది బుద్ధిశక్తి; దానికిఁబరమైనది ఆత్మ లేక పరమేశ్వరశక్తియునై యున్నది." ఈ పరిశీలన వలన 'నేను' ఆత్మశక్తి ఇంద్రియ మనోబుద్ధులను శక్తినిచ్చి నడపుచున్నది. అనగాఁ బరమాత్మయే సకలప్రాణి రూపములలో సంచరించుచున్నది. అనగా 'నేను' దేవుఁడు లేక 'ఆత్మ' కలిసియే యున్నాము; నేనే ఆత్మ లేక దేవుఁడు!

523. సంసారపుటొత్తిడి ప్రతి వ్యక్తిపై నుండును. దేహపోషణ రక్షణాది సమస్యలేకాక, చిత్రవిచిత్రములైన

అనేక కార్యక్రమములతో మానవుఁడూపిరి పీల్చు తీరిక లేకుండ సంచరించును. ఈ నిరంతర క్రియాపరతంత్రత-సుఖ మిచ్చునదా? లెక్కలేనన్ని మనఃక్లేశముల నిచ్చును. సంసార మొక ముండ్లపొద; లోపల నుండలేము; బయటకుఁ బోలేము. పట్టుకొని బాధపడలేము; విడువలేము. దీనిబాధ తొలగించు టెట్లు? సారథ్యము శ్రీకృష్ణుని చేతిలోనుంచి, సంసార యుద్ధము సాగించినచో జయము తప్పక లభించును.

524. ప్రతి విషయము నామూలాగ్రముగఁ బరిశీలించు శక్తియు నేర్పును బ్రహ్మజ్ఞాన మని చెప్పవచ్చును. మానవున కెట్టయెదుటఁగనప్పట్టి, ఆకర్షించి, లోఁగొనునవి భోగవస్తువులు, కామినీకాంచనములు, తత్సంబంధ కోటి సమస్యలు- వీనిని తుణ్ణముగాఁబరిశీలించినచో, భోగలాలసత్వము మానవుల మట్టిలోఁగలిపివేయు దారుణక్రూర రాక్షసిక శక్తి యని స్పష్టమగును. వాని యాకర్షణ బంధములనుండి బయట పడుట దుస్సాధ్యము పోసి అవి సుఖమిచ్చునా? క్షణికసుఖ లేశ భ్రాంతిని, అనంత దుఃఖము నవి కలిగించును. స్వల్ప విచక్షణ మాత్రముచే నిది గోచరించును. ఈ వస్తు రహస్య మును వివేకించి తెలిసికొని, శాశ్వతసుఖమిచ్చు వస్తువును గనిపెట్టి యార్జించుటే బ్రహ్మజ్ఞానము.

525. కీర్తికాంక్ష ప్రబల దోష హేతువు. నన్ను ప్రజలు పొగడుటకుఁ గారణము నాలోనేదియో గొప్పతన మున్నదని మానవుఁడు నమ్ముటయు, దానితో నహంకారము

చిన్న మొలకగా బయలుదేరి, కొలది కాలములో మహా వృక్షమై శాఖోపశాఖలను బెట్టును. అదియే సామాన్యుల పతనమునకే కాక, ఉత్తముల పతనమునకును గారణమగును. కావున భక్తుఁడు జ్ఞానియుఁ గాఁగోరువాఁడు కీర్తికాంక్షను వ్రేళ్లతోఁబీకి బారవేయవలెను. మనము సంపాదింపవలసినది భగవత్కటాక్ష సిద్ధి. అహంకార గర్వములను లోతు గోయిలోఁ బాతిపెట్టినగాని అది లభింపదు. అహంకారము నపరిమితముగా వృద్ధిచేయునది కీర్తికాముకత్వము.

526. భక్తుని కుద్రేకములు స్వాధీనములై యుండవలెను. ఉద్రేకవశుఁడైన భక్తుఁడు భ్రష్టుఁడగు నవకాశము లధికముగా నుండును. భక్తునికి లోకులను వారి మౌఢ్యమును, వారి దుష్ప్రవర్తనములను జూచినచో నుద్రేకములు కలుఁగవచ్చును. లోకములో నత్యధిక సంఖ్యాకులు రజస్తమోగుణాధిక్యముచే ధర్మవిరుద్ధ ప్రవర్తనమునకుఁ బాల్పడుటలో నాశ్చర్యము లేదు. వారి నీతి విరహితమగు ప్రవర్తనము వారి కతిసహజము. కాని భక్తులు వారి అజ్ఞతను, అవివేకము నర్థముచేసికొని, ఖిన్నులుగావలెనే కాని ఉద్రేకవశులు కారాదు. భక్తుఁడు తానెన్నఁడట్టి దుశ్శీలమునకుఁ బాల్పడరాదను దీక్షను నిలఁబెట్టుకొని, దయతో వారిని రక్షింపుమని భగవానుని ప్రార్థింపవలెను తెలియని వారు తప్పుపనులు చేయక మరేమి చేయుదురు? వారియెడ దయ చూపుటే భక్తుని కర్తవ్యము.

527. అజ్ఞాన సాగరమునఁబడి కొట్టుకొనుచున్న లోకులు, పండితులైనను పామరులైనను, నీవు పూజ్యుఁడవని భక్తుని స్తుతించి, మెడలో దండలువేసినచో సంతసింపవలెనా? విచారింపవలెనా ? నిజముగా నెవఁడు పూజార్హుఁడు ? భగవంతు నారాధించి, దర్శన సిద్ధిగాంచి, పునర్జన్మము లేకుండఁ జేసికొనిన పుణ్యాత్ముఁడే పూజ్యుఁడు నిందాస్తవముల కర్థమేమి ? అజ్ఞానులు తాత్కాలికావేశవశులై చేయు నిందాస్తవముల నంగీకరించు నాతఁడు నజ్ఞానులలోఁ జేరును. నీవు పూజ్యుఁడ వైతివని భగవానుఁడు మెచ్చి నీకు సర్వదోష విముక్తి నిచ్చినచో నది నిజమైన మర్యాద. భక్తుఁడు, జ్ఞానియు నట్టి గౌరవము నంగీకరింపవలెను; అజ్ఞుల స్తవములు సంసార బంధములను బిగించును

528. "యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిర్మతిర్మమ." యని గీతా చరమవాక్యము. దీని కర్థము భగవానుఁడనగా శ్రీకృష్ణుఁడు, అర్జునుఁడనగా భగవద్భక్తుఁడు. భగవానుఁడగు శ్రీకృష్ణుఁ డెల్లచోటుల నెల్లవేళల నున్నాఁడు. పార్థునివంటి ఉత్తమ భక్తుఁడుండుట కష్టము. అట్టి భక్తుఁడున్నచోట భగవానుఁ డతిశయముగా నుండును. భక్తుని కనుకూలుఁడై, రక్షకుఁడై యుండును అట్టి భక్తుని కపజయము, పరాభవము, మఱెట్టి లోపము నుండదు. అఖండైశ్వర్యము, విజయము, ఆనందము సర్వకల్యాణగుణ పరిపూర్ణుఁడైన పరమేశ్వరునివి. భక్తుని కవి సంక్రమించుటలో నాశ్చర్యము లేదు.

529. 'రాజు తలచినచో దెబ్బలకు కొదువా' యను సామెత గలదు. రాజనగాఁ బరిపాలకుని వశమై సైన్యబల ముండును. కావున రాజు తన రాజ్యములో నెవని నైన శిక్షింపఁగలఁడు. భగవానుఁడు సర్వప్రపంచాధిపతి. లోక ములో నెవ్వరికైన రక్షణ శిక్షణములీయ సమర్థుఁడు. అందుకే దుష్టశిక్షణము, శిష్టరక్షణమునకై పరమేశ్వరుఁ డవతారముల ఁదాల్చినాఁడు అట్లుగాక నిత్యము సర్వజీవుల జీవితములలో ఁబ్రతిప్రాణియొక్క శీలము ననుసరించి రక్షణ శిక్షణముల ననుక్షణమాయన యిచ్చుచునే యున్నాఁడు. ఏజీవిని దీసి కొనుఁడు. ప్రతిక్షణ జీవితములో నవసరోచితముగా భగ వానుఁడు ప్రవేశించి, సత్ప్రవర్తనమునకు రక్షించి, దుష్ప్ర వర్తనమునకు శిక్షించుచున్న సంగతి ప్రత్యక్ష గోచరము, సచ్ఛీలముతో భగవాను నారాధించి, శిక్షణ మవసరములేని రక్షణము నార్జింపవచ్చును.

530. మనుష్యులను శంకించుట మనుజుల కలవాటైన నది; ఈ యలవాటుతో దేవునికూడ శంకించువారైరి. భగ వానుని మానవులతో సమముగానో, కొంచె మధికునిగానో భావింతుము అనంత కల్యాణగుణ పరిపూర్ణుఁడగు భగ వంతునికి సాటి భగవంతుఁడే యని తెలియుట కనేక జన్మ ముల పుణ్యముండవలెను. భగవానునాశ్రయించి, భజింప వలెను. భగవానుఁడు రక్షించునా, రక్షింపఁడాయను శంక, నిజమైన భక్తికి దారుణలోపము. తన్నుగుర్తించి, శ్రద్ధతో

నారాధించు భక్తుల కన్ని శుభములు సమకూర్చును. అట్లా రాధించి ధన్యులైన వారి సాక్ష్యములు విని మేల తిరిగి శంకించు ప్రారబ్ధము పట్టవలెను. ఇది అనుభవైక వేద్యము. విశ్వసించి, ఫలితముఁగాంచి నిశ్చయమును నిస్సందేహ మొనర్చుకొని తరింపవలెను

531. ధర్మార్థకామమోక్షముల నార్జించుటకు దేహము మనకు సాధనముగా భగవంతుఁ డిచ్చినాఁడు. దేహము నుప యోగించి, పుణ్యధనమార్జించి, దేహమవసరములేని జన్మ రాహిత్యమనగా మోక్షమును సంపాదించి కొనవలెను. అనగా దేహావసరమును తత్సంబంధ దోషములను పోగొట్టుకొనుటకు దేహమే ఉపకరణము. దేహమును యుక్తరీతిని బోషించుట, దైవకృప లభించు సత్కర్మానుష్ఠాన జపధ్యానాదికముకై దాని నుపయోగించి, అది నశించు లోపున నాశనములేని ముక్తిని పొందవలెను. అజ్ఞానముచే దేహమే నేనను భావ ముదయించి, దాని నర్థకామములకే ఉపయోగించి, మాన వులు భ్రష్టులగుచున్నారు. ఇది గమనించి నడచుకొను నాతఁడే ఉత్తమ మానవుఁడు.

532. మానవ జీవితమే కురుక్షేత్రము. ఇందు యుద్ధము జరుగుచున్నది. అధర్మకాంక్షలకు, ముక్తికాంక్షకు మధ్యమందీ యుద్ధము జరుగుచున్నది. పవిత్రమైన బుద్ధియే అర్జునుఁడు దేహమే రథము; హృదయ పీఠమున వాసుదేవుఁ డాసీనుఁడై రథసారథియై యున్నాఁడు. లోనున్న రథ

చోదకుఁడైన పార్థసారథిని నమ్మి యుద్ధము సాగించుచుచో జయము నిశ్చయము. వాసుదేవుని విడిచి, భుజబలమునే నమ్మి యుద్ధము సాగించిన దుర్యోధనున కపజయమేకాక, మృత్యువు నోటఁబడుట తటస్థించెను కావున నమ్మి వాసుదేవుని సేవించుచు సంసారములో నున్నచో నపజయ దుఃఖము లుండవు.

533. అన్ని అవయవములకు త్రాళ్లుకట్టి బిగించి పడవేసిన పశువులవలె మానవులు స్వీయవాంఛాబద్ధులై బ్రతుకుచున్నారు. అనేక సహస్ర జన్మములనుండి అలవాటైన యీ బంధనములున్నను, లేవనునట్లు బ్రతుకుచున్నారు. భార్య బిడ్డల బంధనములు, దేహాభిమాన బంధనము, కామకాంచన వాంఛా బంధనములు నెన్నియో కలవు. మనకు స్వేచ్ఛగలదను భ్రాంతి యినుపగొలుసు. ఈ గొలుసుల బిగింపుతో మనము జీవించుచు నిందులోనే సుఖముకోరి, దానికొఱకువ్విళులూరుచున్నాము. బంధములు సుఖమిచ్చునా? దురంత దుఃఖమే మిగులుచున్నది. బంధముల గుర్తించి, గొలుసులు తొలగించికొని, స్వేచ్ఛాసుఖముల పొందవలెనని యత్నించుటే జ్ఞానము. నిరంతర పరమేశ్వర భజనచే బంధములు తొలగి స్వేచ్ఛ లభించును.

534. మానవుఁడు కోరఁదగినవి రెండు; అభ్యుదయ నిశ్శ్రేయసములు. అనగా నిహపరసుఖము, మోక్షము. ధర్మకర్మాచరణము, పుణ్యార్జనమును, పుణ్యార్జన మిహపర

సుఖము నిచ్చును. అభ్యుదయ మీశ్వరుఁడీయ వలయునదే. ధర్మావ్యతిరేకముగాని సత్పురుషున కభ్యుదయము నీశ్వరుఁ డనుగ్రహించును. ఇఁక రెండవదైన మోక్షము సర్వ బంధ విముక్తి. అదియే శాశ్వత శాంతిసౌఖ్యసమృద్ధి అనగాఁ బర మాత్మ లక్షణము, భక్తిజ్ఞానముల కది సాధ్యము; జపతపో ధ్యాన నిరవధికదీక్ష దానికి సాధనము. అనేక జన్మముల కృషి దానికవసరము. అనగా వెంటనే బుద్ధిమంతులు తప స్సాధన చేయుటకుఁ బూనుకొనవలెను.

535. దినములు వేగముగాఁ దొరలిపోవుచున్నవి. నేను దేహమును విడిచిపెట్టవలయు కాలము సమీపమగు చున్నది. కృష్ణప్రభూ! ఒకసారి దయతోఁ బలుకరించి, "నీకు భయములేదు. నేనున్నాను; రక్షింతునని అభయహస్తము నీయవా"యని నిష్కల్మష చిత్తముతో నిరంతరము ప్రార్థించు చుండుటే నేను జేయవలయుపని. జీవితము తిరుగులేని పయ నము. సూటిగాఁబోయి, మమకారాభి మానములతోఁ బెంచి, పోషించిన దేహము నగ్నిదేవుని కర్పింపవలెను. మరల నెచటికేగి, చేసిన పుణ్యాపాప ఫలితము లెట్లనుభవింపవలెనో, మరల నేకాంతాగర్భములోఁ బ్రవేశించి, యడుమలకు గురి కావలెనో మనమెఱుఁగము. కావున సర్వోపాయములచే దేవుని కృపను, అభయప్రదానము నార్జింప దీక్షతోఁ గృషి చేయవలెను.

536. భక్తుని భగవానుఁడెందుకు శిక్షింపవలెను; అప కారము చేయవలసిన యవసరము దేవునికేమున్నది? అందుచే

నిజమైన భక్తుని జీవితములో నేమి జరిగినను, భక్తునికి వ్యతిరేక ముండదు. విశ్వప్రాణి పరిపాలకుడు జగత్ప్రభువే; తనకై తహతహలాడు భక్తపుంగవులకు సర్వమనుకూలమగు రీతి నాదేశించి సంతోషించును. నీవు భక్తుడవు కాఁగోరుచుంటివా? సర్వలోకాధ్యక్షుఁడైన సర్వాధిపతి, సర్వానుకూలుఁడై, నీకు సకల శుభసౌఖ్యశాంతు లిచ్చి రక్షించును, ఇదియెంత గొప్పవిషయమో ఊహించుటకు బుద్ధిశక్తి చాలదు.

537. కులతత్త్వము నిర్మూలింపవలెనని కొందరు రాజకీయవేత్తలు పలుకుచుందురు. కులములు వృత్తులనుబట్టి వచ్చినవి. మానవులందరొకే కులమని పలుకుట, సత్యదూరము. చెట్లు, పశు, పక్ష్యాదులు నొకే కులమా? మానవులందరు నన్నివిషయములలో సమాన లక్షణములు గలిగియున్నారా? బాహ్యజగత్తులో భేదములున్నవి. ఆత్మస్థాయిలో భేదములు లేవు. ఆత్మస్థాయిలో సమస్యయే లేదు, భౌతికరంగమున ననేకభేదములున్నవి. కులము పోవలెనను రాజకీయవేత్తలలోఁ గులవర్గాభిమానములు నశించినవా? కులాభిమానము తప్పుకాదు; కుల దురభిమానము తప్పు. ధర్మవిరుద్ధ కులాభిమానము పోవలెను. కులములో దోషము లేదు; గుణములో దోషమును దొలగింపవలెను.

538. కలిసి తినుట, విభిన్నకుల వివాహములు, ముఖ్యవిషయములు గావు. అధర్మముగా నార్జించి తినుట, కాముకత్వమును ప్రేమయనుట దోషములు. కులాంతర

వివాహములు పరిశుద్ధ ప్రేమవివాహములని చెప్పఁగలమా? వ్యక్తిగత క్రోధకాలుష్యములు విడిచి యీవిషయములు పరిశీలింపవలెను. అంతర్వర్ణ అంతర్మత భోజనములు మనస్సులను, రాగద్వేషములను మార్పఁజాలవు. నైతికవర్తనము, నిష్కలుష శీలము ప్రధానమైనవి. పరస్పర సహకారము, అన్యోన్యద్వేష రాహిత్యము ముఖ్యములు. యోగ్యుఁడేకుల మునకుఁ జెందినను పూజ్యుఁడే. కలిసి తినుచు, కలిసి పెండ్లియాడు కుటుంబములోఁ గలఁతలు, కొట్లాటలు లేవా?

539. యముని, యమభటుల నవమానించి పారిపోవునట్లు చేయు నుపాయము తెలియునా? మార్కండేయుని వలె శివుని కౌగలించికొని కూర్చుండుటే. శివుఁడు నీహృదయ మందిరముననే యున్నాఁడు. శివుని మఱువకున్నచో యముఁడు రాఁడు. నిత్యము శివుని పాదపద్మముల నాశ్రయించినచో నకాల మృత్యువు సంభవింపదు. శివుఁడే యముని రూపమున శిక్షించువాఁడు. శివు నాశయించిన వానికి శివుఁడే దర్శనమిచ్చి కాపాడును. శివస్మరణము వజ్ర కవచము, బ్రహ్మాస్త్రమును. అది అభయ స్వరూపము.

540. నీకుఁ బ్రబల శత్రువొకఁడుగలఁడు. వాని నెఱుఁగుదువా? వాఁడు నీవే. నిన్ను నీవెఱుఁగని కారణమున నీకు నీవే శత్రువై నశించుచున్నావు. నీలో నిలిచి, నీ యింద్రియములను, మనస్సును, బుద్ధిని, దేహమును సర్వకాల సర్వావస్థలలో నడపించుచున్నవాఁడు సర్వశుభప్రదాత, ఆశ్రిత

కల్పకమునైన పరమేశ్వరుని గుర్తింపకుండ నుండుటకంటెఁ బ్రబల శత్రుత్వమేమున్నది? జేబులో వలసినంత ధనమున్నది; లేదనుకొని బిచ్చగాఁడవైతివి. నీతోఁగలిసిపోయి నీలో నివసించుచున్న పరమాత్మను గుర్తించి, అనుగ్రహమునార్జించి సుఖించుటకు బదులు, గుర్తింపక సకల దుఃఖము లనుభవించుచున్నావు.

**541.** "సంతుష్టో యేనకేనచిత్" భక్తుని లక్షణము నిట్లు గీతాచార్యుఁడగు కృష్ణప్రభువు, భక్తియోగములోఁ జెప్పినాఁడు. నీకు దేవుఁడనుగ్రహించిన దానితో సంతుష్టి నందవలెను. దేవుఁడనుగ్రహించినది నీకుఁజాలనిదైనచో నేమిచేయుట? చాలని దానితో సంతృప్తి యెట్లుకలుగును? ఈప్రశ్నకుఁదావులేదు. ఏలన నీకేమీయవలెనో దేవునికిఁదెలియదన్నమాట. అది దైవదూషణమగును. మఱియు నింకొక భావమిందిమిడి యున్నది. చాలని రీతిగానిచ్చి అసంతృప్తిని కలిగించి, సంతృప్తియు దేవుఁడొసఁగునదే యని గ్రహించి, దానికొఱకును దేవుని ప్రార్థింపవలెను. నీకు సంతుష్టి కలుగునట్లే దేవుఁడిచ్చును; లేదా సంతుష్టినిచ్చును.

**542.** భగవానుఁడిచ్చిన దానితో సంతృప్తి నందక, ఏవేవియో యింకను గావలెనని కోరుట మొదలిడినచోఁ గోర్కెల కంతముండదు. ఆయుర్దాయ మంతయు నొకటి వెనుక నొకటి కోరుచుండు తుదిలేని వ్యాపారమగును, కోరికల కంతముండదు. అందుచే భక్తుఁడు భగవానుఁడిచ్చిన దానితో

సంతుష్టినంది, ముఖ్యముగా వలయు భక్తిజ్ఞానమోక్షముల నిమ్మని కోరవలెను. కాని సత్యమేమన భక్తునికి భగవానుఁ డెన్నఁడు లోటు చేయఁడు; భక్తుఁడడిగినను, అడుగకున్నను భగవంతుఁడు భక్తుని కిహలోక జీవయాత్ర కవసరమైన వానిలో లోపము నెన్నడు చేయఁడు. ఇది అనుభవముచేఁ దెలియు విషయము.

543. మానవునకుఁ గర్తృత్వాధికారము లేదు; భగవానుఁడే సర్వకర్త. ప్రాణులలోఁ బ్రవేశించి, ప్రాణుల ద్వారమున నన్నిపను లాభగవానుఁడే చేయుచుండుటవలన జీవులే కర్మలను జేయుచున్న వను భ్రాంతి జనించును. ఇందలి మర్మమేమో, భగవంతుని సాక్షాత్కారముగలిగి, భగవంతుఁడే మనకు దయతోఁ దెలియు జ్ఞానభిక్ష నొసఁగినప్పుడే తెలియుట కవకాశమున్నది. భగవంతు నాశ్రయింపవలెనను బుద్ధి పుట్టించి రక్షించువాఁడును భగవానుఁడే. అయినచో మనము కర్మలు చేయవలదా? చేయునవి చేయుట, మానినవి మానుటయు నీశ్వరసంకల్పముచే జరుగును.

544. మన కనారోగ్యము, దారిద్ర్యము, అవమానము, శత్రుత్వము మున్నగునవి కలిగి బాధించుచున్న వనఁగా, మనముచేసిన యీశ్వరారాధనము, వానినిఁబోఁ గొట్టునంత శక్తిగలది కాదని వేరుగాఁజెప్ప నవసరము లేదు. చీపురుపుల్లతో బలమైన సర్పమును చంపఁగలమా? గట్టి కర్రతో గట్టిగా సర్పమునుకొట్టి, తల యెత్తినచో మరల

మరలఁ గొట్టుచు నది మృతినందువరకుఁ గొట్టవలెను. జన్మాంతర మహాపాపము లను సర్పరాజములు, వ్యాధిదారిద్ర్యావమాన రూపములలోఁ దలెత్తి పైఁబడ యత్నించుచుండును. శివస్మరణ మను కర్రతో నవి పూర్తిగా నశించువఱకుఁ గొట్టు చుండవలెను అనగా మితిలేని భగవదారాధనము, సర్వదోషములను నుసిచేయును.

545. కృష్ణప్రభు విచటనుండగా, ఆయన నాశ్రయించి స్మరించెడు కుతూహలముండఁగా, భక్తజన కల్పకమై ఆయన నిరంతరము కాపాడుచుండఁగా, నెందుకాందోళనము? పరమకరుణామృత భాండమైన పరమేశ్వరునొద్ద గూర్చుండి యేడుపా? ఎంత అజ్ఞానము? ఎంత బుద్ధిమాంద్యము? శ్రీకృష్ణప్రభువున్నచోటనేయుండి, స్మరించి భక్తితో పూజించుచుండగా లోపదోషము లెందుకుండును? మతి పోయినదా? ఆయన దివ్యనామ సంకీర్తన మను నమృతౌషధము సర్వవ్యాధి నివారిణి కాదా? నీ కన్నియుఁ దెలియునను గర్వము, నహంకారము! వానిని విడిచి కృష్ణప్రభువు పాదములు పట్టుకొని, అన్ని బెంగలు తృణప్రాయముగా విడిచిపెట్టు.

546. "భగవంతునిఁ గీర్తించిన దేహరోగములు పోవునా"? ఇదియొక ప్రశ్న. భగవానుని భక్తితో స్మరించినచో సర్వదుఃఖములు పోవుచుండఁగా శరీర జాడ్యములు మాత్రము మిగులునా? మానవదేహమున కెన్నివిధములైన బాధలుండు నవకాశమున్నదో, అన్నియు నిశ్శేషముగా భగ

వత్సంకీర్తనాగ్నిలోఁబడి భస్మములై పోవును. అంతేకాదు; మానసిక యాతనలు, బుద్ధి దోషములు, సర్వము నశించుటే కాక, అమిత సంతుష్టి, ఆనందము, శాంతియుఁగలిగి, తిరిగి జన్మింప నవసరములేని మోక్షసిద్ధియునగును. రామస్మరణము కంటె నౌషధమేమున్నది?

547. "ఎన్నాళ్లు? ఇహలోకమున 73 సంవత్సరములు గతించినవి. ఇంకెంత కాలము కావలెను? ఎప్పుడో దేహత్యాగము తప్పదుకదా!" యని నాలోనేను ప్రశ్నించికొని, శ్రీకృష్ణప్రభువుతో నిట్లుచెప్పికొంటిని; "కృష్ణప్రభూ! ఇంకొక జన్మమెత్తు కోర్కెలేదు. ఈజన్మమందే నీదివ్య దర్శనము లభించి, ముక్తుఁడను గావలెనని కోరుచున్నాను. నా జీవితమందుఁగాని, నాకుటుంబమందుగాని యెట్టి అపక్రమ దోషములు లేకుండ రక్షించి, ముక్తులమై దేహత్యాగము చేయు భాగ్యమిమ్ము! ఇంకేమియు వలదు." శ్రీకృష్ణప్రభువు నామొఱ వినుటయు, (గోర్కెలిచ్చుటయు జరిగి తీరునని విశ్వాసమున్నది.

548. చేయుటకేమియుఁ బనిలేదు; శక్తియులేదు. కావున నింక రామభజనమే మిగిలినది" ని మూర్ఖులు పలుకుదురు. అనగా రామభజన అన్నిపనులకంటెఁ దక్కువదని భావము. ఇట్టి మూర్ఖుల మాటలు తృణీకరించి, రామభజనముకంటె నుత్కృష్టమైన దింకొకటి లేదనియు, సకల దుఃఖ నివారిణి రామస్మరణమనియు, రామస్మరణ ప్రభావ మనంత

మైనదనియుఁ దెలిసికొనుటే అఖండపుణ్య ఫలితము. రామ భజనముచే సకలాశుభములు పోయి, సకల శుభములు సమ కూరునని చెప్పుట రామభజనవలని అనంతఫలితములో నొక నలుసంత చెప్పుటే యగును. అందుచే రామభజన శీలునితో సముఁడుకాని, అధికుఁడుగాని మఱెవ్వఁడును లేఁడు.

549. "తమేవశరణంగచ్ఛ సర్వభావేనభారత, తత్ప్ర సాదాత్పరాంశాంతిమ్ స్థానంప్రాప్స్యసి" భగవానుఁ డర్జును నికి బోధించెను. భగవానుఁడు సర్వజీవులలో నిండియుండి, జీవులను బొమ్మలవలె నాడించుచున్నాఁడు. ఆపరమేశ్వరునే సర్వవిధములచేత నాశ్రయించి, శరణుపొందినచో శాశ్వత సౌఖ్యశాంతులు లభించును. నీ తెలివి, పౌరుషము, పాండి త్యములను లోతుగోతిలోఁ బాతిపెట్టుము. అవి వెండ్రుకంత పని చేయవు. పరమేశ్వరుని పాదములు పట్టు; నీవు మఱే మియుఁ జేయనక్కరలేదు.

550. భార్య, బిడ్డలు, బంధువులు, లోకులునందరు నజ్ఞానమను చీకటిలోఁ డడవులాడుచు సత్యమేదో కానిదేదో తెలియనివారై ప్రలపించుచుందురు. భక్తుఁడు జ్ఞానియునైన వానికిఁ గోపమును రప్పింతురు. కాని క్రోధమువలన సమ స్యలు పరిష్కారము పొందవు; మరియు నెక్కువ జటిలము లగును. వారి అక్రమ సంభాషణములకు, వారి అనుచిత ప్రవర్తనములకు **వారి** అజ్ఞానాంధకారమే కారణము. చీకటి వస్తు జ్ఞానము చూపదని కోపగింతు**మా?** భక్తుఁడు జ్ఞానియు

నాత్మజ్ఞానమను దీపమును వెలిగించికొని, వారికిని వెలుగు చూపవలెను.

551. బాధ కలిగినదా? బోధకలుగ లేదా? బాధ వచ్చి బోధను కలిగింపవలెను. బోధయన భగవాను నాశ్రయింపవలెనను నిశ్చయజ్ఞానము, అట్టి బోధ, సుదృఢము, అచంచలము, సుస్థిరమునై నప్పుడు బాధలుండవు. అనగా బాధలున్నవన బోధపూర్ణముగా లేదన్నమాట. ఈవిషయమును భక్తుఁడు జ్ఞానియునైనవాఁడు నిత్యము తన అంతఃరంగమందు, భక్తియు, జ్ఞానము నెట్టిస్థితిలో నున్నదో పరిశీలించికొని, దానిని సమగ్రమొనర్చుకొను దీక్షపూనవలెను.

552. పరమేశ్వరుఁ డిచట నున్నాఁడని యెఱుగుదువా? ఆయన పాదపద్మము లాశ్రయించినచో, రక్షించునని యెఱుగుదువా? నీభక్తిలో లోపముండవలెనుగాని ప్రభువు రక్షణములో లోపమెన్నఁడు నుఁడదని యెఱుగుదువా? ఏలనఁ దన్నుఁ జిత్తశుద్ధితో నాశ్రయించిన భక్తుని రక్షణభారమును వహింప బద్ధకంకణుఁడై యున్నవాఁడే భగవానుఁడని యెరుగుదువా? అయినచో నీ వెరుగని దింకేమున్నది? పరమేశ్వర కృపామృతవృష్టి నీపైఁ గురియలేదా? సరిగాఁ జూచికో! సవరణ యెచటఁగావలెనో పరికించు. అప్పుడు నీకు సమస్యలు మిగులవు.

553. నీకంటికేది కనపడినాసరే, అది భగవానుని రూపమేయని నిస్సంశయముగా నమ్మము. "విశ్వ మేవేదం

పురుషః" వేదవాక్యము. విశ్వమంతయు భగవంతునితో నిండి యున్నది. ఏకము, అద్వితీయమునగు పరమాత్మ నానా రూపములను ధరించెనని వేదవచనము. ఇదంతయు భగవానుని మూర్తియే యైనచో, నీవు నాపరమాత్మగాక మరే మగుదువు? నీవును దేవుఁడవే. కానని గోలపెట్టుచున్నావు. దేవుఁడే దేవుఁడు దానుగానని యేడ్చుటకంటె వింతయేమున్నది? దేవుని కజ్ఞానమా? నాటకమా? లీలయా? వినోదమా? దేవునారాధించి తెలిసికొమ్ము.

554. మాయయను నజ్ఞానమువలన మానవుఁడు సత్యము నెఱుగక, లోకములో అనిత్యపదార్థ సంపాదనా వ్యామోహాబద్ధుఁడై చలించుచున్నాఁడు. క్షణికభోగద్రవ్య సముపార్జనకృషి, మానవమానసము మాయాశక్తివశమై, చేయుచున్నది. ఇందొక వైచిత్ర్యమున్నది. మాయా కల్పిత మనస్సుగల మానవుఁడు, తన భోగద్రవ్య సముపార్జనములో మాయాశక్తుల నుపయోగించుచు మోసములొనర్చుచున్నాఁడు. మోసము మాయలో భాగమే. భగవానుఁడు కల్పించినది పెద్దమాయ, మానవుఁడు చూపునది మాయలో నంశము. అనగా మాయలోమాయ. ఇది అద్భుతము; ఈ మాయను జయించు బీజము లోపల ప్రతిప్రాణిలో నున్నది. దానిని వృద్ధికిఁ దెచ్చినచో నది పరమేశ్వరశక్తి యగుటచే మాయను జయింపఁగలదు. అనగా దేవుని నమ్మిభజించుట, మాయ, మాయమగుట నేకకాలముననే జరుగును.

555. మన దేశము సుస్థిరముగానుండి మరల సుసంపన్నమై సుఖమందవలెనన్నచో, దేశమును నడపు ముఖ్యనాయకులు, అధమమధ్యశ్రేణి లోనివారు ధర్మపరాయణత్వము, దైవభక్తి, దైవభీతి సమగ్రముగా నభ్యసించి, అచంచలమగు నాధ్యాత్మిక బలశీలమును దమ జీవితములోఁ బ్రదర్శింపవలెను. వారిలో నెట్టి లోపములున్నను, ప్రజలు కూడ వారి ననుకరింతురు. దానితో దైవకృప లోపించును. ఇహాపరములు రెండును తుడుపెట్టుకొని పోవును. దానితో సకల దౌర్భాగ్యములకు నిలయమై దేశమధోగతిఁ జెందును.

556. అన్నియు సక్రమముగా శుభప్రదముగా జరుగును. ఎందుచేత? విశ్వపరిపాలకుఁడు భగవానుఁడున్నాఁడు కనుక; భగవానుఁడు భక్తజనార్తిహరుఁడు, రక్షకుఁడు కనుక. భగవానుని పాదపద్మములాశ్రయించుటలో నీ వనిశ్చిత విశ్వాసమును జూపినచో అపక్రమములు నీ జీవితములోఁబొడఁ జూపును. అది నీవే ఆత్మపరిశీలనముతోఁ జూచికొనవలెను. నీ మనస్సును మంచికిఁ జెడుగునకుఁ గూడఁ బ్రోత్సహించువాఁడు భగవానుఁడు కాఁడా? భగవానుఁడు కర్తయని గుర్తించినచో, నా వెనుక నీకుఁదప్పుపనులుచేయుకోరిక నశించును. దేవుఁడే సర్వకారణమని గుర్తించుటకంటె శ్రేష్ఠతరమైన జ్ఞానము వేరుగాలేదు.

557. "నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్." గీతావాక్యము. నేనేమి పనిని కించిత్తైనను చేయుట

లేదని తత్త్వవేత్త తెలిసికొనును. "ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్" "ఇంద్రియము లింద్రియ వస్తువుల యందు వర్తించుచున్నవి." అనియు గీతావాక్యమే. ఇంద్రియము లెవనిచేఁ గల్పింపబడెను; ఎవని యాజ్ఞననుసరించి వర్తించుచున్నవి? అవి భగవత్కల్పితములుగావున భగవదాజ్ఞ ననుసరించి చరించుచున్నవి. అనగా నీశ్వరుఁడే యింద్రియముల నింద్రియ వస్తువులయందు వర్తింపఁజేయుచున్నాఁడు. అజ్ఞానవశమున నేను, నీవు, జీవులు కర్తలమని భ్రాంతిచేఁ దలచుచున్నవి. ఈ రహస్యము నెఱిఁగినవాఁడే తత్త్వవేత్త.

558. భక్తునికి భగవంతునితో నుండవలయు సంబంధములో, భక్తుఁడున్నత స్థాయికిఁ జేరువరకు ఁదనలోఁ జేరులోపదోషములను తొలగించికొని, శుద్ధిచేసికొను చుండవలెను. దైవానుగ్రహమున కర్హత సంపాదించికొనవలెను. భక్తుఁడు సంసారగతుఁడగుటచే ఁగొన్నివస్తు కాంక్షలు, వ్యామోహములు తలెత్తు చుండును. అందుచేఁబరిశుద్ధ భక్తి లభింపదు. అందుచే దైవానుగ్రహము కోరిన రీతిగా నుండకపోవచ్చును. కాని భగవంతుఁడు భక్తుఁడు కాఁగోరుసాధకుని కన్నిటఁ దోడ్పడి, క్రమముగా లోపములు తగ్గించి, శుద్ధునొనర్చును. పూర్ణశుద్ధి, పూర్ణదైవానుగ్రహము నేకకాలముననే సంభవించును.

559. "కుతస్త్వాకశ్మలమిదమ్ విషమే సముపస్థితమ్ అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున" గీతావాక్యము. "స్త్రీకేల

యీవిషమ స్థితిలోనుండి చిత్తవికార మందుట ? ఇది అనా ర్యుల (అజ్ఞానుల) పద్ధతి, నరక హేతువు. అపకీర్తి నిచ్చునది." ఇది అర్జునునికే కాదు. ఏ అవస్థలోనున్న మానవునకైనను చెందును. ఏ పరిస్థితిలో నున్నను నప్పటికి (1) శాస్త్ర చోదిత మగుపని చేయుట (2) భగవంతుని గుర్తించి, భక్తి తోఁజేయుట జరిగినచోఁ జిత్తవికారము, విషాదమునుండవు. కారణములు (1) విధ్యుక్తధర్మాచరణ మనగా నీశ్వరోద్దిష్ట కర్మచేయుటే, (2) దేవుని స్మరించుచు భక్తితోఁ జేయుట వలన భగవానుఁడా పనిలోఁ బ్రవేశించి యెట్టి విషాదమున కవకాశము లేకుండఁజేయును. ఎవ్వనికి దోషము సంభవింప కుండఁజేయు దివ్యబోధ గీతామృతము.

560. కామినీకాంచ నానుభవ సంస్కారములు బల వత్తరమ్ములైనవి. ఒకప్పుడు క్షణికసౌఖ్యమునిచ్చిన కాంతా సంగమానుభవము; ధనమిచ్చిన తాత్కాలిక సంతుష్టి-వీని వాసనలు హృదయములో హత్తుకొని యెన్నిజన్మములెత్తి నను దొలఁగిపోవు. వానిని నిర్మూలించుటకు రెండేమార్గ ములు. (1) భక్తివలన భగవదనుగ్రహమునార్జించుట (2) బ్రహ్మజ్ఞానమును సంపాదించుట - మూడవమార్గము లేదు. అభ్యాస వైరాగ్యములచే మనస్సును నిగ్రహింపవలెనని గీతాచార్యుఁడు చెప్పినాఁడు. కామినీ కాంచనము లజ్ఞాన దుఃఖహేతువు లని స్పష్టముగా గ్రహించి, నిత్యభక్తి సాధ నముచే వానిని తృణీకరించు టభ్యసింపవలెను. వానిలోపము

లను గుర్తించుటచే వైరాగ్యము కలుగును. ఈ సంస్కార ములు బ్రహ్మరాక్షసులవలె పట్టుకొని విడువక పీడించును. బ్రహ్మజ్ఞానమను బ్రహ్మాస్త్రముచే వానిని నాశన మొనర్చుట సాధ్యము.

561. భోగములలోని సుఖలేశమును, మితిలేని దుఃఖ మును గూర్చి నిరంతరము చింతింపవలెను. వాని మంచి చెడ్డలను విపులముగా విడదీసి చర్చించి, వానిలోని దోష ములు శాశ్వతబంధ హేతువులని గుర్తించినచో వానియందు భ్రాంతి నశించును. విషము చంపునని తెలిసి యెవఁడు మ్రింగును? వస్తువుల మోసమును గమనింపక వానినిఁగోరు నవివేకము ప్రమాద హేతువు. సుఖము పొందవలెనను కొందరలో సుఖభ్రాంతి కల్పించు ద్రవ్యములందలి ఘోర దోషములను మనము పరిశీలించుటలేదు. కల్తీలేని స్వచ్ఛ స్థిరసౌఖ్యము భగవంతుని తెలిసి భక్తిజ్ఞానముల నార్జించుట వలననే లభించునని స్పష్టముగా నెరుగుటతో, వానియందలి భ్రాంతి నశించును. దీనికి తీవ్రసాధన దీక్షయే కావలెను.

562 మనముచేయు పుణ్యపాపములకు మనమే కర్త లమని భావించు నహంకారము నశించినఁగాని పుణ్యపాప ఫలితము లనుభవించుట తప్పదు. కాని మనము నిమిత్త మాత్రులమేయనియు మనచే సర్వకర్మలు దేవుఁడే చేయించు చున్నాఁడనియు నిస్సంశయముగా నెఱిగినవాని కట్టి కర్మఫలి తము లంటవు. పుణ్యకర్మ జరిగినపుడు 'నేనుచేసితిననియు,

ఁబాపకర్మ జరిగినపు డది దేవుఁడు చేయించెనని పలుకుట తన్నుఁదాను మోసగించికొను దుర్వ్యాపారము. విశ్వమంతయు నీశ్వర ప్రదర్శనమనియు, నీశ్వర సంకల్ప క్రియా పరిపూర్ణమనియు నిశ్చయజ్ఞానము కలిగినంతనే బంధములన్నియుఁదెగిపోవును. అహంకారనాశనమే మోక్షము.

563. చేతిలోనున్న విలువగల వస్తువులను వాడుకొనుటచేతగాక మనమందరము దుస్థితిలోఁబడి దుఃఖములనుభవించు చున్నాము, మనకుగల వస్తువు లన్నిటిలో అమూల్యమైన వస్తువొకటి గలదు. దానిని గుర్తింపకుండుటే మన దురవస్థకుఁ గారణము. ఈ అమూల్య వస్తువును సంపాదించికొనుటకు మనకెట్టి శ్రమయు లేకుండ మనకత్యంత సమీపముననేయుండి, మనకన్ని శుభములను, సకల పురుషార్థములను సమకూర్చు శక్తిగలది. ఆవస్తువేది? భగవానుఁడే యావస్తువు. భగవానుఁడు మనలో నున్నాఁడు; అన్నిట నున్నాఁడు; సర్వత్రనిండి యున్నాఁడు. ఆశ్రితులకు సకల సౌఖ్యములను వర్షించు దయామయుఁడు. ఏవస్తువును జూచినను, అందు దేవుఁడున్నాఁడని గుర్తించినంతనే మన స్వార్థదృష్టి మాఱిపోయి. దైవదృష్టి కలిగి, విశ్వమంతయు నీతోసహా భగవన్మయమని బోధపడును, దానితో సర్వ దుఃఖవినాశమగును. అదియే ముక్తి.

564. "అహం క్రతురహం యజ్ఞస్స్వధాహమహమౌషధమ్ మంత్రోహమహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్...అమృతంచైవమృత్యుశ్చ సదసచ్చాహమర్జున."

గీతామృతము. "నేను క్రతువును, యజ్ఞమును, స్వధను, ఔష
ధమును, మంత్రమును, నెయ్యిని, అగ్నిని, హోమమును నేనే,
ఉన్నది నేనే, లేనిది నేనే. అమృతమును, మృత్యువును నేనే"
అని యర్థము. మన మాటలలోఁ జెప్పినచో, "పొయ్యినేనే,
పొయ్యిమీద గిన్నె నేనే, గిన్నిలోని బియ్యము, నీరు, పొయ్యి
క్రింద నిప్పు, సమిధలు, వంటచేయువాఁడు, వంటకమును దిను
వాఁడు నేనే." ఇంతకంటె, "సర్వంఖల్విదంబ్రహ్మ" అంతయు
నేకబ్రహ్మమే యనిన సరిపోవును. అనగా, నేను, నా దేహము,
నింద్రియ మనోబుద్ధ్యహంకారములు నేనుజూచి, విని, అనుభ
వించునది, అంతా బ్రహ్మమయమే యని స్పష్టము. దేవుఁడు
వినాయేమీ లేదు.

565. సర్వత్ర పరమాత్మను జూడవలెనని వేదాం
తము బోధించుచున్నది. సర్వత్ర పరమాత్మను దర్శించు
టనగా సర్వము పరమాత్మయేయని చూచుటే. ఇఁకఁ
జూచునదెవరు ? పరమాత్మయే. పరమాత్మ పరమాత్మను
జూచుచున్నాఁడు. అందరిది ఆత్మదర్శనమే. అది అంద
రెఱుఁగరు. అందుచే సాధనకేమున్నది? ఇది గ్రహించుబుద్ధి
పుట్టవలెను. అన్నిటిలోఁ బరమాత్మయెట్లు వ్యవహరించు
చున్నదో చూడవలెను. అన్నివిషయము లాత్మదృష్టితోఁ
బరిశీలించి ఆనందించు టభ్యసించు మహాభాగ్యము లభించుటే
సిద్ధి; మోక్షము. ఇది శ్రీకృష్ణప్రభువే గీతలోఁ బలికెను
గావునఁ బరమప్రమాణము.

566. భగవానునితో నిట్లు మొరపెట్టుకొనవలెను; "నేనెందుకు బాధ లనుభవింపవలెను? దేహమనః క్లేశములు నాకెందుకుండవలెను? నాకవసరము లేదు; పిసరంత దుఃఖము ననుభవింపవలసిన యవసరము నాకు లేదు. ఎందుచేతనందువా? నేను నీ అబ్బాయిని; నీవెవరు? అనంత విశ్వప్రపంచాధిపతివి అంతేకాదు, అనంతశక్తి దయానిధివి. నిన్ను నమ్మినంత మాత్రమున సకల దోషములను క్షణములోఁ బోఁగొట్టి అనంతమగు నానందశాంతులను ప్రసాదించుటలోఁ బరిపూర్ణుఁడవు. అట్టి నాన్నగారబ్బాయిని నాకేల లేశమాత్రమును దుఃఖముండవలెను?"

567. మానవులిట్లు చెప్పికొనుచుందురు. "గతములో నేనెన్ని పాపములు చేసితినో ఇప్పు డనుభవించు చున్నాను. ఎంతటి వాఁడైనను చేసిన పాపములకు ఫలితము లనుభవింపక తప్పదు, ఏనాడో పాపములుచేసి అనుభవించుచున్నాను." ఈప్రకారము తలఁచి, దుఃఖానుభవము తప్పనిసరియని లొంగి పోవుచున్నారు. కాని ఒక విషయమాలోచింపరు. భగవానుఁడు నాకుఁ దల్లితండ్రి, రక్షకుఁడును. సకల కల్యాణగుణ పరిపూర్ణుఁడు. ఆయన పాదముల నాశ్రయించినచోఁ దెలిసి, తెలియక చేసిన పాపములను తొలగింపఁడా? క్షమింపఁడా? ఆయన పరమకారుణికుఁడని యెఱిగి, భజించినచో, క్షణ మాత్రమున సకల పాపములు, దుఃఖములు భస్మమగును. ఈ చిన్నపని చేసి సర్వసౌఖ్యములు పొందలేవా?

568. "నేనుకాదు" అనునది చతురక్షర మంత్రము, దీని నెల్లప్పుడు పారాయణ చేయవలెను. భగవానుఁ డేకైక కర్తయై, సర్వమును జేయుచున్నాఁడు, నేను నిమిత్తమాత్రుఁడను. పేరు నాది, చేత దేవునిది. అనగా భగవానుఁడాడించు చున్న చిత్రపటమును నేను; తోలుబొమ్మను, భగవానుఁడేది యేరీతిగాఁ జేయించిన నావిధముగా భగవానుఁడిచ్చిన కరచరణాదులతోడను నింద్రియ మనోబుద్ధులతోడను నాప్రకారముగాఁ జేయుచున్నాను, నేను కర్తనుగాను" అని స్పష్టముగా నమ్మి 'నిర్మమోనిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి" యని గీత చెప్పినట్లుగా నాచరింపవలెను. "నేను కాదు" మంత్రము జపించి, "దేవుఁడే" యను విశ్వాసముతో, సర్వ దుఃఖములను బోఁగొట్టుకొనవచ్చును.

569. భక్తులు, జ్ఞానులు కాఁగోరువారికి సంభవించు అహంభావము సామాన్యుల అహంకారము కంటెఁ బెక్కురెట్లు ప్రమాదకరమైనది. నాకు భగవానునిగూర్చి పరమాత్మనుగూర్చియు నితరులకంటె నధికముగాఁ దెలియునను దురహంకారము పతనహేతువు సంసారులవలెనే భక్తిజ్ఞాన సాధకులును దమ భక్తిజ్ఞానము లెవరికిని లేనంత గొప్పవని నమ్మి, అహంకార దోషముచే సత్యదూరులై వర్తింతురు. అహంకారము సత్యమును స్ఫురింపనీయదు. నిరహంకారులకే సత్యదర్శనమగును. ఆత్మదృష్టికి సత్యము గోచరించును. అహంకారము దాని నణచివేయును. పూర్తిగా నిరహంకారియైనవాని యెదుట సత్యజ్యోతి ప్రకాశించును.

570. పెండ్లిచేయుట మున్నగు పెద్దపనులమాట నటుంచి, పూచికపుల్లను విరుచుట యను పనియు మనచేతిలో లేదు. కృష్ణపరమాత్మ లీలయై సర్వము నడచుచున్నది. జీవితములో నేవిషయమును దీసికొని సూక్ష్మముగాఁ బరిశీలించినను, ఆ విషయమట్లు జరుగుట కీశ్వరసంకల్పమే కారణమని స్పష్టమగును. నీ జీవితములోనే కాదు; ఎవని జీవతములోని సంఘటనలను బరిశీలించినను, నిదే సత్యము గోచరించును. అంతే కాదు; లోకములో నేవిషయమైన నిదే సత్యమును ప్రదర్శించును. "ప్రజ్ఞానమ్బ్రహ్మ" యని ఉపనిషన్మహా వాక్యార్థమిదియే, జ్ఞానమే పరమాత్మ. "జ్ఞానంజ్ఞేయం జ్ఞానగమ్యం హృదిసర్వస్యవిష్ఠితమ్మ'ని గీత. అనగా జ్ఞానము, జ్ఞేయమనగాఁ బరమాత్మ, జ్ఞానమిచ్చుమోక్షము సన్నియు హృదయములో నున్నవి. పరమాత్మ పరమాత్మను దెలుపు జ్ఞానము, దానివలనఁ గలుగు మోక్షావస్థయునన్నియుఁ బరమాత్మయే.

571. "ఉన్నాను; భయపడకు" మని చెవులున్నవారికి భగవానుని మాటలు నిరంతరము వినఁబడుచునే యుండును. ఆయన సర్వసాక్షి; అన్నియు ఁజూచుచునే యున్నాఁడు. నీవాశ్రయించిన భగవానుని దివ్యదృష్టి, సర్వత్ర నిండియుండి, సర్వమునెల్లప్పుడు చూచుచుండగా, లోపములకు భయభ్రాంతులకు, చిత్తక్షోభకు, దుఃఖములకు స్థానముండదు. భగవానుని నమ్మి, ఆశ్రయించి భజించుటే సర్వదుఃఖనిర్మూలన మార్గము.

572. ఇదిగో నా విష్ణుచక్రమును నీచేతిలోఁ బెట్టి నాను. అది నీ చేతనున్నంత కాలము నీచేతిలో నేనే యున్నట్లు భావింపుము. అది తిరుగులేని ఆయుధము. సర్వ దోషములను భస్మమొనర్చి సర్వశుభముల నిచ్చునమోఘ బ్రహ్మశక్తి. అదియే రామనామము. దానిని నీలో నిలుపు కొని, నీ ప్రత్యణువుతో దానిని జపించు నభ్యాసముచేసి, సర్వ మును జయింపుము. ఎన్నడు నశింపని శాశ్వతానంద సామ్రా జ్యము నేలుకొనుము. అంతియేకాని దిగులుపడి యేడ్చు ప్రారబ్ధమేల యనుభవింపవలెను ?

573. భక్తుఁడు దేవునితోఁ దనకుఁగలకోర్కెలను, గష్టములను జెప్పుకొనుటకు సర్వాధికారమున్నది. బిడ్డలు తమ సంగతులను తమ తండ్రితోఁగాక మరెవ్వరితోఁ జెప్పి కొందురు? తండ్రికంటె సన్నిహితు లెవ్వరుందురు? కాని బిడ్డల కేమి కోరవలెనో తెలియదుగదా! భగవానునియందు నమ్మక మున్న భక్తులందరును చంటిబిడ్డలే! వయస్సు పెరిగిన బిడ్డలు! అందుచేత వారు, "మేమడిగినవానిలో మాకేది క్షేమమో అదియే యిమ్మ"ని కోరవలెను. ఇహలోక జనకుఁడు బిడ్డల యెడ మమకారముచేతను, అజ్ఞానమువలనను, ఏది బిడ్డలకు శ్రేయమో పూర్తిగాఁ దెలియకుండుట వలనను, వారికీయ రాని వానినిగూడ నిచ్చుచుండును. కాని విశ్వజనకుఁడగు పరమాత్మ, సర్వమెఱిఁగినవాఁ డగుటచే మనకేది శ్రేయః ప్రదమో అదియే యిచ్చి రక్షించును.

574. నిజమైన సంపూర్ణ భక్తి నీకున్నదా? ఉన్నచో నీ వెప్పుడెందుకు భగవానుని "ఓ రామప్రభూ! లేక ఓ కృష్ణ ప్రభూ!" యని పిలిచినపుడెల్ల "ఏమి కావలెను? చెప్పు" మని భగవానుఁడు బదులు పలుకవలయును. నీవు నీ భార్యతో, బిడ్డలతో, బంధుమిత్రులతో సంభాషించు చుండునటులే ఉత్తమభక్తుఁడు భగవానునితో సంభాషించుచుండును. ఇదియే నిజమైన భక్తి, భగవానుఁడు మాటాడఁగలఁడు; కోరినది వెంటనే ప్రసాదింపఁగలఁడు.

575. భక్తియనఁగా జ్ఞానమే. జ్ఞానమన భక్తియే. కర్మ, భక్తిజ్ఞానములకు వేరుకాదు. వీనిని సూక్ష్మముగాఁ జూచినచో మూఁడునొకటే. కారణములు; (1) భక్తియనఁగా భగవానునియందు భక్తి. భగవానునిపై భక్తి యెందుకుండ వలెను? మన లోపములన్నిటిని దొలగించి మనకు శాశ్వత సుఖమిచ్చు ననంత పరిపూర్ణశక్తిగలవాఁడు దేవుఁడు. ఆ భగ వానుని స్వరూప స్వభావము లెరుఁగవి భక్తి మూఢభక్తి. జ్ఞాన సహిత భక్తియే సమగ్రసంపూర్ణ భక్తి. భక్తియనగాఁ బవిత్రమైన భావము లేనిదే ఆ పరమాత్మ నెరుఁగ యత్నింపఁడు. ఎరుకయే జ్ఞానము; దేవుని సంగతి బాగుగా నెఱిఁగి ప్రేమించుటే భక్తి; అట్టి భగవానుని ఆదేశము లొనర్చుటే కర్మ. కర్త భగవానుఁడొక్కఁడేయని యెరిగి (జ్ఞానము) ప్రేమతో (భక్తి) చేయునదే కర్మ. భక్తిజ్ఞాన కర్మలొకే తత్త్వములోనివి.

576. ఎంత గొప్పవాఁడైనను, బలధైర్య సాహస ములు గలవాఁడైనను, దైవాశ్రయము లేనిచో వాని ప్రయత్న ములన్నియు నగ్నిలో దూదివలె భస్మమగును. భగవానుని సంకల్పము లేనిదే అర్జునుఁడంతటి బలశాలి గాండీవము నెత్త లేకపోయెను. ధర్మరాజంతటివాఁడు దైన్యముతో జీవిత మును గడపవలసివచ్చెను. చరిత్రలోఁ జికాకుపాలైన రాజాధి రాజుల ఉదాహరణములెన్నియో గలవు. అందుచే దేవుని కాదను పొగరుబోతు తనము నిరర్ధకము. దేవుని పాదములపై శీర్షముంచి భజించువాఁడెంత యల్పుఁడైనను సర్వపూజ్యుఁ డగును.

577. నీకుఁ దోఁచినపని చేయుము. పని సవ్యముగా జరిగి అనుకొనిన ఫలితము లీయకున్నచో నేడ్వకుము. కొన్ని పనులు భగవానుఁడు చేయించి మనముకోరిన ఫలితము లీయఁడు, కొన్నిటికి వ్యతిరేక ఫలితము లిచ్చును. అప్పుడే భక్తునికి పరీక్ష. భక్తుఁడిట్లు భావించి, నిశ్చల చిత్తశాంతిని నిలుపుకొనవలెను; "ఈపని భగవానుఁడు నాచేఁ జేయించెను. అనుకూల వ్యతిరేకఫలితము లాతఁడెందు కిచ్చునో మనకుఁ దెలియదు. భగవానుని నమ్మిన నీకెట్టి నష్టమును గలిగించు టాయన ఉద్దేశ్యముకాదు. కార్యము వ్యర్థమైనచో నదియే నాకు శ్రేయము. వ్యతిరేకమైనచో నదియు నాకు శ్రేయమే." అన్నియుఁ దెలిసినవాఁడు భగవానుఁడు. ఏమియుఁ దెలియని వాఁడవు నీవు!

578. నాన్న అనగా రామప్రభువు లేక కృష్ణ ప్రభువు. ఆయన సర్వలోకైకాధిపతి. నీజీవితమంతయు నాయన చేతిలో నున్నది. ఆయనయెడఁ బరిపూర్ణభక్తి గౌరవములు చూపినచో నీకెట్టి దోషమును సంక్రమింపకుండ నాన్నగారు చూతురు. ఎన్నియో విధముల నీజీవితనౌక నీ సంసార సాగరమునుండి తీరమునకుఁజేర్చుటకుఁ బూను కొనును. నాన్నగారన్నిటినిఁజూచి నెరవేర్పఁగల సమర్థుఁడని గుర్తించి, హాయిగాఁ బరుండుము, నీవెంద్రుక నెవఁడు త్రెంప లేఁడు. నాన్నగారి నెన్న డపార్థముచేయని దీక్షనొసఁగి రక్షింపుమని నాన్నగారినే కోరి భజింపుము. నాన్నగారి ఆదేశము సకల లోక సర్వవిషయములను నడపు అమోఘ శక్తియని మరువకుము.

579. నూటికెనుబది మంది తమ భుక్తినిమిత్తమె ఆలోచనలు, పనులు చేయుచుండుటలో నిమగ్నులై యుందురు. మిగిలిన యిరువది మందిలో నెక్కువ మందికి భుక్తి సంపాదన మవసరము లేకున్నను, భోగలాలసులై కాలమును వ్యర్థ మొనర్తురు. నూటికొకఁడో యిద్దరో, "నే నెందుకు జన్మిం చితిని. ఈజన్మ కర్థమేమి? విశ్వకర్త యెవఁడు, నేనేమి చేయ వలెను; దుఃఖవిమోచన మార్గమున్నదా ?" యని ప్రశ్నించి కొని, సజ్జన సద్గ్రంథపరిచయముచే, భక్తిజ్ఞానము లవసరమని గుర్తించి, కాలమును వ్యర్థమొనర్పక, తపస్సాధన లొనర్చి, తరించుటకు యత్నించును. మనకుఁగలశక్తి, కాలము పరమార్థ

సాధనమునకు జాలవు. తీవ్రగతిని సాధనచేసి తరించుటకుఁ బ్రబల దీక్షబూని కృషి చేయవలెను.

580. అన్ని పాపములకంటె మించిన పాపమొకటి గలదు. మనము భక్తితో నారాధించిన భగవానుఁడు రక్షించునా, రక్షింపఁడాయని శంకించుటే దారుణపాపము. ఈ సంశయము భక్తిసాధనలో దిగువమెట్టు; పైమెట్టు నిస్సంశయ ప్రగాఢ విశ్వాసము. "దేవుఁడున్నాఁడు; నేను భజించుచున్నాను; నన్ను రక్షించి తీరును." అను మెట్టునెక్కిన భక్తి ముఖ్యమైనది. భక్తునియెడ దేవునికుండు ప్రేమ హద్దులు లేనిది. ఎంత చిన్నపని చేసిన నెంత అఖండ ఫలితమో! అంతట నిండియున్న దేవుని పాదపద్మములను భజింపలేవా? భజింతువా, నీకు లోపము, దోషము, దుఃఖము నెన్నఁడుండవు; సర్వశుభములు, సుఖములు అనంతశాంతి, ముక్తియు నీవే!

581. "యేభజంతితుమాం భక్త్యామయి తే తేషు చాప్యహమ్" "ఎవరు నన్ను భక్తితో భజింతురో నాలోవారుందురు; వారిలో నేనుందున"ని శ్రీకృష్ణభగవానుని గీతావాక్యము. నీకు సకల దుఃఖముల నుండియు విముక్తి గావలెనా? భక్తితో భగవాను నాశ్రయించి భజించు, తదితర మార్గములన్నియు ననఁగా ధనము, మిత్రులు, బంధువులు, వైద్యులు వ్యర్థము. నిరర్థకములైనవారి నాశ్రయించి, కోరిన ఫలితములు లభింపలేదని పలవించుట తెలివి తక్కువగాదా? అమోఘరక్షణము భగవదాశ్రయము.

582. భగవద్భక్తికి ముఖ్యలక్షణములు, (1) భగవంతు నసంత మహిమను శక్తిని దెలిసిన ఆశ్చర్యభావముగల ప్రేమ (2) భగవానునెడ మనమెట్టి అవివేకమును ప్రదర్శింతుమో యను భయము (3) అనంతకోటి బ్రహ్మాండ సర్వాధిపతి యగు భగవంతునెడ మనకుండ వలయు శ్రద్ధావినయపూర్వక ప్రవర్తనము (4) ఎడతెగని విధమున పీడించు సాత్త్విక రాజసిక తామసిక దురహంకార విసర్జనమునకై దీక్ష (5) భగవానుఁడే తప్ప మనకు రక్షణమీయఁ గలవాఁడింకొకఁడు లేఁడను దృఢవిశ్వాసము అనగాఁ బ్రేమ, భయము, వినయము, శ్రద్ధ, నిరహంకారము, భగవానుఁడేకైక రక్షకుఁడను విశ్వాసము భక్తికి ముఖ్యాంగములు. వీనిని సాధనలోఁజూపు భక్తుఁడు భగవత్కృప కెల్లప్పుడు పాత్రుఁడై ముక్తుఁడగును.

583. ప్రపంచమును జీవులను సృజించిన భగవంతుఁడు వాని బాధ్యతలనుండి తప్పించుకొనుటెట్లు? జీవులను సృజించి, వాని నజ్ఞానములో నుంచుటలో నుద్దేశమేమి ? భగవానుఁడు సర్వసద్గుణ పరిపూర్ణుఁడగుటచేఁ దప్పుచేయు ననుట విరుద్ధ ప్రసంగము కాదా ? కాని జీవుల దుస్థితి అసత్యమా ? భగవానుఁడు పొరపడుట, విరుద్ధ వాక్యము. జీవుల దుఃఖ మసత్యమనుటయుఁ బొసగదు. లోకములో జీవుల దుఃఖాశ్రువులు సాగరములగుచున్నవి. ఈ జీవులు, వానిదుఃఖము, అజ్ఞానము, లేక మాయ లేక అసత్యము నన్నచో, నీజీవ ప్రపంచ ప్రదర్శన కారకుఁడు భగవానుఁడు కాఁడా ? నోరు విప్పక,

మహర్షులు చెప్పిన రీతిగా భగవాను నాశ్రయించుటే కర్తవ్యము. అజ్ఞాని ప్రశ్నలకు జ్ఞానమే జవాబు. జ్ఞానము భగవదాశ్రయముచే లభించును.

584. కర్మసిద్ధాంతమును గూర్చి పండితులనేక విధములుగా వ్యాఖ్యానించుచుందురు. దేవునితో సంబంధము లేకుండఁ జేసినకర్మ తనఫలితముల నపూర్వమను శక్తిచేఁ గర్తలకు సంక్రమింపఁ జేయునని పూర్వమీమాంసకులు వాదింతురు కర్మ ఫలితములనిచ్చువాఁడీశ్వరుఁడని ఆస్తికులు పలుకుదురు. కాని యీవాదములు తర్కమున నిలువవు. మొదట సృష్టిచేసినపుడే జీవుల కర్మలొనర్చుట కేర్పాటు చేయఁబడెనా ? సుకృత దుష్కృతముల రెంటినిఁజేయు బుద్ధి నెవఁడు కల్పించెను. ఆరంభములో జీవులు సుకృతమే చేయు బుద్ధిని వారికేల కల్పింపలేదు? జీవులకు మంచి చెడ్డలు చేయుటకు స్వేచ్ఛ నిచ్చెనందురు, స్వేచ్ఛగోఁ బాపములు చేయుట జరుగునని భగవానునికిఁ దెలియునా ? అది భగద్విలాసమందురు. అనగా దాని యర్థము మాకుఁ దెలియదని చెప్పుటయే. ఇఁక నేమిచేయుట ? భగవద్భజనచే జవాబు దొరకును.

585. తప్పు చేయుట కవసరమగు నజ్ఞానమునిచ్చి, నీవు తప్పుచేసితివి గనుక తత్ఫలితమైన దుఃఖము ననుభవింపుమనుటలో నౌచిత్యమేమి ? నలుసంత సుఖలేశమును క్షణమాత్ర ఫలితముగా (గామోపభోగములలోఁ బెట్టి, శాశ్వతా

నందమును దనయొద్దనుంచికొని, మీకేది కావలయునో తీసి కొమ్మని జీవుల కేర్పాటు చేయు టతివిచిత్రమైనది? క్షణిక సుఖ మరచేతఁబెట్టి, స్థిరానంద సంపాదనము దుస్సాధ్య మొనర్చి సంసారచక్రములోఁ బడవేసి, జీవులను, భగవానుఁడు భ్రాంతివశుల నొనర్చుటలో నర్థమేమి? ఇట్టి తర్కము వ్యర్థ మని నమ్మి, మహాజ్ఞానులు బోధించిన రీతిగా 'రామ' స్మర ణము చేయుటే ఉత్తమ మార్గము.

586. భగవద్ధ్యానమును నీవు నిరంతర మెందుకఁ జేయుచున్నావు? జవాబిట్లుండవలెను; 'భగవద్ధ్యానములేనిదే క్షణమైన జీవింపలేము గనుక" యనునదే సరియైన జవాబు. "ఒక క్షణము భగవంతుని మఱచినచో, గుండెను వేయు గున పములతోఁ బొడిచిన బాధకలుగును." జవాబిట్లుండవలెను. ఏ బాధయు లేకుండుటేగాక, అవ్యయమైన ఆనందము, అనంత మైన శాంతియు భగవద్ధ్యాన మీయవలెను. అందుచే భగవ ద్ధ్యానము మానుట కవకాశమే లేదు. దేవుని మఱచుటకాదు; భక్తి పరవశుఁడై తన్నే మఱచువాఁడే భక్తుఁడు.

587. నీవు నిరంతరము నెడఁదెగని సుఖమనుభవింప ఁగోరుదువా? అయినచో, భగవానుఁడు సర్వకార్యములకు ఁగర్తయై యుండుటకంటె ఁగోరఁదగినదేమున్నది? చెప్ప వాల్చుట మొదలు, అనంతకోటి బ్రహ్మాండములను నడుపఁ గల అనంత ప్రజ్ఞామూర్తి సర్వకర్తయగుట మన అఖండ భాగ్యముకాదా? "ఈపని నేనిట్లు చేయుదును; ఆపని నారీతిగా

చేయుదున"ని భగవాను నేకైక కర్తృత్వమును, దాని వలని అఖండ లాభమును గుర్తింపక అల్ప మానవుఁడు తన కర్తృత్వమును నమ్మి, వైఫల్యముల నెదుర్కొనలేక, దుఃఖించుటేల ? నమ్మినవారి పనులన్నిటిని పరమకృపా పరిపూర్ణ హృదయముతో సంపూర్ణ సంతృప్తి భక్తునికి లభించు రీతిగాఁ జేయుటకు సిద్ధముగా నీలో నిరంతరము నిలిచియున్న భగవానునిపైన భారమున్నదని గుర్తించి సుఖించుట కేల యత్నింపవు ?

588. ఆహా ! ఏమి అనిర్వచనీయ మహాభాగ్యము ! దేవుఁడున్నాఁడు, చాలు ! ఇంక నేమియు నవసరము లేదు. సకల విధయోగ క్షేమములాయన చూచును; చూడఁ గలఁడు; చూచి తీరును ! అనంత కృపతోఁ జూచును; సకాలమున జూచును; అవసరమైనచో ముందుగనే జూచును. వేయి నేత్రములతోఁ జూచి, వేయి చేతులతో రక్షించును; తిరుగు లేని రక్షణమది, ఇంతకంటె గావలసినది, కోరవలసినది, విలువగలది మరేమున్నది? "భగవానుఁడున్నాఁడు; చాలు!" నని నిరంతరము నమ్మి నిశ్చలభక్తితో భజించు భక్తునికి లభింపనిదేమున్నది ?

589. పుత్రికలు భర్తలున్న చోటికిఁ బోవలెను. పుత్రులు వృత్తికై యెచటికో పోవలెను. ఇఁక నింటమిగులు వారు వృద్ధ దంపతులు. పుత్రికా పుత్రులున్న చోటికిఁ బోవుటకు శక్తి చాలదు. పొత్తులుండవు; అచటనుండలేరు; ఇంట

నేకాంతులై యుండలేరు. మరణవేళకైన నెవరైన వత్తురో రాఁజాలరో తెలియదు. ఒంటరిగాఁ బుట్టి, సంతతిఁగని వృద్ధులై లోకము నుండి నిష్క్రమించుట; ఒంటరిగా నిష్క్రమించుట, ఇట్లెన్ని పర్యాయములు జరిగెనో–మరల నెచటనో పుట్టుట – చచ్చుట – మధ్యసంతతి – సంసార దుఃఖము లనుభవించుట – తుదిలేని యాత్ర – దుఃఖయాత్ర – కాని మన యాత్రలో త్రోవ మార్చవలెను. దేవునిఁ జేర్చుయాత్ర – త్రోవ పట్టవలెను. దుఃఖసంసారయాత్ర ముగిసి, దైవసాన్నిధ్యము, ఆనందము, శాంతి, ముక్తి లభించును.

590. ఆకలి దహించుకొని పోవుచున్నదా? నీకనుల యెదుట పిండివంటలతో అన్నము, కూరలు, దప్పళములు సమృద్ధిగా నున్నవి. నీకుఁగనులున్నవి. నీవువానిని ఁజూచియుఁ దినవు; ఆకటిబాధ కోర్వలేక, వెక్కి వెక్కి యేడ్చుచున్నావు. ఒకవేళ నీవు చూడలేదేమో యని నీవద్ద నేయున్న పెద్దలు, (జ్ఞానులు). చెప్పుచున్నారు. నీవు వారి మాటలు వినవు; రోదనము మానవు. ఇంతకంటె విచిత్రమేమున్నది? సర్వ సమర్థుఁడు, సర్వదాత అయిన పరమేశ్వరుఁడు, నీకెట్టి వ్యయ ప్రయాసలు లేకుండ, నీలో, నీకత్యంత సమీపవర్తియై యున్నాఁడు. నీవు చూచున దంతయు నాభగవానుని దివ్య స్వరూపమే. జ్ఞానులు నీకుఁజెప్పుచున్నారు. నీవు చూడవు, వినవు. వారి మాటలు నమ్మవు. సర్వసుఖదాతను దగ్గర ఁబెట్టుకొని తుదిలేని దుఃఖము లనుభవించుచున్నావు. ఈ అవి

వేకము విడిచి, భగవాను నాశ్రయించి నిత్యసుఖ మనుభ వింపుము.

591. "ప్రజాతంతుమ్ మావ్యవచ్ఛేత్సీః" తైత్తిరీ యోపనిషత్తు. "ప్రజాతంతువును త్రెంపి వేయరాద"ని భావ మును గురువు శిష్యుల కుపదేశించుచున్నాఁడు. వివాహ మాడి, సత్సంతానమును గనుమని ఆదేశము. సంసారబంధ ములను బిగించి, అజ్ఞానములో శాశ్వతముగా నిలిపివేయు కార్యక్రమము కాదా యీసంతానోత్పత్తి యను ప్రశ్న ముదయించును. కాని శ్రుత్యాదేశములో లోపముండదు. ఈ యాదేశము ముక్తినిచ్చు సాధనము. అర్థకామములను భగవానుఁడే సృజించెను. ధర్మయుక్తముగా దాని నుపయో గించినచో దోషము లేదు గృహస్థుఁడు ఋషి, పితృదేవతల ఋణములను దీర్పవలెను. సత్సంతానములో శహితార్థమే; వేదధర్మవిచ్ఛిత్తి జరుగకుండఁ గాపాడును. ధర్మవిరుద్ధములు కాని అర్థకామముల వినియోగము మోక్షభవనమునకు దోడ్కొని పోవును. ధర్మసహితార్థకామముల ద్వారమున మోక్ష సిద్ధి; ఇది వేద ముపదేశించెను.

592. భక్తుఁడు వివేకము గలిగి, సునిశితబుద్ధితో భగవంతుని రూపమును, మహిమను, ప్రజ్ఞను, తదితర దివ్య లక్షణములను సవ్యముగా నర్థము చేసికొని, ఆరాధించుట నభ్యసింపవలెను. ఉదాహరణమునకు "కనపడున దంతయు భగవంతుని రూపమే." ఇది మనకుఁగనపడుచున్న యన్నిటికి

వర్తించును. మనదేహములు, పృథివి, ఆకసము, పంచభూతములు, సూర్యచంద్ర నక్షత్రములు మనుజులు, పక్షులు, పశువులు, క్రిమికీటకాదులు అన్నియు భగవానుని దివ్యరూపములే. అన్నియు నుండుటకు, గనిపించుటకు భగవత్సంకల్పమే కారణము. మరొక కారణములేదు. ఈ విధముగా సర్వం విష్ణుమయమను భావన బలపడి క్రమముగా భగవత్సాక్షాత్కారము సిద్ధించును.

593. భగవానుని గూర్చి తెలిసికొనుట కెన్ని జన్మములును జాలవు; ఏలన బరిమితిలేనివాడే భగవానుడు. అనంతమైన విషయములను గూర్చి యెంత తెలిసికొన్నను, నింకను దెలియవలసిన దనంతముగా మిగులుచునే యుండును. మనము తెలిసికొన్నది కొన్ని వేల జన్మముల కృషి ఫలితము; ఆవగింజతయు నుండదు. అనగా దెలిసికొను యత్నము మానవలయునని పొరపడరాదు. భగవానునిగూర్చి యేఅణు మాత్రము తెలిసినను, అది సర్వదుఃఖాపహారియై బ్రహ్మానందమిచ్చును. దేవుని మహిమనుగూర్చి తెలిసికొను కృషియే తపస్సు. అదియిచ్చు నమృతరసము, రుచి, సౌఖ్యము నింకెచటను దొరకదు. ఇంకొక విశేషమున్నది. నీవు భగవానుని దెలిసికొను దీక్షను, క్రమాభివృద్ధి చేసికొన్న కొలదియు, భగవానుడు దన్నుగూర్చి అధికముగా దెలియు నట్లనుగ్రహించుచుండును. ఇది అనుభవైక వేద్యము.

594. తుపాను భగవాను నుగ్రరూపము. భగవాను నుగ్రరూపమును దర్శింపఁగల వారెవ్వరును లేరు. భగవానుని సౌమ్యరూపమునే మనము చూడఁగలము. మనము నిరంతర మాభగవానుని మృదుమధుర సౌమ్యచిద్విలాస విలసితమైన ముఖ పద్మమునే చూపి రక్షింపుమని ప్రార్థించుచుండవలెను. అందుకుఁదగిన సౌమ్యకోమల స్వచ్ఛ హృదయములను మనము వెంపొందించుకొని, ఆరాధించినచో, మన కాతఁడు ఘోర దర్శనముగాక సౌమ్యదర్శనమే యిచ్చును. మనము దురహంకార దూషితులమైనచో శ్రమ తప్పదు.

595. కృష్ణా జిల్లా దివి తాలూకాలోని యిరువది గ్రామములు సాగరోత్తుంగ తరంగ మహామారుతముచేఁ దుడిచివేయఁబడెను. వేలకొలఁది మనుజులు పశువులు మృతులైరి; ఇండ్లన్నియుఁగూలి కొట్టుకొని పోయెను. ఇది భగవానుని హస్తమే. దీని కర్థమేమి? భగవానుఁడే తుపాను; కృష్ణాజిల్లావారిని శిక్షింపఁదలచెను. ఎవఁడాపఁగలఁడు? కాకినాడ తీరము ననుగ్రహింపు మని తుపాను భీకరమూర్తియైన భగవానునికిఁ జేతులు జోడించి నమస్కరించితిని. అటులే చేసెను. దివి తాలూకా ప్రజలకు శిక్ష తప్పదని పరమేశ్వరుఁడు నిర్ణయించెను. రక్షణ మీశ్వరకృపయే యని గుర్తించి, ప్రార్థించుటే శరణ్యము. అపు డుగ్రత దేవుఁడు చూపనవసరముండదు. ఈ సత్యము నెఱిఁగి బ్రదుకవలెను.

596. ఈశ్వరానుగ్రహ మీశ్వరానుగ్రహము వల ననే లభించును. అందుచే, మానవులు పరమవిశ్వాసముతో భగవాను నాశ్రయించుటయు, సేవించుటయు మహాదీక్షతో నిర్వహించుచున్నచో భగవానునికృప మనకు లభించుచుండుట పరమసత్యమని, అటులుచేసి భగవానుని కృపగాంచిన మహా పురుషులు బహుముఖముల సాక్ష్యములు పలికియున్నారు. కావున భగవద్భక్తిచే సర్వదుఃఖములను మనము పోగొట్టు కొని ధన్యులము కావలసియున్నది. చిన్నబిడ్డలకుసైత మీ కార్యక్రమమును బోధించి, నడపిన మనజాతి విజ్ఞాన సంపద పరమపూజ్యమైనది. ఈశ్వరానుగ్రహమే సంపాదింపవలసినది.

597. "యేహి సంస్పర్శజాభోగా దుఃఖయోనయఏవతే, ఆద్యంతవంతః కౌంతేయన తేషు రమతేబుధః" స్త్రీపురుషుల పరస్పరాలింగన చుంబనలైంగిక స్పర్శాదుల వలనను, రుచిర పదార్థ భక్షణాదుల వలనను, సుఖము కలుగుట నిజమే. కాని ఆ సుఖమెట్టిది? దాని గర్భములో దుఃఖమున్నది. ఎట్లున్నది? ఆద్యంతములు గలది; అనగా క్షణికమైనది. స్పర్శాభోగము క్షణిక సుఖప్రదము; నిత్యము కాదు; అందుచే దుఃఖమిచ్చు నది. బుద్ధిగలవారందుచే దానిని గోరరు. అనుభవింపఁ బూనరు. నిత్యసుఖమిచ్చు దానిని కోరుట, వివేక లక్షణము; అనగా భగవత్కృప నిత్యసుఖమిచ్చునది; కావున భగవంతు నారాధించి నిత్యసౌఖ్య మార్జింపవలెను.

598. "తానహమ్ద్విషతః క్రూరాన్సంసారేషునరాధమాన్ క్షిపామ్యజస్ర మశుభానాసురీష్వేవయోనిషు." గీతా ప్రవచనము. ధర్మద్రోహులను, దైవద్రోహులను, క్రూర కర్మలను నరాధములని పలికి, ఆ సురయోనులందు విసరివేసి యెప్పటికి నన్నుఁజేరు నవకాశము కలుగకుండఁ జేసెదను. తెలిసియుండియు దారుణ పాపకర్మలకుఁబాల్పడు ధనకాంతా భోగలాలసులను, దైవద్రోహులను శిక్షించుశక్తి భగవానున కనంతముగాఁగలదు. ధర్మపరులను, దైవభక్తులను, సజ్జనులను రక్షించును, దుర్జనులను "క్షిపామి" యని నరకమునకు నెట్టి వేయుదునని భగవానుఁడు తీవ్రముగా నిరసించెను. భక్త పాలనము, భక్తి హీనులను భంగపరచుటయు భగవానుని లక్షణము.

599. "బాహ్యస్పర్శేష్వ సక్తాత్మావిందత్యాత్మని యత్సుఖమ్, సబ్రహ్మయోగ యుక్తాత్మా సుఖమక్షయ్య మశ్నుతే." గీతావాక్యము. వస్తువులు బాహ్యరూపములను, బాహ్య దేహస్పర్శచే ననుభవించుట మానినవాని కాత్మ సుఖము సంక్రమించును. ఆత్మసుఖమనగా నక్షయ బ్రహ్మా నందము స్పర్శాసుఖము కాదనుట లేదు. అది క్షయ లక్షణాము గలది. మానవజన్మమెత్తి, అల్పజీవిత శక్తిని, దేనికై వినియోగించుట తెలివి? క్షణములో నదృశ్యమైపోవు బాహ్యస్పర్శసుఖ కాంక్షయా? అక్షయానందమిచ్చు ఆత్మ స్పర్శ సుఖకాంక్షయా? మానవజన్మ మెత్తిన వారంద

రీసంగతి స్పష్టముగాఁ దెలిసికొనవలెను. దీనినిగూర్చి ఉపదేశింపని విద్య అవిద్యయే.

600. భోగములు దుఃఖహేతువు లగుటకుఁ గారణములు (1) తినుట; ఎంత విలువగల మధుర రసభరిత పదార్థములు తిన్నను, అన్నియు మరుగుదొడ్డిలోనికిఁ బోవలసినవే. ఇవి రక్తవీర్య పుష్టినీయువా? ఇచ్చి దృష్టిని భోగములపైకే మరల్చును. (2) లైంగిక భోగములు – నిర్వీర్యులఁజేసి, బుద్ధిశక్తిని నీరసింపఁజేసి, వార్ధకమునకుఁ దొందరగాఁదోడ్కొనిపోవును; మరియు రోగములకు, అకాల మరణములకు దారిచూపును. పూర్వులందుకే సదాచారసంపత్తి, ఉపవాసములు, నియత దినములందే కాంతాసంయోగము, తీర్థయాత్రలు, మున్నగున వేర్పాటుచేసి భోగవ్యామోహమును తగ్గించిరి. గృహస్థులాత్మ శిక్షణగలిగి, నియమబద్ధులై వ్యవహరించుట, పరమార్థ దృష్టిని పెంపొందించుటకే.

601. సర్వశుభ లక్షణ పరిపూర్ణుఁడగు సర్వేశ్వరు నొక క్షణమైనను మరచికాని, స్మరింపకుండఁగాని జీవింపలేకుండుట భక్తుని ముఖ్య లక్షణమై యుండవలెను. అట్టి అనన్య శ్రద్ధగల భక్తుని భక్తి వేగముగాఁ బెంపొంది, స్థిరపడుటవలయు పరమార్థ తత్త్వజ్ఞాన వికాసము, తత్ఫలితమగు నవ్యయానందమును భగవానుఁడే ప్రసాదించును. భగవత్కృప నీవిధముగాఁ జవిచూచిన భక్తుఁ డిహలోక క్షణికభోగములకై పరితపింపఁడు. అట్టి భక్తుఁడు త్వరలో భగవ

త్సాయుజ్యముగాంచుటలో నాశ్చర్యము లేదు. అందుచే భక్తునికి చలింపని దీక్ష, సాధన, తపస్సు ముఖ్యములు.

602. మనకుఁ బ్రియుఁడైన పుత్రుఁడో, మిత్రుఁడో దూరస్థుఁడై యున్నప్పుడు మనదృష్టి నావ్యక్తిపైఁ గేంద్రీకరించి, ఆతని యోగక్షేమవార్తకై యెదురుచూచుచుందుము. భగవానుఁడు మన మిత్రులకంటె, పుత్రులకంటె, బంధువులకంటె నత్యంత ప్రేమపాత్రుఁడని యెరిగినచో, మన హృదయమును పూర్తిగా నా భగవానునిపై నుంచి, సేవింతుము; భగవానునుండి వార్తకై యెదురుచూతుము. ఈసాధనమే మహాయజ్ఞము. తక్కిన యిహలోక కార్యము లన్నిటికి ద్వితీయస్థానమిచ్చి, ప్రధాన కార్యక్రమమైన భగవదారాధకే జీవితమర్పించు దీక్ష పూనుదుము. భక్తియన నిదియే.

603. మానవు లెట్లు జీవించినచో స్వర్గమో, మోక్షమో లభించునో భగవానుఁడే, వేదశాస్త్ర గీతాపురాణాదికములందు ప్రకటించెను. ఆంగ్లవిద్య పెచ్చుపెరిగి, నాస్తికత పెంపొంద, భారతదేశ యువక ప్రపంచము దైవవాణిని నిరసించుచున్నది. చదువుట, వినుటయు లేనిదే, యిఁక నాచరణ మెచ్చట? దైవవాణిని భక్తితో విని, యథాశక్తి నిత్యజీవితములో నభ్యసించి దైవానుగ్రహము నార్జింపవలెను. ఆ కృషి లేని జాతి రాక్షసికజాతియై, అధోగతి పాలగును. స్వజాతి మతధర్మముల నొల్లని జాతికి భవిష్యత్తు దుర్భరమగును.

604. ప్రతి ప్రాణియు నిరతిశయానందామృతమును చవిచూచి, తనివి తీరఁ ద్రాగుటకు గోరుచున్నది. నిజముగా సకల ప్రాణుల తాపత్రయమిదియే. అల్పబుద్ధిని, అతిపరిమితమగు నాయువునిచ్చి, "నీకానందమెల్ల ప్పాడుండునది. కావలెను గదా. ఎచటనున్నదో సరిగా వెదకికొనుము." అని భగవానుఁడు, ఆనందామృత భాండమును దన చేతనుంచికొని మానవుల నాభగవానుఁ డాహ్వానించు చున్నాఁడు; "నన్నుఁదెలిసికొన్నఁగాని మీకు స్థిరమైన ఆనందము లేద"ని పలికినాఁడు. కాని మూర్ఖమానవుఁడు తనకన్నెదుటఁ గన్పట్టు స్త్రీ ధన గృహాదికములో నానందమున్నదని భ్రమించి, దురంత దుఃఖము లెదురుపడగా మోసగింపఁబడి దుఃఖించుచున్నాఁడు. బ్రహ్మజ్ఞానసిద్ధి వలన భగవానుని కృపనార్జించుటకై సర్వశక్తుల నుపయోగించి యత్నించు టేకైక కర్తవ్యము.

605. "దేవా! పాపములు చేయుబుద్ధి పుట్టకుండ దయతోఁజూచి రక్షింపుము. నీ సంకల్పము లేనిదే యెవరికేబుద్ధియుఁబుట్టదు. నీవు ప్రతిప్రాణి హృదయములో నుండి, నిరంతరము సదసద్భావము లుదయింపఁ జేయుచున్నావు. పూర్వజన్మ సంస్కారములు వానికిఁ గారణములని చెప్పెదురు. కారణము నేను గానందువా? ఆది జన్మసంస్కారము లెట్లు వచ్చినవి? ఇవన్నియు నీదు సంకల్పము వలననే వచ్చినవి. నీ సంకల్పమే సుఖదుఃఖములకుఁ గారణము. ఇందు సందేహాము లేదు. కావున నన్ను రక్షించి, పాపములు చేయ

నీయక, నీసేవయే చేయించి ధన్యునొనర్పుమ"ని ప్రార్థింప వలెను.

606. సర్వమీశ్వరమయము; సర్వమీశ్వర కర్తృకము, కావున సర్వము నిర్దుష్టము, నిరవధికానందశాంతి సంపూర్ణము, సర్వతోముఖ శుభాన్వితము నని పరిపూర్ణముగా నమ్మునటయు నట్లు నమ్మువాని కీశ్వరలక్షణములైన సంపూర్ణ బలతుష్టి శుభానందశాంతులు సంక్రమించుటయు, సర్వక్లేశ దుఃఖాదిష్టములు శాశ్వతముగాఁ దొలఁగి పోవుటయు నిస్సందేహముగా జరిగితీరును. నమ్మి ఫలితములంది ధన్యతగాంచుము.

607. భగవంతుని సృష్టిలో, లోపములు, దోషములు దుఃఖములునుండుట కవకాశమున్నదా? ఉన్నదన్నచో భగవానుని దూషించుటేయగును. భగవానుఁడు పరిపూర్ణుఁడు ఆనందమాతని పరిపూర్ణతలోనిదే; దుఃఖలేశమున కవకాశము లేదు. కాని మనము జీవులము, ఎన్నియో దోషములకు, దుఃఖములకు నిత్యము పాల్పడుచున్న సంగతి నిజమేకదా? ఇది యెట్లు పొసఁగును? దీనికే సమాధానముగా రజ్జుసర్ప భ్రాంతి నుదాహరణముగా నిచ్చిరి. త్రాడునుజూచి విష సర్పమని భయపడి, కలత చెందుచున్నాము. సరిగాఁ జూచినచో నిర్దుష్టమగు త్రాడే! ఎవఁడైన త్రాడునుజూచి, భయ దుఃఖములు పొందునా? త్రాడే పరబ్రహ్మము. ఏకము,

అద్వితీయము; వర్ణనాతీతమగు నానంద శాంతినిలయము, కావున భ్రాంతియు లేదు; భ్రాంతి పొందువాఁడును లేఁడు.

608. మనస్సును, హృదయమును బుద్ధినేకాక, దేహము నందలి రక్తమాంసాస్థి సముదాయమును, తుద కందలి నఖశిఖాదులనుగూడ భగవంతున కర్పించి, భగవన్మయ మొనర్పవలెను. మనకున్న సర్వమును భగవన్మయ మొనర్చినచో, మనము భగవన్మయ వ్యక్తుల మగుదుము; అనగా భగవత్తుల్యుల మగుదుము. భగవానునితో సమానత్వము నేకత్వము లభించును. అనగా మనకు దేవునికి నభేద మగును; దానితో సర్వతోముఖ సంపూర్ణత లభించును. దీనికి సాధనము, మనము భగవన్మహిమా విష్టులము కావలెను. ఏ క్షణమందుఁగాని, క్షణలేశమందుఁగాని భగవంతుఁడు వేరుగా నున్నట్లు భావముకలుగరాదు.

609. దేహములన్నియుఁ గర్మదేహములని దేహ నిర్మాణమే తెలుపుచున్నది. పూర్వకర్మ సంస్కారముల ఫలితముగా దేహము లేర్పడును. పుణ్యపాపకర్మలు, తర్కించుటకు శక్యముకాని పాళ్ళలో మేళవించి, అతివిచిత్రరూప వైఖరులు సృజింపఁబడినవి. అందుకే మానవులలో అనంత భిన్నరూప వైఖరులు కలిగినవి. అందరు నొకటే, అందరు సమానులే యను వ్యర్థవాదములు సత్య దూరములు. అందరకు నొదరించుట కవసరోచితావకాశములఁ గల్పింపవలెను గాని, సమానావకాశముల నిచ్చుటయు నిరర్థకమే.

610. పుట్టుకలో, వంశములో, దేహరూప బల వర్ణ పాటవములలో, భావసంకల్ప నిర్ణయములలో, నతి సన్నిహితులగు భార్యాభర్తలకే విభేదములుండఁగా, మానవులందరు సమానమే యను ప్రలాపము లర్థరహితములేగాక, సంఘ విద్రోహకరములు, జాతి ధర్మ విపత్కారములునై యున్నవి. అన్నవస్త్ర గృహాదికము లందరకు సమానములే. వైద్యుఁడు తన వద్దకువచ్చిన రోగులందరను సమాన ప్రేమతో (జూడవలెను గాని, చికిత్స, మందు సమానమగునా ? అందరొకటేయని అందరకొకే చికిత్స చేసి, ఒకే మందిచ్చుట, మతిలేని వైద్యుని పద్ధతి యగును బుద్ధిమంతులు దేశ పరిపాల నార్హులు. అందరొకటే యని మూర్ఖుల నున్నత పదవులలో (గూర్చుండఁ బెట్టిన, దేశము పరవశమగును. భిన్నత్వము నంగీకరించి, భిన్నతలో నేకత్వమును గమనింపవలెను. భిన్నత లేదనుట బుద్ధి మాంద్యము.

611. పరమాత్మ సర్వత్ర వ్యాపించి యున్నాఁడు. ఎట్లు వ్యాపించి యున్నాఁడో దర్శించుట నేర్చికొనవలెను. మనుజులలో సౌందర్యము, ముఖ విలాసము, మాటలో మాధుర్యము, చూపులో (గాంతి, మున్నగు నవన్నియు (బరమాత్మ చైతన్య ప్రదర్శనమే. సింహశార్దూలములలోని శౌర్యము, పక్షుల గమనవైఖరి, కూతలలోని ధ్వని వైవిధ్యము, వృక్షలతా పుష్ప ఫలములందలి పరిమళ, మాధుర్యములు పరమాత్మ చైతన్య రూపములే. జడములలోని

నిశ్చల చైతన్యము, నదీసాగర ఘోష, పంచభూతముల అమోఘశక్తి, రవి శశి నక్షత్రకాంతి, సర్వమా పరమాత్మ జ్యోతి రేఖలే. ద్రష్టయు బరమాత్మ రూపమే.

612. ఛాందోగ్యోపనిషత్తులో మానవహృదయము బ్రహ్మ పురమని చెప్పఁబడెను; "బ్రహ్మ పురేదహారం పుండరీకం వేశ్మ" అనియున్నది. హృదయాకాశమే పరబ్రహ్మ నిలయము. అనగా హృదయము పరమాత్మ రాజ భవనమును జేరి పరమాత్మను దర్శించి వచ్చి ప్రతిదినము సుషుప్తి నాధారముగా జేసికొని 'సుఖ' స్మృతిని వెలిబుచ్చు చున్నాము. నిద్రలోఁ గాక, యోగ (ధ్యాన) నిద్రలోఁ బరమాత్మను దర్శించితిమా, మనకు జన్మజరా మరణాతీతమగు మోక్షము లభించును. నిద్రలో దేహము నింద్రియములు, మనస్సు మున్నగు నాత్మేతరము లన్నియు నైష్కర్మ్య సిద్ధిని గాంచునటులే, మనము జ్ఞాన బలముచే బరమాత్మ జ్యోతిని దర్శించి, అదియే మన నిజస్వరూపమని గ్రహించి తరింపఁ గలము.

613. అంతా పరమాత్మ స్వరూపమే అయినచో నశించిపోవు దేహము మాత్రము బ్రహ్మస్వరూపము గాదా యనియు నందుచే దేహమునే బ్రహ్మపదార్థముగా నారాధించినచోఁ దప్పేమున్నదనియుఁ బ్రశ్న లుదయించును. దేహము మరణించి దహనముచేయఁబడినప్పుడు బ్రహ్మమున కట్టి లక్షణమున్నదని తెలిసికొని విచారించుట మానవలెను.

పైగా సంతసింపవలెను. దేహాలోపమును గ్రహించి, అది అదృశ్యమగు లక్షణముగల పరబ్రహ్మమే యని భావించి, దేహారాధనము చేయుటలోఁ దప్పులేదు. కాని దేహామమ కారము తప్పు. నిర్వికారులై, దేహాము విలువ తెలిసి అంగీక రించి దానిని ధర్మయుక్తముగా వినియోగించుట బ్రహ్మర్షుల ధర్మమే.

614. పరమేశ్వరుని పాదారవిందములను భక్తితోఁ బట్టుకొని కూర్చుంటివా? అటులైనచో నిది విను; "నీరోమము తెగదు. నీకుఁగాని నీకు సంబంధించిన వారికిఁగాని యెట్టి లేశ మాత్ర క్లేశము, అరిష్టము, దుఃఖము సంభవింపదు. ఇది పరమ సత్యము. దీనిని గుర్తులోనుంచికొని, స్వస్థచిత్తుఁడవై ప్రశాంతిగలిగి చిఱునగవుతో సుఖముగా జీవింపుము. ఏలన సర్వలోకైక నాథుఁడు, సర్వపరిపూర్ణ సమర్థుఁడు, సర్వ సంపూర్ణకృపానిధి యగు పరమాత్మని పాదములు స్మరించు; చాలు; ఇఁక నర్చింతువా, లోపదోషము లేమాత్రమైనను తటస్థించునో యను శంకకలుగుట దైవనింద చేయు ఘోర పాప మగును. దేవుని పాదముల మహిమ వర్ణనాతీతము.

615. అన్నియు భగవంతుని దివ్య హస్తములలో నున్నవని తెలిసి నీవెట్టి అహంకారమును దగిలించికొనకుండ హాయిగాఁ గూర్చుండలేవా ? పరమాత్మ చేతిలో నీయోగ క్షేమములకు లోటు కలుగుననియా? అహంకార దూషితుఁ డవై నీవు చేయుటకాని, నీవలె నహంకార కలుషితులైన

మిత్రులు మున్నగువారు చేయుట కాని, తప్పుదారి పట్టి దుర్గతిపాలగుటయే యని యెన్నఁడు గ్రహింతువు? మఱియు భగవంతుని దివ్యసంకల్పముచేయు పనులు శాశ్వతసుఖాస్పదములగునని నమ్మి, జీవితమును గడపుట నేర్చికొనుము.

616. నీకంటె, సార్వభౌములకంటె గణనాతీతాద్భుతముల రెట్లు పరిపూర్ణత, సామర్ధ్యము, జ్ఞానము, దయగల భగవానుఁడు నీ పనులన్నియుఁ జేసి నిన్ను సుఖింపఁజేయుటకుఁ గంకణము గట్టుకొని యెల్ల వేళల నీలోనే కూర్చుండియుండగా నీవే నీయోగక్షేమ నిమిత్తము స్వయముగా నీపనులు చేసికొనవలెనను గాఢాంధకారములో జీవించుటలోఁ దెలివి లేశమైన నున్నదా? "నేనున్నాను, భయపడకుము"ని అఖండ ప్రేమతో నీ పనులన్నిటి నాతఁడు చూచుచుండగా, విని కూర్చుండి సుఖింపవేల? భగవానుని నమ్మి భజింపుము. నీ పనులన్నియు నాతఁడు పరిపూర్ణముగాఁ జేసి, నిన్నుఁ గాపాడును.

6.7. భగవంతుఁడు కృప నీక్రింది విధముగాఁజూపి ప్రార్ధనకు జవాబిచ్చెను: నా రెండవ పుత్రిక భర్తతో బొంబాయిలో నున్నది. పదునేను దినములనుండి ఆమె క్షేమవార్తకై దినదినమెదురు చూచుచు లేఖ రానందున, నాందోళిత మనస్కులమైతిమి. నేను వ్రాసిన రెండు లేఖలకు జవాబులేదు. నాభార్య చాలకంగారు పడెను. టెలిగ్రామ్ నిప్పించితిని. రాత్రి కృష్ణ భగవానునితో నీసంగతి చెప్పికొని పరుంటిని. కృష్ణుఁడుండగా, క్షేమవిషయమై శంకింపరాదని

యెఱిఁగియు నేనే శంకించుటకుఁ బూనితిని. నాభక్తి దౌర్బ ల్యమునకు నిందించికొంటిని. ఉదయము దీనినిగూర్చి చర్చించు చుండగా చిరునగవుతో శ్రీకృష్ణ ప్రభువు, "నేనున్నాను గాదురా! ఎందుకు నీవు కంగారు పడుచున్నావ"ని పలికిన మాటలు స్పష్టముగా వినబడెను. ఒక గంటలో క్షేమలేఖ వచ్చినది.

618. మరల కృష్ణప్రభు విచ్చిన ప్రబల సాక్ష్యము, నానాల్గవ పుత్రుఁడు కళాశాలనుండి తిరిగి వచ్చుచుండగాఁ త్రోవలో గాలువ వంతెనపై నెదురుగా నొకలారీ వచ్చు చున్నది. లారీ ప్రక్కనుండి నాపుత్రుఁడు ప్రభువు సైకిలుపై నున్నాఁడు. అటువైపునుండి రిక్షాలు, సైకిలుపోవుటకు సందు లేదు. ముందుకుఁబోయినచో లారీక్రిందఁబడును. నిలఁబడి నను లారీ మీాదనుండిపోవును. వెనుకకుఁబోవలెను; వెనుక నడ్డముగా గళాశాల విద్యార్థినులు నిలఁబడి యుండుటచే దారిలేదు. ఒక క్షణములో లారీమీాదనుండి పోవును. ఆతఁడు సైకిలు విడిచి, వెనుకకు దూకి పడిపోయెను. సైకిల్ ముక్కలై లారీ ఆగెను. ప్రక్క జనులువచ్చి లేవఁదీసి దూరముగాఁ గొనిపోయి కాపాడిరి. బ్రతికి బయటపడి యింటికిఁ జేరెను. కృష్ణభగవానుఁడు కృపఁజూపి యింటికి క్షేమముగాఁజేర్చెను. కృష్ణప్రభువును నేనాశ్రయించితిని; రక్షించెను; ప్రబల సాక్ష్యము కాదా?

619. "సత్యంవద, ధర్మంచర..." మున్నగు వేద వాక్యాదేశములు, మనము కర్తృత్వములేని వారమైనచో వ్యర్థములుగావా యను ప్రశ్న బయలుదేరును. కాని వేద వాక్యములు వ్యర్థములెట్లగును? అనగా నీశ్వర శాసనమే, "సత్యము పలుకుము, ధర్మమాచరింపుము"ని ఆదేశించు చున్నది. కాని యీశ్వర శాసనమే వేరొకచో నీవు కర్తవు గావనుచున్నది. ఇది పరస్పర విరుద్ధములవలెఁ గనుపట్టును గాని నిజముగా నవిరోధనములే. ఈశ్వరాదేశము ననుసరించి నిమిత్తమాత్రుడనని యెరిగి నిరహంకారియై మానవుఁడు కర్మ చేయవలెను. ఈ సమన్వయములోఁ గర్తకు దోషములేదు; బాధలేదు.

620. కర్తృత్వ శూన్యతకుఁగర్మ నిర్వహణమునకు సంఘర్షణము లేదు. అజ్ఞాని తనకుఁ గర్తృత్వమున్నదని నమ్మి అహంకారబద్ధుఁడై 'నేను' కర్తననుకొనును. అట్టి వ్యక్తి వేద శాస్త్రాదేశముల ననుసరించి సత్యధర్మ విరుద్ధములుగాని కర్మ ప్రవృత్తి కలిగియుండును. జ్ఞాని, యేకైక కర్త భగ వానుఁడని యెఱిగి. యీశ్వర చోదిత కర్మలఁజేయుచు "నేను కర్తనుగాను. ఈశ్వరుఁడే కర్త; నన్నాతఁడు వివిధరీతుల నడపుచున్నాఁడ"ని గమనించి, కర్తగాని కర్తయగును ఇందు జ్ఞానాజ్ఞానభేదమేకాని వేదవాక్య విరోధము లేదు.

621. మానవజీవితములో జన్మమృత్యుజరాది దోష ములు వ్యాధి దారిద్ర్య వైరాది దుఃఖములను జూచియు

వానిని దొలగించి కొనవలెనను తలపునే పట్టించుకొనక, వానితో సర్దుబాటుచేసికొని బ్రతుకువారి కేబాధయు నుండదు. ఈప్రబల దోషముల నిర్మూలింపనిదే సుఖమును గోరుట, నిష్ప్రయోజనమని గ్రహించి ధ్యానసంకీర్తనాదిక తపస్సాధన లకుఁ బూనుకొనిన వారికిఁ గాలము శక్తియుఁజాలవు; తీవ్ర కృషిచేయనిదే భగవత్కృప నార్జించుటలోఁ గొంత శ్రమ తప్పదు. కాని మానవ కర్తవ్యమిదియే కావున నీకృషిలో నున్న సాధకులకుఁ బ్రతిదశలోను భగవానుని కృపాన్విత సాహాయ్యము లభించుచునే యుండును, అందుచే నీసాధనలో శ్రమ తగ్గును; క్రమముగా నానందానుభూతి లభించును.

622. వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణ ములు భక్తుల, జ్ఞానుల వాక్యములు – దేవునినమ్మి భజించిన వారి దుఃఖకారణములను దొలగించి, స్థిరశాంతి సౌఖ్యముల నా భగవానుఁడిచ్చి రక్షించుననియు, రక్షించిన సాక్ష్యముల నెన్నిటినోచూపి, మీరు నట్లుచేసి తరింపుఁడని యాహ్వానించు చున్నవి. అందుచే మానవజన్మమెత్తి ఆత్మోద్ధరణ సాధనల నిష్ఠతోఁ జేయుచు, భయభక్తివినయ నిరహంకారములతో జీవించుటయే ప్రతి మానవునికిఁ గర్తవ్యము. ఇట్టి పవిత్ర కార్యక్రమ దీక్షాబద్ధుని జీవితములో ప్రతిఘట్టములో భగ వానుని కృపాహస్తము గోచరించు చుండును.

623. "భగవానుఁడు నన్నుజూచు చున్నాఁడు. కావున నాకెట్టి భయాందోళనములు నవసరములేద"ని భావించు

భక్తుని భావన పూర్ణసత్యము. ప్రతిక్షణము భగవానుఁడు నన్నుఁజూచుచుండుటచే, నేనా సత్యమును గుర్తించి, భగవానుని కిష్టమగు రీతిగా జీవించుట నేర్చికొనవలెను. కాని యొక విశేషమున్నది. మనము భగవానుని భక్తితోఁ బూజించునపుడు తప్పక భగవానుఁడు మనలఁజూచి సత్ఫలితము లీయవలెనని కోరుదుము. కాని మనము తప్పొఘనులు చేయునపుడుకూడ భగవానుఁడు చూచి తగిన శిక్షయిచ్చునను సత్యమును గుర్తింపకుందుము. మనమేమి చేయుచున్నను, సర్వత్ర సర్వసాక్షియగు భగవానుని చూపునుండి తప్పించుకొనలేము గావునఁ బాపములు చేయరాదనియు, ఁబాపకర్మ చేయు దుర్బుద్ధి పుట్టకుండ రక్షింపుమనియు భగవానునే ప్రార్థించు చుండవలెను.

624. ఎవరినుండి యైనను నీవు తప్పించుకొనఁగలవు కాని దేవుని దృష్టినుండి మాత్రమొక క్షణమైనను దప్పించుకొనఁజాలవు. నీకు నేత్రముల ద్వారా చూపు నిచ్చినది దేవుఁడే; వినుటకుఁజెవులిచ్చినవాఁడు దేవుఁడే! నీ హృదయ నివాసియై నీ జీవితరథము నాతఁడే నడపుచున్నాఁడు. నీవు తిన్నది జీర్ణింపఁజేసి, రక్తముగా మార్చుచున్న దాతఁడే; మూత్రపురీషాదులను బయటికి ఁద్రోసివుచ్చు వాఁడాతఁడే. నీమనస్సులోని భావముల నాతఁడే కలిగించుచున్నాఁడు. నీ బుద్ధిలో నిశ్చయజ్ఞాన మాతఁడే నిర్ణయించు చున్నాఁడు. అయినచో మనము తప్పులేల చేయుచున్నాము; పాప చింత,

దురాలోచనము లెందు కుదయించు చున్నవి? భగవానుఁడు చేయించుచున్న వానిలో దోషము లెన్నఁడు నుండవు. ఇఁక నేను గర్తనను నసత్యభావముచే దోషములు కలుగుచున్నవి. ఈశ్వరుఁడే కర్తయని నిస్సందేహముగా ఁదెలిసికొనుటచే సర్వ దోషవినాశమగును. సర్వసుఖ సిద్ధియగును.

625. ఏ వస్తువైనను నీదికానప్పుడు, దానిని నీవు వాడుకొనుటకుఁగాని, యితరుల కిచ్చుటకుఁగాని నీ కేమి యధి కారమున్నది? నీజీవితము, నీ శరీరము, మనస్సు, బుద్ధి, యింద్రి యములు, గృహభూధన ధాన్యాదులు - మఱియు నీభార్య, సంతతి, బంధుమిత్రులు - అన్నియు భగవంతునివే. ఆయన కృపలేనిచోఁ బైనచెప్పిన వానిలో నొకటియు నీకు లేకుండఁ బోవును. ఉండి నిరుపయోగములగును. అందుచే సర్వ మీశ్వర సామ్రాజ్యములోనివే; నీవు నందులోని వాఁడవే. ఈశ్వరోద్దిష్ట కార్యక్రమము నెఱిఁగి, నీవు నిరహంకారివై వర్తించుచో, నీకెట్టి దోషములు సంక్రమింపవు. 'నాది' యను నది పీసమంతయు లేదని తెలిసికొనుటే యీశ్వరాదేశము. ఏ వస్తువుకు 'నాది' యను భావమును దగిలించుకొంటివా, అది నీదికాదని తెలియువఱకు భగవానుఁడు నిన్ను వేయి విధముల వేధించి, తెలియపరచును. ముందే తెలిసికొని, వివేకముతో వర్తించుటే కర్తవ్యము.

626. ఈసృష్టి యంతయు భగవంతుని సంకల్ప సంజాతము. నీ వందులో నొకవస్తువు. సృష్టిలోని సర్వ

వస్తువుల వలెనే, నీవును దేవుని వస్తువే. కావున నీవు భగవానుని వస్తువునకుఁ దగిన రీతిగా వర్తింపవలెను. నీవెట్లు వర్తించినచో నీ కర్తయు, జనకుఁడు నగు భగవానుఁడు సంతసించునో అట్లు వర్తింపవలెను. నీవు భగవానుని సంకల్ప సంజాతుఁడవయ్యు లోకములోఁ బాపకృత్యములు చేయుటకుఁ గారణమేమి? నీకుఁగల యీశ్వర సంబంధమును విడిచి, "నేను స్వతంత్రుడను, నాయిచ్చవచ్చిన రీతిగా జీవింపఁగల" నని అజ్ఞానములోఁ బడుటచే, నీవర్తనము దైవ సంకల్ప విరుద్ధమగుచున్నది. ఈలోపమును సవణచేసికొన్నచో దైవ కృప, దానివలన సర్వసుఖములు లభించును.

627. సర్వకాల సర్వావస్థలలో, నిశ్చంచల చిత్తము, నిర్వికార శాంతి, దివ్యానందమును గలిగియుండు టందరును వాంఛితురు. దానికి సులభసాధన మేమైన నున్నదా? ఉన్నదో లేదో చూచికొనుటే బ్రహ్మజిజ్ఞాస. ఇది చాల సులభమైనదని, భారత ధర్మము, యుగములనుండి గొంతెత్తి చాటించు చున్నది. వేదవేదాంగములు, పురాణేతిహాసములు, భక్తులు, జ్ఞానులు విస్పష్టముగా బలికియున్నారు. చెవులు లేవా? సర్వకాల సర్వావస్థలలో భగవంతు నాశ్రయించి కూర్చుండుటే. ఇంతకంటె సులభమార్గ మేమున్నది? యజ్ఞ యాగాదులు, యాత్రలు, పూజలు, వ్రతములు, కఠోర నియమములతోఁగూడి, వ్యయప్రయాసలకుఁ గారణములగును.

వీనితో నిమిత్తము లేకుండ (బరమేశ్వరు నేక్షణమునందును మఱువనని ప్రమాణముచేసి జీవించు టే అతి సులభ మార్గము.

628. భగవానునికిఁ దెలియకుండ నీ విశ్వములో నేదియు జరుగదు. ఆకురాలుట మొదలు, విశ్వప్రళయము వరకు, నీశ్వరాజ్ఞవలననే జరుగుచున్నది. ఈశ్వర పాదాంకిత సర్వస్వుఁడవై జీవింతువా, నీకెట్టి దోషము పట్టకుండ నెల్లప్పుడు కృపాహస్తుఁడై అమోఘరక్షణమిచ్చి కాపాడును, ఇఁక నీకు బెంగ లెందుకు? భగవానుఁడున్నాఁడని నమ్ము, ఆతఁడు సర్వకల్యాణగుణ పరిపూర్ణుఁడని నమ్ము, భగవానుని నమ్మిన వారి నమోఘమైన దయచూపి రక్షించుటలో భగవానుఁడెల్లప్పుడు పూర్ణసంసిద్ధుఁడని నమ్ము; ఇంతే నీవు చేయవలయు పని. ఈచిన్న రహస్యము నెఱిఁగి జీవించుట నేర్చికొని నిత్య సుఖమందలేవా ?

629. అంజలిఘటించి, ఆనందబాష్పములు కురియుచుండ, "హే కృష్ణప్రభూ, రామప్రభూ!" యని స్మరించుట నేర్చికొన్నచో నెట్టి జన్మాంతర ఘోరపాపములైనను క్షణములో భస్మమై, సర్వదుఃఖములు నశించును. ఈ సులభమైన పనిచేయుటలో నెట్టి వ్యయప్రయాసలు లేవు. భక్తి భయ సంతోష వినయములతో భగవానుని (గీర్తింపుము. నీ దుస్థితిని (దొలగించు శక్తి భగవానునికిఁ దప్ప నింకెవ్వరికిని లేదు. కావున నిజమగు నాధారము నీకు దేవుఁడే. దైవేతరులైన

బంధుమిత్రాదులను నమ్మి వేలకొలంది జన్మములను వ్యర్థ మొనర్చితివి. ఆ మూఢత్వము నిప్పుడైనను విడిచిపెట్టుము.

630. భగవాను నాశ్రయించుటనగా నేమో తెలియ కుండఁ దెలిసిన దనుకొను నమాయక భక్తులు, నధికసంఖ్యలోఁ గలరు. సర్వకర్తయు సర్వదాతయునగు భగవానుని దాతృత్వమునకు మితిలేదు. నిజముగా నాశ్రయించిన భక్తుఁ డేమడిగిన నది సమృద్ధిగా వెన్వెంటనే భగవానుఁ డిచ్చుటలో విశేషము లేదు. భగవానుని కది సహజౌదార్య లక్షణము. అంతేకాదు, భగవాను నౌదార్యమును, అనంత కృపామృతమును నీ వెన్నఁడును శంకింపరాదు. శంకించితివా, భగవానుఁ డనఁగా నీకేమియుఁ దెలియదన్న మాట. ఇంకొకటి; భగవానుని జవాబు అత్యంతవేగ మహితమై యుండును. మఱియు స్వచ్ఛభక్తుని కడుగుటకు ముందే అడుగనవసరము లేకుండఁ గోర్కె నిచ్చి వేయును. ఇంతకంటె నాశ్చర్యమేమున్నది?

631. దేహమారోగ్యమును గలిగియున్నచోఁ, భోగముల వైపునకీడ్చును; రోగగ్రస్తమైనచో మానసిక పటుత్వమును నశింపఁజేయును, ఈదేహముతోఁ బొత్తు నిరంతర ప్రమాద హేతువు, దీనితో నెట్లు బ్రదుకుట? దేహమును త్రోసిపుచ్చుట సాధ్యపడదు; పట్టుకొని దానితో భోగములకై తిరుగాడినను ప్రమాద హేతువు. దేహావసరము లేకుండఁ జేసి కొనుటే కర్తవ్యము. భగవదారాధనము వలనఁగాని, బ్రహ్మ జ్ఞానము వలనఁగాని, విముక్తియు, నిత్యానందమును బొందు

టొక్కచే మార్గము. కాని యీమార్గమంత సులభమా? నమ్మినవారికి సులభమే; నమ్మలేని వారికి సుసాధ్యము గాదు.

632. 'నీకు జరావ్యాధి మృత్యువులతోఁ గూడిన సకల ప్రమాద దుఃఖకరమైన యీలోకమున జన్మమెందు కిచ్చితినో తెలియునా? నన్నుఁదెలిసికొని, దీని వలన సమస్త దోషములను దొలగించికొని, దుఃఖదూషితముకాని స్థిరదివ్యా నందము నార్జింపుమనియే. క్షణికములై దుఃఖహేతువులైన యిహలోక భోగము లనుభవించుచు నవి పుణ్యకాల బలహ రణముచేసి మోసగింపఁగా విలపించుచుఁ బునర్జన్మ మరణముల నందుచు నుండుమని కాదు. కాని మాయావరణము మా కన్నులకుఁగప్పి, నన్నుఁజూడుమనిన మేమెట్లు చూడఁగలమని మీరడుగవచ్చును. "మీ జన్మములలోని దోషములు, మీ రాసించు భోగములలోని మోసములు గమనించు శక్తిని మీకిచ్చితినిగదా! దోషములను జూచి వివేకించు శక్తి మీ కిచ్చితినే! మీరు మాయావరణమును దొలగించుకొను శక్తిని మీకిచ్చినటులే కాదా?" యని భగవానుఁడు ప్రశ్నించును.

633. ఇది 1978 జనవరి 1-వ తేదీ. ఇట్టి తేదీ లెన్ని లక్షలు గడచినవో! ఎన్ని వేల సారులు మన మెచటెచట నే రూపములలోఁ బుట్టి, పెరిగి, సంసారచక్రపు సందులలో నలిగి మృతులమై పునర్జన్మ మరణములు గాంచితిమో, ఈ సృష్టియను మహాప్రవాహ తరంగ సంఘటనలలోఁ దల క్రిందులై యెన్నిమాఱు లేడ్చితిమో, నవ్వితిమో, ఈ కాల

ప్రవాహమునకు నిలకడ యెన్నడు కనుపట్టదు. ఐనను మనము నేర్చికొనిన గుణపాఠము లేమైన నున్నవా? దుఃఖములేని సౌఖ్యమును గాంచు రహస్య ప్రక్రియలేమైన నేర్చితిమా? ఇప్పుడైన బుద్ధితెచ్చికొందమా? నిర్వికారుఁడైన భగవాను నాశ్రయించి నిర్వికారానంద పదవిని సాధింపయత్నింపరాదా?

634. పరమేశ్వరునిఁగూర్చి గ్రంథములలోని విష యములు చదివి మెచ్చుకొనుట మంచిదే. కాని అదిప్రథమ ఘట్టమని తెలిసికొనుట మంచిది. పరమేశ్వర సాక్షాత్కా రము లేనిదే, ఉన్నట్లు మాట్లాడుట, బుద్ధిచే మాత్రమే గ్రహించి, ఆచరణసిద్ధి నందినట్లు సంతుష్టి చెందుభ్రాంతిలోఁ బడి, కృతార్థులమైతి మని భావించువారి సంఖ్య అమితము గానే యున్నది. కాని యెన్నటికైనను అనుభవసిద్ధిగాంచిన వారితో వీరు సమానులెట్లగుదురు? ప్రజలు నిజముగా నను భవజ్ఞుల యెడనే గౌరవము చూపుదురు. అనుభవ బలమే ప్రజా హృదయమును నిజముగా మార్చఁగలదు; పాండిత్య బలము కాదు.

635. ఒకయింటి నద్దెకుఁ బుచ్చుకొనునపు డాయింటి కిఁగల సదుపాయములు, లోపములు తెలిసికొనకుండ నెవ్వ రందుఁ బ్రవేశింపరు. ప్రవేశించిన తరువాతఁగూడ నది వఱకుఁ దెలియని కొన్ని మంచి చెడ్డలు తెలియును. దానిని బట్టి యెంతకాల మాయింటనుండుట మంచిదో, యెట్లుకాలము గడపుట మంచిదో, లోపముల నెట్లు సహింపవలెనో పరిశీ

లించకుండ నెవ్వరును కాపురము చేయరు. అదే రీతిగా నీ లోకము మన కద్దెయిల్లు, మనము జీవింపవలసిన యీ లోక మెట్టిదో, దాని గుణదోషము లెట్టివో, అందు నివసించువారి స్వరూప స్వభావములెట్టివో, యీ లోకమున మనకెంత కాల ముండుట కవకాశము గలదో, యిం దేవిధముగా జీవించుట యుక్తమో, శ్రేయఃప్రదమో, ఉన్న లోపదోషముల నెట్లు తొలగించి కొనవలెనో, తెలిసికొని జీవించుట ప్రథమ కర్తవ్యము గాదా ?

636. సర్వకళలు, శిల్పములు, శాస్త్రములు మానవ బుద్ధి కల్పించినవే. చిత్రలేఖనము, సంగీతము, తర్క వేదాంతములు మానవబుద్ధి జన్యములే. మానవదేహముకంటె శిల్ప సౌందర్యమును జూపఁగల వస్తు విం కొకటిలేదు. బుద్ధి శక్తి యెచటనుండి వచ్చినది? తదంతర్గతమై అనంతజ్ఞాన కళా సౌందర్య నిలయమైన ఆత్మనుండి జనించినదే. బాహ్యప్రకృతి సౌందర్యమంతయుఁ బరమాత్మ నుండి బహిర్గతమైనదే. ఆత్మావలోకనముచే, సర్వకళలు, సర్వశాస్త్రములు ఆవిష్కృతము లైనవి. నీ శరీరము, దాని శిల్పము నీవు పరిశీలించినచో నందెంత అనంతప్రజ్ఞ, నిబిడీకృతమై యున్నదో తెలియును. సృష్టిసౌందర్యమంతము సృష్టికర్తయైన భగవానున నంత సౌందర్యసాగరములో నొక నీటిబొట్టు!

637. నేను నేనుగా నుండుట నే చ్చెకొనుటే నిజమగు వేదాంతము. అనగా స్వచ్ఛమైన నేను, నేనుగానిదేదో నేనే

అన్నదేదో విస్పష్టముగా విడఁదీసి చూడవలెను. ఇది నా కలము, గృహము, పొలము, శయ్య, పుస్తకము మున్నగునవి పలుకుదుము. విడఁదీసి చూచినచో 'నేను' కలమునుగాదు, గృహాదికముగాదు. అటులే నేను శరీరముగాదు. శరీరము గృహమువంటిది. అందు నేను నివసించుచున్న మాత్రమున శరీరమే నేనని తలఁచుట పసిబాలుని అజ్ఞానభావము. నేను శరీరము నిల్లువలె వాడుకొనుచున్నాను. కాని నేను శరీర మెట్లగుదును ?

638. "నాబుద్ధి సరిగాఁ బనిచేయక, ఆతప్పు చేసితిని. నామనస్సు చాల చికాకు పడినద"ని పలుకుచుందుము. అనగా నేనువేరు, నాబుద్ధి వేరు; నేను మనస్సును, చిత్తమును, బుద్ధిని గాను. అటులే నాహృదయము కరగినది, నాగుండె ఝల్లుమన్నది మున్నగు మాటలు నేను వేరు, నా హృదయము వేరని తెలుపుచున్నవి. నాబుద్ధి నేనైచో నాబుద్ధి చేసిన తప్పు నేను కనిపెట్టుట లేదా? బుద్ధిచేఁ బనిగొనుచున్న నేను బుద్ధినెట్లగుదును ? నేను పరమాత్మ శక్తినే దేహేంద్రియ మనోబుద్ధ్యాదులన్నిటి మూలమునఁ బనిచేయుచున్నానని స్పష్టము. నేనాత్మ పదార్థమును, వచ్చుట పోవుటలేని శాశ్వత సత్యస్వరూపునని యెఱుఁగుటయే ముక్తినీయఁగల జ్ఞానము.

639. ఒకవైపున (బరమేశ్వరుఁడు వేఱొకవైపున ప్రకృతి ప్రపంచము. పరమేశ్వరుఁడు చర్మచక్షువులకు గోచ

రింపఁడు. ప్రకృతి ప్రత్యక్షము. కన్నుల యెదుట గోచరించుచున్న యింద్రియ విషయములైన భోగద్రవ్యములు, దేహకాంతాధన వస్తువాహనాదులు కూడ భగవానునుండి వచ్చినవే. అవి మెఱుపు తీగవలె ఁదళుక్కుమని మెరసి, క్షణములో నదృశ్యమగును. పరమేశ్వరుఁడింద్రియ గోచరుఁడు కాఁడుకాని, నిర్వికారుఁడగుటచే, నిత్యానందమూర్తియు నిరవధిక శాంతిసౌఖ్య ప్రదాతయునై యున్నాఁడు. తీవ్ర కాంక్షగలిగి భక్తులైనవారికి ఁబ్రత్యక్షముగా గోచరించును; రక్షణమిచ్చి దుఃఖాపనోదనమును సుఖ లాభమును జేకూర్చును. కనపడుట ముఖ్యముకాదు; కాపాడుట ముఖ్యము. కాపాడు పరమేశ్వరు నాశ్రయించుటే కర్తవ్యము.

640. స్థిరమైనదేదో, అస్థిరమేదో స్పష్టముగాఁ దెలిసికొని, స్థిరమైనదాని నాశ్రయింపు మనియే సకల వేదవేదాంత రహస్యబోధ. ఎల్లప్పుడుండుట, సుఖశాంతు లిచ్చుట, దుఃఖము లేకుండఁ జేయుట మనము కోరుదుము. కొలఁదికాలమే యుండి, సుఖభ్రాంతిని కల్పించి, దుఃఖమిచ్చి, అదృశ్యములై యేడ్పించు దేహాదిక ద్రవ్యజాలము అస్థిరవర్గములోనివి. అస్థిర వస్తువులు మనకు ఖేదము కల్గించుటకుఁ గారణము, మనతో నీవిధముగాఁ జెప్పుచే యగును; "నీకు స్థిరానందము కావలెనని కోరి అస్థిరములైన మమ్ముభిమానించి, ఆశ్రయింతువేల? నీ దుఃఖములకు మేము కారణములము గాము. స్థిరాస్థిర భేద వివేకములేని నీబుద్ధియే నీ దుఃఖమునకు ఁగారణము."

641. ప్రకృతిలోని ప్రతి వస్తువుమీాద స్పష్టాక్షరము లతో నిట్లు వ్రాసియున్నది; "మమ్ము మట్టు కొనకుఁడు. మామీాద భ్రమ పెట్టుకొనకుఁడు. మేమీాశ్వరాదేశముచే ఁగపటనాటక మాడుచున్నాము. మేము, నీరు, గుంజును లేని కొబ్బరి దెయ్యపు తట్టులము. మీారది మమ్ము దృష్టిలో ఁబెట్టుకొని అహంకార మమకారములఁ బెంచికొని, అజ్ఞాన బంధముల బిగించికొని, బయటపడు నుపాయముగానక, ఆక్రం దించు చున్నారు. అమృతరస సాగరుఁడు పరమాత్మ. మీా కన్నులు విప్పి, వివేకము పెంపొందించికొని భగవాను నారా ధించి సుఖింపుఁడు.

642. జర యనగా వార్ధక్యము, గృహస్థులకు, భోగ లాలసులకు మిక్కిలి ప్రమాదకరమైనది, యౌవన బలము, ఓజశ్శక్తి భోగములకై వెచ్చింపఁబడిన తరువాత, బలహీన దేహము మిగిలి, రోగము తదితర బాధలు విజృంభించును. ఏపని చేయుట కనర్హుఁడై, మానసిక దౌర్బల్యము పెరిగి, ఆందోళనము, భయము జనించి దుఃఖహేతువులగును. భగ వంతు నాశ్రయింపఁ గోర్కెయున్నను, సాధనచేయు సామ ర్థ్యము లోపించును. ఈ విధముగా వార్ధకదశ మృత్యువు నాహ్వానించును. "చావు రాకుండ నున్నద"ని పెక్కురు పలవ రింతురు. అందుకే బుద్ధిమంతులు వార్ధకదశ పైఁబడులోపు ననే, భగవత్కృప నార్జింపవలెను.

643. జరాదోషము బాధింపకుండఁ జేసికొను నుపాయములు శాస్త్రకారులు నిర్ణయించి యిచ్చియున్నారు. గృహస్థులు, కఠోర నియమబద్ధులై, ధర్మానుష్ఠానముకొఱకు, సత్సంతతి కొఱకు దాంపత్యమును నిర్వహింపవలెను. అస్ఖలిత బ్రహ్మచర్యమే బ్రహ్మజ్ఞానమునకు మూలము, సద్గృహస్థునిది నాతిగల బ్రహ్మచర్యము. గృహస్థుఁడును ధర్మదీక్షాబద్ధుఁడై, కామభోగములను ధర్మనిష్ఠతో మాత్రమే అనుభవించి, సర్వప్రాణి శాంతిప్రదములైన సత్కర్మలు చేయుచు జీవించుటచే, బ్రహ్మజ్ఞానార్హుఁడై తరించుట కవకాశమున్నది. అట్టివ్యక్తి వార్ధక దశలో స్వేచ్ఛాభోగ లంపటుఁడగు గృహస్థుని వలెఁగాక, జితేంద్రియుఁడై భగవంతు నారాధించి తరింపఁగలఁడు.

644. బాధలేని మానవజీవితములేదు. కోరికల ఫలితముగా ఁగర్మఫలముల ననుభవించు దుఃఖమయమైనదే మానవ జీవితము. అందుకే మానవ దేహమును గర్మదేహమనిరి. దేహమును, తత్సంబంధ బాధలను గల్పించువాఁడు, తొలగించువాఁడు భగవానుఁడే. తెలిసియో తెలియకయో చేసిన పాపములను క్షమించి, ఉన్నబాధలను దొలగించి, మరల నట్టియేబాధలు రాకుండఁజేసి రక్షింపుమని భగవంతుని భక్తితో ఁబ్రార్థించుటే కర్తవ్యము.

645. పిచ్చివారెవరు? తమకుఁబిచ్చి యెత్తినదని తెలియనివారు. మానవులలో నత్యధిక సంఖ్యాకులు వారే.

దుఃఖము రాకుండఁ జేసికొనుట శీఘ్రప్రధాన కర్తవ్యమని యెఱిఁగి దానికై కృషి చేయుటకు జీవితమర్పింప వలెనని తెలియని వారు, తెలిసి సాధన చేయనివారు నున్నారులే. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖతరంగములచే సంసార సాగరము పొంగి ముంచివేయు చుండగా మానవు లేమియుఁ దటస్థింపనట్లు భావించి, రక్షణోపాయములఁ జూచుకొనని వారి కంటెఁ బిచ్చ వారెవరుందురు ?

646. జన్మజరా మృత్యువుల వలని దుఃఖనిర్మూలనమునకు మనమేమి చేయఁగలము? మన కేమి శక్తియున్నదని పలుకుదురు. అందుచే దుఃఖదాసులై జన్మాంతర యాత్రలు చేయుచుఁగూర్చుండుటే తెలివైన పనియా? ఈ సృష్టికి నందలి మానవుల జీవితములకుఁ గారకుఁడైన భగవానుఁ డున్నాఁడు. భగవాను నాశ్రయించి భజించినచో, సర్వ దుఃఖములను బోఁగొట్టి, జన్మరాహిత్యము నొసఁగి, శాశ్వతానంద శాంతి ప్రదమైన మహోన్నత స్థితిని ప్రసాదించును. ఆశ్రితులయెడ ననంత కారుణ్యము నాతఁడు చూపును. కావున నీ సంగతి తెలిసికొని ఫలితమును సాధింట కర్తవ్యము.

647. కోరికలు సంసారకారణములు. సంసారము దుఃఖనిలయము; దుఃఖనివారణమునకు మానవ జీవితములో ననేక సదుపాయములు చూపఁబడినవి. మానవుఁడు యుక్త వయస్సు వచ్చినది మొదలు పరమార్థ సంపాదన కృషికై సర్వ శక్తు లుపయోగించి కృతార్థుఁడు గావలెను. కాని

అత్యధిక సంఖ్యాకులు గృహభార్యా పుత్రాదికము లేనిదే జీవింపఁజాలరు. కాని గృహస్థునికి గృహమేధి యను పేరు గలదు. మేధ మనఁగా యజ్ఞము. గృహము యజ్ఞశాల కావలెను. భగవత్ప్రీత్యర్థము గృహస్థ ధర్మాచరణమును నియతితో నడపుకొను గృహస్థుఁడు గృహమేధి యగును. గృహస్థుఁడయ్యు నాతిగల సన్యాసినలె వర్తింపవలెను. బాహ్యాభ్యంతర సన్యాసము సన్యాసము; ఆంతరంగిక సన్యాసము గార్హస్థ్యము.

648. మనోనిగ్రహము సన్యాసికి గృహస్థునికి సమానమే. అదిలేని సన్యాసి భ్రష్టుఁడగును. అదిలేని గృహస్థుఁడును కాంతాశనకలోలుఁడై నశించును. సంపూర్ణ నిగ్రహము సన్యాసిది. ధర్మసంతాన కాంక్షకలిగిన పూర్ణ నిగ్రహము గృహస్థునికిఁగావలెను. ధర్మసంతానమును కాంక్షించు గృహస్థుఁడు కామోపహతుఁడు గాకుండ, ననేక వ్రతములు, సత్కర్మలు చేయవలెను. భోగకాంక్ష లేశమైన లేకుండుటచే సన్యాసి, కర్మలు చేయనవసరములేదు. భోగము లనుభవించుటే గృహస్థ ధర్మమనుకొనువారు పశుతుల్యులగుదురు.

649. జీవితయాత్ర ముగియుచున్నది. కన్నుల కరవు తీర నాకెన్నఁడు నీ పరమపావన దర్శనమిచ్చి, "ఒరే! నీ కభయహస్త మిచ్చుచున్నాను. భయములేదు. నీకెట్టి బాధలు లేకుండఁజేసి, సకల శుభసౌఖ్యము లిచ్చి రక్షింతు న"ని పలికి ధైర్యమిత్తువు? నీవు తప్ప నన్నుఁ గాపాడువా

ఁడన్యుఁడెవ్వఁడును లేఁడు. అన్నియువిని చూచి, నాకత్యంత సమీపమున నేయుండి ముచ్చటదీర నొక్కసారి పలుకవదేలా? నిన్ను మరువకుండఁజేసి, నన్ను రక్షించుట మరువకుము''ని ప్రార్థింపవలెను. రక్షించువఱకుఁ బ్రార్థనచేయుచునే యుండవలెను.

650. పరమాత్మ ఏకమైయుండి, 'నేననేకమ' గుదునని కోరి నానాజీవులను సంకల్పమాత్రమున సృజించి, అందుఁ బ్రవేశించి, సర్వసదసద్రూప ధారియయ్యెనని ఉపనిషత్తు పలికినది. అనగాఁ బ్రతి ప్రాణిలోనుండి పరమాత్మ, ప్రతి ప్రాణి రూపమునఁ దానేపని చేయుచున్నది. అది పరమాత్మ విలాసమని సూక్ష్మదృష్టితోఁ జూచువారికి దెలియఁగలదు. మానవుఁడు చేయు ప్రతిక్రియయు ఁబరమాత్మ కార్యమే. తుమ్ముట, దగ్గుట, మలమూత్ర విసర్జనము, భోజననిద్రా మైథునాదికము సర్వమూపరమాత్మ క్రియాకలాపమే. మనము కోరిన రీతిగాఁగాక, మఱొకరీతిగా జరుగు సకల విషయములు పరిశీలించినచోఁ బరమాత్మ సర్వప్రాణి క్రియాకలాపములో స్పష్టముగా గోచరించును.

651. దేవుఁ డీయలేని దున్నదా? దేవుఁడీయని దున్నదా? దేవుఁడీయఁగలిగియు భక్తుని కిచ్చుట కిచ్ఛగింపని దున్నదా? వీనికి సమాధానములో దేవుని తత్త్వము కొంత తెలియుట కవకాశమున్నది. (1) దేవుఁడీయనిది లేదు. దేవునియొద్ద లేనిదేదైన నుండునా? ఆతఁడు పరిపూర్ణుఁడనఁగా,

సర్వసంపన్నుఁడు. సర్వమాతని హస్తగతమై యున్నది. అందుచే భక్తుఁడడిగిన దేదైన లేదనకుండ నీయఁగలఁడు. (2) దేవుఁడీయఁ గలిగియు నిచ్చుట కిచ్ఛగింపఁడా? భక్తుల భక్తి పరిణతి భేదముల ననుసరించి, కొందర కిచ్చుటయు, నీయ కుండుటయు జరుగును. అన్నియు నీయఁడని నమ్మువారి కటులే చేయును. అన్నియు నిచ్చునని నమ్మువారి కన్నియు నిచ్చును. అన్నియు నిచ్చినచో భక్తుని భక్తి చెడదా? అన్నియునిచ్చి భక్తుని భక్తికి లోపమురాకుండఁ జూడఁగలఁడు.

652. ఒక కుటుంబ యజమాని, యోగ్యుఁడు నుదారుఁడు నైనచో తనకుటుంబ సభ్యులందర యోగక్షేమ బాధ్యతను తనపైఁ బెట్టుకొని, వర్తించును. కుటుంబ సభ్యులలో నెవ్వనికి లోపము రాకుండఁ జూచును, జగత్కుటుంబ యజమాని సంగతియో? ఆతఁడు యోగ్యుఁడే కాదు, పరిపూర్ణ యోగ్యుఁడు, సర్వ సమర్థుఁడు. ఎట్టి లేశమాత్ర శ్రమయు లేకుండఁ దన విశ్వకుటుంబ సభ్యులందరి యోగక్షేమములను నిరంతరము, సంకల్పమాత్రముచే సంరక్షించు పరమపావన కృపాశీలము గలవాఁడే భగవానుఁడు. మఱియు నా భగవానుని యాజమాన్యమును గుర్తించి, వినయ విధేయతల తోడను, భక్తిశ్రద్ధా గౌరవములతోడను భజించు భక్తుల విషయములో సర్వకామదాతయై భగవానుఁడు వర్తించు ననుటలో నెట్టి సందేహమును లేదు.

653. ఏది తెలిసినను, నేది తెలియకున్నను, నొక్కటి మాత్రము సులభముగాఁ దెలిసికొని తరింపఁదలఁచి కొనిన వారికి ప్రథమ సోపానమున్నది. అదేదనఁగా మానవదేహము స్మశాన వాటికలో దహనము కాక తప్పదను పరమసత్యము. రోగము, వార్ధకము, బహుళప్రమాద తాటస్థ్యము, మరణము నెప్పుడేరీతిగా సంభవించునో తెలియని దుస్థితి గలది మానవ దేహము. దేహము సుఖమిచ్చునని భ్రాంతి మనల నావహించి మూర్ఖులఁజేయుచున్నది, నిజముగా నానందము మన భావములో నున్నది. ఆనంద మాత్మనుండి భావములో సంక్రమించి దేహములో నున్నదనిపించును. అనగా సుఖ మాత్మజము. ఆత్మజ్ఞాన జన్యము. ఇదియే ముక్తి నానందము నిచ్చును.

654. యుద్ధనిపుణులైన అసంఖ్యాక యోధులు సాయుధులై నా చుట్టును నిలిచియుండగా నొక తస్కరుఁడు నొక తుంటరి నన్నెట్లు సమీపింపఁగలఁడు? నాపై నొక యీగ, దోమ వాలదు. నాపేర బ్యాంకులో ఁగోటి రూప్యము లుండగా, నేను పస్తుండి, చినిగిన గుడ్డపేలిక ధరించి బ్రతుక వలసిన అవసరమేమున్నది? అప్రతిహాత బలశక్తులు, అవ్యయైశ్వర్యము, అఖండ భక్తజన రక్షణ పరాయణత్వముగల పరమేశ్వరుఁడు, మనకేమియు శ్రమ లేకుండ మనలో, బయట అత్యంత సన్నిహితుఁడై యుండఁగా, మనకేమి బాధ కలుగుట కవకాశమున్నది? వానితో మనలోపములు, తాపములు

చెప్పికొని, నిముసములో వానిని నిర్మూలించి, సర్వసౌఖ్యము లిచ్చుచుండగా భగవానుని నమ్మి హాయిగా జీవింపవచ్చునే. క్లేశమెందుకు ? దుఃఖమందవలసిన ప్రారబ్ధమేమున్నది ?

655. లేమిచే నేడ్చువారు కొందరు, సంపదలధికమై యేడ్చువారు కొందరు లోకమునఁ గలరు. భగవంతు నస్తిత్వమును, సామర్థ్యమును, అనంత కృపామృతమును గూర్చి వక్కాణించుచు, భగవంతుని పాదముల నాశ్రయించితి మని చెప్పికొనుచు, తాపత్రయాధీనులై, సకల క్లేశముల ననుభవించువారి నేమనవలెను? వీరన్నియునుండి యేడ్చువారు; భగవంతుని నిజముగా నాశ్రయించిన భక్తుల కేడ్పెందులకు ? భగవంతుఁ డత్యంత సన్నిహితుఁడై యుండగా భక్తుఁడైన వాఁడు క్లేశము లేశమాత్ర మనుభవింప నవసరములేదు. నిజముగా భగవానుని నమ్మినవానికి సర్వదుఃఖ నివారణము క్షణములోఁజేసి, భగవానుఁడు రక్షింపనివాఁడనియా? అనగా భక్తుని భక్తి లోపభూయిష్ఠమైనదని స్పష్టము.

656. రైలులోఁ బయనించుచున్న కాలములో నందరు తల్లులు పిల్లలను గనిరి. భారసాల రైల్లో, చదువు రైల్లో, పెళ్లి రైల్లో, పిల్లలను కనుట రైల్లో, చదువుట రైల్లో, ఉద్యోగములు రైల్లో, జపతపాదులన్నియు రైల్లో, మృత్యువు రైల్లో, తద్దినములు రైల్లో – అనగా రైలు నడచుచుండగా – మన జీవితమిది ? ఎంత విచిత్రము! ప్రయాణము చేయుచునే కర్మలన్నియుఁ జేయుచున్నారు. శ్మశాన ప్రయాణము!

ఒక్క నిమిషమాగదు. ఆగినట్లు కనిపించి, రైలు నడచుచునే యున్నది, పయనించుచు భోగములు, సంపాదనలు ఎంత అద్భుత జీవయాత్ర! ఎవఁడెక్కడ దిగిపోవలెనో తెలియదు! భగవంతుని సేవించు టెపుడో! శ్మశానమునకు నూటిగాఁ బోవుచు 'రామరామ' యని తరింపలేవా?

657. "హే పరమేశ్వరా! నీవుండఁగా నాకులోటేల? నీవు నిశ్చయముగా నున్నావు. అందెట్టి సందేహమును లేదు. ఎటువంటి నీవు? సర్వసంపూర్ణ సమర్థుఁడవైన వాఁడవు, ఆశ్రితులఁ గాపాడుటలో వాయు మనోవేగముల నతిక్రమించి రక్షించు లక్షణము గలవాఁడవు. నిన్నాశ్రయించిన మాత్రముననే సంతసించి భక్తుని నీయంత వానినిఁగాఁ జేయువాఁడవు. నీకు నాకును భేదములేకుండ ననుగ్రహించు నఖండ దయామూర్తివై అవ్యయానందశాంతి సౌఖ్యముల నిచ్చువాఁడవు. అట్టి నీ పాదపద్మములుండగా నాకేమిలోటు?" అని ప్రార్థించి, తప్పక లభించు ఫలితములను జూచికొనుచుఁ గూర్చుండుటే కర్తవ్యము.

658. "భగవానుఁడున్నాఁడు కదా? నీకు సంశయ మున్నదా? లేనిచో భయముండరాదు. భగవానుని పాద పద్మములను మనస్సులోనూహించి పట్టుకొని, భజింప లేవా? ఎంత చిన్నపని? ఈ బుల్లిపనిచేసి, సర్వవిధ భయముల దహించి వేయు భగవానుని దివ్యకృప నార్జింపలేవా? నీపవిత్ర హృదయ మాభగవానుని పాదపద్మముల స్పృశించుటయు, సర్వభయ

కారణములు దహనమై పోవుటయు నొకక్షణములో జరిగి పోవును! ఇంత సులభముగా వేగముగా భయనాశనమై, అభయానంద శాంతులు లభించుచుండగా నేల యీపనికి బూనుకొనవు ?"

659. సాక్షాద్భగవానుఁడు నీ పనులన్నియుఁ జేసి పెట్టుదు ననుచుండఁగా, వలదను దుర్బుద్ధి నీకెన్నఁడు పుట్టకుండ జూచికొనుము. కాని ఒక రహస్యమున్నది. నీ వేమను కొన్నను, సత్యమొకటే, అన్నిపనులు దేవుఁడే చేయుచున్నాఁడు. సకల జీవరాసులు జడపదార్థ తుల్యములే. నీలోనుండి నీ మనస్సును, నీ బుద్ధిని, నీ యింద్రియములను నీ దేహమును, శక్తినిచ్చినడపు శక్తి యెనరిది ? అది నీదా? అది దేవుని శక్తి; భగవాను నేకైక కర్తృత్వమును గుర్తించి, నీకర్తృత్వశూన్య తను గ్రహించుచో నాక్షణములోనే, నీజీవితమంతయు మారి పోయి, దైవత్వ లక్షణములను గాంచును. ఈ గుర్తింపే బ్రహ్మజ్ఞానము. ఇది కలిగినచో నన్నియు దేవుఁడే చేయు టయు, నీవే దేవుఁడగుటయు, సకల లోపములు నశించుటయు నేక కాలముననే జరుగును.

660. మానవునకు ముఖ్యసమస్య జన్మజరామృత్యు వుల దొలగించుకొనుట. తక్కిన సమస్యలన్నియు, ముఖ్య సమస్యను బరిష్కరించుకొనుటకు సహకరించు రీతిగా సమన్వ యించు కొనవలెను. రాజకీయ సమస్యయనగా మానవుల ముఖ్య సమస్యను బరిష్కరించికొనుట కనువైన పరిపాలన

మును స్థాపించుకొనుటే. ఆర్థిక సమస్య, సాంఘిక సమస్యల కిట్లే అర్థము చెప్పవలెను. రాజకీయార్థిక సాంఘిక రంగము లన్నిటిని, మానవుని దేవుని దగ్గర కతివేగముగాఁ దోడ్కొని పోవుట కనుకూల విధముగాఁ బరిష్కరింపవలెను. ప్రస్తుత నాగరకత యీ విషయమును పూర్తిగా విసర్జించి, గంతులు వేయుచున్నది. నేటి భౌతిక భోగలోలత గలిగిన నాగరకత, ముఖ్యమైన ఆధ్యాత్మిక సమస్యను తృణీకరించి, ప్రపంచ మంతట సాంఘిక కల్లోలమును సృజించి, అశాంతిని పెంపు చేయుచున్నది. మానవులలో దైవాంశను పెంపొందించు నుద్దేశమును విడిచిపెట్టి, మానవత్వమునే కలుషిత మొనర్చు చున్నది.

661. మరచుట మరణతుల్య దుఃఖము కలుగఁజేయు నదొక వస్తువున్నది. అదియే మృత్యువు. అది అనుక్షణము మనల ననుసరించియే తిరుగును. దేహధారియైన వాఁడెంత గొప్పవాఁడైనను మృత్యు హస్తములకుఁ దనదేహము నొప్ప గింపక తప్పదు. మన మాసంగతి నెఱిఁగి, యిచ్ఛాపూర్వ కముగా నీయకున్నచో బలవంతముగా మన దేహమును మృత్యువు లాగికొనిపోవును. మన దేహముపై నుపయో గించు నొక చినిగిన వస్త్రము పోయినచో విచారింతుమా? అటులే, ముదుసలి తనముచే గృశించిన దేహము నా వస్త్ర మును వలెనే చూడవలెను. లేకున్న దుఃఖము తప్పదు. జ్ఞానము కలిగి, మృత్యువెదురైనపుడు, "ఇదిగో! తీసికొని

వెళ్లుము"ని చెప్పఁగల దేహాభిమాన రాహిత్యమును మనము పెంపొందించి కొనుచుండవలెను.

**662.** ప్రపంచమును సృజించి, దానిని భగవానుఁడు దుఃఖమయ మొనర్చెను. కాని భక్తునికి, జ్ఞానికి విచారింప నవసరము లేదు. భక్తుఁడు తనసర్వస్వము భగవంతుని కర్పించి భజించినచో భగవానుఁడాతనికి సర్వదుఃఖావసరములను దొలగించి, సర్వసుఖములిచ్చి రక్షించును. ఇఁక జ్ఞాని యనగా బ్రహ్మవేత్త. బ్రహ్మజ్ఞాని విశ్వమంతయుఁ దనతో సహా, బ్రహ్మమయముగాఁ దిలకించి అప్రమేయానంద మనుభవింపఁగలఁడు. భక్తునికి దుఃఖము తొలగింపఁబడును; జ్ఞానికి దుఃఖసమస్యయే లేదు. ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులను నాల్గువర్గములలో జ్ఞానియు నేను నొకటే యని కృష్ణభగవానుఁడు చెప్పి, మిగిలినవారు నుదారులే యని చెప్పెను. మిగిలిన ముగ్గురు భక్తకోటికిఁ జెందుదురు. వారిని భగవానుఁడు రక్షించును.

**663.** జీవికి దేహసంబంధ మత్యంత క్లిష్టమైనది. జీవి, దేహముతో నేకత్వము పొందును, అదియే దేహాత్మభావము. దేహదోషములు, ప్రమాదములు తనవేయని మమకారముచేఁ బెక్కు దుఃఖము లనుభవించును. మరియు దేహము నశించుట భరింపరాని దుఃఖము నిచ్చును. కాని దేహములేనిదే సత్కర్మానుష్ఠానము, తపస్సు, ధ్యానము, మోక్షసాధనములును కుదురవు. దేహమును దేహితరించుట కుపకరణముగా

నుపయోగించి కొనుట నేర్వవలెను. అదిమాని భోగముల కుపయోగించినచో దుఃఖమే ఫలితమగును.

664. "యత్ జ్ఞాత్వా నపునర్మోహమేవం యాస్యసి పాండవ." గీతావాక్యము. ఏది తెలిసినచో నీక మోహము (అజ్ఞానము) ండదో, దానిని దెలిసికొమ్మని భగవానుఁడు చెప్పుచున్నాఁడు. మానవుఁడు భూమిపై జన్మించి, మోహములను దొలగించు జ్ఞానము నార్జింపవలెను. అనగా దుఃఖ వినాశమును, సుఖప్రాప్తినిచ్చు జ్ఞానమును దెలిసికొనవలెను. అదియే ఆత్మజ్ఞానము లేక బ్రహ్మజ్ఞాన మనఁబడును. అట్టి జ్ఞానమునిచ్చు వేదవేదాంతములను జదివి, సారమును గ్రహించి, జీవితాచరణముచేసి, అనుభవసిద్ధి పొందవలెను. ఇదియే బ్రహ్మవిద్య. దీని నార్జించి, లోకోద్ధరణమునకై బ్రాహ్మణజాతి కల్పింపఁబడెను.

665. "నహికశ్చిత్క్షణమపి జాతుతిష్ఠ త్యకర్మకృత్ కార్యతేహ్యావశఃకర్మ సర్వఃప్రకృతిజైర్గుణైః" "ఎవ్వఁడు నొక క్షణమైనను గర్మచేయకుండ నుండఁజాలఁడు. అవశుఁడై, ప్రకృతి నియుక్తుఁడై కర్మచేయుచున్నాఁడు." ఇది పూర్ణ సత్యమని తెలియఁగలదు. పురిటి గదిలోని చంటిబిడ్డ మొదలు, సకల జీవిత దశలలోను దేహపోషణము, మానసిక, వాచిక, కాయికములగు కర్మలచే జరుగుచున్నది. కాని యీ కర్మ చేయుట ప్రాణుల వశమైలేదు. ప్రకృతి తనశక్తిచే సకల ప్రాణులచేఁబనులు చేయించుచున్నది. ప్రకృతి కధిపతి

యెవరు? భగవానుఁడే! భగవానుని బంటు ప్రకృతి. అనగా సర్వప్రాణులు దైవశాసన సంకల్ప ప్రభావములచే (గర్మలు చేయుచున్నారు.

666. వైరాగ్యము కలుగుటకుఁ బెక్కు సాధన లున్నవి. అందొక ముఖ్యమైన దానిని మనము గమనింప వచ్చును. జీవి మరణించినపుడు పచ్చివెదురు కర్రలతో నిచ్చెన వంటిది కట్టి శవమును దహనభూమికిఁ దీసికొని పోవు దురు. శవ బంధువులు రోదించుచుందురు. జ్యేష్ఠ పుత్రుఁ డున్నచో నగ్నిని చేతఁబట్టి శవముతోఁబోయి కట్టెకు నిప్పు పెట్టును. పూర్తిగా శవము బూడిదయగు వరకు ముఖ్య బంధువు లచటనేయుండి చూచుచుందురు. ఈదృశ్య మంద రకు వైరాగ్యమును గలిగించును. ప్రతి వ్యక్తియుఁ దన శవము నటులే దహింతురని, అది తప్పదని యిపుడే గుర్తించి, విరాగియై భగవదారాధనపరుఁడై తరించుటకు యత్నింప వలెను.

667. "చినిగిన వస్త్రమును పారవేసి, నూతన వస్త్ర మును ధరించు నటులే, జీర్ణించిన దేహమును విడిచి, నూత్న దేహములను జీవులు పొందుదుర"ని గీతావాక్యము. ఇది చిన్న విషయమువలె (గన్పట్టును కాని చాల పెద్దవిషయము. చినిగిన వస్త్రము, జీర్ణించిన శరీరము సమాన మెట్లగును? మరియు (గొందరు, ఆరోగ్యవంతులై యుండి మరణింతురు. చినిగిన గుడ్డలను పారవేయుట సులభము. దేహము నట్లు

పారవేయఁగలమా? చినిగిన గుడ్డ పారవేసినచో, క్రొత్త వస్త్రము వెంటనే వచ్చును. క్రొత్తదేహమంత సులభముగా వచ్చునా? మరలనొక కాంతాగర్భ నరకమునఁజేరి, ఎన్నో అవస్థలు పడవలెను. ఉపమానము చెప్పుటకు బాగున్నది కాని చేయుట కంతసులభము గాదు. అనగా, శరీరముపై మమకారమును చిరకాల సాధనచే విడిచిపెట్టవలెను. జన్మ మంతయు సాధనచేసి, తపస్సంపన్నుఁడైన వానికిఁగాని శరీర మును జీర్ణవస్త్రమువలె విడిచిపెట్టుట సాధ్యముగాదు. అందుచే ప్రతిమానవుఁడు దేహదోషములను గుర్తించి, దేహాభిమానము తగ్గించికొని తపస్సు చేయవలసియున్నది.

668. దేహాత్మభావ మనఁగా నేనే దేహము నను భావము. ఇందు పరమేశ్వరు నమోఘప్రజ్ఞ విదితమగు చున్నది. నేను, దేహము వేరని విడఁదీసి, తెలిసికొనుటయు, నిత్యజీవితములో నట్లు ప్రవర్తించుటయు బహుకష్టమైన విష యము. నిద్రలో నా దేహము పాన్పుపై నుండగా నేను దేశాంతరములు స్వప్నమందుఁ దిరిగి అనేక కార్యక్రమ ములు నడపుచున్నాను. గాఢసుషుప్తిలో, సూక్ష్మస్థూల దేహ ములు రెంటిని విడిచి, పరమాత్మ నాలింగనము చేసికొనుటచే, మెలకువ వచ్చిన తరువాత నేను చాలసుఖ మనుభవించితి నని చెప్పుచున్నాను. ఇది ఉపనిషత్తు చెప్పిన విషయము. దేహము నాకత్యంత ప్రాణప్రదమైన ఉపకరణ మనుటలో సందేహములేదు కాని, నే నుపకరణము నెట్లగుదును? దేహ

ముపకరణమే, నేను గాదు. ఈ జ్ఞానము దృఢముగా స్థిరపడి నచో మరణభీతి యుండదు. ఈశ్వరారాధనముచే నది లభించును.

669. ప్రజాస్వామ్య ప్రభుత్వములోఁ బరిపాలకుల పక్షము, వ్యతిరేక పక్షములుండి ఐదుసంవత్సరముల కొకసారి ప్రతినిధుల నెన్నుకొనుచుందురు. ప్రతివ్యక్తి స్వేచ్ఛగఁ దన స్వత్వము (వోటు) నుపయోగించి కొనవచ్చును. అటులే యీ జగద్రాజ్యములో రెండు పక్షములున్నవి. శివుఁడు యముఁడు, పాలక వ్యతిరేక పక్షాధిపతులు శివుని పక్షమెల్ల ప్పుడు రాజ్యము చేయుచుండును. యముఁడు ప్రజలను బాధించి చంపి, దుఃఖకారణుఁ డగుచున్నాఁడు. ఎవరికి వోటివ్వవలెను? శివునికా? యమునికా? నూటికిఁ దొంబది తొమ్మిది మంది తమ వోటును యమునికిచ్చు చున్నారు! దుఃఖభాజను లగుచున్నారు. కొలఁదిమంది శివునికిఁ దమ వోటునిచ్చి సకల సదుపాయములను, సౌఖ్యములను పొందు చున్నారు. మీవోటును సరిగా నుపయోగించికొనుఁడు.

670. నా సర్వస్వమును నీ కర్పించితిని. వీస మంతయు మిగుల్చుకొనలేదు. ఇఁక నాకేది జరిగినను, కర్తవు పూర్తిగా నీవే. నాబాధ్యతలన్నియు నీవే! బ్రతికియున్నంత కాలము లేశమాత్ర శ్రమయు లేకుండఁజేసి, యుక్త కాలమున దేహమును విడిచిపెట్టు లోపున నీ దివ్యానుగ్రహముచేఁ బరిపూర్ణ జ్ఞానమయ భక్తితో ముక్తినిచ్చి నన్ను రక్షింపఁగోరు

చున్నాను. సకల పరిపూర్ణ కల్యాణగుణమూర్తివగు నీపాద పద్మములసేవ లభించు మహాభాగ్యము నాకుఁగలిగినది. ఇఁక లోపమున కవకాశ మెచటనున్నది ?

671. అనంతబ్రహ్మాండకోటి నవలీలగా సంకల్పమాత్రముచే సర్ధక్షణములో సృజించి పరిపాలించు నమేయ ప్రజ్ఞాశాలియు, ఆశ్రితకోటి సర్వభారవహన దీక్షాదక్షుఁడును, సర్వకాల దేశ కారణ కార్యస్వరూపియునగు భగవానుఁ డుండఁగా, నేపని వచ్చినను నా జగజ్జనకునితోఁ జెప్పికొని నీ పనులన్నియు నీకు శ్రేయస్సంతుష్టి శాంతులు కలుగు నట్లాయన చేయుట కెల్లప్పుడు సంసిద్ధుఁడై యుండఁగా నిఁక నీకు బాధించు సమస్య యేమున్నది? ఏమికావసిన నాయనతోఁ జెప్పికొనుటే నీపని. ఇదియే అత్యంత పవిత్రమైన తపస్సు.

672. కోర్కెలను, ముఖ్యముగా కామినీకాంచన కాంక్షలను జయింపవలెనని చెప్పుదురు. కాని యిది సాధ్యమగు విషయముగాదు. మనస్సులో జనించు కాంతాలింగన సౌఖ్యకాంక్ష, ఎన్ని వేల జన్మములనుండియో సంక్రమించుచు, రక్తమాంసాస్థి పంజరములలో గడ్డకట్టి నిలిచియున్నది; అది నిర్మూలించుటకు శక్యముకాని ప్రబల సంస్కారము. ధన కాంక్షయు నట్టిదే. ఈ కాంక్షలు వ్యక్తితో నేకమై పోయినవి; విడిగా లేవు. వానినిఁ దొలగించు శక్తి మానవులకు లేదు. మానవులకు స్త్రీపురుష లింగములనిచ్చి, వానివలన నీ ప్రపంచములో నెందును లభింపని సుఖలేశముంచి, వానిని

విడిచిపెట్టు మన్నచో నెవని తరమగును ? కాని వానిని విడిచిన ఁగాని ముక్తి లేదు; అనంత జన్మపరంపర, దుఃఖమును తప్పవు. ఇఁక మార్గమేమి? "నీవు పెట్టిన వానిని నీవే తొలగించి, రక్షింపుమ"ని భగవానునే ప్రార్థించు టొక్కటే మార్గము; అన్యపంథ లేదు.

673. దేవుఁడడుగో! నీకుఁ గన్నులున్నవా? చూచి ఆనందింపవేమి? పంచభూతపరి కల్పితమైన నీదేహము, ఒక క్షణమాత్రము దేవుని దివ్యశక్తి లేనిచో దేనికది విడిపోయి తుత్తునియలగును. నీ గుండెకాయ కొట్టుకొనుటకును, నీఅవయవములు పని చేయుటకును, నీ బుద్ధి ఆలోచించుటకును గారణము భగవానుని శక్తియే. అనగా దేవుఁడున్నాఁడని చూపు సాక్షివి నీవే. నీతోఁబాటు పంచభూతములు, సూర్యచంద్రాదులు, పశుపక్షి వృక్షలతాదులు సాక్షులు. భగవానుని చైతన్యమందరను, అన్నిటిని, లోపల బయటనుండి నడపుచున్నది. అంధుఁడైనను తన గుండెకొట్టుకొను టెఱిఁగి, అది దైవశక్తియే యని గ్రహింపవచ్చును.

674. "భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతిసూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమఇతి" "ఈ పరమాత్మవలని భయముచే వాయువు వీచుచున్నది; సూర్యుఁడుదయించుచున్నాఁడు; అగ్ని యింద్రుఁడు తమ పనులు చేయుచున్నారు. మృత్యువు తన విధిని నిర్వహించుచున్నది." తైత్తిరీయోపనిషత్తు. పంచభూతములకు, సూర్యచంద్రాగ్ని

దేవేంద్రులకు బరమాత్మ యనిన గుండె దడ! ఈశ్వర శాస నము ననుసరించి, తమ కార్యములను తు, చ, తప్పకుండ నిర్వహించుచున్నారు. ఇఁక మనమెందులో జేరుదుము? మనకెంత భయముండ వలెను ? భగవాను నాదేశముల బాటింప కున్నచో భస్మమగుదుము. భయభక్తులతోఁ బర మాత్మ నారాధించినచో నింకే భయము నుండదు. ఏ క్షణము నందును భగవానునికిఁ గోపము రాకుండ మనము బ్రతుకవలెను.

675. పతివ్రత, తనభర్త మృతిచెందినచో దుఃఖిం చును. భర్త పూజ్యుఁడై, తన భార్య ననింద్యప్రేమతోఁ జూచువాఁడైనచో, నామె దుఃఖమునకు మితియుండదు. జీవుల మైన మన మందరము స్త్రీలమే. మనకందర కేకైక భర్త పరమేశ్వరుఁడే. ఎట్టి భర్త ? చావులేని భర్త; ఆతఁడు మృత్యువుకు మృత్యువు. పరమేశ్వరుని వివాహమాడినచో, మనకును మృత్యువుండదు. పరమాత్మను భర్తగా నెన్నుకొని మనము, సీత, రుక్మిణి వంటి పవిత్ర హృదయములు గలిగి వర్తించినచో మన భాగ్యమనంతమైన దగును. అందుచే భగవానుని మనము పెండ్లాడి తరింపవలెను.

676. కరములకుఁ బాదములకు నడుమునకు నినుప గొలుసులు బిగించి, యినుప స్తంభమునకుఁ గట్టివేసి రత్న హారములు, విలువైన దుస్తులు, పిండి వంటలతో భోజనము,

స్తుతి వచనములను సమకూర్చినచో నేమిలాభము? బంధములు సడలవు; స్వేచ్ఛ లేదు. మానవజీవిత మిట్టిదే. జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖము లినుప గొలుసులు. అవి యున్నంత కాలము, ధనధాన్యములు, పేరు ప్రతిష్ఠలు, పదవులు నున్న నేమిలాభము? ఇవి, బంధములో నుండగా చిత్త శాంతి సౌఖ్యము లీయఁగలవా? కావున బంధవిచ్ఛేదక కార్య క్రమ మొక్కటే ప్రధానమైనది. తక్కినవన్నియు దుఃఖ ప్రదములే.

677. పశ్చిమ నాగరకతలోని ప్రబల దోషములను గుర్తింపవలెను. లోటులేని మనుగడకై ప్రకృతి శాస్త్రము, యంత్రనిర్మాణములు, పరిశ్రమాభివృద్ధి అఖండైశ్వర్య మిచ్చినది. ఇది మానవదృష్టిని భోగోన్ముఖ మొనర్చినది. భోగ లాలసత్వము మితి లేనిది. ఈధన భోగవ్యామోహములలోఁ బడి పశ్చిమజాతులు, దుఃఖనివారణోపాయముల నాలోచింప లేని వారైరి. దేవేంద్రైశ్వర్యము నార్జించినను దేహాత్మ భావము స్థిరతిమించినది; దుఃఖములకుఁ బరిష్కార మార్గము నన్వేషించు దృష్టిలోపించినది. ఇది నవనాగరకతలోని ప్రబల దోషము.

678. కాంతాభోగమనంత సంతాపహేతువు. ఈ భోగము వ్యక్తిస్వాధీనములో లేదు. అనేక పరిస్థితులు కలిసి వచ్చినచో, నొకక్షణార్ధకాల పరవశత్వము లభించును. సంతతి

ఫలితము. తుదిలేని బాధ్యతలు; అనవరత తాపత్రయాధీనమై జీవితము దుర్భర సమస్యాన్వితమై, దుఃఖదూషిత మగును; ఆయుర్దాయము క్షీణించును. అతివేగముగా యౌవన మదృశ్యమై, సకల యాతనల నిచ్చు వార్ధకము, మరణము, పైఁబడును. ఈయుద్ధక్షణ సంతుష్టికై, ధనగృహావస్త్రాదిక వివిధ ద్రవ్య సంపాదనమునకై యారాటము. ఇది కాంతాభోగము

679. వైరాగ్యమనగా కోర్కెలను విడుచుట. అనగా దేనిని కోరుట, వ్యర్థమో, దుఃఖకారణమో దానిని కోరకుండుట; దేనిని కోరుట సుఖప్రదమో, స్థిర శాంతి హేతువో, దేనిని కోరి యార్జించిన, సకల దుఃఖావకాశములు నశించునో, దానినిఁగోరి సంపాదించుట వైరాగ్యము. సుగంధ లావణ్యములు గల పుష్పగుచ్ఛము మనలనాకర్షించును గాని కొలఁది కాలములో నదివాడి నశించును. అటులే శృంగార రసాన్విత యౌవన విలాసము కొలది కాలములో మృత్యువశమై లావణ్యసౌందర్యములు బూడిదలోఁ గలియును. ఎల్లప్పుడు నుండి, సుస్థిరానంద మిచ్చు నాత్మసాంగత్యమే కోరుట నిజమగు వైరాగ్యము.

680. దుఃఖము నిచ్చువానిని విడిచిపెట్టుటయుఁ గోరకుండుటయు నిజమైన వైరాగ్యము. అదియే జ్ఞానము నిచ్చునది. క్షణకాలము మెరసి అదృశ్యమైపోవు వానినిఁగోరి సంపాదించుటవలన నేమి సుఖమున్నది? కావున మనకు గోచరించు వస్తువులలో మృత్యువశములై, లాలిత్య సౌందర్యము

లను గోల్పోవక, కాలత్రయమందుండి శాశ్వత చిత్తానంద శాంతులనిచ్చు ద్రవ్యమేదో మనము వెదకికొని ప్రేమింప వలెను. దేహసౌందర్యములు క్షణికములు, మృత్యువశములు. లావణ్యవతి ముఖసౌందర్యమును జూచి, మృత్యువును జ్ఞాపకము చేసికొనవలెను. మృత్యువునకు మృత్యువైన శివు నారాధించి సుఖింపవచ్చును.

681. చిన్నప్పుడు మాతల్లిదండ్రులతో నివసించిన పల్లెటూరు (పొడగట్లపల్లి రామచంద్రపురము)-అచటి యిల్లు విడిచిపెట్టి ముప్పదేండ్లైనది. ఇటీవల మరల (జూడలేదు. ఇచట (కాకినాడ గాంధీనగరములో) నొక గృహమును సంపాదించి యందు స్థిరపడితిమి. ఇదియు విడిచిపెట్టి, దానితోఁ బాటీలోకమును విడిచి యెచటికేగి యెట్లుండవలెనో తెలియదు. నాతల్లిదండ్రులు, వారి తల్లిదండ్రులు నెచటెచట జీవించి, యెచటికిఁబోయిరో వార్త లేదుకదా! మనము నటులే యెచటికిఁ బోవలసివచ్చినను భయ దుఃఖములులేని అనుకూలము, సుఖశాంతిమయము నైన స్థలనివాసమిమ్మని పరమేశ్వరు నారాధించుచు జీవించుట మరువరాదు.

682. మానవునకు వార్ధకదశ బహుక్లేశ భరితమైనది. ఇది స్వయముగా వృద్ధులకుఁ దెలిసిన రీతిగా నితరులకుఁ దెలియదు. శరీర ముపకరణ యోగ్యతను బోఁగొట్టుకొనును. భోగాభిలాష, నిరర్థకమైనను సంస్కార రూపమున బాధించును. భగవంతుని భజించు శక్తి సన్నగిల్లును. దానికి సాయము పోషించువారు లోకైనచోఁ జెప్పున దేమున్నది ?

అది ప్రత్యక్ష నరకమే. అందుచే యౌవనబల మున్నపుడే భగవంతు నారాధించి, వార్ధకదశ ననుకూలముగా నడపి, మృత్యువేళ వచ్చులోపుననే జ్ఞానసిద్ధి కలిగించి ముక్తినొసఁగి రక్షింపుమని ప్రార్థింపవలెను. యౌవనములో దేవునిఁగొలు వక, ముదుసలివై కొలువలేక, యేడ్చిననేమి లాభము ?

683. మనదృష్టిని మనస్సు నెచట ఁకేంద్రీకరింప వలెను? సర్వప్రాణులకు నేకాగ్రతకు శక్తియున్నది. కొంగ నీటిలోని చేపపైనను, చిలుక చెట్టుకొమ్మనున్న పండుపైనను వలెనే మానవులు కాంతాకనకములపై దృష్టిని కేంద్రీక రింతురు. ఎచట నేకాగ్రత నిలుపుదుమో, అచట సుఖ మున్నది. దృష్టి నిల్పినచోట సృష్టిరహస్య మిమిడియున్నది. అందుకే పురుషుఁడు కాంతపై దృష్టిని కేంద్రీకరించి సంతతిని సృజించుచున్నాఁడు. స్త్రీ జననేంద్రియ మసహ్యాకరమైనది. అందేకాగ్రత నిమేషమాత్రమే యుండును. తరువాత నిలు వదు. క్షణమాత్ర సుఖమున్నది. కాని మన మనస్సును భగవంతునిపై ఁకేంద్రీకరించినచో నిర్మల శాశ్వతానంద సమృద్ధమగు మోక్షము లభించును.

684. ఉపస్థ కల్పించిన మనస్సు క్షణకాల సుఖ మనుభవించుటలో సంశయములేదు. అందుకే సర్వప్రాణులు జననేంద్రియములపై నేకాగ్రతనిల్పి, సుఖలేశ మనుభవించి తరువాత సకల తాపత్రయాధీనులై దుఃఖించుచున్నారు. కార ణములు – జననేంద్రియ సంయోగము నిత్యము కాదు.

అనియు (గ్రహించి నశింపును. తత్ఫలితము దుఃఖము, స్థిర మైన పరమాత్మకు మనస్సునిచ్చి, యేకాగ్రత సాధించినచో సుస్థిరానంద శాంతి సౌఖ్యములు, మోక్షమును లభించి, పర మాత్మ లక్షణములు మనకును సంక్రమించి యీసుఖ సంపా దన సమస్యను శాశ్వతముగా (బరిష్కరించును.

685. ఎట్టి కోరికనైనను మనలో (బరమాత్మ పుట్టించుచుండగా, 'ఇది కోరరాదు; అదికోరవలెను' మున్నగు నుపదేశముల కర్థమేమున్నది? అయినచో మన మప్పుడప్పుడు కోరుచున్న అధర్మములు, నీచకర్మలు పాప దుఃఖములకు (గారణములైన కోర్కెలను, మనలోనున్న భగవానుడే మనలో నుదయింప (జేయుచున్నా(డన్నచో, నది దైవ ద్రోహ నేరములలో (జేరదా? చేరదు. పరమాత్మయే మన భావము లన్నిటికి నిస్సంశయముగా (గారకు(డని నమ్మినచో, మనము కోరుతుచ్ఛవాంఛల యొక్కయు, మనముచేయు దుష్కర్మలయొక్కయు ఫలితములు మనకు సంక్రమింపవు. సత్కర్మల నటులే చేసినచో నాఫలితములును మనకు( జెందవు. అందుకే ద్వంద్వాతీత మనస్కులమై భగవంతుని లీలగా విశ్వప్రపంచ ప్రదర్శనము నవలోకించినచో మనకు మోక్షము లభించునని గీతాకారు( డుపదేశించినా(డు.

686. తప్పుచేయుట తప్పుకాదు. తప్పుచేయుటకు, ఒప్పు చేయుటకు (దనకు లేని కర్తవ్యము నారోపించికొనుట తప్పు. అజ్ఞాన దశలో (దనకు (గర్మాధికారమున్నదని నమ్మి

నప్పుడు పాపకర్మలు చేయకుండ నుండుటకు యత్నింపవలెను. పాపములు చేయకుండ నుండఁగల శక్తి తనకు లేదని తెలిసి, అట్టి శక్తి నిమ్మని భగవానుని ప్రార్థింపవలెను. చేసిన తప్పు తెలిసిన వెంటనే, పరితాపమంది, మరల నట్టి తప్పుపని నెన్నడు చేయకుండులాగున బలమిచ్చి రక్షింపు మనియు భగవానుని ప్రార్థింపవలెను; ఎల్లప్పుడును పుణ్యకర్మలే చేయు శక్తినిమ్మనియు ప్రార్థింపవలెను. నిరంతర దైవారాధన పరుఁడైనవానికి దైవరక్షణము లభించి, పాపములు చేయకుండు శక్తియు లభించును.

687. స్త్రీపురుష జననేంద్రియ సంయోగము వలన, జననేంద్రియ గత జీవాణువుల సంపర్కముచే మానవులు జనింతురు. అందుచే మానవుల దృష్టి జననేంద్రియ సౌఖ్యము నాసించు భోగసంస్కారములను విడిచిపెట్టుట దుస్సాధ్యమగుచున్నది. దేహభోగాభిలాష యొక్క సంస్కార రూపమే మానవ దేహము. అటులైనచో దేహధారి, దేహభోగ సంస్కారముల విడుచుట యనఁగా దేహమును విడుచుటే యగును; అనగా నసాధ్యమని భావము. కాని దేహభోగ సౌఖ్యమెట్టిది? కోటి బంగారు నాణెములు కోరి, కోడిగ్రుడ్డు డొలక నంగీకరించుట వంటిది; సుఖము క్షణమాత్రము; దుఃఖము మితిలేనిది. ఇట్టి కఠోర పరిస్థితి కల్పించి మనకిచ్చుటలో భగవానుని భావము సుస్పష్టము. క్షణిక సౌఖ్యవాంఛ విడిచి, స్థిర సౌఖ్యమునిచ్చు భగవత్కృప నాశ్రైపుమనియే.

688. స్థిరమేదో అస్థిరమేదో, క్షణిక సుఖమేదో, శాశ్వత సుఖమేదో, సుఖమేదో, దుఃఖమేదో, దుఃఖముతోఁ గలిసిన సుఖమేదో, దుఃఖసాంకర్యము లేని సుఖమేదో తెలిసి, స్థిరసౌఖ్య సాధనముచేసి కృతార్థత నందునదే బ్రహ్మజ్ఞానము. సకల పరిపూర్ణతలనుగలిగి యెట్టిలోపము, అశాంతి, దుఃఖము లేనిది, సంకల్ప మాత్రమున నెట్టి పనినైనను నిర్వహించు శక్తి, యివి పరమాత్మ లక్షణములు. దేహేంద్రియ మనస్సులు అస్థిరములు; ప్రకృతి దృశ్యము లస్థిరములు వీనిని నమ్మి, స్థిరములని మోసగింపఁబడి, అవి అదృశ్యములైనంతనే విచారించుచున్నాము. అస్థిరదృశ్య మంతయు ననగాఁ బ్రకృతి మాయా స్వరూపము. బ్రహ్మజ్ఞానముచేతను, పరిశుద్ధ భక్తి చేతను మాయ నతిక్రమించి, సత్యమును సందర్శించి, మోక్ష సామ్రాజ్యము నేలవచ్చును.

689. దేవుఁడు మనము కోరిన పని చేయునా? చేయఁడాయను సంశయ మెప్పుడు వచ్చుననగా మనలో లేశ మాత్రమైన 'నకిలీ' యున్నప్పుడే వచ్చును. మనలో సంపూర్ణ స్వచ్ఛభక్తి యున్నచో మనమేది కోరినను భగవానుఁడిచ్చును. ఇచ్చునా, లేదా యనునది భక్తిలోను, జ్ఞానములోనుగూడ దిగువమెట్టు. దేనిని సందేహించుట? దేవుని శక్తి సామర్థ్యములను, ఔదార్యకృపా లాలిత్యములను, వివేక పరిపూర్ణతలనా? దేవుని శంకించుట మహాపాపము. తెప్పపాటు కాలముకూడ నవసరము లేకుండ విశ్వమంతటిని

సృజించి రక్షింపఁగల భగవానునికి నీవడిగిన దిచ్చుటెంత తృణప్రాయమో! నమ్మకము నిశ్చంచల మొనర్చికొనుము.

690. దేవుఁడిది కావలెనని భక్తుఁ డడిగిన వెంటనే అనుగ్రహింపఁగలఁడు. తత్తుల్యుఁడైన దాత వేరొకఁడు లేఁడు. ఏ మిచ్చినను, నెందర కిచ్చినను, నెంత యిచ్చినను దేవుని సంపదలో నొకపైస తగ్గదు, దేవు నైశ్వర్యము పరిపూర్ణ మనవ్యయము, నని చెప్పుటకూడ దేవునికి దక్కువ విలువ కట్టుటే యగును. అందుకే 'పూర్ణతరు' డని వేదము దేవుని వర్ణించినది. అనగా భగవానుని ఘనత భాష కందనిదని యర్థము. భక్తుని కెన్నఁడు దేవుఁడు లోపము చేయఁడు. నీవు లేమి ననుభవించుటకు గారణము భగవాను నడుగ లేమియే కారణము.

691. మనము కోరవలసినది సరిగా దెలిసికొని భగవానుని కోరుట నేర్చికొనవలెను. సర్వతోముఖ పరిపూర్ణత్వమును మనము కోరవలెను. సామాన్యముగా మనము మన జీవితములలో నప్పటికి బాధించుచున్న లోపమును దొలగింపుమని కోరుదుము. అది వెంటనే భగవానుఁ డిచ్చివేయును. మరొక రంగములో మనకు దోషము సంభవించి బాధించును. అందుచే నెందును లోపములేని పరిపూర్ణ సర్వతోముఖ శాశ్వతభాగ్యము నిమ్మని కోరవలెను. భగవాను నంతటి సర్వతోముఖ పరిపూర్ణైశ్వర్యవంతుని జేరి, తాత్కాలికముగా బాధించు ననారోగ్యమును దొలగింపు

మనియో, దారిద్ర్యమును పోఁగొట్టుమనియో, సంతతి నిమ్మనియో ఏకపక్షకాంక్షను దేవునియెదుట ( జెప్పికొందుము. భగవానుఁడు దానిని మాత్రమే యిచ్చి యూరకుండును. ఏ విషయము లోను లేశమాత్ర లోపములేని సర్వ సంపూర్ణ భాగ్యమిమ్మని కోరి, భగవంతుని భజింపవలెను.

692. మనకుఁ గర్మాధికార ముండవలెనా? లేక కేవలము భగవానుని హస్తములలో నుపకరణములుగా నుండుటే మేలా? ఇది చాల చిన్న విషయము. భగవానుఁడు సర్వపరిపూర్ణ ప్రజ్ఞానిధి కావున నాతఁడు చేయు పనులలో నెన్నడెట్టి లోపములుండుట కవకాశములేదు. భగవానుఁడు దోషము చేయుననుట మహాపాతకము. భగవానుఁడు, దోషము వ్యతిరేక పదములు. మనమే కర్తృత్వము కలిగి యున్నచో, మన మెన్నియో లోపములు కలిగిన వారమైనందున మనము చేయు కర్మలలో ననేక దోషములుండుట తప్పదు. మనమును తప్పులు చేయకుండు పరిపూర్ణులమైనచో మనకు దేవునికి భేదముండదు. అందుచే మనము పరమాత్మరమే యని గుర్తించి చరించినచో మనమెన్నడును తప్పులు చేయకుండవచ్చును; లేక భక్తులమై దేవుఁడే మన పనులన్నియుఁ జేయుటను గుర్తించి, యెట్టిలోపము లేకుండ ( జేసికొనవచ్చును.

693. భగవంతు నేక్షణమున మరచిపోకుండ నీకుఁ దోచిన పనులు చేయుము. సంసారికి దేహకుటుంబ సంబంధ

వ్యాపారములు పెక్కు చేయవలసియుండును. అయినచో ధర్మవిరుద్ధ కర్మలు చేయరాదని శ్రీకృష్ణ భగవానుఁడే చెప్పి యున్నాఁడు కదా, నీకుఁ దోఁచిన పనులు చేయుమన్నచో (బాపకృత్యములు జరుగవా? జరుగవు; కారణము, భగవానుని నీ వనుక్షణము గుర్తులో నుంచికొనుట, సామాన్య విషయము కాదు. అది అఖండ దీక్ష; అట్టి దీక్షగలవాని సకల భారము భగవానుఁడే స్వీకరించును, భగవానుఁడు బాధ్యత స్వీకరించి నచో నిఁక (బాపకార్యము లెట్లు జరుగును? భగవానుని ప్రవేశమున్నచోట దోషముండదు. ఇదియొక మహాసాధన విషయము. చేసి తరించు.

694. భగవానుఁడు లేనిది, భగవానుని సంకల్పము లేనిది ఏదే నున్నదనికాని జరుగునని కాని తలచుట కేవలాజ్ఞానమే. భగవానుఁడన్నిటిలో నున్నాఁడు. భగవానుఁడు కానిది లేదు; లేనిది లేదు. అందుచే దేనిని (జూచినను భగవానుని దివ్యరూపమని గ్రహింపుము. ఏది జరిగినను భగవానుని సంకల్ప ప్రభావమే యని తెలిసికొనుము. ఈ విధమగు చూపును, విషయగ్రహణ పద్ధతి నలవరచుకొన్నచో (గొంతకాలమునకు సాధన పరిణతి నంది, నీవు నిజముగాఁ బరమాత్మకు వేరుకాదని రూఢి యగును దానితో జనన మరణాత్మక సంసారము వినోదముగా మారి, దుఃఖావసరము నశించును. అంతయు (బరమాత్మయై, ఆ పరమాత్మ నీవైనచో దుఃఖస్థాన మెచట నుండును?

695. లోకముతో నీవెట్టి మమకార సంబధమును బెట్టుకొనకుము. ఏలన నవి తెగిపోవు సంబంధములు. కొలఁది కాలముండి విచ్ఛిన్నమగు సంబంధములు దుఃఖహేతువులు. కాని లోకములో జరుగుచున్న సకల విషయములను నీవు నిర్లిప్తుఁడవై చూడుము. ప్రతి విషయమందును భగవానుని దివ్యహస్తమును నీవు గమనింతువు. లోకములో జరుగు ననంతకోటి విషయములన్నిటిని భగవానుఁడు సంకల్పించి జరిపించుచున్నవే. కర్త పరమేశ్వరుఁడే. జీవులు, జడములు పరమేశ్వరుఁడు ధరించిన రూపములే. వాని నుపకరణములుగా నుపయోగించి, పరమేశ్వరుఁడు జగన్నాటకమును లీలగా నడపుచున్న సంగతి గుర్తించి యానందించుటే, మోక్షానంద హేతువు.

696. "ఉద్ధరేదాత్మనాత్మానమ్" గీతావాక్యము. ప్రతి వ్యక్తియు ఁదన్నుఁదానే ఉద్ధరించికొనవలెను. ఒక వ్యక్తికి ఁగల దాహము, ఆకలి, వేరొకవ్యక్తి త్రాగుట చేతను, దినుట చేత నుపశమించునా? అనగా మానవుఁడు దనకు ఁగల లోపములను, దోషదుఃఖములను పోఁగొట్టుకొనుటకే, వానిని ఁదెలిసికొని, అవిలేని అవ్యయ శాంత్యానంద సమృద్ధమైన జీవితమెట్లు లభించునో గ్రహించి, ఆప్రకారము నడచుకొని తరింపవలెను. తన కడుపులోని కుర్రు, వేరొకఁడాముదము త్రాగినచోఁ బోవునా? తనమనస్సు,హృదయముల లోని కశ్మలమును దానేఁదొలగించుకొని శుద్ధుఁడు కావలెను.

ఉత్తీర్ణులైన బ్రహ్మవేత్తలు, తమ అనుభవసిద్ధి వాక్యోప దేశముచే సులభమార్గములు చూచింతురు. అందుచే నెవ నికి వాఁడే, శుద్ధుఁడు గావలెనని కోరి, శుద్ధుఁడై ముక్తుఁడు గావలెను. మోక్షమార్గమున నెవనికివాఁడే దిక్కు.

697. భగవాను ననంతశక్తి శౌర్యౌదార్యానందాది గుణములను మనము గ్రహించి, ఊహకందనివని తెలిసికొని, వినయ శ్రద్ధాభక్తి భయసమన్వితులమై నమస్కరించి, కీర్తించి, ధ్యానించి, భగవత్కృపను సంపాదించి తరింపవలెను. ప్రతిక్షణమందు లక్షలకొలఁది జీవులు, పుట్టుట, గిట్టుట జరుగు చున్నది. కోట్లకొలఁది పశుపక్ష్యాదులు, వృక్షలతాదులు పుట్టి పెరిగి, ధూళియగుచున్నవి. యుద్ధములు, భూకంపములు, జాడ్యములు, అతివృష్టి అనావృష్టి దోషములు – వీని నెవఁ డాపఁగలఁడు? ఈ భగవల్లీల యెందుకో మనకు దెలియదు. మన మజ్ఞులము, నల్పులము నని గుర్తించి, గర్వ దురహం కారములను పాతాళము వరకు లోతుగాఁ బాతిపెట్టి, మాకు జ్ఞానమిచ్చి కృపజూపి రక్షింపుమని భగవానుని నిరంతరము ప్రార్థించి, ధ్యానింపవలెను. ఈపని చేయకున్నచో మన బ్రతుకు నరకమే యగును.

698. భగవానుని ధ్యానించుటకుఁ గాలము, నియ మము, స్థలము, ఆచారము నేవియు నడ్డురాకూడదు. ఏలన నేకారణము చేతనైనను భగవంతు నొకక్షణార్ధము మరచి నచో నాక్షణమే మనకు బ్రమాదకారణము గానగును.

మఱియు భగవద్ధ్యానముచే దేశకాల నియమాచారము లన్నియు బవిత్రము లగును. భగవన్నామ సంకీర్తనముకంటె బవిత్రము చేయున దింకొకటి లేదు. భగవంతుని స్మరించు చునే అన్నిపనులు చేయవచ్చును. అపుడు జీవితమంతయు భగవన్మయమై, భగవత్తుల్య మగును.

699. భగవంతుని పరిశుద్ధ చిత్తముతో నాశ్రయించి, భజించినచో, లోకకల్యాణ ప్రదమగునా? జగత్కల్యాణ సిద్ధికై వేరుగా గర్మకలాపమును జరిగింపవలెనా? సమాజ ములు స్థాపించి జనసమూహము నాకర్షించి, వ్యావహారిక రంగమున నిర్ణీత కార్యక్రమములు జరుపవలెనా? నిజమైన భగవద్భక్తుడు, వ్యవహార రంగమునకు బోనక్కర లేదు. భక్తుని కోర్కెననుసరించి భగవానుడు వలయు కార్యకలా పములను తన సంకల్ప మాత్రముననే నెరవేర్చుచు. ఆ భగవత్సంకల్పము లోకులచే నిర్వహింపజేయును. భక్తుడు తాను స్వయముగా బూనుకొని చేయనక్కర లేదు. అజ్ఞుని వలెనే భక్తుడును వీధికి వచ్చి వ్యాపారములు చేయనవసర ముండదు. ఆతడు లోకహితమును గోరుట, అది జరుగుటయు నిస్సంశయము; అనుభవముచే నిది స్పష్టమగును.

700. భగవానునితో సన్నిహిత సంబంధముండుట, సామాన్య విషయముగాదు. అట్టి సంబధమువలన భక్తునికి బ్రహ్మానందము మోక్షసిద్ధియు జేకూరును. దేవునితో బరి చయము, కష్టము, సులభముకూడ నైయున్నది. అజ్ఞానము

దట్టముగానుండి, పాప నిమగ్నుఁడైన వానికి భగవానునితోఁ బరిచయ మతికష్టమే. కాని పరిశుద్ధచిత్తుఁడై, నిరహంకారియై, భక్తుఁడైన వానికది అతి సులభము. భగవానుఁడు సర్వత్ర వ్యాపించి, ఎవరి హృదయము పవిత్రము, భక్తియుక్తము నైనదో చూచి, వెన్వెంటనే, వానికనేక విధముల దర్శనలాభము, మఱియు సకలశుభములు చేకూర్చుచుండును.

701. చిత్తశాంతికి దివ్యౌషధము భగవంతుని హృదయ మందెల్లప్పుడు స్మరించుటే. సర్వవ్యాపి, సర్వశక్తి గలవాఁడు నగు భగవానుని దివ్యనామ సంకీర్తనము కంటె సకల జన్మరోగములను నివారించుటకు వేరుగా నే యౌషధము లవసరములేదు. అట్టి భక్తుని చిత్తశాంతి నీ లోకములో నేదియు ఁజెడఁగొట్టఁజాలదు. ఏలన భక్తునికి శాంతిని ప్రసాదించు నాతఁడు పరమేశ్వరుఁడే: ఈ యౌషధమున కొక్కపైస వ్యయింప నవసరములేదు. ఈయౌషధము భక్తునికి దేహమానసి కారోగ్యమునేగాక అవిచ్ఛిన్నమగు శాంతిని, ఆనందమును, జ్ఞానమునుగూడ నిచ్చి, తరింపఁ జేయును. ఎందుకుఁ గలఁత చెందెదవు? "రామ" స్మరణము చేయలేవా? ఇందు కష్టమేమున్నది?

702. అనేక దోషముల వలన, లోపముల వలన నీ లోకమందు దుఃఖము కలుగుచున్నది. ఈ లోపములను, దోషములను దెలిసికొని, వానిని ఁదొలగించు నుపాయము చూచుకొనవేమి? నిజముగా భగవానుని నమ్మి భజించు

చుండగా లోపదోష దుఃఖములు సమీపించుట, అసంభవ విషయము. భక్తి లోపించి, మేము భక్తులమని భ్రమించు వారికి దుఃఖములు సంభవింపఁగా, "అయ్యా! దేవుని స్మరింప గానే పనులు చక్కఁబడునా? చాలాకాలము తపస్సు చేయ వలెన''ని పలుకు మూర్ఖుల ప్రసంగములను వినవలసివచ్చుటే పరమ దౌర్భాగ్యము. అది దైవదూషణమే యగునని తెలిసికొనుము.

703. పూర్వానేక జన్మములలోను, మఱియు నీ జన్మమందును జేసిన పుణ్యపాప కర్మలఫలితములు బాధింప కుండఁ జేసికొను నుపాయమున్నదా? "జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణం తమాహుః పండితమ్‌బుధాః" "జ్ఞానమను నగ్నిచేఁ గర్మలను దగ్ధమొనర్చిన వానినే పండితుఁడని తెలిసినవారు చెప్పుదుర"ని గీతావాక్యము. ప్రారబ్ధకర్మల ననుభవింపక తీరదనియుఁ జెప్పుదురు. మనకు భగవంతుని గీతావాక్యమే పరమ ప్రమా ణము. జ్ఞానాగ్ని యననేమి? జ్ఞానమనఁగా బ్రహ్మజ్ఞానము; అనగాఁ బూర్ణదైవ భక్తియు నగును. భగవానుఁ డేకైక సత్యమనునది భక్తి; పరమాత్మ యేకము నద్వితీయము ననుట జ్ఞానము. భక్తికి జ్ఞానమునకుఁ బరమాత్మ యేకైకమై మిగు లును. భక్తుఁడు 'నేను' పరమాత్మలోఁ గలిపి వేయుటచేఁ బరమాత్మయే; నేనే పరమాత్మనని గ్రహించుట, జ్ఞానము– ఇఁకఁ బాపము, అనుభవించుటయు నెచటనుండును?

704. స్వార్థరహిత సత్కర్మానుష్ఠాన దీక్ష దేశ
ములో నిద్రాణమై యున్నది. తమకు లాభమున్నఁగాని
సాధారణముగా ప్రజలు సత్కర్మల నాచరింపరు. దీనికి
హేతువు ప్రజాహృదయములలోని అలస భావము, దుర్బల
వివేకమునై యున్నవి. ఈ యలస నీరస భావములకు గార
ణము పాపము. భగవదారాధన వలన బాపములు నశిం
చిన కొలఁదియు, పరోపకార పరాయణత్వము వృద్ధిపొందును.
అన్ని లోపములకు గారణము దైవారాధనదీక్ష లోపించుటే.
నిష్ఠతో నీశ్వరారాధనము చేయు టభ్యసించినచో మానవుని
లోపములు నశించి, క్రమముగా భగవత్తుల్యుఁడగును.

705. భక్తుఁడెన్నఁడు వేగము మాట మరువరాదు.
స్వచ్ఛ హృదయము, తీవ్ర ముముక్షుత్వమునుండి భగవద్ధ్యా
నము చేయవలెను; కాని వేగమవసరము. ఎట్టి వేగము?
కాలము మనలను మ్రింగివేయు వేగముతో నడచును, కాల
వేగమును మించిన వేగముతో మనము కాలమును జయించి,
భగవత్కృప సాధింపవలెను. మనము నెమ్మదిగా సాధన
చేయుచు సంతృప్తినందినచో, గమ్యస్థానమును జేరుటకు
గాలము చాలదు. చేరులోపుననే కాలము మనలను మోస
గింప వచ్చును. ఇదియే తుది జన్మము కాఁగోరువా రత్యంత
వేగముతో భగవాను నారాధించి, శీఘ్రముగా నాతని కృప
నార్జించి, ముక్తులు గావలెను.

706. "జ్ఞానంజ్ఞేయమ్ జ్ఞానగమ్యమ్హృది సర్వస్య విష్ఠితమ్" అనగా, "గమ్యస్థానము, దానిని దెలుపు జ్ఞానము, తెలియదగు పరమాత్మ, మానవహృదయమందు ప్రతిష్ఠితమై యున్నది." గీతాబోధ. అనగా (బరమాత్మయే సత్యము నేకము నద్వితీయమును; దానిని తెలుపు జ్ఞానమనగా ననుభవ సిద్ధి. తత్ఫలితము పరమాత్మ తాదాత్మ్యము. ఇది సర్వ ప్రాణులలో సుప్రతిష్ఠితమై యున్నదనఁగా, సర్వప్రాణులు పరమాత్మ రూపములే. అజ్ఞాన వినాశముతో నిది సంభవించును. అజ్ఞానము సత్యమును కప్పివేసినది. "అజ్ఞానేనావృతం జ్ఞానమ్ తేనముహ్యంతి జంతవః" జ్ఞాన మజ్ఞానముచే నాచ్ఛాదితమై యుండుటచే జీవులందరు మోహావశులై తమ స్వస్వరూపము నెఱుఁగ లేకున్నారు. పరమేశ్వరారాధన నిష్ఠచే నజ్ఞానాచ్ఛాదనము తొలఁగి, జ్ఞానజ్యోతి ప్రకాశించి ముక్తి లభించును.

707. ఈ లోకమున జన్మించినదాదిగా సర్వ కాలమును, సర్వశక్తులను భగవంతునిఁ జూపు తపస్సాధనలలో బూర్తిగా వినియోగింపవలెను, ఎంత దీక్షతో వినియోగింపవలెననఁగా మరణకాలము రాకుండఁగనే మానవుఁడు ముక్తుఁడై పునర్జన్మ లేని స్థితి నార్జింపవలెను. అది అందరకు సాధ్యముకాదు. అథమము, భగవద్ధ్యానమున కత్యంత ప్రాధాన్యము నీయవలెను. ఇహలోక సంబంధ కార్యక్రమములు చాలవఱకు (దగ్గించి, తప్పనిసరియగు వానికి ద్వితీయస్థాన మిచ్చి, జీవితము గడుపవలెను. మూడవది దేవుని దృష్టిలో

నుంచికొని, తప్పనిసరి కర్మలఁజేయుట నేర్చికొనవలెను. దేవుని మరపించు సేవనిని ఁజేయరాదు. ఈనియమములఁ బాటించుచో మనము తరించుట తథ్యము.

708. భగవానుఁడత్యంత సులభుఁడు. నిష్కల్మష హృదయముతో నీకత్యంత సమీపవర్తియై భగవానుఁడున్నాఁడని గమనించి, రక్షింపుమని ప్రార్థించినచో భగవానుఁడు వెంటనే జవాబిచ్చితీరునని నిస్సంశయముగా నమ్మవలెను. మనకుఁగావలసిన సమీప బంధువులు, మిత్రులకంటెఁ గోటి రెట్లనంత కారుణ్యమూర్తియై మన పిలుపునకు భగవానుఁడు బదులు పలుకుట, మనము కోరినవి సమకూర్చుట, అడుగకున్నను జ్ఞానప్రసాద మిచ్చుట, తరింపఁజేయుట, తప్పక జరిగి తీరును. లక్షలకొలఁది మంది భక్తులకు జ్ఞానులకు భగవానుఁడట్లు కటాక్షించిన సాక్ష్యములున్నవి. భక్తి కలిగి, దేవునితో మాటాడి, దేవునితో నాడుకొనుట - అత్యంత సులభ విషయము.

709. జగత్ప్రభువును నేనిట్లు ప్రార్థించుచుందును; "తండ్రీ! నీవు సర్వతోముఖ సంపూర్ణ దివ్యకల్యాణగుణ మూర్తివి. నీయనంత ప్రభావము ననుసరించి, నిన్ను నే నాశ్రయించి, రక్షణకై వేడుకొనుచున్నాను. లోకములోని ప్రజలు తమ కప్పటికి బాధించుచున్న దానిని దొలగించి, ఏదోయొక సంపద, పదవియో, ధనమో, సంతతియో, వాహనమో, గృహమో, ఆరోగ్యమో యిమ్మని ప్రార్థింపఁగా

నీవు వెంటనే దాని ననుగ్రహింతువు. మిగిలిన జీవితరంగము లలో దోషము లటులే మిగిలియుండి బాధించుచుండును. నేనట్లు కోరను. నాకు నీకున్నదంతా, సర్వతోముఖ పరిపూర్ణతయు, అవ్యయానంద శాంతి సమృద్ధిని అనుగ్రహించి ఏ విషయములోను లేశమాత్ర లోపమును లేకుండగను, పిసరంత దుఃఖావసరము లేకుండగను జేసి, రక్షింపుము. నీ యౌన్నత్యమునకు దగిన కోర్కె నాది. అనగా, నిన్నాశ్రయించి నందుకు నన్ను నీయంతవానినిగా జేయుము."

710. భగవానునారాధించి, భగవాను నంతటివానిని నేను గావలెను. అందుచే సాటిలేని మేటి భగవాను నాశ్రయించి అల్పకాంక్షల నిమ్మని యడుగుట తప్పు కాదు కాని, తెలివి కాదు. ఏమడిగినను తన భక్తుని కిచ్చుటలో వీసమంతయైనను శ్రమలేకుండ నిచ్చువాడు, నీయగల సమర్థుడు అనంతకృపామూర్తియు నగు భగవానుని మహిమ నీవెఱుగని వాడవైనప్పుడు, ఏకముఖాల్ప కాంక్షలను గోరుదువు. దేవునితో సమానత్వమును గోరుటే వివేకము. నిజముగా నీవు దేవుడవే యని వేదాంతము చెప్పుచున్నది.

711. పరమేశ్వరు నెఱిగి సేవించు భక్తునితో సమానుడు పరమేశ్వరుడే. సార్వభౌములు కావచ్చును; స్వర్గ సుఖము లనుభవింపవచ్చును. దిగంత కీర్తి నార్జింపవచ్చును. కాని భగవానుని భక్తునితోగాని, భగవత్తత్త్వ మెఱిగిన జ్ఞానితోగాని పైవారెవ్వరును పోల్పదగరు. పరిపూర్ణత వారికి లేదు. భగవానునికే పరిపూర్ణత గలదు. అది తెలిసి

సేవించిన జ్ఞానికి, భక్తునికిఁగూడ భగవత్తుల్య పరిపూర్ణత లభించును. తక్కినవారు గొప్ప పూజ్యులుగావచ్చును. కాని సమగ్రపరిపూర్ణత వారికిలేదు. పరిపూర్ణతకుఁ పిసరంత లోప మున్నను జనన మరణాది దుఃఖములు తప్పవు.

712. మనము కోరినది జరిగినపుడు సంతసించి భగవానుని మెచ్చి కీర్తింతుము. మన కోరికకు వ్యతిరేకముగా జరిగినపుడు చెదరిన మనస్సుతో, సవ్యముగా నాలోచించు శక్తిని గోల్పోయి, దేవునిమాట మరచియో, లేక దేవుని గూర్చి తేలికగా మాటాడియో, ఖిన్నుల మగుట జరుగు చుండును. ఏ కోర్కెకు వ్యతిరేకముగా భగవానుఁడు మనకు ఁజేసెనో అట్లుగాక, అనుకూలముగా ఁజేసినచో మనకపార నష్టకష్టములు గలిగియుండునని తెలియవలెను. అనగా నట్టి కష్టనష్టములు మనకు ఁగలుగకుండ నివారించిన భగవానునికి, అనుకూలము చేసినప్పటికంటె నధిక కృతజ్ఞతను జూపుట నేర్చికొనవలెను.

713. ఈలోకములో మనకు జన్మమునిచ్చుటలో భగవాను నుద్దేశమేమి ? ఈ లోకము మనకొక శిక్షణ కళాశాల. పరమేశ్వరుని గూర్చియు, ప్రపంచమును గూర్చియు, మన కర్తవ్యమును గూర్చియు ఁబాఠములు నేర్చికొని క్రమోన్నతస్థాయి వివేకమునుగాంచి, తరింపవలెననియే భగవాను నుద్దేశము. పాఠములు నేర్చికొనుటనఁగా సుఖదుఃఖముల మధ్య నలుగుట తప్పదు. శిక్షణాకాలము శ్రమాన్వితమైనదే.

శిక్షణ ముగిసిన వెనుక, సత్యసాక్షాత్కారమై, సర్వదుఃఖములు తొలఁగి, అవ్యయానంద మందుట కవకాశము కలుగును. ఈలోకమున జన్మించుట భోగానుభవము కొఱకుఁగాదు, సత్య జ్ఞానానుభవసిద్ధి కొఱకే. మానవ జీవితము సత్యసందర్శనదీక్ష కావలెను. అదియే భగవాను నుద్దేశము, నాదేశమును.

714. భగవంతుని లేక సత్యము నెఱుఁగు శక్తి మనకు లేదు. సత్యమెఱిఁగినఁగాని సౌఖ్యము లేదు. దుఃఖమయమైన యిహాలోక జీవితము, ఆలోచించు శక్తిగల బుద్ధిమంతునికి, దుర్భరదుఃఖ దూషితమై కన్పట్టును. తీవ్ర సత్యసందర్శనకాంక్ష లేక ముముక్షుత్వమున్నచో భగవద్రహస్యానుభవసిద్ధి యెట్లు లభించునో చూపఁగల మహాపురుషసాంగత్యమును లభించును. అదియే గురుకటాక్షము. గురువు దేవుఁడే. భగవానుఁడే కొందరకు ఁదీవ్ర ముముక్షుత్వమిచ్చి తానే గురు రూపమున వారికి దర్శనమిచ్చి, తన దివ్యస్వరూప మెట్లు లభించునో సూక్ష్మమార్గములను దెలిపి రక్షించును. భగవానుని లేక సత్యద్రష్టలను దర్శింపవలెనని కోరువారు ధన్యులు; వారికిదే తుదిజన్మమగును.

715. మీరిప్పుడేమి చేయుచున్నారని మిత్రుఁడొకఁడు ప్రశ్నింపఁగా నిట్లు జవాబు చెప్పితిని: "దేవుని ఁదినుచు, దేవుని ఁద్రాగుచు, దేవుని ఁబీల్చుచు, దేవునిపై ఁగూర్చుండి, దేవునిపై నడచుచు, దేవునిలో నిద్రించుచు, దేవుని స్మరించుచు

సుఖముగా నున్నాను." దేవుని దినుటనగా నన్నమే బ్రహ్మ స్వరూపము; దేవుని ద్రాగుటనగా జలము నారాయణ స్వరూపము, దేవుని బీల్చుటనగా వాయువు ప్రత్యక్ష బ్రహ్మమే; సర్వత్ర దేవుఁడు వ్యాపించియుండుటచే దేవునిపై గూర్చుండుట, నడచుట, నిద్రించుట మున్నగున వన్నియు దేవునిలో దేవునిపై జరుగుచున్నవి. దేవుని స్మరించుశక్తి దేవునిదే! సర్వము పరమాత్మ మయమని గుర్తించి జీవించుచో బ్రహ్మానందము సిద్ధించును.

716. నేను పరబ్రహ్మమే యని తెలియుటయు, బరబ్రహ్మ లక్షణములైన అవ్యయ శాశ్వతానంద శాంతులు నాకుఁగలుగుటయు ననగా సర్వదుఃఖవినాశ మగుటయు - నిదియే బ్రహ్మజ్ఞానము. బ్రహ్మజ్ఞాన మనగా, బరబ్రహ్మ తాదాత్మ్య సిద్ధియే, నేను వేరుగానుండి, జన్మమృత్యువశుఁడనై, దురంతదుఃఖ మనుభవించు చుండుటయే అజ్ఞానము అంతేగాక, నేను వేరుగా బరిమిత రూపగుణ దేహధారినై, దోషదుఃఖ పరీతుఁడనై యున్నానని పొరపడుటయే అజ్ఞానము. ఈ పొరపాటు సవరించికొనుటే జ్ఞానము. జ్ఞానమే పరబ్రహ్మము. అదియే ఆనందము, శాశ్వతము. అదియే అఖండ పరిపూర్ణ బలశక్తి తేజస్సంకల్పమని యెరుగుటే తపస్సిద్ధి.

717. నిన్ను దారిద్ర్యము బాధించుచున్నదా? పరమేశ్వరు నారాధించు; సకలైశ్వర్యనిధియైన పరమాత్మ

నీదారిద్ర్యము నరనిముసములో నిర్మూలించి సకలైశ్వర్యము లిచ్చి రక్షించును. కాని నీవుచేయు పొరపాటును గ్రహించి సవరించికొనవలెను. దారిద్ర్యదోష దుఃఖముచే నీవు లోకుల నాశ్రయించు బిచ్చగాఁడవై అవమానము పొందుటేకాక, దారిద్ర్యమధికమై, దుఃఖమును పెంపొందించి కొనుచున్నావు. దాత ఒక్కఁడే గలఁడు. భగవానుఁ డేకైకదాత; ఆయన నాశ్రయించి, దారిద్ర్యమునే కాదు; సకల దుఃఖభయములను నిర్మూలించి కొనఁగలవు.

718. నీకు మరణించుటన భయమగుచున్నదా ? నిజమే, చావు భయహేతువే. ఇందు రెండు విషయము లున్నవి. (1) అకాల మృత్యువు తటస్థింపరాదు. (2) అనాయాస మరణము లేక సుఖమరణము కావలెను (3) మూఁడవది వీనికంటె ముఖ్యమైనది; మరల ఁబుట్టకుండు నుత్తమగతి లేక మోక్షము కావలెను. ఈమూఁడింటి ననుగ్రహించి రక్షించుట భగవానుని పని. మఱెవ్వఁడీపనిని ఁజేయఁజాలఁడు. భగవంతుని పాదములాశ్రయించి అంతఃకరణ శుద్ధితో నారాధించు పనిని వెంటనే ఆరంభించు. ఎంత సులభమో! ఎంత ఆనంద శాంతిప్రదమో !

719. నీవు సంసారములోనుండి ఏవిధమైన బాధలు, దుఃఖములు లేకుండ, అవ్యయానంద శాంతులనుగాంచి హాయిగా బ్రతుకుమార్గమున్నదని యెఱుఁగవా? నీకొకే ఒక నియుతి లేక దీక్ష అవసరము. అదియు నతి సులభము, సుఖ

ప్రదమునై నది. నీకు వలసిన వన్నియు ననుభవింపుము. నీ వనుభవించు సౌఖ్య మీశ్వర స్వరూపమని మఱువకుము. క్షణికమైన యిహలోకసౌఖ్యము, పరమాత్మ స్వరూపమని తెలిసికొని, నిరంతర భగవద్భజనానంద సాగరములోఁ దేలి యాడుము. స్త్రీధన వస్తువాహనాదికమంతయు భగవానుని దివ్యరూపములే యని నిశ్చయముగా నమ్మి భగవంతుని స్మరించుచు జీవింపుము. నీకు దుఃఖముండదు.

720. భార్యయనఁ బలికోరెడి అమ్మవారు. ఆమెకుఁ గల యెన్నియో కోర్కెల కనుగుణముగా వర్తించుటేగాక, ఆమెచే నవమానము పొందుట కెల్లప్పుడును సిద్ధముగా నుండ వలెను. భర్తయు నట్టివాఁడే. భార్యకుఁ బరపురుషాభిలాష, భర్తకుఁ బరకాంతాభిలాష, సహజముగానుండి, అన్యో న్యము సంశయించుచుండు మనస్తత్వము లుదయించి, సుఖ భ్రాంతితో దుఃఖ మనుభవించుచుందురు. ఇర్వురు కామ కాంచనదాసులై, కుటుంబ రక్షణార్థము ధనగృహారామాదిక సంపాదన కాంక్షతో జీవితమును గడపుదురు. ఈ దేహము లస్థిరములను భావము కలుగదు. భగవదారాధన నామ మాత్రమేకాని, ప్రప్రథమ ప్రాధాన్యమునిచ్చు నవకాశములు లేవు; వార్ధకము, మరణము, పునర్జన్మము జరుగుచుండును. లజ్జావిహీనులై యిట్టి తుచ్ఛజీవితములను గడపుచుఁ దామెం తయో ప్రయోజకుల మని చెప్పికొనుచుందురు?

721. ప్రాతివ్రత్యముగలిగి జీవించు స్త్రీలు నేడరుదు. స్వచ్ఛవైదిక కుటుంబములలోఁగూడ నైహిక భోగకాంక్షలు పెంపొంది, దుష్టమైన వాతావరణము పెరిగినది. శారీరకార్థిక వ్యామోహాములచే నాకృష్టులై, తమభర్తలను తరచు నిందించుచుందురు. భర్తలలోను పెక్కులోపములు పెరిగినవి. విశృంఖల విహారులు పెచ్చుగా నుండుటయు, నీతినియమ నిష్ఠలు సడలుటయు, స్వచ్ఛమైన భగవద్విశ్వాసము లోపించుటయు ప్రబల దుఃఖహేతువులైనవి. వేదశాస్త్ర పండితులు, వేదశాస్త్ర విక్రయ జీవనులైరి; వారి సంతతియు దుష్ట సంస్కారములకు లోనగుచున్నది. ప్రాచీనవైదికాచార సంపత్తి నశించి, పాశ్చాత్యవిద్య లభ్యసించి, వేషములకు విలాసములకు లోనగుటచే, జాతిధర్మము, తుత్తునియలై, భగవత్కృప దూరమగుచున్నది. ఇదిమారినఁగాని దేశమునకు దౌర్భాగ్యము తప్పదు.

722. స్త్రీలకు పురుషులతో సమాన స్వత్వమిచ్చి, విశృంఖల విహారమంగీకరించు నేటిధోరణి ప్రాతివ్రత్యశీలమను గాజుపాత్రను, బండరాతితో బగులకొట్టి తుత్తునియలొనర్చు పద్ధతియే. జితేంద్రియులైన వారికి స్వేచ్ఛనీయవచ్చును. జితేంద్రియులును, కఠోర నియమబద్ధులై ఆత్మశిక్షణ దీక్షలేనిదే, పరిశుద్ధులై బ్రతుకలేరు. ఇంద్రియ లోలురైనవారికి స్వేచ్ఛ, సర్వానర్థహేతు వనుటలో సందేహమున్నదా? చలనచిత్ర దర్శనములు, కాముకత్వము నుద్రే

కింపఁజేయు నేటి సంస్కారహీనుల రచనలు, పత్రికలు, గ్రంథములు, స్త్రీపురుష ధర్మములను కొట్టికివేయు గొంగళీపురుగుల వలె పనిచేయుచున్నవి. స్వేచ్ఛ స్వైరవృత్తి, మానసిక దైహిక వ్యభిచార కాంక్ష – విజృంభించుచున్నది. భారత జాతి మనుగడ యేమగునో!

723. దేశ పరిపాలనము భగవత్కార్యము. ఈశ్వరాంశ లేనిదే ఆపని కెవ్వఁడు పనికిరాఁడు. రాగద్వేషములు లేనివాఁడు, పదవీవ్యామోహబద్ధుఁడు కానివాఁడు, తన పరిపాలితులలో నన్నివర్గములవారికి తత్తదుచిత సౌకర్య సదుపాయములను కలుగఁజేసి పరిపాలన దైవభీతితో, ధర్మనిష్ఠతో జరిగింపవలెను. నేటి పరిపాలకులు, కులమతవర్గ భేదముల నుద్రేకింపఁజేయు పాక్షిక కార్యక్రమములకులోనై, తమ పరిశుద్ధ చిత్తమును గోల్పోయి, దురహంకారవశులై, దేశమున నలజడి, సంక్షోభము, కొట్లాటలు సృజించి, తమ అసమర్థతను ప్రకటించికొనుచున్నారు. దైవారాధన దీక్ష కాని, ధర్మాచరణ శౌర్యము కాని లేనివారై, వోట్లు సంపాదనమే ముఖ్యమని భావించి, దైవకృపనార్జింపలేనివారై దినదినమునకు బదవీస్థిరీకరణ జాడ్యమునకు లోనగుట భారతజాతి దౌర్భాగ్యము.

724. పెండ్లికొడుకును చేయుట, పెండ్లికూతురును జేయుట – ఆచారములైయున్నవి. దీనిలో రెండర్థములున్నవి. (1) బ్రహ్మచర్యమును విరమించి, సంసారియై కుటుంబ భార

మును భుజములపై వేసికొని, కృంగికృశించి, మృతిచెందుట. ఇందు కాయిక భోగము ప్రధానలక్ష్యమై, స్త్రీపురుషులు నిర్వీర్యులై, నియమములు విడిచి, నీతిదూరులై, భ్రష్టులగుచున్నారు. (2) కామ సంతృప్తికై వివాహమాడినను, భగవానుని సేవ, ధర్మకర్మాచరణముతో మేళవించి, నడపుకొనునది గృహస్థ ధర్మమగును. ధర్మవిరోధముకాని కామమును శ్రీకృష్ణభగవానుఁ డంగీకరించెను. కామ సంతుష్టిని భగవద్భక్తితోఁగలిపి, గృహస్థులను హిందూధర్మము పెక్కు నియమములతో బంధించి, ధర్మకర్మానుష్ఠాన మూలమున మోక్షమార్గమునకు ఁదోడ్కొని పోవుచున్నది. ఇహపరముల నేకకాలమున సమకూర్చి, యేక కాలమున మోక్షకాంక్షను గలిగించి, భక్తిజ్ఞాన వైరాగ్యబోధ చేయునది భారతీయ గృహస్థ ధర్మమై యున్నది

725. నేడు వివాహము వర్తకమైనది; శుభ కర్మ గృహస్థులకు మనోల్లాసము నిచ్చునదై యుండవలెను. కాని నేడది క్లేశాయాసకరమై, మనలను పతితులను జేయుచున్నది. ధనమునకు, దుస్తులకు. విలాసములకు ఁప్రాధాన్యమిచ్చి, కుటుంబయజమానులు నలిగి, నశించుచున్నారు. ధర్మమయమైన పుణ్యకర్మయేఁ వివాహమను భావము నశించినది. వేషములు, ఆడంబరములు, పవిత్రవివాహకర్మ కవసరములేని విందులు, వినోదములు, మితిమీరినవి. అవసరములేని బంధువర్గములు, సకుటుంబముగా విచ్చేసి, యజమానిని వ్యయ

ప్రయాసలకు లోనుజేయుటేకాక, మర్యాదలు చాలవని వివాదహేతువు లగుచున్నారు. సుఖాంతములు కావలసిన వివాహములు దుఃఖాంతము లగుచున్నవి. ఇట్టి వివాహములు జాతి ధర్మ వినాశ హేతువులు.

726. శ్రీరామప్రభువనఁగా సర్వాంతర్యామియై సర్వస్వరూపియై, పరమాత్మ శక్తియై, లోకకల్యాణమునకై అనేకావతారములు ధరించి, ధర్మాచరణమార్గమును ప్రదర్శించిన భగవానుఁడే. రామనామస్మరణము ముక్తితో సర్వ శుభములీయఁగలదు. భారతదేశమున జన్మించి, రామస్మరణమను దివ్యాయుధమును జేతఁబూని, అజ్ఞాన జన్యములగు జన్మకర్మమృత్యుదోషము లన్నిటిని తృణప్రాయముగా భస్మమొనర్చి, శాశ్వత బ్రహ్మజ్ఞానానందముల నెవఁడైనఁ బొందఁగల అప్రతిహత శక్తి; నాజీవితములో రామజపము నేను గోరిన వన్నియునిచ్చి, రక్షించినది. రామస్మరణ మహిమను వర్ణించుశక్తి లేనందున, క్షమాభిక్ష వేడికొనుచున్నాను.

727. ఎవరెంతకాల మీప్రపంచమున జీవింపవలెనో భగవానుఁడు నిర్ణయించును అంతేకాదు; ప్రపంచములో నేభాగమున జీవింపవలెనో, ఎట్టియింట నెట్టివృత్తితో నేరీతిగా గడుపవలెనో, సుఖదుఃఖము లెంతగా ననుభవింపవలెనో యీశ్వర సంకల్ప శాసనము ననుసరించి జరుగును. కాని దైవారాధన తత్పరులై జీవించు పరమ పుణ్యాత్ముల కీశ్వ రాజ్ఞ వారి కనుకూలమై సర్వసౌఖ్యముల నిచ్చుటేగాక జన్మ రాహిత్యమును ప్రసాదింపఁగలదు.

728. ప్రశాంతి వాతావరణములో భుక్తి ముక్తి దాయకమైన జీవితము, మానవులందరు కోరునదే; కోరవలసినదే. ఇదియే భారతీయ వైదికమత రహస్యము. నేటి ప్రపంచమందును, తత్సంబంధముచే భారతదేశమందును, సుఖప్రశాంతి వాతావరణము లోపించినది. అందరకు భుక్తియును లేదు; ముక్తికాంక్షకాని, సాధనకాని అసలే లేదు. మానవజాతి నాగరకత నేడు భోగలాలసమై యున్నది. భోగదృష్టి మారినఁగాని శాంతిసౌఖ్యములుండవు. ఈ రంగమున లోకమునకు మార్గదర్శకముగా నుండవలసిన భారతజాతి పాశ్చాత్యనాగరకతానుకరణముచే, నాత్మదర్శనమును విడిచిపెట్టుచున్నది. ఇది భారతభూమికి, లోకమునకుఁగూడ, ప్రమాదహేతువనుట నిశ్చయము.

729. కామినీకాంచనములు, లేక కామకాంచన కాంక్షలు- ఎంతటి మహాత్మునైనను వశమొనర్చుకొను శక్తి గలవి. కాని స్వయముగా వానిలో దోషము లేదు. భక్తుఁడు వానిని (గోరి అనుభవించుట తప్పుగాదు. ఒకటిమాత్ర మున్నది. వానికిలోంగి బానిసలు కాకుండ, వానిని (దనకు బానిసలుగా (జేసికొను మనోనిగ్రహమున్నచో వాని ననుభవింపవచ్చును. శివుఁడు మన్మథుని జయించి, పార్వతిని వివాహమాడెను. అత్రివసిష్ఠ గౌతమాదులు పరిపూర్ణ జితేంద్రియులై సంసారముచేసి, సంతతిఁగని, లోకకల్యాణ హేతుభూతులైరి. దైవకృపనార్జించి, యావెనుక కామ

కాంచనము లనుభవించుటలో లోపములుండవు. దైవకృప నార్జించిన గృహస్థ ధర్మము, సన్యాసముకంటె శ్రేష్ఠతర మైనది. ఏలన గృహస్థుఁడు దానుతరించి, లోకకల్యాణమును సాధించును.

730. కొన్ని కఠినసమస్య లుదయించి పీకగట్టిగాఁ బట్టుకొని, యెంతత్రోసివేసినను విడువవు. పరిష్కారమునకై వీనిని భగవానుని కర్పింపఁబూనినను, మనల నవి విడిచి పెట్టవు. దీని యర్థమేమనఁగా భగవానునియందు మనభక్తి దుర్బలమైనదని తెలిసికొనవలెను. ఏలన మన సమస్యలను త్రికరణశుద్ధిగా దేవుని కర్పించినచో, భగవానుఁడే స్వయముగా వానిని దీసికొని, మన కనుకూలముగాఁ బరిష్కరించి, అనుగ్రహము చూపునని నిస్సంశయముగాఁ దెలిసికొనవలెను.

731. మనుస్మృతిలో వ్రాసినాఁడు. అందచందములు ధనము, విద్య మున్నగునవి ముఖ్యకారణములు గావు. భర్త కంటె నితరుఁడెవఁడైన సరే, స్త్రీలు వానిని గుణములతో నిమిత్తము లేకుండ మోహించి వ్యభిచరింతురు. వాఁడు మగవాఁ డగుటొక్కటే వారికిఁజాలు. ఎంత ఘోరమగు సత్యమో! అది నిజము కాదనిపించు పరమ సత్యము. శిశ్నోప స్థలను గల్పించి, తుదిలేని వ్యామోహములు పెట్టి స్త్రీపురుషు లను మతిహీనుల నొనర్చి, విశ్వవ్యాపారమును భగవానుఁ డవలీలగా నడపుచున్నాఁడు. ఎందుకో!

732. సుఖలేశము లభించుచోట తప్పనిసరిగా దారుణమగు పోటీలుండును. శిశ్నోపస్థలు సుఖలేశస్థానములు, వానికొఱకై బహుముఖముల బహుజనులు కన్ను వేసి అనుభవింపఁజూచుచుందురు. దానితోఁ గామక్రోధాదులు మితిమీరి పెచ్చుపెరిగి, చెప్పరాని దుష్ఫలితములిచ్చును. నిజమైన యే బాధయు, పోటీలు, లేని దివ్యానందము బ్రహ్మజ్ఞానముచే లభించు బ్రహ్మానందమే. ఈశ్వర సాక్షాత్కారము మానవుల కవశ్యముగా సంపాదింపఁదగినదని స్పష్టము.

733. మనము దేవునిలో నున్నాము; ఏలన దేవుఁడు లేనిచోటు లేదు; సర్వవ్యాపి అట్టి భగవంతుని సాన్నిధ్యము మనకుండు టెంతభాగ్యమో! ఇది గుర్తించి, నిరంతరము భగవద్ధ్యాన సంకీర్తనములుచేయు దీక్షయుఁ గలుగు భాగ్యము సాటిలేనిది. మనము మంచిగంధపు ముక్కలను మోయు గాడిదలవంటివారము. బరువే కాని, పరిమళమెరుగని గాడిదవలె మనము దేవునితోనుండి దేవుని మహిమను గుర్తింపకున్నాము; ఎనలేని దుఃఖము లనుభవించుచున్నాము. మేలుకొని, దైవకృప నార్జింపుమని ఉపనిష దుపదేశ సారాంశము.

734. తన భార్యను బిడ్డలను అన్నవస్త్రములిచ్చి పోషింపలేని దరిద్రుఁ డూరందర కన్నదానము చేయఁగల ననుకొనుట తాతని బుద్ధిమాంద్యమును జూపును. అటులే యెన్నఁడు దుఃఖమిశ్రితముకానిది, యేకాలమందుఁ జెడనిదియగు నవ్యయానందమును జననేంద్రియము లిచ్చునని తలఁచి,

నమ్మి, చరించు వాని బుద్ధిమాంద్యమునట్టిదే. జననేంద్రియము లిచ్చు క్షణికసౌఖ్యము, మార్పులేని శాశ్వత సంపూర్ణానందమని నమ్ముట, మానవుఁడు తన కన్నులలోఁ దానే దుమ్ము కొట్టుకొనుటే యగును. జననేంద్రియ సౌఖ్యము ననుభవింపుము; వలదనము; కాని దాని విలువ నెఱిగి, మోసములోఁ బడకుండ ననుభవింపుము; స్థిరావ్యయానందము కోరుదువా- బుద్ధిమంతుఁడు కోరవలెను- భగవదారాధనచేసి సంపాదించుకొనుము.

735. భగవంతు నెఱిఁగి స్మరించు దీక్షఁ బూనినచో సర్వ విషమసమస్యల నాభగవానుఁడే స్వయముగా నద్భుతముగా, నీ కనుకూలముగాఁ బరిష్కరించి రక్షించును. భగవంతుని మహిమ వినుము; ఆతఁడు లోకాధిపతి, సర్వకారకుఁడు, సర్వసమర్థుఁడు, సర్వపరిపూర్ణుఁడు, సర్వాతీతుఁడునని గ్రహించి భయవినయ భక్తులతో వాని రక్షణమును గోరుచు బ్రతుకుట కంటె నీవుచేయవలసిన దేదియును లేదు; చేయనులేవు. ఒకవేళ నితర కార్యక్రమము లేవైనఁ జేయఁ గోరినను నవి వ్యర్థములే. నీ రక్షణమున కవసరమైనదానికంటె భగవత్సంకీర్తనము మిక్కిలి యెక్కువ విలువ గలది. భగవన్మహిమ, భగవత్సంకీర్తన మహిమ పరిమితులు లేనిదని గ్రహింపుము.

736. అజ్ఞానములోనుండి సుఖముగోరుట, బొచ్చులోఁ బరుండి శుభ్రతను గోరుటవంటిది. నీశరీర మనోబుద్ధ్యహంకారములు, పంచభూతములు జడపదార్థముల వంటివే.

నీ కజ్ఞానము తొలఁగి జ్ఞానజ్యోతి వెలిగినపుడు నీలోనున్న భగవానుఁడే, నీమనోబుద్ధి దేహేంద్రియాదుల నన్నిటిని నడపుచున్నాఁడని బోధపడును. విశ్వప్రపంచ వ్యాపారమును భగవానుఁడు దన వినోదలీలకై నడపుచున్న సంగతి నెఱిఁగి నీవు బ్రహ్మానందము నందఁగలవు.

737. దేవుని గానములో నపశ్రుతులుండవు. దేవుని రాజ్యములో నసంగతము లుండవు. దేవుని సృష్టిలో దోషములుండవు. ఉన్నచో దేవుని పరిపూర్ణతకు లోపము సంభవించును; అందుచే నపశ్రుతులు, అసంగతములు, దోషములు మనకు లోకములోఁ గన్పట్టుచున్నమాట నిజమే. కాని అవి యథార్థములుగావు. అవి సత్యములైనచో దేవుని మహిమకు లోపమగును. దేవుని మహిమ లోపములేని పరిపూర్ణత గలది. కామెర్ల రోగికి లోకమంతేయు నాకు పచ్చగాఁ గనఁబడును; అటులే అజ్ఞానికి లోకములో లోపదోషములు గోచరించును. స్వచ్ఛజ్ఞాన నేత్రములకు, లోకము సర్వానందమయమై ప్రత్యక్షమగును.

738. దైవభక్తి, దైన్యము రెండునొకచోటనుండుట జరుగరాదు; జరుగదు. దేవునారాధించు వ్యక్తి యుండుస్థానము దేవుఁడుండు స్థానమే. దేవునికి దైన్యమూహించుటకంటె ఁబాపమింకొకటి లేదు. దేవుఁడు దైవభక్తుఁడుండుచోట నుండును. భగవంతుఁడు భగవద్భక్తుఁడు నుండుచోట దైన్యమేకాదు, ఏ విధమగు లోపము నుండదు. "యత్ర యోగీశ్వరఃకృష్ణో, యత్ర

పార్థో ధనుర్ధరః తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ." కృష్ణుఁడు దేవుఁడు; అర్జునుఁడు భక్తుఁడు; వారిర్వురున్నచోట సర్వశుభములు నుండును. తనకున్న దంతయుఁ దన భక్తుని కిచ్చువాఁడు దేవుఁడు, దైవభక్తుఁడు- అచట దైన్యమా? ఊహించుటే పాపము. నీకు దైన్యమున్నచో నీవు భక్తుఁడవు కావని తెలిసికొనుము.

739. "తద్విష్ణోః పరమమ్పదగ్ం సదాపశ్యంతి సూరయః దివీవచక్షురాతతమ్." వేదవాక్యము. జ్ఞానులు కన్నులు తెరచినంతనే ఆకసమును జూడకుండ నుండలేనటులే, యెల్లప్పుడు పరమేశ్వరునిఁ దిలకించుచుందురు." ఆకసము సర్వవ్యాపిత్వముగలదైనను, విష్ణువు దానికంటె ననంతవ్యాప్తి గలవాఁడు. అందుచే భగవానుని దర్శింపకుండుట సాధ్యమెట్లగును? లోపల, వెలుపల సర్వత్ర నిండియుండిన పరమేశ్వరునిఁ జూచుచు నీవు చూచునది పరమేశ్వరుఁడు కాదు, వేరు వస్తువులని భ్రమించుచున్నావు. భ్రాంతి తొలఁగి దేవునిఁ జూచుటే జ్ఞానము. జ్ఞాని కంతయుఁ దనతో సహా దేవుఁడే.

740 ప్రకృతిలోని సకల జీవజడ పదార్థములపై నీశ్వరుని సంకల్పముద్ర గలదు. ఏవస్తు వేరీతిగాఁ గన్పట్టిన నది భగవంతుని రాజశాసన ముద్ర లేకుండ నుండదు. జగత్తే యీశ్వర సంకల్ప ముద్రితము. దేవుఁడు నానా వేషధారియై సర్వము చేయుచు నిత్యచిదానంద స్వరూపియై వెలయు

చున్నాఁడు. సంసారసాగర దుఃఖతరంగములచే ( గొట్టఁబడి మున్గుచుఁ దేలుచుఁబరితపించుచున్న జీవులబాధ అజ్ఞానజన్యమే. అంతయు నీశ్వరమూలము, నీశ్వర రూపము, నీశ్వర శక్తి ప్రకటనమే. ఇది గుర్తించి, పరమేశ్వరా రాధన చేయు భక్తుఁడు దివ్యానందము పొందఁగల యేర్పాటు నీశ్వర సంకల్పమే. ఇది తెలిసికొని దుఃఖనివారణము చేసికొనలేవా?

**741.** సర్వదుఃఖములు, లోపములు, దోషములు, పోకున్నచో భగవదారాధన మెందులకు ? లోపముకాని దుఃఖముకాని నలుసంతయైన మిగులకుండ సంపూర్ణముగా నశింపఁజేసి భక్తుని రక్షించువాఁడే భగవానుఁడు. జ్ఞాని తానే భగవంతునని తెలిసికొనును; ఇఁక సగుణోపాసకుఁడగు భక్తుఁడు తన వ్యక్తిత్వమును పూర్తిగా భగవానుని కర్పించి, భగవానునితో నేకమై, భగవంతుని సర్వశుభ లక్షణములను పొందును. "వాసుదేవ స్సర్వమితి" యనగా భక్తుఁడు వాసుదేవుఁడే యగును.

742. మంచి మామిడిపండ్లు తినుట కిష్టములేని వాఁడుండఁడు. కాని కొన్ని లక్షలపండ్లు పట్టుకొని వచ్చినచో నెన్ని తినఁగలఁడు? అటులే కాంతయున నిష్టము లేనివాఁడు లేఁడు. కాని పదివేల కాంతలనిచ్చినచో నెవ్వఁ డనుభవింప ( గలఁడు? అటులే, కాంచనమును తిరస్కరించువాఁడుండఁడు; కాని మానవుఁడు నివసించు పట్టణమంతయు ( గాంచనమైనచో నేమి చేయును? సర్వమయత్వముగల భగవానుఁడు సర్వమేక

కాలమున ననుభవింపఁగలఁడు. అనగా నీవు దేవుఁడవు కావలెను. దేవుఁడవై, అన్నిటిలో నేకకాలముననుండి అన్నిటి ననుభవింపవచ్చును. అల్పకాంక్షలు విడిచి, దేవుఁడు కావలెనని కోరుటయే. అద్వైతతత్త్వము, నిజముగా నీవు దేవుఁడవే యని చెప్పును.

**743.** ప్రతి మానవుఁడు భగవానుఁడగుట కవకాశముండఁగా నూటికిఁదొంబదితొమ్మిదిమంది, తాము ధనవంతులు, ఉద్యోగులు, కీర్తిమంతులు కావలెనని కోరుచున్నారు. కాని పైపదవులాక్రమించు కోరికలు సఫలము గాంచుటకంటె, దేవుఁడే కావలెనను కోరిక సులభముగా ఫలించును. ఇఁక ఫలితములలో నెంత భేదమున్నదో! ధనికులు, అధికారులు, కీర్తిమంతులు నగుటవలన దుఃఖసమ్మిశ్రితములు కాని యిహపర సుఖములు లభింపవు. దేవుఁడగుటవలన సర్వదుఃఖములు నశించి, శాశ్వతములైన సకలావ్యయ పరిపూర్ణ సౌఖ్యశాంతులు లభించును. అందుచే మానవుఁడు దేవుఁడగుటకు గోరవలెను. అది సాధ్యమా? యని భయపడుదురు. భక్తితో భగవంతుని సేవించి, భగవంతునితో నేకమై, భగవంతుఁడవే యగుట, అత్యంత సులభము.

**744.** ఒకతీవ్రసమస్య బాధింపఁగా దానిని నాపూర్వపద్ధతి ననుసరించి, కృష్ణప్రభువు కొప్పగించి పరిష్కరింపుమని కోరుట మరచి, నేనే అహంకారమునఁబడి పరిష్కరింపఁబూనితిని. కాని మానసికోద్రేకము, చాపల్యము, తాపము

ప్రశమింపు సూచనలు గోచరించినవి. వెంటనే కృష్ణ ప్రభువు స్మృతికి వచ్చినాఁడు. క్షమాభిక్షకోరుకొని, అహంకారమును విడిచి, "కృష్ణప్రభూ! దీనిని నీవే పరిష్కరింపుము. నేనే పరిష్కరింపఁ దలచిన నా మూర్ఖతను క్షమింపుము"ని నమస్కరించి, ఉద్రేక భావములను నెట్టివేసి, ప్రశాంత మనస్కుఁడనై కూర్చుంటిని. దరహాసమును వెదజల్లు దివ్య సుందర వదనారవిందమును నాయెదుట కృష్ణప్రభువు తళుక్కున మెరపించెను. ఒక గంటలో సత్యోత్తమ సంతృప్తికరముగా సమస్యను పరిష్కరించి, "నన్ను మఱువకురా!" యని పలికినాఁడు.

745. సర్వతోముఖ సంపూర్ణజ్ఞానమే బ్రహ్మజ్ఞానము. అది లభించుటనఁగా (దెలియునిదేదియు మిగులదు. అన్నియు (దెలియుటవలన జ్ఞానములోని సకలాంశములు, సమగ్ర సమన్వయసిద్ధిగాంచి, సంశయ మావంతయునుండు నవకాశము లేకుండఁజేయును. దానివలన సంపూర్ణ సంతృప్తి, సంపూర్ణానందము, సంపూర్ణ శాంతి, వాగతీతమై లభించును. అట్టిస్థితిలో సకలము భగవానుని దివ్యరూపమే, సర్వత్ర గోచరించును. ఇంకొక విచిత్రముకూడ జరుగును. సర్వస్వరూపియగు పరమాత్మవు నీవే యని దర్శింపఁబడును. మఱేమి కావలెను?

746. ఒక తెలివితక్కువ పిల్లవాఁడు తనకుఁ జిల్లర ఖర్చుకొఱకు, సొమ్ముకావలసి తనతండ్రి నడుగుట మాని, బయటవారిని యాచించుట, ఇతరుల జేబులలోఁదడుముట

షునన్నగు దురభ్యాసములకు లోనయ్యెను. కాని యాతనికి వలయు సొమ్ము లభింపమి, లోలోపల విలపించుచున్నాఁడు. వాని సంగతి కనిపెట్టి, వాని తల్లిబిడ్డను పిలిచి, "మీనాన్న గారివద్ద వలసినంత ధనమున్నది. నీ చిల్లరఖర్చుల కడిగినచో లేదనరు. నీకు సిగ్గులేదా! ఇతరులను యాచించుట, జేబులఁ దడవుట తప్పుకాదా?" యని మందలించినది. అప్పుడా పిల్ల వాఁడు తండ్రిని సమీపించి, భయభక్తులతో ఁజిల్లర కావలె నని కోరెను. తండ్రి వెంటనే కొంతయిచ్చి, "నీకెప్పుడు కావలసిన నడుగుము. ఇంకెవరి నడుగకు"మని చెప్పి ముద్దాడి పంపెను. తల్లి గురువు, బాలుఁడు భక్తుఁడు; తండ్రి భగవానుఁడు.

747. దేవునిఁగూర్చి తెలిసికొనుటకు, ఁగుతూహల ముండుట, ప్రయత్నించుట తప్పులేదు కాని, "నాకు దేవుని ఁగూర్చి పూర్తిగా ఁదెలిసిన"ని సంతసించుట తప్పగును. ఆద్యంతములులేని అనంతతత్త్వముగల దేవునిగూర్చి తెలిసి కొను సామర్థ్యము మానవులకే కాదు దేవతలకును లేదు. అందుచే ఁదెలివైనవని యేమనఁగా నెన్నఁడు దేవుని విడువ కుండ వినయశ్రద్ధా భయభక్తులతో నారాధించుచునే యుండ వలెను. దేవు ననంత మహిమనుగూర్చి తెలిసికొను కోరిక గలిగి, తెలిసిన స్వల్పమునకు సంతసించుచు నింకను దెలియ ఁగోరుచు నేమిజరిగినను దైవారాధనమును విరమింపకుండు

వ్రతముబూని, దానిని నిర్విఘ్నముగా జరిగించు మనియు గోరుచున్నచో, దేవుఁడే సంపూర్ణజ్ఞాన ప్రదానముచేయును.

748. కాలికిఁ దేలుకుట్టినది. తేలు బాధలో నిట్లేడ్చితిని: "నీ దర్శనముచేసి, గుమ్మము దిగుచుండగా దేలు కుట్టినది; కృష్ణా! నీకు దెలియకుండ నీయాజ్ఞలేనిదే అది కుట్టినదా? నేను బాధపడ లేనని యెరిగియు నెందుకుఁ గుట్టించితివి? నిన్నెన్నఁడు స్మరించుట మానలేదే! పూర్వపాపములకు శిక్షయందువా? నిన్ను స్మరించుట వలనఁ బూర్వపాపములింకను నశింపలేదా? గాయత్రీమాతా! బాధతగ్గింపవా? నాన్నయగు కృష్ణుఁడు శిక్షించెను. అమ్మా! నీవైన నన్ను దయతో జూచి రక్షింపవా?" చాలవరకు బాధ తగ్గెను అసలు తేలెందుకు గుట్టవలెను? కృష్ణప్రభువు చిరునగవుతో నిట్లు సూచించెను; "నీకు నేనెవఁడనో పూర్తిగా దెలియుననుకొనుచున్నావు. నీకు బూర్తిగా దెలియుదని ఋజువు చేసితిని!

749. మనకు ధర్మవిరుద్ధములైన కోర్కెలుదయించుచున్నవి. అట్టి కోర్కె లుదయింపఁగా నవి సఫలమందవలెనని మనస్సు తహతహలాడు చుండును. కోర్కెలు, వాని అనుభవముపై లగ్నములైనందున మనస్సు భగవానుని స్మరించుట సాధ్యపడదు. కోర్కెలను మంచివి చెడ్డవి కలిగించువాఁడు దేవుఁడే. చెడుకోర్కెలను కలిగించుటతో నూరకొనక వాని ఫలితములగు శిక్షలఁగూడ ననుభవింపఁజేయును. అపుడు మనకు భరింపరాని కష్టము దుఃఖము కలుగును,

అందుచే మనము చేయవలసిన పనియిది; "భగవాన్! పాప ఫలితము లనుభవింపవలయు నధర్మకాంక్షలను నామనస్సులో నుదయింపకుండఁజేసి రక్షింపుము; దుఃఖమనుభవింపఁజాలన"ని భగవాను నర్థించినచోఁ దప్పక రక్షించును.

750. చంటిబిడ్డ కొక్కటే తెలియును. అమ్మకొఱ కేడ్చుటే. అమ్మయే చంటిబిడ్డ కెప్పుడేమి కావలయునో చూచి సర్వవిధముల గాపాడుచుండును. మనము భక్తులము కాఁగోరుచోఁ జంటిబిడ్డలమైపోయి, విశ్వశక్తి యను అమ్మను స్మరించి, రక్షింపుమని యేడ్చుటే చేయవలసినపని. చంటి బిడ్డకుఁ దానమ్మకొఱకేడ్చు చున్నాననను సంగతికూడఁ దెలి యదు. మన మాలోచన లన్నిటిని కట్టివేసి, ఏమీ తెలియని చంటిబిడ్డలమై పోవుట, అమ్మవచ్చి యెత్తుకొని లాలింపనిదే, ఏడ్పుమానకుండుట, నేర్చికొనవలెను. మనలోఁ జంటిబిడ్డలకు లేని అహంకారము, తెలివిగల వారమను గర్వము నమసి పోవలెను. అప్పు డమ్మవచ్చి ముద్దాడి అన్నియు నిచ్చి కాపాడును.

751. విసుగు మనకు జాలవిషయములలోఁ గలుగు చుండును. ఏలన నవి మనకు సంతృప్తి నిచ్చుశక్తి లేనివి. మనకు సంపూర్ణసంతృప్తి, చెడని సుఖమునిచ్చి దయచూప గలశక్తి గలవాఁడు భగవంతుఁ డొక్కఁడే. పరమాత్మ సాక్షాత్కారమే సంపూర్ణ సుఖము. అందుచే భగవ న్నామము నెఱిగి, అర్పించుటలో విసుగును జయింపవలెను.

దైవారాధన విషయములో విసుగు కలిగినదనగా, దాని మహిమ మనకుఁ దెలియ లేదన్నమాట, భగవద్భజన యొక్కటే సంపూర్ణ శాంతి సౌఖ్యముల నిచ్చునదని తెలిసి కొని, నిరంతర మాపనిలో నిమగ్నులమై యున్నచో, జ్ఞాన సిద్ధి దానితోఁ బాటు విసుగును జయించునోర్పు కలుగును.

752. శీతకాలమునఁ జలియెక్కువై వణకించినను, వేసవిలో వేడిమి అధికమై కాల్చినను, వర్షర్తువులో వర్షము లధికమై నాన్చినను, అంతయు నీశ్వర విలాసమే. శీతోష్ణసుఖ దుఃఖములను సహనభావముతోఁ జూడవలెనని గీతోప దేశమై యున్నది. వాతావరణ ప్రకోపములు, పంచభూత ముల వలనను రవిచంద్ర నక్షత్రాదుల వలనను కలుగును. అవన్నియు భగవానుని సంకల్ప సంజాతములనఁగా భగ వానుని రూపములే. భక్తుఁడనగా నాతఁడు దుస్సహవాతా వరణబాధల నోర్వలేనంతగాఁ దటస్థించినపుడు, భగవానుని తగ్గింపుమని ప్రార్థింపవలెను. భగవానుని పాదములకుఁ బరు గెత్తి పోయి, "సహింపలేకున్నాము; ఉగ్రత సడలించి రక్షిం పుమ"ని ప్రార్థించినచోఁ దప్పక ఫలితము లనుకూలములగును. ఇది చాల స్వల్ప విషయము.

753. ధర్మమనగా విశ్వమును సక్రమముగా నిలుపు నీశ్వరశక్తి యని యర్థము. "సత్యం వద, ధర్మం చర,... మాతృదేవోభవ, పితృదేవోభవ..." మున్నగునవి వేదరూప మునఁ బలికిన యీశ్వరవాణి, వాని ననుసరించు వారిని ధర్మ

మనగా, భగవానుఁడు రక్షించును. ధర్మవిరుద్ధము కాని సంసారజీవితమును శ్రీకృష్ణ భగవానుఁ డంగీకరించినాఁడు; "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ." గీత, ధర్మాను గుణమైన కామము నేనే యని భగవానుఁడు పలికినాఁడు, గృహస్థులు, ధర్మవిరుద్ధముకాని భోగము లనుభవించుచు, భగవంతుని మఱువక ధ్యానించుచు నిహాపర సుఖముల రెంటిని పొందుట కవకాశమున్నది.

754, సర్వములోనుండి, సర్వత్ర సర్వస్వరూపియై యుండి, భగవానుఁడు తన జగన్నాటకలీల నడపుచుండఁగా, నెప్పుడేది తటస్థించినను, ఆకురాలుట మొదలు జగత్ప్రళయమువరకు (బరమేశ్వరు నేకైకసంకల్ప ప్రభావము వలననే జరుగుచున్నది. భక్తులైనవారి కొకకేపనియున్నది; "నాన్నగారు, ఇది భరింపలేకున్నాము. దయచూపి మమ్మనుగ్రహింపుము"ని యేబాధ తటస్థించినను చేతులెత్తి నమస్కరించి మొఱపెట్టినచోఁ దప్పక భగవానుఁ డనుగ్రహము చూపి, బాధ తొలగించును. ఇది సాధన; ఇదే తపస్సు; తత్ఫలితము భగవత్కృప – ఇంకేమి కావలెను ?

755. భగవానుని ప్రార్థింపు మని భగవానుఁడే హృదయకోశమునుండి ప్రేరణ కలుఁగఁజేసి, ప్రార్థింపఁజేసి, ప్రార్థన ఫలితములను దయతో నొసఁగి కాపాడుచుండును. నేను భగవద్భక్తుఁడనని అహంకారము పెట్టుకొని, వివేకహీనుఁడు కారాదు. మనకు భగవానుఁడు భగవత్ప్రార్థన

చేయవలయునని కోర్కె కలిగించి ప్రార్థింప జేయుచున్నా డనగా నెంత మహాభాగ్యము! మనము భగవంతుని స్మరించు చున్నామనగా మనకు భగవత్కృప అదివరకే కలిగినదన్న మాట! సర్వప్రాణుల నీవిధముగా భగవదున్ముఖులఁజేసి భగ వానుఁడు సర్వదుఃఖ నివారణ చేయుచున్నాఁడు.

756. భగవద్గీత, ముఖ్యముగా భారతీయులకు సర్వ బాధా నివృత్తి చేసికొను దివ్యోపాయముగా భగవానుఁడు ప్రసాదించిన మంత్రరాజము. పదునెనిమి దధ్యాయములు నిత్య మేయింట బారాయణము భక్తిశ్రద్ధలతో జరుగు చున్నదో ఆయింట కృష్ణ భగవాఁడు స్వయముగా నివసించి, ఆకుటుంబ యోగక్షేమములను సదారక్షించుచుండు ననుటలో నెట్టి సంశయ లేశము నుండనవసరము లేదు. ఇది నానిత్యాను భవమని తెలుపుటకు సంతసించుచున్నాను. ఆయింట ననా రోగ్యములు, అకాల మరణములు, కామక్రోధాది దోష ఫలి తములు, ఏ విధములైన అనిష్టములు తటస్థింపవు. మఱియు బుత్రపౌత్రాభివృద్ధి సకల విద్యైశ్వర్యములు, శుభసుఖ శాంతులు నాయింట తాండవించును. దేహావసానము లోపున బ్రహ్మజ్ఞానమోక్ష సిద్ధియు భగవానుఁడనుగ్ర హించును. వ్యర్థకాలక్షేపములు మాని గీతాపారాయణము చేయుటేమి కష్టము ?

757. భగవాను నేమడిగిన నీయఁడు; ఈయలేఁడు? ఉష్ణోగ్రత దుర్భరముగా నున్నదని ప్రార్థించితిని. తగ్గి చల్లని

గాలి వీచినది; అనావృష్టి దోషము పట్టనై యున్నది; ప్రార్థింపఁగా చక్కని వర్షము కురిసినది; జ్వరము వచ్చునట్లు కనపట్టగా, మొరపెట్టితిని; రాలేదు; మాయింట నీ శుభము వెంటనే జరిగింపుమని కోరితిని; వెంటనే జరిగెను; ఒక వ్యక్తి చాల చికాకులో నుండగా, వానికి రక్షణ మిమ్మంటిని; వెంటనే యిచ్చెను; ఒక వస్తువు కావలెనని యడిగితిని. ఆ వస్తువు నెవఁడో తెచ్చియిచ్చెను; ఒక బంధువర్గములోని గర్భిణీకాంతకు సుఖప్రసవము, పుత్రోత్పత్తి కావలెనని కోరగా నటులే జరిగెను. నాజీవితము దినదిన మిటులే భగవత్కృపామృతమయమై జరుగుచున్నది. మీ రీ విధముగా నమ్మి సర్వదుఃఖములు పోఁగొట్టుకొని సుఖింపుఁడని చెప్పుటకే యిది వ్రాసితిని.

758. చినిగిన తాటాకు బుట్టను, కట్టుగుడ్డను పారవేసినట్లు, దేహము నగ్నిదేవుని కొప్పగించి పోవలసియుండగా కులుకులకు, విలాసములకు, వినోదములకు, రాగద్వేషాదికము నకుఁ గాలమేది? ఈ లోకములో నుండఁగలిగినంత కాలమును రక్షకుఁడైన భగవానుని సంకీర్తనలోఁ గడపి, ఆయన కృపామృత మార్జించికొని, మొచటికిఁబోయినను భయముండదు. కావున వెంటనే అన్ని గొడవలు విడిచిపెట్టి, మనస్సు నింద్రియముల నేకమొనర్చి, దృష్టిని భగవత్పాదారవిందములపైఁ గేంద్రీకరించి జపధ్యానాదికములోఁ గడపువానితో సమానుఁ డెవఁడు నుండఁడు.

759. ఈలోకములో నెన్నినాళ్లుందువు? కార్యక్రమ మేమిటి? ఇచటనుండి యెచటికిఁ బోవలెనని గమ్యస్థాన నిర్ణయము చేసికొంటివి? ఏమి ఆలోచించికొనక, నిశ్చిత కార్యక్రమము లేకుండ, నెటుగాలివీచిన నటు పోవు నెండుటాకువలెఁ గాలము గడపుటెంత శోచనీయము? ఈ జగన్నాటక సూత్రధారి, పరమకారుణ్యమూర్తియు నగు భగవానుఁడున్నాఁడు. ఆయన నాశ్రయించి, దయ సంపాదించి సురక్షితుఁడవగుటే కైక ప్రధాన కార్యక్రమమని తెలిసికొని, తదనుగుణముగా నొక క్షణము వ్యర్థము చేయకుండగా జీవించు ధన్యుఁడవు కావలదా?

760. "అజ్ఞశ్చాశ్రద్ధ ధానశ్చ సంశయాత్మావినశ్యతి" యని కృష్ణ భగవానుఁడు ప్రవచించినాఁడు. (1) అజ్ఞుఁడు; మానవుఁడై జన్మించి దేవునిఁ దెలిసికొనని వాఁడు నశించును, తెలిసికొనకుండుటే తప్పు. (2) అశ్రద్ధధానః అనగా భగవానునిఁ దెలిసికొనుట కెంతశ్రద్ధ కావలెనో అంత శ్రద్ధ చూపకుండుటయు వినాశహేతువే. శ్రద్ధ లేనివాఁడు తెలిసికొనుట కవసరమైనంత కృషి చేయలేఁడు. కావున నాతఁడు నశించును. (3) సంశయాత్మకుఁడు; భగవానుఁడున్నాఁడా? లేఁడా? ఉన్నచో మనల రక్షించునా, విడిచిపెట్టియూరకుండునా? ఇట్టి సంశయములు పెట్టుకొనువాని, అజ్ఞత, అశ్రద్ధ, వినాశహేతువులు దేవుని అస్తిత్వమునుగూర్చియు, దేవుని రక్షణమును గూర్చియు శంకించువానికి నిశ్చిత విశ్వా

సము లేదని యర్థము. వాఁడును నశించును. ఈమూడు లోపములు లేకుండఁజూచికొని ఆత్మరక్షణము చేసికొనవలెను.

761. "సంశయాత్మావినశ్యతి" గీత. సంశయించి నంతమాత్రమున నశించునా? యని ప్రశ్న. కాని దేవుని, కృపను సంశయించుట తప్పకవినాశకారణమే. నూటికి నూఱుపాళ్లు పవిత్రుఁడు, సత్యవ్రతుఁడు నైన మానవుని శంకించుటే పాపము; భగవానుఁ డెట్టివాఁడు? నూటికి కోటి పాళ్ళు. అనగా వచించుట కతీతమగునంత పవిత్రుఁడు, సర్వజ్ఞుఁడు సత్యస్వరూపియు నగువాఁడు భగవంతుఁ డగుటచే, భగవానుని. వాని కృపను శంకించుట, చెప్పఁజాలనంత పాపము, వినాశకారి యని తెలియఁదగును.

762. "అవజానంతిమామ్ మూఢామానుషమ్ తను మాశ్రితమ్ పరంభావమజానంతో మమభూత మహేశ్వరమ్." గీతావాక్యము. "మానవదేహము నాశ్రయించిన నన్ను మూర్ఖు లవమానించుచున్నారు. నేను సర్వలోకాధిపతి నని వారు గ్రహింప లేకున్నారు." శ్రీకృష్ణుఁడు భగవానుఁడే యని తెలియక, కంసుఁడు, దుర్యోధనాదు లవమానింపఁ జూనిరి ఇది పౌరాణికార్థము. ఆధ్యాత్మికార్థము రెండవది; ప్రతి మానవుని హృదయ మందిరములో నేనున్నాను. నే నట్లుంటినని యెఱుఁగక, ప్రతి మానవుఁడు నన్నవమానించు చున్నాఁడనగా నన్ను గుర్తించి పూజించుట లేదని భావము. అవగాఁడను కత్యంత సమీపవర్తినై తమతో నిత్యము నివ

సించుచున్న నన్ను (దెలిసికొని ఆరాధింపక, అజ్ఞానులై, ప్రవర్తించు చున్నారని భావము.

763. బ్రహ్మజ్ఞాని కాఁగోరువాఁడు, రాగద్వేషములను విడువవలెను. ఎందుకు విడువవలెను? సర్వజీవులలో (బరమాత్మ యను ననంతశక్తి యుండి, మాటలు, చేతలు, ఆలోచనములు, ప్రతి విషయములోను నడపించుచున్నాఁడు. అది మనము ప్రత్యక్షముగా (జూచుట నేర్చికొనవలెను. అనగా నెవఁడేమి పలికినను తలఁచినను, చేసినను పరమాత్మయే యను నచంచల విశ్వాసముండినచో, నెవరిని ద్వేషించుట యుక్తమగును? ఎవరిని ద్వేషించినను పరమాత్మనే ద్వేషించుట యగును. పరమాత్మ చేయుచున్న పనులకు జీవులను ద్వేషించుట దోషము కాదా?

764. భగవంతుని స్మరించుట, ధ్యానించుట, ఆశ్రయించుట వలన సర్వసమస్యలను పరిష్కరించి భగవానుఁడు సర్వ శుభసుఖశాంతులను సమకూర్చును. ఈ విషయము నెన్నఁడు శంకింపకుము. ఏమి జరిగినను సరే, భగవంతుని స్మరించి, భక్తి వినయ భయములతో (బ్రార్థించుచుండుటభ్యసింపుము. అన్నియు నీ కనుకూలముగా జరుగుటజూచి, భగవదనుగ్రహ మహిమనెఱిఁగి, ఆశ్చర్య చకితుఁడవగుదువు. "నేను భగవంతుని స్మరించుచున్నాను; సమస్యలు బాధించుచునే యున్నవే" యని పలుకుదువు; దీని కర్థము స్పష్టము. నీ భక్తిలో లోపమున్నదని వెంటనే నిర్ణయింపుము. కొన్ని

సమస్యలు భగవంతుని స్మరించుచుండగా గఠినతర మగును. అనగా నీవు స్మరణమును తీవ్రతర మొనర్చి చూడుము. వెంటనే భగవత్కృప ప్రత్యక్షమగును.

765. ఒక్కమాటు భగవంతుని స్మరించి, "భగవాన్! రక్షింపుము"ని కోరితివా, ఒక్కపువ్వు భగవానుని విగ్రహముపై నుంచి పూజించితివా? లేక నేవిధముగానైనను భగవాను నారాధించితివా. అదివ్యర్థమగునని యెన్నఁడు తలపకుము. నీ హృదయములో నున్న దేవుఁడు నీకోరిక నెఱుఁగఁడనుకొనకుము. నీవేవిధముగా బూజించినను, తత్ఫలితమును భగవానుఁడిచ్చి తీరును. దేశకాల వ్యక్తి భేదముల ననుసరించి నీకుఁ దగినదని దేవుఁడు భావించిన ఫలితమిచ్చును. నీప్రార్థన వ్యర్థమగు టెన్నఁడు జరుగదు. కారణము భగవానుఁడనంత సామర్థ్యము, అనంత కారుణ్యము గలవాఁడు. ఈరెండు లక్షణము లాభగవానునికిఁదప్ప నింకెవరికి నుండవు.

766. దేనికి నాశ్చర్య పడనవసరములేదు; భయపడ నవసరమును లేదు; ఎవనికి? భక్తుఁడైన వానికి; ఏలన భగవానునికి దెలియకుండ నేదియు జరుగదు; భగవాను నాజ్ఞ లేనిదేదియు దటస్థింపదు. ఒక విశేషమున్నది; ఏతాటస్థ్యమైనను, భక్తుని కీషణ్మాత్రమైనను క్లేశము కలిగించునదేదియు భగవానుఁడు జరుగనీయఁడు. భక్తిహీనులకు బాధలుండును. అవి భక్తి నుదయింపఁజేయు శిక్షారూపములు. ఈషణ్మాత్ర బాధ కలుగ బోవుచుండగనే భగవానుని పాదములు పట్టి

భజించినచో వెంటనే భగవానుఁ డట్టిబాధ కలుఁగకుండ ఁజేయును. ఇవి జీవిత సాధనలోఁ బరిశీలించి కొనవలయు పరమసత్యములు.

767. "యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ తతస్తతో నియమ్యైత దాత్మన్యేవవశం నయేత్." "చంచలము, నస్థిరమునైన మనస్సు ఎచటెచటనో సంచరించుచుండును. వెంటనే దానిని చేఁబట్టి, ఆత్మవశమొనర్పవలెను." గీతోపదేశము. మానవుఁడెంత మహనీయుఁడైనను, వానిమనస్సు తప్పుత్రోవలఁబట్టి చరించుచుండును అపమార్గములలో సంచరించి, పాపకృత్యముల ఁజేయించుట మనస్సు లక్షణము. భక్తులను, జ్ఞానులనుగూడ మనస్సు నిముసములో ఁబెడత్రోవకు లాగుకొనిపోవు శక్తిగలదే, దాని సంచారశీలమును గ్రహించి, కనిపెట్టి, ఆత్మ (దేవుని) వశమొనర్చుటే మార్గము. ఈ కార్యక్రమము ననుసరించు టభ్యాసయోగ మందురు. మనస్సును కట్టిపెట్టి దేవుని పాదములపైఁ బడవేసి చూడుము. భగవత్సంబంధముచే మనస్సు చాంచల్యదోషమును గోల్పోయి నిలకడ నేర్చికొనును.

768. మానవు నిహలోక కార్యక్రమ మేమిటి? పుట్టుట, పెరుగుట, వృత్తి, చదువు, ధనాదిక సంపాదనము, పెండ్లి, పిల్లలు, వయసు మరలుట, ముదుసలి తనము, మరణము, మరల ఁబుట్టుట – మరల నిదే కార్యక్రమము. ఈ కార్యక్రమములో మానవుఁడేమి యనుభవించుచున్నాఁడు;

క్షణికసుఖభ్రాంతి, మితిలేని దుఃఖము. ఈనాటక పాత్ర ధారిత్వము యుగములనుండి జరుగుచున్నది. ఎవనికిని విసుగు రాదేల? చలనములేని సుఖశాంతులను సంపాదించుట తప్పా? దుఃఖములను దొలగించికొనుట దోషమా? భగవంతునర్చించి భక్తుఁడవై లేక జ్ఞానివై దుఃఖరాహిత్యమును, జన్మరాహిత్యమును ఆద్యంత రహితానందశాంతుల నార్జించుట కర్తవ్యమని తెలియదేమి ?

769. పై చూపు తగ్గి, లోపలిచూపు పెంపొందవలెను. కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునికీసంగతి నుపదేశించెను. ఇంద్రియములు, మనస్సు బాహ్యములైన నామరూపములు జూచి భ్రమించి, మనల మోసగించి, దుఃఖము పాలొనర్చును. బుద్ధిమంతుఁడు నామరూపముల వెనుక నిలిచియున్న దివ్యశక్తిని దర్శించి, అదియే పరమాత్మయని గ్రహించి సకల దుఃఖములనుండి విముక్తుఁడగును. దేహేంద్రియ మనోబుద్ధులకు శక్తినిచ్చి నడపుచున్నది. నామరూప రహితమగు నాత్మ చైతన్యము. అంతర్దృష్టి నభ్యసించి, ఆత్మదర్శనముచే నమర్త్యత్వమందుటే మన లక్ష్యమై యుండవలెను.

770. ప్రతి మానవునిలోనొక తస్కరుఁడున్నాఁడు; వానిపేరు మనస్సు; వస్తువులపై భోగాభిలాష కలిగించి, శాశ్వతశాంతి సౌఖ్యములనిచ్చు భగవంతునిపైపు మనదృష్టిని పోనీయదు. ఈ మనస్సను తస్కరుఁడు మన ధర్మానురక్తిని

దైవభక్తిని, నియమాసక్తిని దొంగిలించికొనిపోయి, "రా! యిటు చూడు! పరకాంతాలింగన సౌఖ్యమును రుచిచూడవా! పరధనాపహారణములో నెంత యానందమున్నదో చూడు; ఎందు కొరకు పైన నీయుని జపతపాదులు!" అని చెప్పుచు మన బుద్ధిని సన్మార్గమునుండి మరలించును. మన ప్రబల శత్రువు మనమనస్సే! దానిని భక్తిజ్ఞానరజ్జువులతో ఆత్మలేక భగ వానుఁడను స్తంభమునకుఁగట్టిగాఁగట్టి యుంచినచో, మనస్త స్కరుఁడు మహాభక్తుఁడై తరించును.

771, "ఏ మడిగినా లేదనకుండ నిచ్చు వాఁడెవఁడైన నున్నాఁడా?" భగవానుఁడొక్కఁడే గలఁడు. రెండు లక్షణము లున్నవాఁ డేదైన నీయఁగలవాఁడు. (1) ఎట్టి లోపము లేకుండ నెన్నఁడు తరుగని, అనంతసంపద గలవాఁడు కావలెను. (2) భక్తితో నాశ్రయించి, యెవరేమడిగిన వెంటనేయిచ్చి దయ చూపు సాటిలేని ఔదార్యము, కృపగలవాఁడునై యుండ వలెను. ఈరెండు లక్షణములు భగవానునికే గలవు. మరె వ్వరికిని లేవు. అందుచే ధైర్యముతో భగవాను నాశ్ర యించి భజించి, సర్వమును పొందవచ్చును.

772. పతివ్రతయగు భార్య, తన భర్తకు సర్వవిధ ముల స్వాధీనురాలై వర్తించినచో భర్తతో నేకత్వమును సాధించి, సంపూర్ణానందమును పొందఁగలదు. పతివ్రత వలెనే, భక్తుఁడు భగవంతునికి సంపూర్ణముగా స్వాధీనుఁడై భగవంతునితో నేకత్వమును సాధించినచో, భగవానుని సర్వ

స్వామున కధికారివై సకల సుఖములను పొందును. ఏపిస రంతయు భర్తకు వ్యతిరేక భావమును స్వప్నమందైనను జూపనిదే పతివ్రత. అటులే భక్తుఁడు తన అజ్ఞానాహం భావములెన్నఁడు చూపకుండ, దేవునికి సంపూర్ణ స్వాధీనతను ఋజువు చేసికొనవలెను.

773. ఈ విశ్వప్రపంచ మహారాజ్యమున కధినేత పరమేశ్వరుఁడే. మనమందర మా భగవద్రాజ్యములో జీవించుచున్నాము. భగవానుని రాజ్యములో నశుభము, దుఃఖము, అవినీతి, అకాల మృత్యువు మున్నగు దోషములకు స్థానముండదు. ఇదియే రామరాజ్యమనిరి. నీవు నిరంతరము భగవద్భక్తుఁడవై, భగవాను నాశ్రయించినచో నీవు భగవ ద్రాజ్య సభ్యుఁడవై, యెట్టి దోషములులేని సంపూర్ణ సౌఖ్య శాంతియుత జీవితమును గాంతువు. నమ్మి యీశ్వర పరి పాలనలో జీవింపరాదా ?

774. "జననమరణరోగ దుఃఖమయం జగత్" మరియు "సర్వం విష్ణుమయం జగత్' ఇవి రెండును సత్యములగునా? విష్ణుమయమనగా, జగమంతయు భగవన్మయమైనచో జన్మ మృత్యుజరాది దుఃఖమయమగుట యెట్లు సంభవించినది? దేవుఁ డంతట నిండియున్నాఁడు. దేవుఁడున్నచోట దుఃఖ మెట్లుండఁగలదు? దేవుఁ డున్నచోట దుఃఖముండుట దేవునికి వ్యతిరేక లక్షణము కాదా ? ఏది సత్యము ? దుఃఖమా, దేవుఁడా ? దుఃఖము నిజమని లోకులందరు సాక్ష్యమిచ్చు

చున్నారు. మహాభక్తులు మహాజ్ఞానులు లోకమంతయు దుఃఖరహితము, ఆనందభరితమునైన భగవన్మయమేయని చెప్పుచున్నారు. వారు సత్యవ్రతులు, అఖండజ్ఞానవేత్తల మాట నమ్మెదువా? అజ్ఞానముచే నంధులైన మూర్ఖులమాట నమ్మెదువా ?

775. నీయిచ్ఛవచ్చిన దాలోచించు; నీకుఁ దోచినది మాటాడు; నీ చేతికి నచ్చిన పనులను చేయుము. కాని ఒకటి మాత్రము మఱువకుము. నీ మాటలకు, తలపులకు, చేతలకుఁ నీశ్వరశక్తి సంకల్పములే కారణములని మఱువకుము. సర్వజీవ వర్తనమున కిదియే పరమసత్యము. నీకట్టి విశ్వాసము స్థిరపడినచో, నీజీవిత మీశ్వర సంకల్పశక్తిచే నిర్దిష్టమై, శుభావహమై నడచును. దేవుని నమ్ముటయు, దోషములు సంక్రమించుటయు నెన్నఁడు జరుగని విషయము.

776. ఈ శరీరమును, శరీరబంధువులను, గృహమును నిచట విడిచిపోవుట కఠిన సమస్యయే, చిరకాల సంబంధపాశములను మృత్యువు త్రెంపివేయుటచే నెంతవానికైనను, అప్రయత్నముగా దుఃఖము రాకమానదు. కాని యెంత దుఃఖము కలిగినను, ఇహలోక సన్నివేశమును విడిచిపోక తప్పదు. నిర్విచారముగా దేహమును, బంధువర్గమును, ధనవస్తువాహనాదికమును విడిచిపోవుట కుపాయము లేదా? ఉన్నది. బ్రహ్మజ్ఞానము నార్జించుటొక్కటే ఉపాయము. అది సులభమైన పనియా? కష్టమైనదే కాని, చేయుచున్నచో

సులభమగును. నిరంతర భగవదారాధనచే భగవానుఁడు కృపజూపి, జ్ఞానజ్యోతిని ప్రకాశింపఁ జేయునని గీతావాక్యము.

777. అజ్ఞానమును పెట్టినవాఁడు భగవానుఁడు; దానిని దొలగించి జ్ఞానమిచ్చువాఁడును భగవానుఁడే. మనము స్వయముగా నజ్ఞానములోనుండి, దానిని దొలగించికొనుటకు మనకు శక్తి లేదు. "ఎవరు నన్నాశ్రయింతురో వారి హృదయమందు జ్ఞానదీపమును వెలిగించి నన్నుఁ జేరుటకు సహాకరింతు నని గీతలో భగవానుఁడే పలికినాఁడు. అందుచే మనము నిత్యము, "ఈగాఢాంధకారములో నేను జీవింపలేకున్నాను, భగవాన్! దయతో జ్ఞానదీపమును వెలిగింపు మ"ని ప్రార్థింప వలెను. భగవానుఁ డట్టి ప్రార్థన నంగీకరించి, జ్ఞానకాంతిని ప్రసరింపఁ జేయునని, గీతలోనే కృష్ణుఁడు పలికియున్నాఁడు. భగవానుని వాక్యమును నమ్మి వర్తింపలేవా?

778. తప్పక దేహమును విడిచి పోవలసినవారు, తామెల్లప్పుడు నుండువారివలె ప్రవర్తింతురు! "అజ్ఞానేనా వృతం జ్ఞానమ్ తేన ముహ్యంతి జంతవః" యని గీత పలికినది. జ్ఞానమందరలో నున్నది. జ్ఞానమనగా బరమాత్మయే; "సత్యం జ్ఞానమనంతమ్ బ్రహ్మ" యని ఉపనిషత్తు; అది అజ్ఞానమనఁగా, మాయచేఁ గప్పబడియున్నది. అందుచే, జీవులు, మోహావశులగుచున్నారు. ఎందుకట్లు భగవానుఁడు చేసినాఁడు? ఈప్రశ్న, దీనికి జవాబు మనము గ్రహింపఁగల స్థితిలో లేము. జవాబు జ్ఞానములోనిది; అజ్ఞాని యెట్లు చూడఁ

గలఁడు? భగవాను నెఱిఁగినఁగాని జ్ఞానము రాదు; అందుచే నమ్మి భగవంతు నర్చించినచో, దయతో నజ్ఞానము తొలగించి రక్షించును.

779. ఒక పెద్దమనిషిని, "ఏమండీ! సంసార మనుకూలముగా నడచుచున్నదా? బాధించు గొడవ లేమియు లేవు కదా! అందరు క్షేమముగా నున్నారా?" యని ప్రశ్నింపఁగా నాతఁడిట్లు బదులు చెప్పెను; "ఏదో నడచుచున్నది. గొడవలు లేకేమి? ఇంట ఁగొందర కనారోగ్యము; ధనము చాలదు; పిల్లలకు వివాహ సమస్య; ముఖ్య బంధువులే విరోధులైరి. ఏదో కాలము గడపుచున్నాము." భక్తుఁడిట్లు చెప్పవలెను; "అన్ని గొడవలు దేవుని పాదముల కర్పించితిని; వానివలన నాకెట్టి క్లేశమును గలుగకుండ, మిక్కిలి అనుకూలముగా వానిని దేవుఁడే పరిష్కరించి శుభసంతోషముల నిచ్చుచున్నాఁడు, నాకెట్టి విచారకారణమును గనపడక, విచారించుచున్నాను." భక్తిజ్ఞానములే, సుఖములనిచ్చి, సర్వక్లేశ నిర్మూలన మొనర్చును.

780. సర్వజ్ఞుఁడనగా భగవానుఁడు. మానవుఁడల్పజ్ఞుఁడు లేక అజ్ఞుఁడు సర్వజ్ఞు నాశ్రయించినచో మానవుఁడు సర్వజ్ఞుఁడు కాఁగలఁడు. అట్లు సర్వజ్ఞతగాంచిన మహర్షుల చరిత్రలు మనకు ఁదెలియును. సంశయము, భయము, దుఃఖము నెపుడు కలుగును? సర్వజ్ఞత యనగా, ఁదెలియవలయునేదియు మిగులని సంపూర్ణజ్ఞానము. ఏమాత్రము

జ్ఞానలోపమున్నను, సంశయములు బాధలు తప్పవు. సర్వజ్ఞుఁడైన భగవానునితో సంపర్కము, సన్నిహిత సంబంధము పెట్టుకొని, అభేదమును లేక భగవానునితో నేకత్వసిద్ధి నందిన మానవుఁడు సర్వజ్ఞుఁడై లోపరహితుఁడగును.

781. నీరు లేని యెండమావులలో నీటికై వెదకుటెట్టి వృథాశ్రమ యగునో, సంసారములో సుఖమునకై యత్నించుటయు నంత వ్యర్థప్రయత్నమే. సుఖమను వస్తువును భగవానుఁడు తనయొద్ద నుంచికొనినాఁడు. జలము నదిలోనే కాని, యెడారి యెండమావులలో నుండదు. ఏదియెచట దొరకునో స్పష్టముగా దెలిసికొనుటే వేదాంతసారము. అందుచే శాంతి సౌఖ్య నిలయుఁడైన భగవంతు నాశ్రయించి సుఖము పొందవలెను. మానవుఁడు మాధవుఁడు కావలెను. మాధవు నెఱిఁగి, నమ్మి, ధ్యానించి, మానవత్వము నధిగమించి తరింపవలెను.

782. అసత్యమును సత్యమనుకొను భ్రాంతియే అజ్ఞానము. భ్రాంతి తొలఁగుటే జ్ఞానము. అదియే దైవత్వము, మోక్షము, బ్రహ్మత్వము, భ్రాంతివలననే జన్మజరామృత్యు దుఃఖపూరితమగు సంసారము తుదయు మొదలు లేకుండ నడచుచున్నది. దుఃఖమే సుఖమను భ్రాంతి, అనాదిగా వచ్చినది. కాని దానికంతము గలదు. దైవకృప లభించినా భ్రాంతి నశించును. అందుచే మానవుఁడు మృతిపొందులోపున దన భ్రాంతిని బోఁగొట్టుకొని తరించుటకు యత్నించుటే వివేకము.

783. గృహము, భార్య, సంతతి, ధనము – ఈనాలుగును గలిగినవాఁడు ధన్యుఁడని లోకులు తలఁచుచున్నారు. కాని యీ నాలుగును నాలుగుకోట్ల సమస్యల నుదయింపఁజేసి, మానవునికిఁ గావలసిన శాంతిసౌఖ్యములను కొల్లకి వేయుచున్నవి. ఒడలంతయు గాయములగునట్లు చిదుకగొట్టి, తినుమని యొక లడ్డునిచ్చినచో నది రుచించు టెట్లు? గాయములు సలుపుచు. వానిపైన నీగలు ముసురుచు దుర్వాసన కొట్టుచుండగాఁ దీపిలడ్డు తినుటలో సుఖమేమున్నది? ఇదియే సంసార సుఖము. దానిని సుఖమనఁ దగునా? దానికై జీవితము నాహుతిచేసి దుఃఖించుట తెలివా? దైవ ధర్మానుగుణ ప్రవర్తనము రక్షింపదా?

784. ఏది నిజమైనను గాకున్నను, ఒకటి మాత్రము సర్వకాల సర్వావస్థలలోను, నిరాక్షేపణీయమైన పరమ సత్యము. అంతఃకరణ శుద్ధితో జీవితమును భగవానునికాత్మార్పణముచేసి భక్తుఁడై, నిరహంకారియైన, వ్యక్తి పఠించు ప్రతి వేదమంత్రము, సంకీర్తనము, స్మరణము భగవానుఁడు విని, అంగీకరించి, దాని కత్యంత ప్రాధాన్యమిచ్చి, వాని కనుకూల ఫలితమిచ్చి కాపాడుట – అనుభవైక వేద్యమయిన సత్యము. అట్టి భక్తునికి వలయు సదుపాయములు సమకూర్చుటలోను, భక్తునకెట్టి కష్టనష్టములు కలుగకుండఁ జేయుటలోను, శాంతిసౌఖ్యమయ జీవితము ననుగ్రహించుట

లోను భగవాను నౌదార్యము, దయ, వేగము - సాటిలేనివి. ఇది యెవ్వఁడును మఱువరాదు. మరచుటాత్మ హింసయే !

785. "అన్నియునున్నవి; ఐదువతనమే లోపించె" నను సామెతగలదు. మానవజీవిత మట్టిదే. దైవానుగ్రహము బ్రహ్మజ్ఞానము గలుగుటే ఐదువతనము. అదిలేనిదే యెన్ని యున్నను, సర్వభారములు వహించి సుఖశాంతులిచ్చు భర్త లేనటులే యగును. అన్నియు దుఃఖకారణములే యగును. వైధవ్యము సుఖమా? ధనగృహకాంచన వాహనసేవకా బృందములు, మఱియు ననేకములైన భోగద్రవ్యములు సమృద్ధిగా నుండవచ్చును గాని, భర్తలేని బ్రతుకు, దీపములేని పాడుచీకటి కొంపవలె, నీరులేని సరస్సుమాదిరి, చినుకుఁబడని మేఘమువలె, దుఃఖహేతువే యగును. అందుచే భక్తుఁడవో బ్రహ్మవేత్తవో కమ్మ.

786. ప్రకృతి యంతయు భగవాను ననంత దివ్య శక్తి ప్రదర్శనము. కనపడున దంతయు నాభగవానుని రూపమే. ఈసంగతి నెఱిఁగి, పరమాత్మ నారాధించి బ్రతుకు వాఁడే బ్రతికియున్నవారిలో లెక్క, మిగిలిన వారందరు సజీవ శవములే. ప్రకృతిలోని దివ్యప్రదర్శనములైన సూర్యచంద్ర నక్షత్రాదులను, పంచభూతములైన వాయుజలాగ్ని భూమ్యా కాశములను స్తవమొనర్చునవే వేదమంత్రములు. ఆ మంత్ర పఠనముచే ప్రకృతిశక్తులు, దేవతాస్వరూపములు దాల్చి, ఆర్యులకు సర్వవాంఛాసిద్ధులను సమకూర్చినవి. అందుకే

హిందువులు నేటికిని, నదులకు సముద్రములకు, వృక్షములకు పర్వతములకు, శిలలకు, శిల్పములకు, ఎండకు వానకు, నన్నిటికి నమస్కరించి పూజించుచున్నారు. ప్రకృతి దృశ్యములు దేవుని సాక్షాత్కరింపజేయును.

787. నీ వెన్నో చేయుము; ఎంత ధనమో వ్యయింపుము, ఎందరి సాయమో పొందుము – నీ వెంత గింజుకొనినను, నీలోపములను, దుఃఖములను దేవుఁడుతప్ప మఱెవ్వరును తీసివేయలేరు. ఎందుకితర ప్రయత్నములలో వృథాశ్రమ, కాలహరణము? కూర్చుండినచోటనే కూర్చుండి, ఆవగింజంత శ్రమలేకుండగా భగవంతుని స్మరింపలేవా? అంతకంటె ఫలప్రదము, సుఖప్రదమునగు కార్యక్రమ మింకొకటి లేదని నీకు నీవే కోటిసారులు చెప్పికొని నీ మనస్సును కట్టి భగవానుని పాదములపైఁబెట్టి, మహోల్లాస విలాసములతో హాయిగా బ్రదుకుము. నీవు దేవుని ముద్దు బిడ్డవగుదువు.

788. ఇహలోక భోగములెవఁడనుభవింపనర్హుఁడు? బ్రహ్మవేత్తయొక్కఁడే వాని ననుభవించు నధికారము గలవాఁడు. దేహాదికము, కాంతాకాంచనములు, గృహారామాదులు, వస్త్రాభరణాదికము, మార్పుగలవి; జీర్ణములై, అదృశ్యము లగును. కనపడుట, కొలది కాలముండుట, జీర్ణించుట, కృశించుట, నశించుట – ద్రవ్యలక్షణములు. ఎప్పుడు మారని వాఁడు దేవుఁడు. వస్తువుల లక్షణములను సరిగా గమనించి. వాని ననుభవింపవచ్చును. కాని యవి మనోనిగ్రహమును,

జ్ఞానమును నాశనమొనర్చు లక్షణములుగలవి. పరిపూర్ణ జ్ఞానసిద్ధిగాంచి, పరమాత్మ సాక్షాత్కారముపొంది, చెక్కు-చెదరని స్థిరమనస్కుఁడు వస్తువుల నిశ్చిత లక్షణములెరిగి, అనుభవింప వచ్చును. అట్టి అనుభవముచే నాతఁడు చలింపఁడు. అవి నశించినపుడు, విచారింపఁడు. కామినీకాంచనాదిక మనుభవించుటకు బ్రహ్మవేత్తయే అర్హుఁడు. కాని లోకము తద్విరుద్ధమై, దుఃఖహేతువగుచున్నది.

789. "అన్నము తిఁటినిగాని యింకను ఆకలివేయుచున్నది." అనగా నర్థమేమి? తిన్నది చాలదని స్పష్టముకదా. అటులే, "భగవంతుని ధ్యానించుచున్నాను, జపధ్యానార్చనములు చేయుచున్నాను, గాని యింకను గొన్నిబాధలు పోకుండ మిగిలియున్నవి." అనగా నీవుచేసిన జపధ్యానములు, నీభక్తి చాలదని యర్థము. నీవింకను నీజపధ్యాన భక్తులను తీవ్ర మొనర్పవలెను; జపాదిక మెన్నఁడును మానరాదు. నేను చాల కాలమునుండి విశేష జపముచేసితినను నహంభావము, గర్వము నెన్నఁడు మనస్సులోఁ జేరనీయరాదు. నేనెంత, నాజపమెంతయని నిజముగా నమ్మి వినయముతో భజించుచున్నచో భగవత్కృప కలుగును. నాజపము చాలదాయను భావమెన్నఁడు కలుగనీయరాదు.

790. దేవుఁడు శిక్షింపఁ బూనినపు డెవఁడేమి చేయఁగలఁడు? "తండ్రీ! రక్షింపుమ"ని యేడ్చుటయే మహాయజ్ఞకర్మ. మన కిదివరకు జన్మములలోని పాపము లెన్నియో

మిగిలియుండి బాధించుచుండ వచ్చును. అవసరము లేనిదే దేవుఁడు శిక్షనీయఁడు. దేవుని స్మరించి, కన్నీటితో నాతని పాదములు కడిగినచో నింకనున్న పాతకములు నశించును. ఏడ్పే జపము; ఏడ్పే ధ్యానము; ఏడ్పే పూజ; దానితోఁ బాపక్షాళనమై దైవకృప కలుగును.

791. ఆరోగ్యమున్నచో ఁగోర్కెలు, భోగాభిలాషలు తలలెత్తును. అహంకారము పెరుగును. పాపబుద్ధి తేకెత్తును; మానవుఁడు భ్రష్టుఁడగును. అనారోగ్యము కలిగినా, తాత్కాలిక వైరాగ్యము, భగవంతుని రక్షింపుమని మొ్రొక్కులిడుట, పొగరుబోతు తనము తగ్గుట; అహంకార దోషములు సడలుట జరుగును. ఏది మంచిది? అనారోగ్యమే మంచిది. కాని ఆరోగ్యము, దైవభక్తి వైరాగ్యము కలిసి యుండుట శ్రేష్ఠతరముకాదా? ముందేమేల్కొనుట, తెలివైన వాని లక్షణము.

792. దేహమెన్నో బాధలకు మూలము; లోకములోఁ బ్రతుకెన్నో దుఃఖములకుఁ గారణము; భగవానుఁడెందు కిట్లు పెట్టెను? దుఃఖముల ననుభవించుచు జీవితములను గడుపుమని యెందుకేర్పాటు చేసెను? బాధించి భక్తులనుజేయుట కని వేదాంతులు చెప్పుదురు. భగవంతుఁడు బాధింపకుండ భక్తులను చేయలేఁడా? అది భగవద్విలాసమందురు? భగవంతుఁడట్టి విలాసము నెందుకుఁ గోరినాఁడు? ఈ తర్కమంతయు వ్యర్థమైనది. చీకటిలోఁ దడవులాడుచు ఖిన్నుఁడైనవాఁడు చీకటి

యెందుకున్నదియని ప్రశ్నించును? చీకటిలోనుండగా సమాధానము దొరకదు; కాంతివచ్చిన వెనుక ప్రశ్నయే అవసరముండదు. అనగా మనము భగవంతు నాశ్రయించి జ్ఞానజ్యోతిని సంపాదించినచో, చీకటి, బాధలు, దుఃఖములు, నన్నియు నదృశ్యములగును.

793. పుట్టించి, పుట్టకుండ జేసికొను మార్గముచెప్పిన భగవానుని గుర్తింప లేకున్నాము. పుట్టుట, మరణించుట, మరల పుట్టుక, మృతిలేకుండ జేసికొమ్మను సూచనలే. జన్మించి జన్మరాహిత్యము నార్జించుటకే సర్వప్రాణులు తహతహలాడుచున్నవి; ఏలన జన్మించుట దుఃఖము; జన్మరాహిత్యము సుఖము. నీసహజ స్వరూపమాత్మ; ఆత్మకు శాశ్వతత్వము, అవ్యయానందము సహజ లక్షణములు. అందుచే లోనున్న ఆత్మప్రబోధనము వలననే అట్టి శాశ్వత జీవిత స్థిరానందములను ప్రతిప్రాణియు సప్రయత్నముగా, గోరుచున్నది. "మానవుడా! చావులేని బ్రహ్మజ్ఞానము నార్జింపుము; ప్రయత్నింపవా? ఎన్ని జన్మములెత్తినను దుఃఖమే నీభాగ్య మగును.

794. అందరలో, నన్నిటిలో భగవానునిఁ జూచుట నేర్చికొనవలెను. భార్యలో, బిడ్డలలో, బంధుమిత్ర శత్రువులలో, పశుపక్ష్యాదులలో, వృక్షలతాదులలో, క్రిమికీటకాదులలో భూమిజలాగ్నివాయ్వాకాశములలో వాసుదేవుఁడున్నాఁడని గీతావాక్యము. ఇది తీవ్రమగు సాధనచేసి "వాసుదేవ

స్వర్వమితి" యను సత్యమును దర్శింపవలెను. ఇదియొక దివ్యసాధన; తరించుట కిది చాలును.

795. నడిసముద్రములో రంధ్రములు గలిగి నీరు లోపలఁజేరు పడవలో మానవులు పయనించుచున్నారు. పైన ఁదుపాను గాలులు, ఏక్షణములో నైనను పడవ మునుఁగ వచ్చును. ఇహలోక మానవజీవితమట్టిదే, పడవ దిగి బయ టకు రాలేము. నీటితో నిండుచు ఁదుపానుగాలి కూగిస లాడుచున్న పడవ మునుగక తప్పదు. రక్షణోపాయమే మున్నది? చిల్లులులేని, తుపాను గాలికి ఁజెక్కుచెదరని బల మైన పెద్దనౌక వచ్చి మనలనందుఁజేర్చి, తీసికొనిపోయి ఒడ్డున దింపఁగలదు. ఆపెద్ద నౌకయే గురువులేక బ్రహ్మ వేత్త. సురక్షణోపాయ మనుభవపూర్వకముగా నెఱిఁగిన వాఁడే బ్రహ్మవేత్త. గురుకృపవలన దైవకృప లభించును. దైవకృపవలన ఁబడవలోని చిల్లులు మూయఁబడును. తుపాను మారి, మలయానిల మగును. ప్రమాదములు తొలఁగి ప్రయాణము సుఖముగా జరిగి, భగవానుఁ డను నొడ్డును జేరఁగల్గుదుము.

796. దేవునారాధించు టెంతసేపు? దేవుఁడు దర్శన మిచ్చి పలుకరించు వఱకును. అది సులభమైనదా? చిత్త శుద్ధి, నమ్మకము గలవాని కతిసులభమైనది. కల్మషచిత్తునకు ఁగోటి జన్మములెత్తినను దేవుఁడు పలుకఁడు. వానికి దేవుని దర్శనము సాధ్యపడదు. దేవుఁడున్నాఁడు; అత్యంత సన్ని

హితుఁడై యున్నాఁడు. మన సర్వమునకు దేవుఁడు సాక్షియే. మన ఆలోచనలు, మాటలు, చేతలు, గ్రహించి, విని, చూచును. నిరహంకారివై, పవిత్రహృదయముతో దేవుని బిలిచినచో జవాబు తప్పక లభించును; దీనికిఁ గోటిమంది భక్తుల సాక్ష్యములున్నవి. నమ్మి యత్నించిచూడుడు.

797. పుణ్యము వలన సుఖము; పాపము వలన దుఃఖము వచ్చును. పుణ్యమనగా భగవానుఁ డంగీకరించు రీతిగా బ్రతుకుట; పాపమనఁగా భగవాను నాదేశములైన ధర్మములకు విరుద్ధముగా వర్తించుట. పుణ్యపాప సాంకర్యము వలన సుఖదుఃఖములు కలుగుచుండును. అఖండపుణ్యమఖండ సుఖమిచ్చును; అనంతపాప మనంత దుఃఖమిచ్చును. సకల పుణ్యకర్మలలో దైవారాధన ముత్తమ పుణ్యము. నిర్విరామ దైవారాధనము, నిర్విరామానందమిచ్చును; శాంతి నిచ్చును; ముక్తి నిచ్చును. దేవుని మఱువకుండ భజించుట కేమి కష్టమున్నది. అభ్యాస లోపమే కారణము.

798. నిజమైన భక్తుఁడనగా దేవుని సర్వత్ర, సర్వ కాలములలోఁ జూచువాఁడే. అన్ని వేళల భగవానుఁడు నన్నుఁ జూచుచుండఁగా నేను తప్పుపని చేయుటెటుల సాధ్యమగును? తప్పుచేయనిదే పాపమెట్లు సంక్రమించును? అందుచే భక్తుఁడనగా బరిపూర్ణ పుణ్యపురుషుఁడు, పాపలేశమును లేని వాఁడు. కొంతభక్తి లోపమున్నచో, బాపములకుఁ దావుండును. వానికిఁ గొంత దుఃఖము, శిక్ష తప్పదు. నిజముగా భగవన్మహిమ నెఱిఁగినచో, భగవాను నాశ్రయించియు

దుఃఖమింక ననుభవించుట విరుద్ధ విషయము. అనగా పూర్ణ భక్తుని కెన్నఁడు దుఃఖముండదు.

799. మనస్సును నిర్మలానంద ప్రశాంతి సౌఖ్యములతో నిండియుండునట్లు చేసికొను నుపాయ మున్నదా? "దేవుఁడున్నాఁడు; మనలో నున్నాఁడు సర్వత్ర నిండి యున్నాఁడు; ఆశ్రితమందారుఁడు. భక్తితోఁ గీర్తించు వారికి సర్వతోముఖ సంపూర్ణవాంఛాసిద్ధినిచ్చి, రక్షించు ననిర్వచనీయకృపామృత సాగరుఁడు భగవానుఁడు. ఆయన నిత్య సంపూర్ణ రక్షణము నాకున్నది." అని పరమ విశ్వాసముతో జీవించువాని కేలోపములు, బాధలు నుండవు. వానికెట్టి కాలుష్యమంటదు. వాని మనస్సు పవిత్రమై, ఆనంద ముద్రితమై ప్రకాశించును.

800. 'రామరామ' యని నిత్యము జపించువానితో దేవేంద్రుఁడు పోల్పఁదగఁడు, అనగా భగవన్మహిమ నెఱిఁగిన వాఁడే అట్టి నిరవధిక స్మరణము చేయఁగలఁడు. అనేక జన్మములెత్తి యెన్నో దుఃఖములనుభవించి, నేటి కావ్యక్తి దైవానుగ్రహ పాత్రుఁడైనాఁడన్న మాట, నిరంతర భగవన్నామ సంస్మరణాతిరేకమున నొడలు మరచి, సమాధిగతుఁడై, అవ్యయానంద మనుభవించు భక్తునితో సాటియగు వాఁడెవ్వఁడును లేఁడు. శ్రమస్వల్పము; ఫలమనంతము. సకల సత్కార్యానుష్ఠాన ఫలితములందిమిడియుండి, భక్తుని భగవత్తుల్యునిఁగాఁ జేయును.

801. కర్మయోగమనఁగా (కర్తను నేనుగాను, భగవానుఁడే యని తెలిసికొనుటే. ఏ కోర్కెయు లేకుండ, (గర్మఫలాపేక్ష విడిచి, భగవంతునిపై భారముంచి, కర్మచేయుటే కర్మయోగముగాఁ జెప్పెదరు. ఇది సత్యముకాదు. కర్మఫలత్యాగము చేసాక, కర్మనుగూడ విడిచిపెట్టుట కర్మ సన్యాసయోగమని చెప్పెదరు కర్మచేయుటకుఁ గాని, కర్మ సన్యాసమునకుఁ గాని మనకెట్టి స్వేచ్ఛయు లేదని చెప్పుచుండఁగా ఇక (జేయుటకు మానుటకు (గర్తృత్వమేది? చేయుట, మానుట దైవ ప్రేరితము. అర్జునుఁడు యుద్ధము చేయనని గాండీవము క్రిందఁ బార వేసినాఁడు. యుద్ధము మానుట తన చేతిలోఁ బనిగాదని తెలిసినాఁడు. "మానుటకు నీవెవఁడవు; తీయుము గాండీవము. యుద్ధము చేయుము" అని కృష్ణ భగవానుఁడు పలికి, తానే యుద్ధములోనికి దిగుట సమంజసము కాదని. అర్జునుని నిమిత్తమాత్రునిగాఁ బెట్టి సర్వము నడపినాఁడు.

802. పరమాత్మ నన్నిటిలో నన్నివేళల (జూచు నభ్యాసము వలన మానవుఁడు జ్ఞాని యగును. కాని దేహేంద్రియ మనోబుద్ధ్యహంకారము లజ్ఞానజములై, నేనొక వేరైన ప్రత్యేకవ్యక్తి నని భ్రాంతిని జనింపఁజేయును. ఇదియే సకల దుఃఖములకుఁ గారణము. అభ్యాసయోగముచే, శ్రుతి వాక్యములను నమ్మి, కనపడు సర్వములో (బరమాత్మ చైతన్యమును దిలకించి భక్తితో నారాధించు వానికి (గొంతకాలము

నకుఁ బూర్ణభక్తి యోగముచే నంతయుఁ బరమాత్మయే యని గోచరించి ముక్తుఁడగును.

803. చావును జయించు టే మానవులకు దుఃఖమును జయించు మార్గము. చావును జయించుట కుపాయమున్నది. చావును జయించుటకు మానవుఁడు తాను స్వయముగాఁ జచ్చి పోవలెను; అనగా నాత్మహత్యకాదు. యముఁడు మన యొద్దకు రాకముందే, మనకు మనమే యముఁడై, మన దేహము నెడ నభిమానమును పూర్తిగా విడిచిపెట్టవలెను. మనము తృణీకరించిన దేహమును యముఁడు తీసికొనవలెను. యముఁడు చేయుపనిని మనమే చేయవలెను. దీనికొకటే మార్గము. దేహము దుఃఖాలయము; పోయితీరును, దేహమును నమ్ముటమాని దేవుని నమ్ము. దేవుని నమ్మినచో దేహదుఃఖములు లేకుండఁజేయును. దేహమును నమ్ముట, అభిమాన మమకారములు పెట్టుకొనుటమాని, యీశ్వరారాధనములో దాని నుపయోగించి తరింపవలెను. పోవుట తప్పని సరియైన దానికి లేని విలువకట్టి, ఉండునని తలఁచి యేడ్వరాదు.

804. బ్రతుకుట మంచిదా, మరణము మంచిదా? అర్థము తెలియకుండ బ్రదుకుటయు, అర్థము తెలియకుండ మరణించుటయు రెండును దుఃఖహేతువులే. బ్రతుకుటవలన సుఖము లభించునని ప్రతిప్రాణి తలఁచుచున్నాఁడు. కాని సుఖముగా నున్నదా? దుర్భరదుఃఖములు తటస్థించుచున్నవి. దేహము, దాని పోషణ ద్రవ్యసంపాదనము, భోగవిలాసము

లకై యత్నములు సుఖము నిచ్చుటకు బదులుగా, నానా రోగ్యము, లేమి, కామక్రోధాదులు, అవమానములు, శత్రుత్వములు - మున్నగు కోటి అడ్డంకులు వచ్చి సుఖలేశము లేకుండఁజేయును. మరణము, మరణకాల యాతన దుఃఖము. తరువాత నేమగునో తెలియదు. వీని రహస్యమెఱిఁగి, దుఃఖ నివారణముచేసికొని మఱియు జీవితమును గడపు టవసరము.

805. యౌవనావస్థలోఁ గాంతాకనకమోహావశులై దేహభోగములకై ఎగఁబడుటలోఁ గొంత అర్థమున్నది. యౌవనము సడలిన వెనుక, దేహ పటుత్వము దిగజారి, రోగబాధల నెదుర్కొని కష్టము లనుభవించు నప్పుడైనను, దేహాభిమానమును తగ్గించికొని, దైవారాధన దీక్షపూన వలదా? ఇదియెవనికి వాఁడు చూచికొని, తనకురాఁబోవు దుస్థితిని గ్రహించి, పరమార్థ సాధనమునకుఁ బూనుకొను టవసరముకాదా? బంధుమిత్రులు, ధనగౌరవములు కాపాడఁజాలవు. గతములోఁజేసిన దోషములకు క్షమాభిక్ష వేడికొని దేవుని పాదములు పట్టుకొని తరింపవలదా? ఈప్రయత్న మెంత త్వరగా ఁజేసిన నంత మంచిదికాదా?

806. మనస్సు మానవద్రోహి; భగవద్ధ్యాన దృష్టి కలుగకుండఁజేసి, ఒకవేళ కలిగినచో నిలువకుండఁజేసి, చంచలములైన భోగములపై కీడ్చుకొనిపోయి బాధించును. పవిత్ర భావములను గప్పివేసి, క్షణిక విలాసవీధులకు లాగుకొని పోవును. ప్రతి మానవుఁడు తనకు ద్రోహ మొనర్చు

మనస్సును నిగ్రహించికొని, దైవధర్మమార్గముల ఁబట్టింప వలెను. దీని కంతర్ముఖుఁడై. ఆత్మావలోకనము సాధించి, మనస్సు నా పరమాత్మపై నిలిపి ధ్యానించుట వలన మనో మాలిన్య చాంచల్యములు నశించును.

807. "ఓరే మానవుఁడా? నేను నీ హృదయమందిర మందును, మఱియు సకల మందును నిరంతరము నిండి యున్నాను. నిన్ను సృజించుటే కాక అనుక్షణము నీజీవిత సర్వకార్యములను నడపుచున్నాను. నేను నిన్నొకటే చేయు మంటిని. నన్ను సుందర మనశ్శుద్ధితో నమ్ము. నీకెన్నఁడు నేలోపమును లేకుండఁజూచి, శాశ్వతరక్షణ మిత్తును. ఎందుకు నేను చెప్పినపని చేయక విలపింతవు? నేను చెప్పినది పెద్ద పనియా? ఇంకెవ రున్నారు నిన్ను ఁగాపాడుటకు? ఇఁక నీ తెలివి చాలునులే. నన్ను నమ్మి సుఖించు" మని దేవుని మాటలు వినువారికి నిత్యము చెవులలో వినఁబడుచునే యుండును.

808. మనస్సు నిర్మలశాంతితో నానంద ముద్రితమై యుంచుకొను నుపాయమున్నదా? ఉన్నది. చలించు వస్తు వులపై మనస్సు నుంచినచో నాచలించు లక్షణమే మనస్సుకు సంక్రమించును. ఎన్నడు చలింపక, పరిపూర్ణానంద శాంత్యా నంద సమృద్ధమగు పరమాత్మపై ఁగేంద్రీకరించినచో నాపర మాత్మ లక్షణములే మనస్సునకు సంక్రమించి, నిశ్చలమగును. చలనశీలము గలిగి, అదృశ్యములై మోసగించి, విలపింపఁ

జేయు దేహభోగాది ద్రవ్యములపై మనస్సును కేంద్రీకరించిన కారణమున లోకము శోకహతమైనది.

809. నీ కెన్నఁడు లోటులేని, దుఃఖింపవలసిన అవసరములేని, పరిపూర్ణానంద మయమైన మహోచ్ఛస్థితి కావలెనా? ఇదిగో! తీసికొమ్ము. చిత్తము శుద్ధిచేసికొనుము; వినయము, భక్తి, భయము, శ్రద్ధ, విశ్వాసము నివి పంచ లక్షణాత్మకమైన అద్భుతప్రక్రియ. వీనిని చిత్తములోఁ జేర్చి, ఆచిత్తమును దేవుని పాదపద్మముల కంకితమిమ్ము! అంతే. నీకేమి లభించునో లెక్కపెట్టుకొనుము; ఎడతెగని శాంతి, సౌఖ్యము, అమర్త్యత్వము, ప్రకృతిపై శాసించు నధికారము, ముక్తి – ఈ పంచలక్షణములు నీకుఁ గలుగును. అనగా, దేవుని లక్షణములు నీవగును. ఇఁక నీకు లోటెక్కడ?

810. పరమేశ్వ రానుగ్రహమను మందమలయానిలము హాయినిచ్చు రీతిగా నెల్లప్పుడును వీచుచునే యున్నది. అజ్ఞానము, అహంకారము, దేహాభిమానము ననుగవాక్షములు బిగించికొని గదిలోఁ గూర్చుండి, గాలి తగులుటలేదని దుఃఖించుచున్నావు. నీపవిత్ర విశ్వాస సంభరితమగు హృదయమను గవాక్షమును తెరచి, భక్తి యుక్తుఁడవై కూర్చుండినచో చల్లని పిల్లవాయువులు సౌఖ్య మీయఁగలవు. అజ్ఞానాచ్ఛాదనమును తొలగించి, గాలిలోనికి రానిచ్చినచో నీ కమితోల్లాసము కలుగును. భగవానుఁడే మలయానిలము; నీవు నీహృదయ కవాటములు తెంచుటయే చేయవలసిన పని;

వెంటనే యీశ్వరానుగ్రహ మను వాయువులోపల బ్రవే
శించి, అఖండానంద మిచ్చును.

811. ఆరోగ్యమిచ్చినా, ఆనందమిచ్చినా, చిత్త
శాంతి నిచ్చినా, చెక్కుచెదరని ధైర్యమిచ్చినా, ఏదుఃఖములు
లేకుండఁజేసినా, జ్ఞాన ప్రకాశమునిచ్చినా, యెప్పటికప్పుడు
జీవితములో నానుకూల్యము కలుగఁజేసి యెట్టి ఒడిదుడుకులు
లేకుండఁజేసినా, ఒక్క పరమేశ్వరునికే సాధ్యమగును గాని
యితరు లెవ్వరికి నిట్టి శక్తి లేదు. అందుచేఁబరమేశ్వరు
నారాధించుట తప్ప గత్యంతర మేమీ లేదు. కాని యిది
చాల గొప్ప కార్యము, అఖండభాగ్యము. భగవంతుని
భక్తితో నారాధించుటవలనఁగలుగు మహాదృష్ట భాగ్యము
పట్టుట, ప్రపంచమునంతను నేలు సార్వభౌముని రత్న కిరీట
ముల కంటె గొప్పది. ఇది తెలిసికొని ఆచరించుటే సకల
మానవుల కర్తవ్యము.

812. చర్మ చక్షువులకుఁగనపడున వన్నియు, ఁగాల
వశములై, పెరుగుట, క్షీణించుట, కృశించుట, నశించుట,
అదృశ్యములగుట యను లక్షణములు గలవి బాహ్య వస్తువు
లన్నిటిని చైతన్యమిచ్చి, నిలుపుశక్తి చర్మచక్షువులకు గోచ
రింపని అఖండాత్మ శక్తి. పంచభూతాత్మక ప్రపంచ దృశ్యము
లన్నియు నిలకడగలవని నమ్మి, జీవులు మోసపోయి, దుఃఖము
లనుభవించుచున్నారు. వస్తువుల ఉనికికి, మార్పులకుఁగార
ణమై, యెన్నఁడు మార్పులేని పరమాత్మ దివ్యతేజస్సు నంత

ర్దృష్టితో (దిలకించి, జ్ఞానభక్తి యోగాభ్యాసములచే మాన వులు తరింపవచ్చును.

813. మనము కర్తృత్వములేని నిమిత్తమాత్రుల మైన ఉపకరణముల మనునది సత్యము. అర్జునుఁ డంతటి వీరుఁడే, "నిమిత్తమాత్రమ్భవ" యని కృష్ణప్రభువు పలికి నాఁడు. అందుచే మనము భక్తితో భగవంతు నారాధించు టకును కర్తలము గాము. భగవంతుఁడే దయకలిగి కొందరచే (దన స్మరణము చేయించును. అనఁగా నర్థము మనము భగవద్ధ్యానము చేయుచున్నామనఁగా, నదివరకే భగవత్కృప కలిగిన దన్నమాట. భగవంతుని స్మరించుచున్నావా? నీది మహాభాగ్యము; సకల శుభములు సుఖములు నీకు లభిం చును. ఇఁక బెంగలు దేనికొఱకు? నీవు చూచికొనవలసినది, నీకు భగవద్ధ్యానము చేయవలెనను కోరికపుట్టి, చేయుచుంటివా లేదా యనునదే. భగవంతుని స్మరించుచున్నావా? ఇఁకనీకు (గల సర్వసమస్యలు పరిష్కరింపఁబడిన వన్నమాటే ఎంత అదృష్టవంతుఁడవు!

814. చీర ఒకటి కొనుటకై స్త్రీలు బజారుకేగి పీలై నన్ని దుకాణములు తిరిగి, పెక్కురకములు తిరుగవేసి, ఒకటి కొని యింటికి వచ్చిరి. ఇంటివద్ద దానిని మరల (బరిశీలించి, నచ్చలేదని ఖిన్నులై కూర్చుందురు. ఎన్ని చీర లీజన్మములో (గట్టిరో! ఇంక నెన్ని కట్టవలెనో! ఎవడు కాంత ధరించిన చీర సౌందర్యమును జూచి మురిసిపోవునో, అట్టి భర్త చీర

తొలగించిననే యానందించును. వస్త్ర వ్యామోహము, దేహ వ్యామోహమును దిగద్రొక్కి వేసినది! ఇది నేటి నాగరకత!

815. కాంతాకాంక్షను జయించు కోరిక గలవారు కొన్ని విషయములు మనస్సులో నుంచుకొనవలెను. నఖశిఖ పర్యంతము నాకవాసినుల సౌందర్యమును మించు కాంత లందర దేహములు మట్టిలో గలసిపోయెను. వారి ముఖ సౌందర్యము, చెక్కిళ్ల సొగసు, పెదవుల అందము, స్తన గాంభీర్యము, పిరుదుల దృఢత్వము, చూపుల విన్నాణము, అధోభాగముల మెఱపు, - అన్నియు గొలదికాలము విజృంభించి, వాడి, నలిగి, కృశించి, చచ్చి బూడిదపాలైనవి! ఎన్ని కోట్ల కాంతలు, కాంతాదాసులు - ఏరీ! మట్టి మిగిలినది. మట్టిని ప్రేమింతురా!

816. అన్నిటిలో దేవుని జూచుట నేర్చికొనవలెను. సర్వవ్యాపియై, అద్వితీయమగు పరమాత్మయే యేకైక సత్యము, సత్పదార్థమును, సకల వస్తువులు జీవులు, జడములు పరమాత్మనుండికాక మఱెచ్చట నుండియురావు; మఱొకటి పరమాత్మేతరము లేదుకదా! అటులే యేది జరిగినను పర మాత్మ సంకల్ప ప్రభావమే. అన్యసంకల్పమనునది లేనే లేదు. కావున నీవేది చూచినను, లోకములో నేది జరిగినను పరమాత్మ శక్తియని వెంటనే గుర్తింపవలెను. కాని నీవు చూచువానిలో నీవు నున్నావు. నిన్ను నీవే పరిశీలించికో!

నీవా పరమాత్మ శక్తివే! సత్యము! భయపడకు! ఇంకొక టేదియు లేదుగా! నిశ్చల మనస్సుతో దెలిసికో! తెలిసి కొనుట, తరించుట నీకటే!

817. జన్మజరా మృత్యురోగ దుఃఖములకు మందు, పవిత్ర నిశ్చయముతో బరమేశ్వరారాధనము చేయుటే, దేహమనోవాంఛలు, కామక్రోధాదులు విడిచిపెట్టుట మనకు సాధ్యముకాని పని, ఈ దోషములను సృజించిన పరమేశ్వరుడే వానిని దొలగింపవలెను. నీవు పరమాత్మను ధ్యానించుట మానకు; అవి నెమ్మదిగా దప్పుకొనును. వానికిని మందు భగవద్ధ్యానమే. ఏ కోర్కెలు కలిగినను వానితో గలహామునకు దిగకుము. "కృష్ణప్రభూ! ఇవి నాపైకివచ్చి పడుచున్నవి. దయతో జూడు"మని కృష్ణప్రభువు కొప్ప జెప్పుటే. కృష్ణప్రభువు వానివైపు చూచెనా అవి నశించును. నీవు పిలిచినచో గృష్ణప్రభువు తప్పక చూచును.

818. భగవంతు నారాధించినచో బాధలన్నియు బోవునా? కొన్నిపోయి కొన్ని మిగులునా? అన్ని పాపఫలితము లనుభవింప నవసరము లేకుండ బోగొట్టుకొన వీలున్నదా? ప్రారబ్ధము లవశ్యమును భోక్తవ్యములని వాడుక కలదు. నిప్పులో బడవేసిన కట్టెలన్నియు భస్మమగును. భగవత్సంకీర్తన మను నగ్నిజ్వాలలో నెట్టి ఘోరపాపములైనను భస్మమగును. ఇందు సంశయమునకు దావు లేదు. అట్లుగాక, కొన్ని మిగిలినచో దేవుని శక్తికి లోపమగును.

కాని మనభక్తి చాలక మిగుల వచ్చును; పరిశుద్ధ సంపూర్ణ భక్తియున్నచో సకలపాప దహనమగును.

819. దీపముండఁగా చీకటిలో దడవులాడు దుస్థితి నేల యనుభవింపవలెను? దేవుఁ డుండగా నేలేశమాత్ర దుఃఖము నేల పొందవలెను? దేవుఁడు దుఃఖము నొకచోట నుండవు. దేవుని నీవు స్మరించుచున్నను దుఃఖము మిగిలి యున్నదా? అనగా భగవానుని మహిమను నీవు సరిగా గుర్తింపని దురల్పమైన భక్తుఁడ వన్నమాట. దేవుఁడనఁగా సర్వసమగ్ర శుభమూర్తి. నీవు చిత్తశుద్ధికలిగి, "హే భగవాన్! సర్వలోకైక శరణ్యా! అనంత కృపానిధీ!" యని స్మరించినచో, సర్వసౌఖ్యములిచ్చి కాపాడుట, ప్రబల వేగముతో జరిగిపోవును. అట్టి సాధనచేసి, ఫలితములఁజూచి ఆశ్చర్యపడుదువు.

820. సృష్టి వైచిత్ర్యము నవలోకించినచో, నాశ్చర్యమంది, తన్మయత్వమును గాంతుము. భూమిలో, భూమిపై, నాకసమున, సాగరములందు, పర్వతములయందు నెన్ని రకములైన జీవులు, వృక్షపుష్ప ఫలాదులు, లెక్కలేనన్ని రంగులు, పరిమళములు, సొగసులు. - మానవులు కొలఁది తావులనే చూడఁగలరు, లోకము లనంతములు, జీవు లనంతములు, సృష్టియు ననంతము; అంతయు నెవఁడును దర్శింపఁజాలఁడు. ఈయనంత దివ్యప్రదర్శనములో మానవుఁడొక నలుసు. అందుకే, "ఆశ్చర్యవత్పశ్యతి" గీతలో జెప్పినాడు.

కాని నలుసైనను మానవునికి సత్యాసత్యములను వివేకించు జ్ఞానము కలదు. అందుచే సత్యమును దర్శించి తరించు నవకాశ భాగ్యము మానవున కున్నది.

821. మార్పులకులోనై నలిగిపోవుచు మార్పులేని స్థితినంది సుఖింపవలెనని మానవుఁడు గోరుచున్నాఁడు. కోరిక చాలదు. దానిని సాధించు నుపాయము కనుగొని జీవితములో దాని నాచరింపవలెను. ఉపాయమున్నను, సాధనచేయుటయును జాలదు. సాధనసిద్ధి పొందువరకుఁజేయు దీక్ష కావలెను. అప్పుడు మార్పులకు లోనై దుఃఖించు మానవుఁడు మార్పులేని దైవత్వమును. నిత్యత్వమును, స్థిరానందమును గాంచును. భక్తుఁడు, జ్ఞానియు మాటలతో మాత్రమే సంతసింపని ధీరులై క్రియాపరులు కావలెను.

822. మన కన్నిరకములైన సమస్యలను పెట్టినవాఁడు భగవానుఁడే యగుటయు, భగవానుఁడే వానిని మన కనుకూలముగాఁ బరిష్కరింప సమర్థుఁడగుటయు, వానిని దేవునికి అర్పించి, "దయతోఁ బరిష్కరించి రక్షింపుము"ని ప్రార్థించుటే సుఖము; మనమే పరిష్కరింపఁ బూనుటలో సంతాపము తప్పదు. సర్వసమస్యలను భగవానున కర్పించు నభ్యాసమున్న భక్తులుకూడ కొన్నిటి నహంకారదూషితులై, దేవుని కర్పించుట మఱచి, తామే పరిష్కరింపఁబూని దుఃఖభాజను లగుచున్నారు. ఏది వచ్చినా వెంటనే, "భగవాన్! ఇది పరిష్కరించి నన్ను దయతోఁ జూడుము"ను

నభ్యాసము మఱువకుండ, మనతో నేకమై జరుగుట వలన భగవానుఁడు తృణప్రాయముగా వానిని మనకు శుభము, శాంతి, సౌఖ్యము కలుగురీతిగాఁ బరిష్కరింపఁ గలఁడు. ఈ సాధన ఒక్కటే మానవుని ముక్తి నొనర్చుటలో సంశయము లేదు.

823. పొంగిపొరలు నదీప్రవాహ మాగక ప్రవహించు రీతిగా, మనస్సు దేవుని పాదములపైకి, క్షణమైన మానకుండఁ బ్రవహించి, మరలకుండు నభ్యాసముచేసి, మానవుఁడు కృతార్థుఁడు కావలెను. అట్టివానిదరి కనుజ్ఞ లేనిదే యముఁడు సమీపింపఁడు; దుఃఖములు, ఆపదలు వానికిఁ గలుగవు; ఆతని హృదయ మానందశాంతి నిలయమగును. దేవుని దివ్య లక్షణము లాతనికి సంక్రమించును. ఇంకేమి కావలెను? అభ్యసించి ఫలితములు చూడు.

824. ఈశ్వరసంకల్పము లేనిదే యేదియు జరుగదు. గడ్డిపరక కదలదు; వాయువు వీచదు; అగ్ని కాలదు; సూర్యుఁ డుదయింపఁడు; ఈసంగతి తెలిసికొని, భగవాను నాశ్రయించి, జీవితసర్వస్వ మర్పించి కూర్చుండుము. ఎన్ని విచిత్రములు జరుగునో నీవు లెక్కింపలేవు. అదియే తపస్సు; జపము; హోమము, యజ్ఞము, భక్తి జ్ఞానము నన్నియు నదియే. అన్నియునిచ్చువాఁ డీశ్వరుఁడుండఁగా నన్యుల నాశ్రయించు టేమి ప్రారబ్ధము?

825. జరుగవలసిన దొక్కటేయున్నది. కాల వేగమును మించిన వేగముతో నిశ్చల ప్రమాణబుద్ధితో, నోర్పుతో, వినయముతో, అనవరత భగవద్ధ్యానము చేయుట నేర్చికొనుము. తక్కినవేమి యెప్పుడెట్లు జరుగునను చింత పెట్టుకొనకుము. కాలమును వ్యర్థమొనర్పకుము. కాలుఁడనఁగా యముఁడు. కాలుని జయించుటకుఁ గాలవేగమును మించిన వేగముతో భగవద్ధ్యాన సాధనచేయుము. భగవానుఁడైన శివుఁడు నీయొద్ద ఁగూర్చుండఁగా, యముఁడెట్లు వచ్చును; దుఃఖము, ఆపద లెట్లు సమీపించును? ఇది నిజమాయందువు; చేసిచూడు.

826. "విశోకశ్శోకనాశనః" యని విష్ణు సహస్రనామములలో నున్నది. భగవానుఁడు శోకము లేనివాఁడు, శోకమున్న వారికి ఁగోరినంతనే తొలగించువాఁడు. మానవునికి ఁగోటి రకముల శోక హేతువులున్నవి. పుట్టుట శోకము, రోగము శోకింపఁజేయును; వార్ధక్యము దారుణ శోకకారణము; అవమానము, దారిద్ర్యము, మున్నగున వెన్నియో శోక హేతువులై మానవుని ఁదినివేయుచున్నవి. దేవుఁడు సకలశోక నివారణ కర్త; ఆయన నాశ్రయించి, అశోకుఁడవై సుఖింప లేవా ?

827. "తద్బుద్ధయస్త దాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః గచ్ఛంత్యపునరావృత్తిమ్ జ్ఞాననిర్ధూతకల్మషాః" గీతావాక్యము; "పరమాత్మయం దేకైక దృష్టితో బుద్ధినిలుపు

నిష్ఠగలిగి, చలింపకుండువారు, జ్ఞానముపొంది, దానిచే సర్వ పాపములు నశించినవారై జన్మరాహిత్యమనగా మోక్షమును గాంతురు". దీని సారాంశమేమనగా, (బరమాత్మయందు మనోబుద్ధి హృదయములతో జీవితమును లగ్నమొనర్చి, చలింపకుండు నిష్ఠ ఫలితము పరమాత్మ లక్షణమగు జ్ఞాన సిద్ధి; దానితో పాపనాశనము; మోక్షప్రాప్తి.

828. ఈలోక ప్రజలు బంధుత్వ మిత్రత్వముల చేతను, వ్యావహారికముగాను, కలియుచుండుట, విడిపోవుట; మరల (గలియుట కవకాశములు లేకపోవుట జరుగుచుండును. సంయోగ వియోగములకు మృత్యువు ముఖ్యకారణము. సంయోగము తాత్కాలిక సుఖమిచ్చి, తాత్కాలిక వియోగము తాత్కాలిక దుఃఖమిచ్చి, శాశ్వత వియోగము శాశ్వత దుఃఖమిచ్చును. పరమాత్మ సంయోగమే వియోగములేనిది. నందుచే దుఃఖము లేనిది, బ్రహ్మజ్ఞానము, పూర్ణ భక్తి దాని నిచ్చును.

829. ఇక్కడ పరమేశ్వరుడు లేడనుకొనుటకంటె దైవద్రోహము లేదు. నీవున్న చోటనుండి చిత్తశుద్ధితో (జేసిన ప్రార్థనలు పరమేశ్వరుడు వినుట లేదనుకొనుటకంటె నీశ్వర దూషణము లేదు. మరియు నిచటనుండి, మన ప్రార్థనములు విని, మన కుదార దయాసింధువై, వాంఛితము లీడేర్ప (డనుకొనుటకంటె దారుణమైన పరమేశ్వర నిరసనము లేదు. అనగా, గంగాతీరమున (గూర్చుండి, త్రాగుటకు నీరు లేద

ం, నన్న రాశి యొద్దనుండి, ఆకటిబాధతో నలమటించు
ు, భగవానునిలో నుండి, దైన్యదుఃఖ వశుఁడగుటయు
ద్రోహము లే. నీవెన్నఁడు దైవద్రోహమునకుఁ బాల్పడ
కువుగాక.

830. పూర్ణశుద్ధ భక్తికి వశుఁడై భగవానుఁ డట్టి
ఁ డేదికోరినను వెన్వెంటనే యిచ్చును. అనగా నట్టి
ఁడు కోరుటయు, దేవుఁ డీయకుండుటయు నెన్నఁడు జరు
ఏ మడిగిన నిచ్చునా? ఏమడిగిన సంతోషముతో
్రను. మంచిచెడ్డలు లేవా? దేవుఁడిచ్చుటచే, నన్నియు
ఎవగును. సర్వదుఃఖములు పోవునా? తప్పక పోవును.
చావులు, అనారోగ్యములు, అవమాన దారిద్ర్య
ాదు లన్నియు నశించునా? ఇన్ని మాట లెందుకు? పోని
లు, రాని సుఖములు నుండవు. పూర్ణశుద్ధ భక్తుఁడవై
ములు చూచికొమ్ము.

831. పరమాత్మకు నీవు వేరుగా నున్నావనుకొనుట
నసత్యము లేదు. నీవనగా, నీదేహము, మనస్సు,
ఇంద్రియములు, ప్రాణము, జీవాత్మ. నీదేహమును
నది నీమనస్సు; నీమనస్సు నింద్రియములను నడపునది
, నీబుద్ధిని నడపునది నీజీవాత్మ. నీజీవశక్తిని సృజించి
నది పరమాత్మ, పరమాత్మయే యేకము నద్వితీయము
అనంతశక్తి. దేహమనోబుద్ధిసహిత జీవరాశి యంతయు
సర్వ సృష్టియు ఁబరమాత్మ బాహ్యరూపములు.

నీదేహ మనోబుద్ధీంద్రియాదులు, నీజీవాత్మభావము సృష్టి లోని భాగములు. అనగా నీవు వేరుగాలేవు. ఆత్మ స్వరూపమే నీవైనట్లు బాహ్యప్రదర్శనము. సత్యమేమన నీ పరమాత్మశక్తియే. సర్వసృష్టియు నీవే! జీవులందరు నీవే! జడము లన్నియు నీ రూపములే, నీవే సర్వము; నీవు కానిది లేనిది.

832. చిత్తము దైవాయత్తమొనర్చి హిమవద్గిరి ద్రఢిమతో నమ్మి, నవగర్భాధానపు పెండ్లికొడుకువలె నిశ్చింతగా, మహోల్లాసపూరితుఁడవై కూర్చుండుము. భగవానుఁడు నీ తలపై నీగనైన వాలకుండ రక్షించును. వేదాంతమనఁగా ఁజదువుట, పాండిత్యము చూపుట, దీర్ఘప్రవచనము చేయుట గాదు. వేదాంతమనఁగా విశ్వసించుట, ఆరాధించుట, చిత్తశుద్ధితోఁబరమాత్మ మహిమను గుర్తించుటయును. వేదాంతమనగా, సర్వదుఃఖములు పోవుట, జన్మమృత్యువులు లేని మోక్షసామ్రాజ్యాధిపత్యము వహించుట–దేహమును విడుచులోపున నట్టి పదవి నార్జించుటయునై యున్నది.

833. విడిచిపెట్ట వలసిన యిల్లు, దేహము, నిల్లాలు, సంతతి, ధనము, వస్త్రవాహనాదికమునిచ్చి వీనితో సుఖముగా నుండుఁడనియే భగవానుని భావమనియే నమ్మెదువా? మరియు రోగములతో నిండిన దేహము, సకల వికారములకు లోనగు ధనగృహాదులు, జరామరణాధీన మగు జీవితమునిచ్చి సుఖముగానుండు ఁడనియే దేవుని యభిప్రాయమా? సుఖ

మిచ్చు ననుభ్రాంతిని కల్పించి, భరింపరాని బాధలనిచ్చు దేహాదికమిచ్చి, "ఇవన్నియు దుఃఖము నిచ్చునవి. దుఃఖ మెన్నడు నుండని పదవినార్జించు నుపాయము చూచికొనుఁడు, నశించు దేహాదికముపై వ్యామోహమును విడిచి, దుఃఖ రహితము, శాశ్వతమునగు నానందము నిమ్మని దేవుని పాదము లాశ్రయించి భజింపుమనియే, భగవాను నుపదేశము.

834. రహస్యమొకటి తెలిసినది. సర్వకర్త దేవుఁడా? నీవా? వేలకొలఁది జన్మములనుఁడి అజ్ఞాన గాఢాంధకారమున ఁగుమిలిపోయి, "నాకు ఁగర్తృత్వమున్నది; నాబాధ్యతలు నెర వేర్పవలసియున్నద"ని తలఁచి, యిపుడు నాకు లేశమాత్ర మును కర్తృత్వము లేదని స్పష్టముగా ఁదెలిసినది. ఇది అద్భుతమగు పరమ సత్యము. అన్నియు భగవానుఁడే చేయును; చేయించును. స్వయంశక్తిచే నేను చేయుట సహిం పరాని అసత్యము. నేను కర్తనను సంస్కార మేనాటి నుండియో వేళ్లుపారి, ఛేదించుటకు శక్యముగాకుండ బలము పొందియున్నది. కాని అసత్యము సత్యమగునా, సుఖ మిచ్చునా? సత్యము నెరుగుటే సుఖము. లెమ్ము! సర్వము దేవుని చేతిలోనున్నది. నమ్ము! అద్భుత ఫలితములు కలిగి, ఆశ్చర్యపడుదువు.

835. ప్రస్తుతప్రపంచము దేవునికి దూరమగుచున్నది; అనగా దుఃఖసాగరమునకు మధ్యమందు ఁబవేశించుచున్నది. కాంతాకాంచన భోగకాంక్ష లాకసమంటి, అజ్ఞాన మను నంధ

కారము గడ్డ కట్టుచున్నది. అనఁగా క్షణిక సుఖములనుగోరి, తప్పు మార్గములఁబట్టి, దారుణదుఃఖ కూపమునఁ దుముకు చున్నది. ఈ నేటి నాగరకత తుచ్ఛమైనదని స్పష్టము. దీనికి దోఁడన్యాస్త్రరాశి పెరుగుచున్నది. భగవానుఁడే తప్ప నెవరు రక్షింపఁగలరు ?

836. ప్రస్తుత ప్రపంచము దైవధర్మముల నిరసించి కామక్రోధ మదమాత్సర్యములకు, రాక్షసికత్వమునకు దారి తీయుచున్నది. మానవజాతి మానవత్వము నీసడించి, పశుత్వమునఁబడి ఘోరమైన ఆత్మాపచారము చేసికొనుచున్నది. యుద్ధపరికరములను మితిమీరు నట్లుగా దయారుచేసి, ప్రపంచమును శ్మశాన వాటికగా మార్చ నుంకించు చున్నది. మహర్షి సంతతికి మూలమైన భారతజాతి, తుచ్ఛపశ్చిమ నాగరకత ననుకరించి, అనుసరించుట మానని చోఁ దుడుపెట్టుకొని పోవును. భక్తులైన వారు భగవంతుని రక్షింపుమని ప్రార్థించుటొకటే క్షేమమార్గము.

837. మూర్ఖానుకరణము చేయుట కుద్యుక్తులగు వారు మృత్యువశులై పోవుట తప్పదు. మనము మహర్షుల ననుకరింపవలెనా? భోగజాతి (బోగపుజాతి) యైన పశ్చిమఖండవాసుల ననుకరింపవలెనా? ధర్మసూత్రములను, నీతి నియమములను, దైవారాధనమును మనము పూజించి అనుసరింపవలెనా, భ్రష్టాచారములను, పైశాచిక కాంక్షా దాస్యమును మన్నించి ఆర్జింపవలెనా? భారతీయుఁడా! నీకు జాతి

ధర్మము లేదా? ప్రపంచము నుద్ధరించి తరింపఁజేయఁగల నీ దివ్యాత్మ జ్ఞానాదర్శముల ననుసరింపఁగోరవా? కోరకున్నచో, సర్వనాశము తప్పించు కొనఁగలవా? నీజాతిలో రాముఁడు, కృష్ణుఁడు నవతరించి మార్గము చూపలేదా? వారిని మఱచి వర్తింతువా? జాగ్రత్త!

838. భరతభూమి ప్రస్తుతస్థితి అయోమయావస్థలో నున్నది. పదవులకై ఎగఁబడువారే కాని, మహోన్నత పవిత్రాశయములు గలిగి లోక కళ్యాణసిద్ధికై యత్నించుట భారతీయాదర్శము కాదా? వోటు రాజకీయ తత్త్వమా రక్షించునది? వోటుకొఱకనాదిగా వచ్చిన జాతిపవిత్ర ధర్మములను బురదలోఁ ద్రొక్కివేయుదువా? పదవి, ధనము, పూలదండలు కోరి, నీతి, నియమము, మానవత్వము, దైవ భక్తి, బ్రహ్మజ్ఞానముల విలువలను పాతిపెట్టుదువా? నీ కుటిల యత్నముల వలన దుఃఖాగ్ని జ్వాలామయమై దేశమాక్రో సించుట గనలేవా? భగవానుఁడు హర్షించు పుణ్యప్రవర్తనము రక్షించు శక్తి గలదని గుర్తింపవా? భారతీయుఁడా! ఏకాంతమునఁ గూర్చుండి, వివేకించి, సత్యమార్గము ననుసరించి, నీక్షేమమును, భారతవర్ష క్షేమమును గాపాడు కృషికిఁ బ్రధాన స్థానమిచ్చుట నెన్నఁడు నేర్చి అనుసరింతువు?

839. భరతభూమి కణ్వాస్త్రముల వలనఁ బ్రమాదము నిస్సంశయము. అణ్వాస్త్రములకు దూరసామీప్యములు లేవు. మూఁడవయుద్ధము ముఖ్యముగా అణ్వాయుధ యుద్ధమే

యగును. మానవజాతి బూడిదయగును. భారతజాతి మారణ హోమమునుండి తప్పించుకొనఁజాలదు. మార్గము లేదా? ఇప్పటికి నున్నది;భోగవిలాసానుకరణమును విడిచి, విశ్వప్రాణి రక్షణ క్షేమములను గోరు, దైవధర్మభీతి నాశ్రయించి బ్రదుకుటకు బూనుకొనవలెను. లోకమును రక్షించు శక్తి భగవానుని చేతిలో నున్నది. భగవానుని పాదము లాశ్రయించి, ధర్మానుగుణ ప్రవర్తన మలవరచుకొను దీక్షకుఁ బూనినచో, భారతీయులకు రక్షణము లభించును. మఱొక దారి లేదు.

840. నేటి ప్రపంచప్రమాదస్థితిలో, భారతభూమి రక్షణము, దేవుని హస్తగతమై యున్నది. భారత జాతిలో నేటికిని నివసించుచున్న బ్రాహ్మణ జాతికి గర్తవ్యమున్నది. ఒక పది లక్షలమంది బ్రాహ్మణులు, ధర్మవిరుద్ధ భోగాభిలాషలు విడనాడి, నిత్యము నథమము సంధ్యావందనము, నూట యెనిమిది సారులు గాయత్రీ జపము చేసినచో దేశమును రక్షింపఁగలరు. తా మగ్రవర్ణులమని గర్వముతోఁ జెప్పికొనుచు, జపతపాదులుమాని, దైవారాధన విడిచిపెట్టి. వేషములకు, విలాసములకు, తుచ్ఛభోగములకు, పదవులకు ధన సంపాదనమునకు మీ జీవితములను బలియొసఁగి వర్తించుటచే, సర్వనాశము తప్పదు. బ్రాహ్మణులు! వెనుదిరిగి చూచికొనుఁడు! మీరు మీబ్రాహ్మణత్వ ధర్మమును పాతిపెట్టకుఁడు. "లోకాస్సమస్తాస్సుఖినో భవంతు" మీధర్మము,

ఆలస్యము చేయకుండు; బుద్ధిమార్చుకొని మీరు సురక్షితులై దేశమును, లోకమును సురక్షిత మొనర్పుడు.

**841.** శరీరము కలుగుటతో శరీరము నేననుకొను ప్రబల మమకారముకూడఁ గలుగును. శరీరము సుఖమిచ్చునదిగాఁ గన్పట్టి దగాచేసి దుఃఖమునే యిచ్చును. క్షణములో రోగ మృత్యువుల నిచ్చి యేడిపించు శరీరముపై మమకారమును నెమ్మదిగాఁ దొలగించికొనుటకై సాధన చేయుచుండవలెను. అనగా శరీరమును నిర్లక్ష్యము చేయుమని కాదు. అది నీవను నాత్మ లేక భగవానుఁడుండు దేవాలయము. దానిని పవిత్రముగా నుంచికొని ధర్మానుష్ఠాన దైవారాధనముల కుపయోగించి కొనవలెను. దేహము నెడ నిదియే యుక్తమైన భావము. దానిని దూషింపవద్దు. దురుపయోగ మొనరింపను వద్దు, నమ్మను వద్దు. శుద్ధముగా నుంచికొని భగవానుని కర్పింపవలెను.

**842.** భగవాను నెడ నమ్మకము, భక్తి, వినయము, అనన్యపూజ్య భావముల నేకారణములచేత నెన్నడు కుంటు పడకుండ చూచుకొను నేర్పుగల వాఁడే నిపుణుఁడు. భగవంతుని యెడ నఖండ మర్యాదభావములో నెన్నఁడును నకిలీ లేకుండ జూచికొను నదృష్టము నీవార్జించినచో నీవు, పరమేశ్వరున కత్యంత సన్నిహిత బంధువై చతుర్విధ పురుషార్థములను పొందఁగలవు. భక్తి, వినయ, భయములు మూడును మూడు రత్నములు, ఈ రత్నత్రయము ధరించి, భగవాను

నాశ్రయించితివా, నీకు భగవానుఁడు వశుఁడై, తనంత వాని నిగా నిన్నుఁ దీర్చిదిద్ది సర్వశుభముల నిచ్చును.

843. గీతాపారాయణము నిత్యము భక్తితోఁ జేయవలెనని కోరిక గలిగి చేయుచుంటి వనఁగా, శ్రీకృష్ణ భగవానుని కృప నీకుఁ గలిగినదని యర్థము. ప్రతిదిన మడ్డు రాకుండ గీతాపారాయణము జరుగుచున్నదనగా నెడతెగని దయ భగవానునికి నీయెడ ఁగలిగినదని స్పష్టము. నీయింట బదునెనిమి దధ్యాయములు నిత్యము పారాయణము జరుగుచున్నచో, నీకెట్టి లోపము, దోషము, దుఃఖము ప్రమాదము సంభవింప దనున దీశ్వర శాసనమే. గీతాపారాయణము వలన శ్రీకృష్ణ భగవానునిపై మనస్సు నిలుచుట, అట్లు నిలచుటచే శ్రీకృష్ణు నవ్యాయ కృపారసామృతము లభించుట, అట్లు లభించుటచే. సర్వదుఃఖ పరిహారము, సర్వశుభావాప్తి కలుగుట-స్వల్పవిషయము. ఇంక నెంత లాభమున్నదో చెప్పుటకు మానవబుద్ధిశక్తి చాలదు.

844. దేశ పరిపాలకుఁడైన ప్రభువు నీకత్యంత ప్రియ శిష్యుఁడై నీయోగక్షేమముల కధిక ప్రాధాన్యమిచ్చి నీసేవ చేయుచుండఁగా నీయింట బియ్యము లేవనియు, నీకు ఁగట్టుకొనుటకు దుస్తులు లేవనియు మరియు నెన్నియో యిక్కట్లు పడుచుంటిని ననియు ఁజెప్పినచో నెవ్వరును నమ్మరు. నీ యవసరముల నత్యంత వేగముగా నేర్పాటుచేసి, నీ గృహధనాదికముల రక్షించుటకై అప్రమత్తమగు సైన్యమును నియమించి,

దేశాధిపతి నిన్ను నిత్యము రక్షించును, ఇఁక నీకు విషాద కారణముండదు. ఓరీ! మూర్ఖుఁడా! దేశప్రభువుగాక సర్వ లోకైకప్రభువు, పరమాత్మ నీరక్షణమును జూచువాఁడైనచో నీ యానందమును కొలువఁగలవా? ఏప్రభువు కావలెనో చూచి కొనుము.

845. అప్రయత్నముగా నూపిరిపీల్చుటయు, గుండె కొట్టుకొనుటయు నెట్లు జరుగుచున్నవో అటులే భగవంతుని స్మరణము - మంత్రమో, నామమో - ఆగకుండ, శ్రమ లేకుండ - నిరంతరము జరుగుచుండవలెను. ఇదొక్కటియే సాధనచేసి విజయము సాధించినచో సకల దుఃఖములను నిర్మూలించి, సకల సౌఖ్యములను పొందవచ్చును. విడువులేని యీశ్వర సాంగత్యము కావలెను. అట్టి సాంగత్యముచే నీశ్వరుని కల్యాణగుణము లన్నియు సంక్రమించును.

846. దేహము దేవుని కర్పించి, విదేహకైవల్యము నార్జింపవలెను. అనగా దేహము పరమాత్మను గాంచు సాధనము. దేహము దేవుని కర్పించి దేహావసరము లేని, మోక్షానంద సామ్రాజ్య కిరీటాధి పత్యమును ధరింపవచ్చును. ఇఁక దేహమెట్టిది? ఒకవైపున శ్మశానవాటికకు గంతు లిడుచు (బరుగిడుచున్నది. ఒకవైపున నింద్రియార్థ సుఖముల (గోరి, అందుఁ దగుల్కొని, బయటపడు నుపాయము లభింపక బాధపడుచున్నది. మఱొకవైపున (దుద మొదలు లేని మమకారములను బిగించి బంధించుచున్నది. అట్టి దేహముపై

మమకారమును విడిచి, దేవుని కర్పించుట సులభ సాధ్యమా? అందుచే, "భగవాన్; నా దేహమును నీకిచ్చితిని; నీవే స్వాధీనము చేసికొని నన్నుద్ధరింపఁజేయుమ"ని ప్రార్థింపవలెను.

847. భగవన్మహిమను వేదములు, మహర్షులు, భక్తులు పెక్కుముఖముల వర్ణించియున్నవి. అజ్ఞానాంధకారములో నుండి, భగవానుని దివ్యకాంతి గల శాశ్వతానందశాంతి నిలయమునకు జేరుకొని సుఖించుటకు - వారు చెప్పిన మార్గములు, సాధనములు అర్థము చేసికొని ఏదో నచ్చిన యొక మార్గముపట్టి, పట్టుదలతో సాధనచేసి తరింపవలెను. వేదములు, మహర్షులు చెప్పిన దివ్యసాధనలఁగూర్చి ఉపన్యసించుట, తర్కించుట, గ్రంథములు వ్రాయుట-ముఖ్యముగావు- వానికి జీవిత మంకిత మొనర్చి, సాధనలో విజయము సాధించుటే మనము పూనుకొనవలయుఁగార్యక్రమము.

848. ఏమి జరుగునో యనుభయ మేల నిన్ను బాధింపవలెను? "క్షుద్రమ్ హృదయ దౌర్బల్యమ్, త్యక్త్వోత్తిష్ఠ పరంతప," యని భగవాను నుపదేశము, రథములో భగవానుఁడు ప్రక్కఁగూర్చుండి, సారథియై నడపుచుండఁగా, అర్జునునికి హృదయ దౌర్బల్యము సోకెను. మానవదేహమే రథము, ఈరథములోఁ బరమాత్మయగు శ్రీకృష్ణు డెల్లపుడాసీనుఁడై నడపుచున్నాఁడు, ప్రతిమానవుఁ డర్జునునివలె, హృదయ దౌర్బల్యముతోఁ గ్రియాహీనుఁడగుచు దుఃఖించుచున్నాఁడు. కృష్ణుని దేహమను రథములో సారథిగాఁజూచియు

భయపడి, అస్త్రసన్యాసమనగా భగవద్భజనమాని యేడ్చుచున్నాఁడు. ఇది మానవుని దుస్థితి. లెమ్ము; దేవుని గుర్తించి ఆయన ఆదేశముల నాచరించి తరింపుము.

849. భగవానుని అవ్యయానందసౌధ ప్రవేశమునకు నీ యొద్దనే తాళముచెవి యున్నది. చిత్తశుద్ధి గలిగి, భక్తితో భగవానుని పాదపద్మములపై శీర్షమునొాపి, నమస్కరింప లేవా? అట్లు నమస్కరించుట నేర్చికొన్నచో నీవేమడిగిన నపారమైన దయతోనిచ్చి, నీయోగక్షేమ భారమును దానే వహించును. దేవుఁడు లేని చోటులేదు; సర్వత్ర ఉన్నాఁడని నమ్మి, భక్తితో సేవించి, ఫలితములు చూచికొని సర్వ సుఖములు పొందుము.

850. ప్రజలేమి చేయవలెనో తెలియక, తెలిసికొను యత్నమును జేయక, తోచని తనము బాధింపఁగా నాసమయమునకు వింతలతో వినోదములతో, వ్యర్థప్రసంగములతో, ననాలోచిత క్రియా కలాపముతో నత్యమూల్యమగు కాలమును దుర్వినియోగ మొనర్చి దుఃఖించుచున్నారు. ప్రకృతి సంబంధములగు సేవలు తృప్తి నీయఁజాలవు; అందుచే మఱల (దోఁచనితనమే కలిగి, మరల (గ్రొత్తరకములైన పనులను వెదకుచుందురు. ఇట్లు వేలకొలఁది జన్మములు గడచిపోవునే కాని, సంపూర్ణమగు సంతృప్తి లభింపదు. సంపూర్ణతగలచోట సంపూర్ణ తృప్తి లభించును. సంపూర్ణత

సత్యము లేక పరమాత్మ రూపము. దాని నెఱుఁగు ప్రయత్నము మాత్రమే సంపూర్ణ తృప్తి నీయఁగలదు.

851. దైవేతర వ్యాపారము లన్నియు (గడుపు నిండని బేరములే. కూలిపనియో, వ్యవసాయమో, ఉద్యోగమో, వర్తకమో, యేది చేసినను, అన్నవస్త్రములకు లోపము రాకుండ నుండవలెనుగదా. అన్నవస్త్రాదులకు లోపము గలిగించు వృత్తులలో మ్రగ్గి, మానవులెట్లు సంతృప్తి పొంది ఆనందింపఁగలరు. పరమేశ్వరుఁడే సకల సంపూర్ణ సంతృప్తినిచ్చి తరుగు, తిరుగులేని దివ్యానందమును ప్రసాదింపఁగలవాఁడు. అట్టి పరమేశ్వరుని విడిచి, మానవుఁడేమి సంపాదించినను, లోపములేని సంతుష్టి కలుగదు. ఈ రహస్యము నెంత వేగముగా గ్రహించి యాచరించిన నంత వేగముగా దుఃఖ రహితానంద సంతుష్టి కలుగును. ఆలస్యమెందుకుఁ జేయుట ?

852. గతములో నాజీవిత దైనికచర్యల నన్నిటిని, నిశిత పరిశీలనము చేసికొని చూడగా రెండు విషయములు స్పష్టము లైనవి. (1) భక్తి లోపముచే నప్పుడప్పుడు చికాకులు, బెంగలు, భయములు ననేకము సంభవించి బాధించినవి. (2) అది కనిపెట్టి, చిత్తమును శుద్ధిచేసికొని భగవానుని కృప తప్ప, మఱొక విధమున దోషములు నశింపవని నిశ్చయించి, దాని నార్జించు నిష్ఠతో నేను భగవదారాధనకు (బూనుకొనుటయు నేక కాలమున, నాలస్యమేమియు లేకుండఁగా, సర్వ

భయములు తొలఁగి, సర్వవిషయములలో ననుకూల వాతావరణము కలిగి, కోరినవన్నియు లభించినవి. ఇది నేను ప్రమాణపూర్వకముగా జెప్పుచున్నాను. శుద్ధ చిత్తము, శుద్ధ భక్తి - సర్వభయనాశనము- ఇవి కావలసినవి మన క్షేమ మీమాటిని రక్షించికొనుటలో నిమిడి యున్నది.

853. మానసికోద్రేకము మహాప్రమాదకరమైనది. సాంసారిక విషయములలో నుద్రేకములు కలిగినచో, వైరములు, కాట్లాటలు; వీధిలోని వ్యవహారములలో నుద్రేకము వలన నన్నియుఁజెడును. ప్రశాంత మనస్కుఁడై వర్తించు వానికి సంసారము, లోకము నానందసౌఖ్యముల మాట నటుండనిచ్చి, లేనిపోని కలహావైరము లుండవు. ఇఁక భగవద్భక్తిలో నుద్రేకముకూడ నష్టములనే కలిగించును. ఉద్రిక్త చిత్తమునకు గొన్ని వేళల భగవానునిఁగూర్చి యుక్తజ్ఞానము నశించును. ఉద్రేకముపోవుటతో భక్తియుఁ బోవును. వివేక సహితమగు ప్రశాంత భక్తియే భగవత్కృప నిచ్చి రక్షింప గలదు.

854. తల్లిదండ్రులు దైవభక్తి, ధర్మానురక్తి గలిగి, లోకమునకు సంత్సంతతి నీయవలెను. భక్తిహీనులై కేవల కాములై, కనిన సంతతి, మానవ సమాజమును కామవశమొనర్చి, అరాజక సృష్టికి హేతువగుచున్నది. బిడ్డలకైదేండ్లు వచ్చినది మొదలు భగవద్భక్తి బీజములను వారి హృదయములో జొప్పించి నిలిపినచో, బెరిగి పెద్దవారై,

మానవ సమాజమును, దేవతల సమాజముగా నడుపఁగలరు. పశు పక్ష్యాదులు, క్రిమి కీటకములు సంతతి నపారముగా గనుచున్నవి. వాని ననుకరించు మానవులు, పశుతుల్యులై, లోకమును శోకహతమొనర్తురు. అనగాఁ దల్లిదండ్రులు నియమనిష్టలు, ధర్మశిక్షణముగలిగి, దైవభక్తులై వర్తించుట జగత్కల్యాణ హేతువు. అర్థకామములే ప్రధానమని తలఁచి నేటి భారత సమాజము ప్రమాదముల వశమైనది.

855. బ్రాహ్మణజాతి, క్షీణించి, దుర్దశపాలగుట యనగా బ్రహ్మజ్ఞానమునకు దుర్దశ సంభవించెను. అనగా దేశ పతనమునకే కాక, ప్రపంచ నాగరకత దారుణ విఘాతమునకు లోనగుచున్నది. బ్రాహ్మణులు వేదవేదాంతములు చదువుటమాని, సత్కర్మానుష్ఠానమునకు స్వస్తిచెప్పి, ఉద్యోగములకు పదవులకు, భోగవిలాసములకు నెగఁబడుట, బ్రాహ్మణధర్మమును, పటుత్వమును, గోల్పోయిరి. ఈ విధముగా బ్రాహ్మణులు తమకు హానిచేసి కొనుటేకాక, దేశమునకు, లోకమునకు హాని చేయుచున్నారు. ఇప్పుడైనను దీనిని గుర్తించి తమ దృష్టిని మార్చుకొని తమ విశ్వశ్రేయః ప్రదమగు కర్తవ్యమున కున్ముఖులగుదురు గాక.

856. నేటి బ్రాహ్మణులు తమ పుత్రుల కుపనయనమును సకాలమునఁ జేసి, విశ్వరక్షణ సామర్థ్యముగల సంధ్యావందనమును, గాయత్రిని నేర్పించుటమాని, ఆత్మద్రోహమునకు, దేశద్రోహమునకు, దైవద్రోహమునకుఁ బాల్పడి అధో

గతి నందుచున్నారు. ఉదయమే స్నానముచే శుచియై, ఒక అరగంట సంధ్యవార్చి గాయత్రి చేయుటకేమి కష్టమున్నది? అధిక సంఖ్యాకులు, పొగరుచే మానివేసి, దురభ్యాసవశులై శూద్రత్వమునుపొంది, మేము బ్రాహ్మణముల మని గర్వించుట క్షంతవ్యము కాని దైవద్రోహమని చెప్పనక్కరలేదు. మీతప్పు తెలిసికొని, సవరించుకొని, లోక కల్యాణ నిష్ఠ చూపుడు; లేదా మీకు దారుణ పతనము తప్పదు.

857. మానవదేహము మట్టిలోనుండి వచ్చినది. కాని దానిలో నాత్మశక్తి ప్రవేశించి, నఖశిఖ పర్యంతము నావరించి, చలనమిచ్చుచున్నది. కాని యీమట్టి యెచట నుండి వచ్చినది? మట్టి జలమునుండి, జలము నిప్పునుండి, నిప్పువాయువునుండి, వాయువాకసమునుండి, ఆకసము ఆత్మ నుండి వచ్చెనని ఉపనిషత్తు చెప్పుచున్నది. అనగా మట్టి ఆత్మస్వరూప మనగా దేవుని రూపమే. మట్టి రూపమగు దేహమును సరిగా వినియోగించుచో దేవునిఁ జూపఁగలదు. దేహము నుపయోగించి, ఆత్మజ్ఞానమునుపొంది, దేహమును మట్టిలోఁగలిపి వేయవచ్చును, మట్టిమట్టిలోఁజేరుటే మరణము; దానికి దుఃఖమెందుకు?

858. మన మేవిషయమును మనసిచ్చి కోరుట ప్రమాదహేతువు. మనసిచ్చి కోరఁదగినవాఁడు భగవానుఁ డొక్కఁడే, మనము దేవునికీయవసిన మనస్సును మరొకదాని కిచ్చితిమా, వెంటనే, ఆకోరిన వస్తువు చెప్పరాని తిప్పలు

బెట్టును. మరల నట్టి తప్పును జేయకుండుమని బోధించును. మన మన్నియు గోరి అనుభవింపవచ్చును; భగవంతుని ద్వారమున గోరుచో, నన్నియునిచ్చి భగవానుడు సంత సింప జేయును. భగవానుని విడిచియో, తృణీకరించియో, మనమేది కోరినను అపజయము పరాభవము తప్పవు. ఇదియు ననుభవముచే దెలిసికొనవలసినదే.

859. ఏవ్యక్తి యెడనైనను రాగద్వేషములు పెట్టుకొనకుండ, మనకేమి కావలసినను, మఱచిపోకుండ భగవానుని దివ్యహస్తములందు సమర్పించి, నిర్విచారముగా నుండుటే ఉత్తమ మార్గము. అప్పుడు భగవానుడు మన బాధ్యతలను చేపట్టి, మనకెట్టి దోషములు సంక్రమింపకుండు లాగున మనకోర్కెలను సఫలమొనర్చి, మితిలేని యానందమును జేకూర్చును. భగవానుడు సకలప్రాణి హృదయాంతర్గతుడై యున్నాడని తెలిసి, యిక రాగద్వేషములు పెట్టుకొను టవివేకముగాదా? నీగోడవ లన్నియు నీలో నివసించు దేవునితో జెప్పికొని, సర్వకాంక్షాసిద్ధి నందుము.

860. నీవు భగవాను నాశ్రయించుట నిజమేయైనచో నీ వేకారణముచేతనైనను దుఃఖించు టాతనికి సహింపరానిది. సకల దుఃఖకారములను తృణప్రాయముగా దొలగించుట కాతనికి క్షణార్ధముకూడ నవసరములేదు. దేశకాలపాత్ర భేదములతో నిమిత్తము లేకుండ, నేతాటస్థ్యము నీకు జిత్తసంక్షోభము కలిగించునో భగవానుడు దానిని జరుగకుండ జేసు

గలదు. కావున, నీభక్తి స్వచ్ఛమైనదిగా జూచికొనుము. నీకు సర్వము శుభప్రదముగా భగవానుడు జరిగించి తీరును.

861. తర్కము వలననే తర్కమునకు జ్ఞానము లభింపదని తెలియవలెను. సత్యము లేక పరమాత్మ సర్వావధుల కతీతమైనది. కావున సత్యస్వరూపమగు పరమాత్మను దెలియ గోరినయెడల, దర్కమును విడిచిపెట్టి, వేదవాక్యములను ప్రమాణముగా స్వీకరించి, యేకాగ్రచిత్తముతో దపస్సాధనచే సాధింపవలసియున్నదని గ్రహింపవలెను. అనగా దేవుని మహిమను పాండిత్యము, తర్కములచేగాక, ధ్యానానుభవ బలముచేతనే తెలిసికొనుటకు యత్నింపవలెను. శ్రుతివాక్యములలోని సత్యము ననుభవసిద్ధిచే ఋజువు చేసికొనవలెను.

862. దైవేతర విషయము లన్నిటికిని, చిన్నవైనను, నెంత పెద్దవైనను, నెరసి రాలిపోయిన వెంట్రుకమాత్రము విలువనే మన మీయవలెను; వానికొఱకు విలువైన కాలమును వ్యర్థమొనర్పరాదు. అట్లు వ్యర్థమొనర్చుటచే, భగవానుని ధ్యానింపవలయు కాలములో గొంత అమూల్యమగు కాలము వ్యర్థమైనదన్న మాట. మనజీవిత కాలమంతయు దైవేతర విషయములలో నశించుచున్నది. దానివలన రెండు నష్టములున్నవి. (1) దైవకృప నార్జించి తరించు నవకాశమును గోల్పోవుటయు, (2) లోక విషయములు దుఃఖహేతువులై, అజ్ఞానాంధకారమున గూలద్రోయుటయు జరుగును.

863. దేవునియొద్ద కేగి, చేయిచూసి ముష్టిఅడుగ వచ్చునా? కోర్కెలు చెప్పి, తీర్పుమని వేడవచ్చునా? నిష్కామముగా దేవుని ప్రార్థింపవలెనా? ఏది సరియగు భక్తి? దేవుని యాచించుటయు, యాచింపకుండుటయు రెండునొకటే. సర్వజీవులు దేవుని బిడ్డలే. వారికేమి కావలెనో సర్వమెరిగిన తండ్రి దేవుఁడై యుండఁగా నడుగ నవసరము లేకుండఁగనే బిడ్డల కవసరములగు నన్నిటినిచ్చును. బిడ్డ లమాయకు లగుటచే, ముచ్చటపడి వలసినదానిని తండ్రినడుగుటయు మిక్కిలి సహజమైనదే. దేవుఁడు దానికి దప్పుపట్టఁడు. సర్వసమర్థుఁడగుటచే నన్నియు నిచ్చును. పరమేశ్వరు నాజ్ఞలేనిదే యేదియొవనికిని లభింపదు. ఇఁక బరమేశ్వరునిగాక, యెవరియొద్ద ముష్టికేగుట?

864. దేవునడుగ కూడనివి, అడుగఁదగినవి గలవు. మన మేమడుగవలెనో, అడుగుట తప్పనిసరియో, వానినెఱుఁగవలెను. దేహధారులు దేహపోషణావసరములడిగి తీరవలెను. లేకున్న జీవించియుండఁజాలము; దుఃఖరాహిత్య మడుగవలెను. దుఃఖమిచ్చునవికోరి దుఃఖించుట వివేక మెట్లగును? అనగా జన్మజరామృతులు లేని మోక్ష మడుగవలెను. మోక్షమునకు దూరముచేయు భోగద్రవ్యముల నడుగుట తప్పగును. ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థము లడుగ వచ్చును. భగవానుఁడంతటి అప్రమేయ ప్రజ్ఞానిధి

యెదుట నిలిచి, మనమెంతో వినయ విధేయతలతోడను, భక్తి శ్రద్ధలతోను నడుగవలెను.

865. భగవానునికి సంపూర్ణాత్మార్పణము చేసి కూర్చుండు వాఁడనఁగా నెంతటి మహానీయుఁడో తెలిసికొను టవసరము. తన జీవితబాధ్యత నంతను దేవుని కొప్పగించెను గావునఁ బరిపూర్ణ చిత్తశాంతి లభించును. చిత్తశాంతి లేక ప్రసాదమనఁగా, "ప్రసాదే సర్వదుఃఖానామ్ హానిరస్యోప జాయతే." యని భగవానుఁడు గీతలో సర్వదుఃఖ వినాశమని చెప్పినాఁడు. భగవానుఁడు తన భక్తునికి వలయు నిహపర సౌకర్యము లన్నియుఁజూచి, లోపమెన్నఁడు కలుగకుండఁ జేయు ననగా నాత్మార్పణము చేసిన భక్తుఁడు పరమేశ్వరు నింట మనుగుడుపు పెండ్లికొడుకు వలెఁ జూడబడును. సర్వార్పణముచేసిన భక్తుఁడనఁగా దేవుని కంత ప్రీతి.

866. దేవుఁడు భక్తుని పనులన్నియుఁ జేయుననగా, దేవు ననంత పరిపూర్ణ కల్యాణగుణ · శక్తులన్నియు భక్తుని వగు నన్నమాటే, ద్వైతమా, అద్వైతమా? రెండు నొకటే, భేదము లన్నియుఁ దుడిచి వేయఁబడును. ఆత్మార్పణమనగా దాను దేవునితో నేకమగుట; అద్వైతమనగా రెండు లేకుండుట, రెండునొకటికాదా? ఆత్మార్పణమనగా 'నేను' విడిచి పెట్టి దేవుఁడగుటే!

867. ఈలోకమందలి సకలప్రాణి రూపములు, సకల జడపదార్థ రూపములు కృష్ణభగవానునివే. ఇన్ని రూపము

లాయన ధరించి ఆడుకొనుచున్నాఁడు. అది ఆయన ఊహా తీత క్రీడ. కృష్ణుఁడొక్కఁడే అనేకమై, అనేకములో నేక పరమాత్మయై ఏకము ననేకము తానై విశ్వలీల నడపు చున్నాఁడు. ఇది గుర్తించి, భక్తితో సంచరించుట వలన విశ్వక్రీడలో భాగస్వాములమై, సర్వదుఃఖాతీత బ్రహ్మానంద భాగస్వాములమునగుదుము. కృష్ణుని మఱువకుండు టొక్కటే వలయునది; ఏపాత్ర వహించినను భగవత్కృపచే నేదోష ములు పట్టవు; ఏ దుఃఖములు కలుగవు.

868. శ్రీరామనామ మను దివ్యస్మరణము నీ నాలుకపై జరుగుచున్నదనఁగా. విష్ణుచక్రము నీ హస్తగత మైనదన్నమాట; ఇఁక సృష్టిలో దేనికి నీవు భయపడవలెను? భయమున కొక్కటైన కారణము లేకుండఁ బోయెనే యను విచారము తప్ప మరే భయము నుండదు. రాముఁడెల్లప్పుడు సర్వత్ర వ్యాపించియున్న పరమాత్మయే. రామ నామ మును జపించుచోటఁ దానున్నట్లు సాక్ష్యమిచ్చి చూపు ననంత కృపా పరిపూర్ణుఁడే శ్రీరామచంద్ర ప్రభువు. రామనామ మను విష్ణుచక్ర మప్రతిహత శక్తి స్వరూపము. వజ్రాయు ధాదులన్నియు దానిని దాకి తుత్తునియలై పోవును; యమ భటులేమి చేయఁగలరు? రామశబ్దోచ్చారణము జరుగు చున్నచో దేనికి భయము?

869 "ఆ వీధిలోనుండు నాపెద్దమనిషి చూచుచుండ గానిట్టే పోయె"నని పలుకుచుందురు. దేహము దగాచేయు

సమయ మెవ్వరికిఁ దెలియదు. సర్వేశ్వర సేవలో నిమగ్నుఁడై జీవించు పుణ్యాత్మునికి కాల మృత్యువు రాదు. దైవ సేవా పరాయణుఁడగువాని కాయువు, నారోగ్యము, బలము, నన్నియు భగవానుఁడిచ్చి పోడిగించును; ఆయురారోగ్యము లిచ్చి, తన సేవలోఁ బరిపూర్ణునిఁజేసి, మోక్షమిచ్చును. సార్వకాలికుఁడు, కాలాధిపతి యగు భగవానుఁడు తన భక్తులగు పుణ్యపురుషులకుఁ గాలము ననుకూలముగా నియమించి, దుఃఖాపహార మొనర్చి, సర్వశుభావాప్తి నిచ్చును.

870. ప్రతి వ్యక్తికి నేదోవిధమగు ననారోగ్యము వివిధ పరిమాణములలో నుండును. లోనున్న కారణ, సూక్ష్మ దేహములు పాపసంస్కారములతో నిండియుండును. వాని వలననే స్థూలదేహ మనారోగ్య హతమగును. కొద్దియో గొప్పయో పాపములేకుండ మానవుఁడు దేహధారికాఁడు. స్థూలదేహముతో నిపుడు పాపకర్మలు చేయకున్నను, పూర్వజన్మ పాప సంస్కారములు మానసిక దేహారోగ్యములఁ జెడఁగొట్టి బాధించును. ఈమూడు దేహములు మూడు పురములు. అవి రాక్షసులతోఁ బోల్పఁబడెను; అందుచేఁ ద్రిపురాసురులనఁ బడిరి. త్రిపురాసుర సంహారి శివుఁడు. త్రిపురముల కధిష్ఠాన మజ్ఞానము. దేహత్రయమును దేవుని కర్పించిన నవి శుద్ధములగును. అజ్ఞానము నశించి, శివానుగ్రహముచే, జ్ఞానసిద్ధి, మోక్షసిద్ధియు లభించును.

871. మన మందరము సుఖమునుగోరి, దుఃఖము నిచ్చు పనులు చేయుచున్నాము. క్షీరాన్నమనుకొని, కడుగు ద్రాగుచున్నాము; స్వర్గమునకుఁ బోఁగోరి నరకమునకుఁబోవు బాట పట్టుచున్నాము; అమృత మనుకొని విషమును ద్రాగు చున్నాము; దుఃఖదూషితముకాని సుఖమెచట నున్నది? ప్రపంచమందలి ద్రవ్యములన్నియు, "సుఖమిదిగో! తీసికొనుఁడ"ని పిలిచి, మోసగించి దుఃఖమిచ్చును, ప్రపంచము, నందలి సర్వము వికారములకు లోనగును. ప్రపంచమున కనాది కారణ శక్తియగు పరమాత్మ నిర్వికారుఁడు; ఆనందము, సౌఖ్యము, అనంత శాంతి, ఆయన రూపములే. కావున సుఖము కావలసిన భగవాను నారాధించి పొందవచ్చును; మఱెచ్చటను లేదు.

872. ఒక్క సూత్రమును భక్తితో నిరంతరము పారాయణ చేసినచో సర్వదుఃఖనాశనము, సర్వశుభావ్యాప్తి కలుగును. "అంతయు నీశ్వర సంకల్పము." ఇది దశాక్షరీ మంత్రము. ప్రపంచ మీశ్వర సంకల్ప సంజాతము. ప్రపంచము లోని జీవజడస్వరూప మంతయు నీశ్వరసంకల్ప సంజాతమే. ఈశ్వర సంకల్పములో లోపము, దోషము, దుఃఖము నుండవు. దుఃఖ, లోప, దోషములు నీకుఁ గనపడుచున్నవనగా, నీదృష్టి దోషమే. దృష్టి దైవమయమైనచో సృష్టియు దైవమయమై కనపట్టును.

873. అంతా దేవుఁడే. మొదట దేవుఁ డొక్కడే యున్నాఁడు. ఆయనకు సృష్టిచేయవలెనని సంకల్ప ముద్భ వించినది. జగత్తు వచ్చెను. అనగా దేవుఁడే యేకము శాశ్వ తము నైన పరమసత్యము. రెండవ దేదియు లేదు. వేరుగా నున్నట్లు కనపట్టు సృష్టి నేపదార్థముతోఁ జేసెను? దేవునకు వేరుగా నేదియును లేదే. అనగా బ్రహ్మపదార్థమునుండియే సృష్టి జరిగెను. బ్రహ్మమునుండి జగత్తు వేరైన, బ్రహ్మము గాని పదార్థమునుండి సృష్టి జరిగియుండవలెను. అప్పుడు పరమాత్మ సృష్టిచేయుటకు తనకంటె వేరైన పదార్థముపై నాధారపడి అస్వతంత్రుఁడగును. తాను వికారము పొంది సృష్టిచేసెనన్నచో నాతని నిర్వికార లక్షణమునకు లోపము వచ్చును. అందుచే బ్రహ్మమే సృష్టిగా గోచరించు చున్నాఁడని స్పష్టము.

874. "సూక్ష్మములో మోక్షము"ని తెలుగులో సామెత గలదు. క్లిష్టమగు కార్యమును సులభముగా నెర వేర్చు నుపాయమునకే సూక్ష్మ మార్గమని పేరుపెట్టిరి. అటులే మోక్షశబ్దమునకు జన్మమృత్యువులు లేని అఖండా నంద స్థితియని అర్థము చెప్పినచో, దానికి సూక్ష్మమార్గ మున్నదాయను ప్రశ్నవచ్చును. ఉన్నదని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఇదంతయు బరమాత్మమయము, వాసు దేవుఁడే సర్వమునని వాక్కులు వినఁబడుచున్నవి. ఇది నమ్మి సాధన చేయుటే సూక్ష్మమార్గమని చెప్పవచ్చును.

875 భగవంతు నాశ్రయించియు బాధలు పోలే దనుట హాస్యాస్పదము. చక్రవర్తి యింట నన్నము లేదనుట వంటిదే, "ఎవరయ్యా! నీవు?" అను ప్రశ్నకు "దేశ పరిపాల కుఁడగు చక్రవర్తి సోదరుఁడన"ని పలికి, దారిద్ర్యదుఃఖమనుభ వించున్నానని చెప్పినచో నెవఁడు నమ్మును. నీ సార్వభౌమ బంధుత్వ మేడ్చుటకా? అటులే సర్వలోకైక సార్వభౌముఁ డగు భగవానునితో నీకు మైత్రియున్నచో, నీదుఃఖములు పోకున్నచో, నెందుకా మైత్రి? అనగా, నీమైత్రి నిజమైనచో దుఃఖ మసత్యముకాదా ?

876. సర్వ కల్యాణగుణ పరిపూర్ణుఁడే కాక, తద తీతుఁడుగూడ నగు (పూర్ణతరః) భగవానుని భక్తుఁడవై ఆశ్రితుఁడవై నీదుఃఖములు పోలేదని చెప్పుటకు నీకు సిగ్గు లేదా? ఇది యిర్వుర మధ్యమందలి సంబంధము. భక్తుఁడగు నీవు; సర్వాతీతుఁడగు భగవానుఁడు - నీదుఃఖములు పోకుండ నిలిచి, నిన్ను బాధించుచున్న వనఁగా - నీలో నేదియో లోప ముండవలెను. భగవానునిలో లోపముండు, టసంభవము. అనగా దేవునియెడ నీవెట్లు వర్తింపవలెనో తెలియులేదన్న మాట.

877. "బాగుగా సుఖముగా నున్నారా?" యని యొక వయసు మీరిన వృద్ధుని ప్రశ్నింపఁగా, "ఇఁక బాగే మున్నది? సుఖమెక్కడ? ఏదో దినములు లెక్కపెట్టుకొనుచు, బ్రతుకు చున్నాన"ని సమాధానము చెప్పెను. దినములు

లెక్క పెట్టుకొనుటకు గారణము వైరాగ్యము కాని, భక్తి జ్ఞానములుగాని కాదు. వార్ధకములో దేహపటుత్వము తగ్గి నందున వచ్చిన దౌర్బల్యముచే బలికిన మాటలవి. బుద్ధి గల మానవుఁ డేదశలో నున్నను, దినములు లెక్కపెట్టుకొని, జరామరణ రహితమగు దివ్యస్థితి నార్జించు యత్నమును తీవ్రముగా గొనసాగింపవలెను. చేతులు కాలిన వెనుక నాకులు పట్టుకొని యేమిలాభము ?

878. సదభ్యాస దురభ్యాసములు రెండును ప్రబల శక్తిగలవే, అభ్యాసము చిరకాలమునుండి చేయబడినచో దానికి దిరుగులేని బలము సంక్రమించును. పుట్టుట, పెరుగుట, గిట్టుట తత్సంబంధ దుఃఖము లనుభవించుట - వాని మధ్యమందే పిసరంతయైన సుఖము లభించు నేమో యని వెదకి, మోసపడుట, ప్రాణికోటి కంతకుఁగల దురభ్యాసము. కొంత కాలమున కిది సహజాభ్యాసమై, బాధించుచున్నను, మంచిదే యనిపించును. అట్లుగాక సత్పురుషుల గలిసి, బ్రహ్మజ్ఞాన భక్తి వాక్యముల విని, తపస్సాధనలు చేయు టభ్యసించినచో, నిది బలవత్తరమై, మోక్షమిచ్చు నందాక విడువదు.

879. మూడు విషయములు ప్రతి మానవుఁడు తెలిసి కొననఁగాని స్థిరచిత్త శాంతి లభింపదు. (1) 'నేను' అనఁగా నేమి? (2) నేనుగాని దేది? (3) నేనేమి కావలెను? (1) నేను దేహబుద్ధీంద్రియాదులు గాను. (2) మార్పు

చెందునవన్నియు నేనుగానివే. (3) నేను పరమాత్మనే అయి యుండవలెను. ఈమూడు సత్యముల రహస్యమెరిగినచో - సర్వసంకల్పసిద్ధి కలుగుటయు, వాగతీత దివ్యానందశాంతులు కలుగుటయు జరుగును. కావున (బైనఁజెప్పిన మూడు విష యములనుగూర్చి పూర్తిగాఁదెలిసికొను కృషి జరుగవలెను.

880. నాబాధలు పోనిదే, నాకీలోకములోఁగీర్తియు గౌరవములు నెందుకు? లోకులు స్తవమొనర్చినచో నాదుర్దశ పోవునా? జరారోగ మరణబాధలు మనకుఁబ్రబల శత్రువులై యేడ్పించుచున్నవి. "నీవు చాలగొప్పవాఁడవు, పండితుఁ డవు, స్తుతి పాత్రుఁడవ"ని, వేలకొలఁది జనులు పాటపాడి నచో, నా దుఃఖము పోవుటలేదే? దుఃఖనిర్మూలన కార్య క్రమమే అత్యంత ప్రధానమైనది. దుఃఖములను దైవకృపయే పోఁగొట్టును. భగవత్కృప నార్జించువఱకు, స్తోత్రపాఠకులకు దర్శన మీయకుండుటే ముఖ్యము.

881. చిత్తప్రసాదము (శాంతి) అను దివ్యప్రాసాద మును మనము నిర్మించికొని అందు నివసించుటయే దివ్యా నందప్రదము. సంసార జీవితములో సహజములై కలుగు కష్టనష్ట దుఃఖములను తుపాను లెన్ని వీచినను, ఆ భవనము చెక్కు చెదరకుండ నిలువఁగలదు. లోకములో నేమి జరిగి బాధింప నున్నను, నిత్యప్రసన్నచిత్త మను రాజభవనములో నెట్టి చలనమును గలిగింపఁజాలదు. "ఆత్మవశ్యైర్విధే యాత్మా ప్రసాద మధిగచ్ఛతి." ఆత్మవశ మగు మనస్సునకు

ప్రసాదము లభించును. సర్వమీశ్వరాయత్తమై, యీశ్వర సంకల్పమను తిరుగులేని శాసనముచే జరుగుచున్నదని గుర్తించి, యీశ్వరు నాశ్రయించి నిర్మముఁడు నిరహంకారి యునై, జ్ఞానభక్తి యోగముల నాశ్రయించు వానిదే చిత్త ప్రసాద రాజభవనము.

882. ఈలోకములో నేప్రాణి యేమి సుఖదుఃఖము లనుభవించినను దానికిఁగర్త దేవుఁడే! మనుజుఁడే కర్త యన్నచో మనుజుఁడు దుఃఖమును కోరఁడు. అజ్ఞానవశుఁడై పాపముచేసి దుఃఖ మనుభవించునని చెప్పరాదా? అజ్ఞానము నెవఁడు కల్పించెను? దేవుఁడే! ఎందుకుఁగల్పించెను? అజ్ఞాన దశలో నీప్రశ్న నిరర్థక మేలన దీనికిచ్చు సమాధానము జ్ఞానికే అర్థమగును. జ్ఞానము వచ్చిన వెనుక నీ ప్రశ్నకే అవకాశము లేదు. అజ్ఞానదశలో నడిగి లాభములేదు; జ్ఞానావస్థలో బాధయు లేదు, ప్రశ్నయును లేదు. ఇక మానవుని కొక్క మార్గమే యున్నది. పరమేశ్వరునం దచంచల విశ్వాస మార్గమే.

883. "సూర్యచంద్రులందును, అగ్నియందునుగల తేజస్సు నాదే" యని కృష్ణభగవానుఁడు గీతలోఁ బలికెను. "యదాదిత్యగతం తేజోజగద్భాసయతేఽఖిలమ్ యచ్చంద్ర మసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్." నేటి ఉదయము జపము ముగించి, తూర్పుదిశ గుమ్మములోనికి వచ్చుసరికి సూర్యభగవానుఁ డుదయించి తన దివ్యతేజస్సును విశ్వ

మంతయు వ్యాపింపఁజేసి, "అసావాదిత్యో బ్రహ్మేతి" యను వాక్యమును ఋజువు చేసెను. సకల చరాచరములు చైతన్య వంతములైనవి. భగవానుని తేజస్సుచే లోకమంతయు, ప్రకాశించినది. దానిని దర్శించు శక్తి మన నేత్రములకు, దాని మహిమను గ్రహించుశక్తి మనబుద్ధికిఁ బ్రసాదించి, విశ్వ సామ్రాజ్య పరిపాలన మొనర్చుచున్న పరమాత్మ రాజ్య ములో మనమందరము నున్నామని గ్రహించి, భక్తితో ధ్యానించి, తరింపవలెను.

884. సకలజీవుల బాధ్యతలు శ్రీకృష్ణప్రభువుచేతిలో నున్నవనియు, నంముచే నన్నిటి నాప్రభువుకే విడిచిపెట్టి, నిర్వి చారముగాఁ గూర్చుండి, అఖండ శాంత్యానందములఁ బొంద వలెనని నీవే వ్రాసి, ఆసంగతి నప్పుడప్పుడు మఱచి, నీబాధ్య తలను మరల నీపైఁ బెట్టుకొని కలఁత చెందుచుందువేల యని కృష్ణప్రభువు నావైపుజూచి చిఱునవ్వుతో నడుగుచున్న దృశ్యము గోచరించినది. "కృష్ణప్రభూ! నాకెన్నఁడట్టి మఱపు, పొరపాటును రాకుండ రక్షింపుమని, నీ దివ్య పాదారవిందము లపై శీర్షము మోపి మ్రొక్కుచున్నాన"ని జవాబు చెప్పు కొను లోపుననే, మనస్సులోఁ బ్రవేశించిన కలఁత భస్మమై, శ్రీకృష్ణ ప్రభువు చిఱునగవులో నుండి నిముసములో నా హృదయములో నానందశాంతి ప్రవాహములు వరదలై ప్రవహించినవి!

885. బ్రహ్మజ్ఞాన మనఁగా ఁదిరుగులేని బ్రహ్మాస్త్రము. దీని ప్రయోగము వలన సంసారదుఃఖ సాగరములన్నియు నింకిపోవును నశించు వస్తు వ్యామోహపర్వతములన్నియు ధూళిలోఁ గలియును. జన్మజరారోగ మరణబాధలన్నియు దూది కొండలవలె భస్మమగును. అంతే కాదు; బ్రహ్మజ్ఞాన మనఁగా సర్వ ప్రపంచహేతు భూతుఁడైన నిర్గుణ సగుణ పరమాత్మ తాదాత్మ్యము లభించును, సంకల్పమాత్రముచే సర్వలోకములను శాసింపఁగల అమోఘశక్తి నిచ్చును. అవ్యయానంద సాగరోత్తుంగ తరంగములపై నుయ్యేల నూగించును. అనంతశాంతి మయమైన అమృతానుభవ మిచ్చి రక్షించును. తత్తుల్యమైన దింకొకటి లేదు.

886. పరమేశ్వరు నెఱుఁగని ప్రాకృత మానవ జీవితము కశ్మలములోఁ సంచరించు క్రిమికీటకాదుల నికృష్ట జీవితమని చెప్పవచ్చును. అట్టి తుచ్ఛజీవితమును ప్రేమించి, కాలము గడపుచున్న మానవులు, అవ్యయానంద శాంతినిలయమైన మహాభక్తుని జీవితమనగా నేమో యెఱుఁగని దారుణ నైచ్యమున నిమగ్నులై నిరంతర దుఃఖానుభూతియే తప్పనిసరియైనదని కాలమును గడపు చున్నారు. వారు గాఢాంధకారమున జీవించుచు ఁగాంతి యున్నదని యెఱుఁగని దౌర్భాగ్యులు. పుట్టి, దేవునారాధించి, మరల ఁబుట్టరాదు. దేహమును విడిచి మరల దేహమును పొందరాదు. దుఃఖమునకు సర్వావకాశములను ధూళిలోఁ గలిపివేయు భక్తుఁడగుట వలని ఫలితము.

887. "ప్రస్తుతము మీరేయింట నున్నార"ని ప్రశ్న "మా తండ్రిగారి యింట" జవాబు. "మీ తండ్రిగారే యుద్యోగము చేసిరి?" ప్రశ్న. "మీతండ్రిగారి పేరెవరు? ఎంత ఆస్తియున్నది? ఏమిచేయు చుందురు?" ప్రశ్న. మా తండ్రిగారి పేరు పరమాత్మగారు. ఆయన ఆస్తికి బరిమితి లేదు. సృష్టి ఆయన ఆస్తిలో నొకరేణువు మాత్రమే. ఆయన యేమియుఁ జేయరు; అన్నియు నాయన సంకల్ప మాత్రముననే జరిగిపోవుచుండును. "మీ కేమిచ్చిరి?" ప్రశ్న, "అన్నియు నిచ్చిరి; తనతో సముఁడుగాఁ జూచి ఎట్టిలోటు కలుగనీయరు." జవాబు. అందరిట్లు చెప్పికొని, అది సత్యమగు వరకుఁ దపస్సు చేయవలెను.

888. "అన్నియు నాకు విడిచిపెట్టినచో నీజీవిత మెంత హాయిగా నుండునో గమనింపలేకున్నావే! నీభార్య, పుత్రులు, కోడళ్లు, తదితర బంధువులు, మిత్రులు—వీరందరు కొన్ని సమయములలో నీ మనస్సునకుఁ గలఁత గలిగించు మాటలనో, నీకుఁగష్టము కలిగించు పనులనో చేయుచుందురు. వారిలో నేనుండి నాటకమాడు చున్నానని గ్రహింపవేల? నా సంకల్పముచేతనేకదా వారును ప్రవర్తింతురు? నేను కథ నడపుచున్నానని యెరిగి, నన్నాశ్రయించి, సర్వము నాకు విడిచిపెట్టుట నెప్పుడు నేర్చికొందువు? వారియెడ రాగద్వేష ములు పెట్టుకొనుటచే నన్ను మఱచిపోవు దోషమునకు

(బాల్పడి కలఁత చెందుచున్నావు. ఇఁక నన్నెఱఁగి వర్తించుట నేర్చికొనుము.

889. పుట్టిపెరిగి, పరిణామ వశమునఁ గృశించి, నశించు దేహాదికమును, లోకవస్తువులను జూచి, వానినిఁ బట్టి భోగసుఖము లనుభవింపవలెనని యెంచి అవి మార్పులనొంది అదృశ్యములగు చుండఁగా నేడ్వ ప్రారంభించుట విచిత్ర విషయము! చెడినశించు దేహాదికమును జూచి, చెడినశించు చున్న వేయని యేడ్చుట వస్తువివేకములేని, బుద్ధిహీనుని పద్ధతి. దేహములను,భోగవస్తువులను ప్రకాశింపఁజేయునది లోనున్న ఆత్మశక్తి; అనగా దైవశక్తి, అనఁగా దేవుఁడే. దేవుని బాహ్యరూపములే దేహాదికము. మార్పులేనిది, సుఖము నెల్లప్పుడు నిచ్చునదియు నగు నాత్మ లేక దేవు నాశ్రయించి సుఖపడుమని ఉపనిషద్ఘోష. ఎంత స్పష్టమగు విషయము! ఇది తెలియక ఏడ్పు !

890. వాగతీతమైన దేవు నన్నంతప్రజ్ఞ, ప్రకృతిలోని ప్రాణికోటి అనంత వైవిధ్యమును,-పుష్పలతా వృక్షఫలాదిక మండలి అనంత వైవిధ్యమును స్థూలముగా (జూచినచో వ్యక్తమగును. ఎన్ని రకములు, రంగులు, వాసనలు, రూపములు-అనంత వైవిధ్యము-ఇఁదొక్క యాకును, పువ్వును, లతను, పండును-ఎవ్వఁడును కల్పింపలేఁడు. ఈసృష్టిలోని సౌందర్య మాభగవాను ననంత సౌందర్యములో నొక అంశ మాత్రమే యని భగవానుఁడు గీతలో (జెప్పినాఁడు. ప్రకృతిని

(జూచి, "ఆహా! ఏమి భగవానుని వర్ణనాతీత సౌందర్య సౌభాగ్యములు!" భగవానుని మహిమ నిత్యము దర్శించి, నమస్కరించి, భక్తితోఁ బూజించి తరింపవలెను.

891. తీవ్ర ముముక్షుత్వము, అనగా నిశితమైన భగవద్ధ్యానమును నిర్వహించి జన్మరాహిత్యము ననగా మోక్షమును గాంచు కోర్కెయు (గృషియు నధిక జనులకు లేకుండుటకు (గారణము, వారందరు తిరిగి పెక్కుమారులు జన్మించి, సంసారదుఃఖముల ననుభవింపవలసి యుండుటయే కారణము. కాకున్నచో సాంసారిక విషయముల సాధించుటలో, వారుచూపు దీక్ష, ఏకాగ్రతలలో నేలేశము మాత్రమో భగవద్ధ్యాన విషయములలో (జూపుటకు (గారణమేమి? అనగా నత్యధిక సంఖ్యాకులు జన్మమృత్యు దుఃఖములను బోఁగొట్టుకొనుట కిచ్ఛగింపరు. పుట్టుచు, గిట్టుచుండవలెననియే వారికోరిక. "ఇఁక నేమైన నేను జన్మింపఁగోర"నని కఠోరదీక్షతో భగవంతు నాశ్రయించి తరింపవలెను.

892. సర్వసంగ పరిత్యాగమనగా సన్యాసమని భావము. పరిత్యాగము, సన్యాసము నను పదములకు విడిచిపెట్టుట యని యర్థము. నిజముగా నన్నియు భగవానుని హస్తగతములై యున్నవి. మనదని చెప్పికొనుటకుఁగాని, మన చేతిలోఁగాని యేమియు లేనిదానిని విడిచిపెట్టుట కర్థము లేదు. సర్వ మీశ్వర హస్తగతములై యున్నవని గుర్తించి,

యీశ్వరుని పాదపద్మములపై మనస్సు లగ్నము చేసినచో నితరములపై మన మనస్సుపోదు. అదియే సన్యాసము,

893. కాలమను మహానదీ ప్రవాహములోఁబడి, మానవుఁడు కొట్టుకొని పోవుచున్నాఁడు. ఒడ్డునకు ఁజేరకుండ నెంత కాలము నీటిలో నానుచుఁ బ్రతుకఁగలఁడు? మఱియు నీటిలో ఁగ్రూర జలచరములు కొఱుకుచుండును. కొలఁది కాలములో నీటమునిగి మరణించుట తప్పదు. తీరముచేరి సుఖము పొందవలెనను కోరికయే ముముక్షుత్వము. నిరంతర భగవద్ధ్యాన పరాయణుఁడైన వాని నీశ్వరుఁ డొడ్డునకు ఁజేర్చి, రక్షించును. మనమెంత ప్రమాదకర పరిస్థితులలో నుంటిమో మొదట గుర్తించి, యావెనుక భగవద్భజనకుఁ బూనుకొని తీరము చేరవలెను.

894. ప్రయాణములోఁబుట్టి, ప్రతి నిమేషము, కాలమను బండిలో ఁబయనించుచుండినదే మానవజీవితము. రైలెక్కుట దిగుట, బస్సెక్కుట దిగుట, ఇది మానవ జీవితము. పట్టుమని పది నిముషముల పాటొకచో నిలిచి, సుఖముగాఁ గూర్చుండి సంతసించు నవకాశము లేదే. కాలమను బండి ఆగదు. దానికి సాయము ప్రయాణములో ననగా ఁగాలమను బండిలో ఁబెండ్లి, పిల్లలు, ఉద్యోగములు, భోగములు, వైరములు, రోగములు, వగైరా! మన స్వగృహము, ప్రయాణము లేనిది, సర్వసుఖముల నిచ్చి ఆనందింపఁ జేయునది, దేవుఁడను గృహమే! ఆ గృహముచేరి సుఖించు నాలోచన, కృషి చేయుటెప్పుడు ?

895. సమానత్వము లేక సమత్వమనున దెచట నున్నది? ఆత్మ లేక పరమాత్మ సర్వజీవులలో, జడములలో నేకము నద్వితీయమునై, సమానముగా నున్నదని ఉపనిషత్తులు పలుకుచున్నవి. నామరూపములుగల ప్రకృతి ప్రపంచములో ననేకత్వము లేక భిన్నత్వము ప్రదర్శింపఁబడియున్నది. నామ రూపముల భేదమును తుడిచి పెట్టుమని స్వార్థపరులగు రాజకీయవేత్తలు పలుకుచుందురు. దేవుఁడు నానాత్వములోఁ బ్రకృతిని సృజించినాఁడు. భేదములు తప్పవు. బాహ్యదృష్టికి భేదములు, అంతరంగిక దృష్టి కేకత్వము తప్పవు. ఆంతరంగిక దృష్టి గలవారు జ్ఞానులు, మహాభక్తులు, యోగులు కొలఁదిమంది మాత్రమే యుందురు. అత్యధిక సంఖ్యాకులు సమానత్వమునుగాక నానాత్వము, భిన్నత్వము గలిగిన దృష్టిగలవారే. మనుజులలో రూపములు భిన్నములు, మానసిక శక్తులు భిన్నములు, ఆకలి దప్పులు భిన్నములు; విభిన్న పరిణామ దశలలో నుండు విభేదము లుపన్యాసములచేఁ బోవునా? ఆత్మదృష్టి కంతయు నేకపరమాత్మే. అజ్ఞాన ప్రపంచమున భేదములు శాసనములచేఁ బోవు.

896. సమత్వ మెచట నున్నది? భావములలో, నేకత్వము లేదు. మానవులు పుట్టిన దేశకాలములను బట్టియు, జననీ జనకుల ననుసరించియు, సమాజ సంప్రదాయములను బట్టియు, భిన్నత తప్పదు. పరిణామము ననుసరించి, వ్యక్తి లక్షణములు మారుచుండును. బంగారు పాత్రలు, వెండి

పాత్రలు, కంచుపాత్రలు, మట్టిపాత్రలు సమానములా? భిన్నతను గుర్తించి, వ్యక్తుల కనుగుణమైన రీతి నన్నిటిని సమకూర్చుట వివేకము. ప్రేమ అందరియెడ సమానముగా నుండవచ్చును. గాని, అందరకు సమాన సౌకర్యములు నిరర్థకము లగును. భిన్న మానసిక పరిణామ దశాంతర్గతశల ననుసరించి, భిన్న సదుపాయములు సమకూర్చుట వివేకము. ఆంతరంగికాత్మ సమత్వమును బహిరంగ విభిన్నదశల కంటగట్టరాదు.

897. సమత్వమనఁగా నాంతరంగిక సమదృష్టి. అనగా రాగద్వేషరహితమైన పరిశుద్ధ హృదయము. అందరిలో భగవదంశను దర్శించి, పరిణామ భిన్నతను గుర్తించి, తదనుగుణమైన సేవల నందిచ్చి ఉద్ధరింపవలెను. తద్దినమునకు వివాహమునకు నొకే మంత్రమా? పచ్చిమాంసమును దినువానికి ఫలాహారికి నొకటే విస్తరియా? చుట్టకాల్చుచు పొలమున్నవానికి, నదీస్నాన శుద్ధుఁడై, వేదము వల్లించువానికి నొకే చదువా? మందబుద్ధికి, నిశిత కుశాగ్ర బుద్ధికి నొకే స్థానమా? స్త్రీలకు పురుషులకు నొకేరకము చీరలా? భిన్నత వ్యావహారిక ప్రపంచము; ఏకత్వము సమత్వము ఆధ్యాత్మిక ప్రపంచము, రెండును కలిపివేయుట—అవివేకుల కార్యక్రమము.

898. లెక్కతెలియని జన్మముల నుండి మనతో వచ్చిన దేహాభిమాన, భోగకాంక్షా సంస్కారములు, అహంకార మమకారములు, మన చిత్తములో పాతాళము వఱకు

బొాతుకొని పోయియున్నవి. వానిని సమూలముగా బీకివేసి, భగవద్భక్తి సంస్కారమును వాని స్థానమున నిలిపి, దృఢ మొనర్చుకొను కార్యము సులభమైనది కాదు. సజ్జన సాంగత్యము, సద్గ్రంథపఠన పారాయణములు, ఏకాంతమున నాత్మ పరిశీలనము. జపధ్యానదీక్ష గలుగు సందర్భములలో దుష్ట సంస్కారములు తొలగినట్లు కనిపించును గాని, అవి అంత సులభముగా విడిచిపెట్టవు; సమయము కనిపెట్టి పగబట్టిన పామువలె గాటువేయును. దీనిలో నొక రహస్యమున్నది. పరమేశ్వర కృపచే బరమేశ్వరారాధన కాంక్ష జనించును. పరమేశ్వర కృపచే దుష్టసంస్కారములు నశించును. పరమేశ్వర కృపచే ధ్యానజపాదికము నిర్విఘ్నముగా నడచును. అందుచే బరమేశ్వరు నర్చించు యత్నము సర్వకాలములందు జేయుచుండ వలెను.

899. కుటుంబ మందువలెనే, సమాజ మందును, లోకమందును, నెన్నియో మనస్సును చికాకు పఱచు సంఘటనలు జరుగుచుండును. వానిని గమనింపక తప్పదు కాని, అన్నిటికంటె ముఖ్యమైనదేదో తెలిసికొనవలెను. తెలిసికొని, దానిని సాధించుటకు మనశక్తి యుక్తుల నన్నిటి నుపయోగించి కొనవలెను. అన్నిటికంటె ముఖ్యమైనది, మన అస్థిరత్వము, మన కేగడియలో మృతి సంభవించునో తెలియదు, దాని నటుంచి, తక్కిన అముఖ్యవిషయములలో మనము కాలమును గడపివేయుట వలన దుడిలేని జనన మరణప్రవా

పది నిముసములలో మేఘము లదృశ్యములై, వర్షమున కవకాశము లేకుండ ( బోయినది. క్షీరాబ్ధిపూజ సక్రమముగా సంతృప్తికరముగా జరిగినది. ఇంతకంటె భగవాను నతి వేగముతో (గూడిన కృపకు సాక్ష్యమెచట లభించును.

902. మనకుఁగట్టి బిగింపఁబడిన యినుపగొలుసులను సముచితోపాయములచే (దొలగించు కొనుటే మోక్షము. అవియే సంసారబంధములు. వానిని సులభముగా (ద్రెంపుటకు దారపు ముక్కలు గావు. మన చేతులకుఁగూడ గొలుసులు బిగింపఁబడి యుండుటచే, వానిని విప్పుకొనుట కవకాశము లేదు. బంధములు లేని స్వేచ్ఛగలవాఁడు (గురువు) వచ్చి గొలుసుల నూడఁదీయ వచ్చును. లేదా, భగవంతు నారాధించినచో భగవత్కృప వలన నవితొలఁగి పోవచ్చును. బంధములున్నవని, వానిని (దొలగించి కొనవలెనని తెలిసినచో, బంధవిచ్ఛేదన కార్యక్రమము చేఁబట్టవలెను.

903. మల విసర్జనముచేసి ముడ్డి కడిగికొను టెవరి కుపకారము చేసినట్లగును? శరీర కశ్మలము పోవునట్లు తలంటుకొనుట లోకసేవ యగునా? దంతధావనము, నిత్యస్నానము, మున్నగు పనులు చేసికొనని మూర్ఖుఁడు పశుతుల్యుఁడగును; తనబాగు తానెఱుఁగని అజ్ఞుఁడు. అదేరీతిగా, అజ్ఞాన నివృత్తికై దేవు నాశ్రయించి ప్రార్థించుట, జపధ్యానాదికముచేసి చిత్త శుద్ధి నార్జించుట, ప్రతివ్యక్తియు (దనకుఁదాను జేసికొనవలసిన నిత్యకృత్యమే. నేను భగవంతుని పూజించు భక్తుఁడ నని

పది నిముసములలో మేఘము లదృశ్యములై, వర్షమున కవకాశము లేకుండ (బోయినది. క్షీరాబ్ధిపూజ సక్రమముగా సంతృప్తికరముగా జరిగినది. ఇంతకంటె భగవాను నతివేగముతో (గూడిన కృపకు సాక్ష్యమెచట లభించును.

902. మనకు(గట్టి బిగింప(బడిన యినుపగొలుసులను సముచితోపాయములచే (దొలగించు కొనుటే మోక్షము. అవియే సంసారబంధములు. వానిని సులభముగా (ద్రెంపుటకు దారపు ముక్కలు గావు. మన చేతులకు(గూడ గొలుసులు బిగింప(బడి యుండుటచే, వానిని విప్పుకొనుట కవకాశము లేదు. బంధములు లేని స్వేచ్ఛగలవా(డు (గురువు) వచ్చి గొలుసుల నూడ(దీయ వచ్చును. లేదా, భగవంతు నారాధించినచో భగవత్కృప వలన నవితొల(గి పోవచ్చును. బంధములున్నవని, వానిని (దొలగించి కొనవలెనని తెలిసినచో, బంధవిచ్ఛేదన కార్యక్రమము చే(బట్టవలెను.

903. మల విసర్జనముచేసి ముడ్డి కడిగికొను టెవరికుపకారము చేసినట్లగును? శరీర కశ్మలము పోవునట్లు తలంటుకొనుట లోకసేవ యగునా? దంతధావనము, నిత్యస్నానము, మున్నగు పనులు చేసికొనని మూర్ఖు(డు పశుతుల్యు(డగును; తనబాగు తానెఱు(గని అజ్ఞు(డు. అదేరీతిగా, అజ్ఞాన నివృత్తికై దేవు నాశ్రయించి ప్రార్థించుట, జపధ్యానాదికముచేసి చిత్తశుద్ధి నార్జించుట, ప్రతివ్యక్తియు (దనకు(దాను జేసికొనవలసిన నిత్యకృత్యమే. నేను భగవంతుని పూజించు భక్తు(డ నని

చెప్పికొనుట, నేను ముడ్డి కడుగుకొను చున్నానని చాటించు కొను దురహంకార దూషితుఁడే. ఆత్మోద్ధరణము, దైవికముగా లోకోపకార మగుననియుఁ జెప్పవచ్చును. కాని యది గర్వకారణము కారాదు.

904. ఒంటినిండ (బుట్టెడు రోగము పెట్టుకొని, మందు పుచ్చుకొనకుండ (గాలము గడపు మానవుఁడు మందు కొనలేని దరిద్రుఁడై యుండవలెను, బుద్ధిహీనుఁడైన నై యుండవలెను. జన్మజరా రోగమృత్యు దోషము లను జబ్బులు లేనివాఁడెవఁడు? వానికి మందు పుచ్చుకొనవలదా? ఈ మందుకు ధనమక్కర లేదు. దరిద్రుఁడు, బుద్ధిహీనుఁడు కూడ (దీసికొన వచ్చును. "ఔషధమ్ జాహ్నవీతోయమ్ వైద్యోనారాయణోహరిః" హరిస్మరణము చేయుటకు ధనముతో నిమిత్తము లేదు. హరిస్మరణమే గంగోదకము. ఉదకమంతా గంగోదకమే అది పరమాత్మనుండి వచ్చినదే. "ఓమ్ కేశవాయస్వాహా! నారాయణాయస్వాహా" యని ఉదకము పుచ్చుకొనిన సర్వరోగములు పోవును. జబ్బుముదిరి చాలకాలమైనది. త్వరపడి మందు తిని మోక్షారోగ్యము నార్జింపుఁడు.

905. హిందూ ధర్మము ననుసరించి, ద్విజులు, గాయత్రీ మంత్రమును జపించి ఉదకము చల్లి పంచప్రాణములకు, మూలశక్తి యగు పరమాత్మకు నాహుతులిచ్చితి నేడు అన్నము, "అమృతమస్తు; అమృతో పస్తరణ మసి." యనుటచే నమృతమగుచున్నది. అన్నము తినుటచే బలము రావ

చ్చును గాని, అమృతము తినినచో సర్వదోష పరిహారక మగును. పరమాత్మ కరిపించిన అమృత ప్రసాదమును దినుచున్నాము. త్రిదేహామలములు నశించి పూర్ణశుద్ధిచే బ్రహ్మ జ్ఞానసిద్ధి కలిగి తరింపవచ్చును. అట్టి పద్ధతిని విస్మరించు ద్విజులు దండనార్హులు.

906. ఈశ్వరసంకల్పము చేతనే మనము ప్రతి నిమేషము బ్రతుకగలుగు చున్నాము. ఇది మనము సరిగాఁ దెలిసికొన్నచో మనలోనే భగవానుఁడు మనకు గోచరించును. మఱియుఁ గ్రమముగాఁ గొంతకాలమునకు దేవునికి మనకు భేదములేదనియు బోధపడును. మనగుండె కొట్టుకొనుట, రక్తము ప్రసరించుట, పంచప్రాణములు తమ కర్తవ్యముల నెరవేర్చు చుండుటయు దేహావయవము లన్నియుఁ బని చేయుటయు లోనున్న ఆత్మశక్తి ప్రదర్శనమే. మనస్సు, బుద్ధి తెలిసికొను పని దేవుని శక్తియే. మన ప్రతి క్షణ జీవిత చలనము, పరమేశ్వర సంకల్ప శక్తియే; మఱొక శక్తియేదియును లేదని తెలిసికొన్నచో, సర్వప్రాణులలోఁ బరమాత్మశక్తి సర్వము చేయుచున్నదనియు, నేను, నీవు భేదములు మన అజ్ఞాన జన్యములనియు బోధపడును.

907. మనదేశ ప్రధానియో, అధ్యక్షుఁడో మన యింటికి వచ్చుచున్న యెడల, మన గృహమునే కాక, మన ముందు పట్టణమంతయుఁ బ్రజలే శుభ్రమొనర్చి, అలంకరించి, మంగళవాద్యములతో నాహ్వానింతుము. మనము జ్ఞాన చక్షువులు తెఱచి చూచినచో, సర్వ జగత్ప్రధానియు సర్వాధి

పతియునగు పరమాత్మ నిత్యము మనతో, మనలో, సర్వత్ర సాక్షిరూపములో సంచరించుచునే యున్నాఁడు. మన మా పరమాత్మను గుర్తించుట లేదు; పట్టించుకొనుట లేదు; లేనట్లుగా వ్యవహరించు చున్నాము.

908 మాటకు నిలఁబడు మానవుఁడు మహిలో లేఁడు. ఒకమాట నిచ్చుట, దానిని మఱచుటయో తృణీకరించుటయో, సామాన్యముగా జరుగుచుండును. మాటలో మాధవుఁ డున్నాఁడని గుర్తింపవలెను. సత్యమనఁగా మాధవుఁడే. పలికినమాట ననుసరించి వర్తించినచో మాధవుఁడు హర్షించి, రక్షించును. తొందరగా మాటయిచ్చి, దానిని విస్మరించు టెందులకు? నూటికి తొంబది మందికి మాటాడుట చేతకాదు. అనాలోచితముగా, మాటాడుదురు; మాటలో దేవుని జూచుట నేర్వవలెను. ఒకమాట పలికి దాని ననుసరించి వర్తింపవలెను. ఈయొక్క సాధనముచే ముక్తి లభించును. ఆలోచించి మాటాడుట; మాట ననుసరించి వర్తించుట పరమేశ్వరారాధనమే.

909. "కామక్రోధాదికమును నిగ్రహించుశక్తి నాకు లేదు. ఎంతటి వారినైనను లోఁగొను శక్తినిచ్చి వానిని నీవు సృజించితివి. నేననేక జన్మముల దేహసంపర్క దేహాభిమానములచే గామాదిక వ్యామోహములకు వశుఁడనై యున్న నేను వానినెట్లు జయింపగలను? నిన్ను నమ్మి స్మరణ కీర్తన ధ్యానాదికము చేయు బుద్ధి నీకృపచేతనే కలిగినది. కామక్రోధాదికము తప్పుదారి పట్టింపకుండ నీవు కృపజూపి,

రక్షింపవలెను. నేను స్వయముగా నేశక్తియు లేనివాఁడ నగుటచే, నీపై నాధారపడి తరింపఁగోరు నన్ననుగ్రహింపు మ"ని భగవానుని ప్రార్థింపవలెను.

910. పగలు, రాత్రియు నాయుర్దాయమును హరించుచున్నవి. సూర్యుఁ డుదయించి వెలుతురు వచ్చినదని సంతసించి సాంసారిక కృత్యములలోఁ బడి తిరుగు చున్నాము. రాత్రియైనదని హాయిగా ఁబరుండి నిద్రించు చున్నాము. అసలు విషయము మరచుచున్నాము. అసలు విషయము మరణకాలము సమీపించుచున్నది కదా! మరలఁ జావకుండఁ బుట్టకుండ నుపాయము చూచుకొను బుద్ధి పుట్టదే! ఎన్నిమారు లీచావు! బుద్ధియుఁ బౌరుషముగలవాఁ డొకసారే చావవలయును! ఎన్నిమారులు చచ్చితివో లెక్కపెట్టఁగలవా? మృత్యువు నోటిలోనుండి యింకా భోగములా? పరమేశ్వరు నాశ్రయించి, జనన మరణములు లేకుండఁజేసికొనరాదా ?

911. "చావు పుట్టుకలు, రోగములు, కామక్రోధములు దుఃఖములు నేను బెట్టిన మాట నిజమే. అవి మిమ్ము బాధింపకుండ నుండుట కతిసులభమైన ఉపాయమునుగూడఁ జెప్పియున్నాను. ఈ యుపాయమును గమనించి ఆచరించుటలో నెట్టి కష్టమును లేకుండ, అత్యంత సులభమొనర్చి చూపితిని. ఆ యుపాయమున న్నేక్షణమందును మఱువకుండ నుండుటే. ఇందేమి క్లేశమున్నదని మీరు

నన్ను గుర్తులో నుంచికొనకుండ సంచరించుచున్నారు? మీకున్న సకలదుఃఖ పరిహారమగునే; సకల శుభసుఖములు లభించునే. ఇది నేఁజేయుదునని మాటయిచ్చి యుంటినే. నమ్మరా! తప్పునాదా మీదా?" భగవానుని మాటలు!

912. కాల మను మహాప్రవాహములోఁబడి కొట్టుకొని పోవుచు, మునుగుచు దేలుచు ప్రాణహానికి బెదురుచు, సుఖాపేక్షతో సుఖమెచట లభించునో తెలియక, పెండ్లాడి పిల్లలను గనుట, ధనగృహాది సంపాదన తాపత్రయములో, రాగద్వేష వైరములకు గురియై ప్రాణికోటి రోదనము చేయుచున్నది. అందుచే నేకొంపలోఁజూచినను వివిధకారణములచే, వివిధ విధముల రోదనములే వినఁబడుచున్నవి. ఈకాల ప్రవాహమునుండి బయటపడి, స్థిమితముగా గూర్చుండి, దుఃఖపరిహారమును సుఖావాప్తి నిచ్చు పరమేశ్వరారాధన తత్పరుఁడవై, శాంతిగన యత్నింపవా ?

913. ఇష్టములు రెండు రకములు; మనకిష్టమైనవి; దేవుని కిష్టమైనవి. మనకిష్టమైనవి దేవుని కిష్టముకాక పోవచ్చును. దేవుని కిష్టమైనవి మనకిష్టమైనవై తీరవలెను మార్గాంతరము లేదు. మనము చపల చిత్తులము; అజ్ఞానులము, తాత్కాలిక సుఖలేశములకై అఱ్ఱులుసాచు నల్పులము. మరియు నేది నిజముగా సుఖప్రదమో యేది దుఃఖప్రదమో తెలియని వారము. భగవంతుని కిష్టమైన వేవో అనుభవజ్ఞుల వలనఁ దెలిసికొని, వానిని మనకిష్టము లొనర్చి

కొని, సంపాదించికొనవలెను. ఇంద్రియ నిగ్రహము, ధర్మ తత్పరత, భగవద్విశ్వాస జపధ్యానాదికము భగవంతుని కిష్ట మైనవే కాక, భగవత్కృపామృతము నిచ్చి, జననమరణ ప్రవాహమునుండి తప్పించి రక్షించునవని యెఱుఁగవలెను.

914. భగవద్ధ్యానము, భగవత్సాక్షాత్కార మగు వఱకుఁ జేయుట ముఖ్యము. అభ్యాస బలముచే ధ్యాననిష్ఠ కుదురును. దేహమును ధరించుట, దానితోఁగల సంసార కార్యక్రమములు నెరవేర్చుట మనకనేక కోటి జన్మముల నుండి అభ్యాస బలముచేతనే సంక్రమించినవి, ధ్యాన జపాది కము నలవరచుకొని, అభ్యాసమును విడువకుండఁ జేయుచో, దానికిని బలము కలుగును. ధ్యాన జపాదికము ప్రతిదినమొక నిశ్చితకాలమందు మార్పులేకుండ జరిగించు దీక్ష వెంపొంది నచో, దాని మహిమ వ్యక్తమై యెన్నఁడెన్ని కష్టములు సంభ వించినను విడువఁజాలఁడు. వ్యర్థ దుఃఖప్రద సాంసారిక కార్య క్రమాభ్యాస బలము క్షీణించి, తుదకు నశించును.

9.5. భగవద్ధ్యానము చేయుట సాటిలేని మహాదీక్ష. ఈదీక్షవలన సాంసారిక క్రియాకలాపము లేవియు నీయఁజాలని సత్ఫలితములు లభించును. ధ్యానజపాదిక మిహపరసుఖముల నన్నిటి నిచ్చును. భగవంతునిపై ధ్యానమనగా, దుఃఖాగ్ని నార్పివేయు దివ్యామృతధారావాహినిలో స్నానమాడుటయే. ధ్యానము వలనఁ బరమాత్మతో సన్నిహిత సంబంధము, సంపర్కము. నావెనుక, నేకత్వము సిద్ధించును. దాని ఫలి

తము పరమాత్మ లక్షణములైన అవ్యయానంత శాంత్యా నంద బలములు సంక్రమించి, తరింతుము.

916. ఏ సమయమున కేమి తటస్థించునో తెలియ కుండుట దీలోక లక్షణము. కాని యేక్షణమునను మనము కోరినదే జరుగునట్లు చేయుశక్తి మనకు లేదు. అందుచే మనల బాధించు విషయములు తటస్థించు క్షణములలో మనము దుఃఖతప్తులము కాక తప్పదు. అన్ని క్షణములు, అన్ని శక్తులు చేతఁగలవాఁడు పరమేశ్వరుఁ డొక్కఁడే. కావున నన్నిక్షణములలో నొకదానిని విడిచిపెట్టకుండ, భగ వానుని పాదపద్మము లాశ్రయించి నిలిచినచో నన్నిసమయ ములు మన కనుకూలములగును. ఇట్టి సదుపాయముగల మానవులు, దాని నుపయోగించికొని, సుఖింపరేల ?

917. మనకు భగవానుఁడిచ్చినది, ఈయనిది రెండును మంచివే. ఇచ్చినది మనకానందము నిచ్చును. ఈయనిదియు మన కానందహేతు వేయని వెంటనే కాకున్నను తరువాత నైనను బోధపడును. ఇందొక నియమమున్నది. మనము సంపూర్ణముగా భగవానుని పాదపద్మముల కాత్మార్పణము చేసి, ఆదీక్ష చలింపకుండ నిలఁబెట్టుకొనవలెను. అట్టి నిశ్చల దీక్షతో మనము భక్తులమై జీవించుచో దేవుఁడేమి చేసినను మనకానంద శాంతులేకాక, జ్ఞానమోక్ష సిద్ధులును కలుగును. మనము మన జీవితసర్వస్వమును నశించు వస్తువుల కీయక, దేవుని కిచ్చుట నేర్వవలెను.

918. శరీరము మనకు గలుగఁజేయు నసంఖ్యాకము లైన రోగాదిక క్లేశము లనుభవించుట చాలకష్టము. కామము నెవ్వఁడును జయింపలేఁడు. కామోపభోగముల కలవడితిమా, తుద మొదలులేని చికాకులు కలిగించి, వేధించును. అందుచే శరీరముతోఁ బొత్తు విషసర్పముతోఁ జెలగాటము వంటిదే. నాదేహమే యని మమకారము చూపితిమా, కాటువేసి తీరును. దేహము మన కపకారము చేయకుండ, దానివలన బాధలు మనకు లేకుండ, వాడుకొను నేర్పు సామాన్య విషయము గాదు. దేహముతో దేవు నారాధించి దైవకృప నార్జించినఁదప్ప, మనకది చెప్పలేనన్ని దుఃఖములిచ్చి తీరును. దేహముతో దైవకృపను సంపాదించు నాతఁడే బుద్ధిమంతుఁడు.

919. మనమనేక వస్తువులను వాడుకొనుచున్నాము. ఒక్కటే లోపము జరుగుచున్నది. వస్తువుల విలువలను సరిగా దెలిసికొని మఱియు వాడుకొనుట వలన, మనల నవి మోసగింపవు. మనము వాడుకొను నన్ని వస్తువులలో దేహముకంటె ముఖ్యవస్తు వింకొకటి లేదు. దేహము విలువను సరిగా గుర్తింపకుండ వాడుకొనుట వలన, ననుకొనని మోసములకు గురియై, దుఃఖమగ్నుల మగుచున్నాము. మనము దేహములను సరిగా వాడుకొన్నచో నీశ్వరదర్శన మగును. ప్రతి దేహములో దేవుఁడున్నాఁడు; దేహమే దేవాలయము. అందుచే దేహము, దేవుని జూపిపోవలెను; దేహ

మెట్లును పోకతప్పదు. పోవులోపున దేవుని దర్శనమిచ్చి పోవు మహాభాగ్యము పట్టుటెంత పుణ్యమో!

920. జీవుఁడు దేవుఁడు సమష్టిగా ఁగాపురము చేయు నిల్లే దేహము. ఈదేహ మనునింటిలో హృదయ మను గుహలో సూక్ష్మరూపమున ఁబరమాత్మ నివసించియున్నాఁడు పరమాత్మయే జీవరూపమున దేహమంతయు వ్యాపించి, కాపురము చేయుచున్నాఁడు. జీవుని కీయింటఁ గావలసిన సదుపాయము లన్నియు నద్భుతముగా ఁజేయఁబడినవి. ఇందు నవద్వారములు; వంటయిల్లు గర్భకోశము; మలమూత్ర స్థానములు, స్త్రీలకు శిశుకోశము, వాయువు స్వేచ్ఛగా లోనికి వచ్చు నూపిరితిత్తు లను కిటికీలు, రక్తప్రసరణమునకు నాళములు (కాలువలు), కాలముతెలుపు గడియారము గుండెకాయ, దంతము లను కత్తిపీటలు, రుచులు తెలుపు నాలుక, వాసనలు తెలుపు నాసిక, మున్నగున వన్నియు నున్నవి. ఒక్కటే లోపము! జీవుఁ డీయిల్లు పరమాత్మ స్వంతమనియు, ఁదానం దద్దె కున్నాఁడనియు నెప్పుడో లేచి పోవలెననియు ఁదెలియక ఇల్లు నాదేయను చున్నాఁడు! గెంటివేయఁ బడు చున్నాఁడు!

921. ఇంటి యజమానిని గుర్తింపక, కట్టవలసిన అద్దె సొమ్ముకట్టక, యెన్నాళ్లు పరగృహములో నుండఁగలవు? మఱియు స్వగృహ మేనాటికైనను సంపాదించి కొనవలదా? మర్యాద చూపినను పరగృహము పరగృహమే కదా! నీదేహ

మను గృహమున కధిపతి, నీ హృదయ మందిరమున నివ సించుచు, గృహమునకు వలయు సౌకర్యము లన్నియుఁగూర్చు చుండు యజమాని సాక్షాత్పరమేశ్వరుఁడే. ఆయన యింట నున్నందుకు నీవు కట్టవలసిన పన్ను భక్తితోఁ బరమేశ్వ రారాధనమే. ఆయనను సరిగాఁ బూజించినచో నీకు స్వగృహ ప్రాప్తియగును. నీ స్వగృహము భగవానుఁడే. ఆయనను నిర్మల చిత్తముతోఁ బూజించి, సంతోషింపఁ జేయుచో, దనలో నైక్యమునిచ్చి ధన్యునిఁజేయును.

922. మాయ యనగా నర్థము నొకసందర్భములోఁ జూడవచ్చును. ప్రతి వ్యక్తియు సాధారణముగాఁ దానిచట స్థిరమే యని తలచి, వస్తు సంపాదనకై కృషినారంభించి జీవి తాంతము వఱకు నందే నిమగ్నుఁడై యుండును. ధనము, గృహము, తదితర వస్తువాహనాదికము, మఱియు దన సన్ని హితులగు భార్యాపుత్రాదుల కొఱకు దాపత్రయము, - విసుగు, విరతి లేకుండ నుండును. ఈ కృషిలో నపజయావ మానములు కలుగకుండ నుండవలెనని అప్పుడప్పుడు వ్రత ములు, పూజలు చేయుచుండును. సకల దుఃఖ నివారణాత్మక మైన మోక్షమును గోరఁడు. మరణవేళ సమీపించుచున్నను, తన కుటుంబము, గృహధనాదికములను గూర్చియే కార్య క్రమములలోఁ దగుల్కొని జీవించును. అసలు విషయమేమని ప్రశ్నింపఁడు. తానెన్నఁడిచటకు మరల రాఁడే! బ్రహ్మ

జ్ఞానము తన్ను రక్షింపఁగల దివ్యశక్తియని తెలియవలదా? తెలిసికొనఁ గోరఁడు. ఇదియే మాయ.

923. దోషములు కొన్నిపోయి, కొన్ని మిగిలిననేమి లాభము? ఒక్క దోషము మిగిలినను బాధించుటకుఁజాలును. సర్వదోషములు, మిగులు లేకుండ, సమూలముగా నాశనమైనప్పుడుగాని మనకు దుఃఖసమ్మిశ్రితముగాని సుఖము లభింపదు. అందుకు మనకు సర్వవిషయములఁ గూర్చిన దోషములు తెలియవలెను; అనగా సర్వతోముఖ సంపూర్ణజ్ఞానము కావలెను. అదియుఁజాలదు; దుఃఖలేశము లేకుండఁ జేసికొను నుపాయము, సాధనయుఁ గావలెను. అనగా, సంపూర్ణజ్ఞానము, సర్వదోష పరిహారసాధనము; దానిని జీవితములోఁజొప్పించు వజ్రసంకల్పము, విజయము సాధించుటయు మనకుఁగావలెను. భక్తి, జ్ఞానములతో భగవత్త్వము నెఱిగి, భగవత్కృప నార్జించు కఠోర దీక్షను కొనసాగించుటయు విజయము గాంచుటయు మనకు వలయునవి.

924. సృష్టి, సృష్టికర్త నెరిగించుటకే యేర్పడినది. మన భోగానుభవము కొఱకేర్పడిన దనుట, మన బుద్ధి మాంద్యమును ప్రదర్శించుటేగాక, సృష్టి కర్తయగు పరమాత్మ. అవివేకి యని నిందించుటే యగును. (1) మన భోగానుభవము కొఱకుఁ బ్రపంచమందలి వస్తువులు చేయఁబడలేదు. ఏలన నవి వికారములకు లోనై చికాకులు కలుగఁ జేయును, ముఖ్యవస్తువులలో దేహము ప్రధానము (2) సృష్టి

కర్తయగు పరమాత్మ నిందయగు నెట్లనఁగా, మన భోగసుఖ మునకై దేహాదికమును కల్పించినచో లోపములు కుప్పలు తిప్పలుగాఁబెట్టి, అనుభవింపుఁడని మనల నాహ్వానించినాఁ డని తలచినచో భగవానునికి మోసగించు స్వభావ మున్న దనుటే యగును. అందుచే లోపములు దోషములు గమ నించి అవిలేని పరమానందస్థితి నిమ్మని, దానికొఱకు దేవు నారాధింపుమనియే భావము.

925. మానవజన్మమెత్తి, దుఃఖముపోవుటకు, స్థిర సౌఖ్యము లభించుటకు నేమిచేయవలెనో తెలిసికొని, చేయుటే వేదాంత రహస్యము. మానవుఁడై పుట్టి, దేవుఁడగుటే చేయవలసిన పని. తక్కిన దంతయు ఁదగుల ఁబెట్టుటకు మాత్రమే పనికి వచ్చు చెత్త. "ఇల్లు, ధనము, పొలము సంపాదించినాను. బిడ్డలను కంటిని; పేరు ప్రతిష్ఠలు తెచ్చి కొన్నా"నని చెప్పినచో, ఆహా! యేమి అదృష్టవంతుఁడండీ!" అని జనులు పలుకుచుందురు. ఒకటి యాలోచింపరు. కర్త లేని సుఖమెప్పుడైనా కలిగినదా? ఈగృహ ధనాదికమును విడిచిపెట్టి, దేహమును దహనమున కిచ్చిపోవుట తప్పదు కదా! అయినచో నిది సుఖమని పలుకుదు వేల? పాలు కావ లెను; విషముతోఁ గలిసినవికావు; పంచదారతోఁ గలిసిన స్వచ్ఛమైన పాలు - అనగా దుఃఖసమ్మిశ్రితముగాని, స్వచ్ఛ మగు నిత్యానందశాంతి సమృద్ధి కావలెను. అది సాధించు మానవుఁడు దేవుఁడగును.

926. "వార్ధకేమునివృత్తీనామ్, యోగేనాంతేత నుత్యజామ్." కాళిదాసు. "వార్ధకమున మునివృత్తి; దేహమును త్యజించులోపున యోగసిద్ధి" ఇదియే సనాతన భారత తత్త్వము. వార్ధకము మునివృత్తిచే బావనమైనది కావలెను; మునివృత్తి యనఁగా సారాంశము భగవంతునియందు మనస్సును లగ్నము చేయుటే. వార్ధకదశ నంటిపెట్టుకొనియుండు నీరసము, రోగము, వెఱ్ఱివాంఛలు, చెల్లని అధికారములు, అమిత దుఃఖదాయకములు. అందుకే భారత ధర్మము, విద్యార్థిదశలో వేదవేదాంతములు చెప్పి, గార్హస్థ్యములోఁ దదనుగుణ కర్మానుష్ఠానము చేయించి, వార్ధకదశకు భగవంతునిపై దృష్టి కేంద్రీకరించుట నేర్పి; మరణదశలో నీశ్వరైక్యము సాధించి దేహము విడుచుట కార్యక్రమమును బెట్టిరి. వార్ధకమరణావస్థలు దుఃఖహేతువులు కాకుండ, భక్తిజ్ఞానధ్యానములచేఁ బవిత్రములై ముక్తిని సాధించు భారత ధర్మమెంత గొప్పదో!

927. భక్తి యుక్తి శక్తి ముక్తులులేని బ్రతుకు, క్రిమికీటకముల బ్రతుకే. (1) భక్తి భగద్భక్తి; మనకుఁగల దుఃఖకారణములను దొలగించి, సర్వశుభములిచ్చును గావున నిరంతర భగవదారాధనయే భక్తి. (2) యుక్తి అనగా జ్ఞానము, జ్ఞానమనగా మనమెవరో, సృష్టి కర్తమేమో, సత్యమేదో అనగా సత్యస్వరూపమగు పరమాత్మ తత్త్వమేమో తెలిపి, ఆనందమిచ్చునది. అదిలేనిదే మిగిలిన వన్ని తెలిసిన

నజ్ఞానమే. (3) శక్తియనగా దైవశక్తి; అమోఘమైనది; సంకల్పమాత్రమున నన్నియు సాధించునది; భగవాను నర్చించుచు తల్లగ్న చిత్తులకు సంక్రమించు దైవబలము. అపుడు మానవుఁడు భగవత్తుల్యుఁడగును. (4) ముక్తి యనగా సర్వ దుఃఖములనుండియు విముక్తి లేక మోక్షము; అవ్యయానంద ప్రదము.

928. సన్న్యాస మనఁగా విడిచి పెట్టుట; కాషాయాంబరములు, రుద్రాక్షమాలలు, దండకమండలములు దానికి బాహ్యచిహ్నములు మాత్రమే. విడిచి పెట్టుటే ముఖ్యార్థము. దేనిని విడిచిపెట్టుట? మోసగించి దుఃఖమునిచ్చునన్నిటిని విడిచిపెట్టి, సత్యస్వరూపమై, సకలానందములను, సమకూర్చు సర్వేశ్వరుని పట్టుకొని పూజించుటే సన్న్యాసము. భగవంతు నారాధించుట కడ్డువచ్చు నన్నిటిని విడువవలెను. మఱియు విడిచిపెట్టుటనగా, వస్తువుల సరియైన విలువ నెఱిఁగి వర్తించుటయే. ఇదియే ఆంతరంగిక సన్న్యాసము. గృహస్థుల కిది సరిపడును; అనగా గృహస్థులు సన్న్యాసులై జీవించుట నేర్చినచో ధన్యులగుదురు. బాహ్యాభ్యంతర సన్న్యాసులు కొలదిమందియే యుందురు.

929. వైరాగ్యమనఁగా దేనిని విడిచిపెట్టుట గాదు. వస్తువు లన్నిటిని వాని విలువలను సరిగాఁ దెలిసికొని, అవసరోచితముగా వాడుకొనవచ్చును. వైరాగ్యమనఁగా నిరాశావాదియై, మూలఁ గూర్చుండి దైన్య విషాదములను చూపుట

కాదు. వికార లక్షణముగల వస్తువులు మార్పు నొందుట చూచి కలత చెందకుండుట, నిర్వికారమై, నిత్యస్వభావము గలదేదో గ్రహించుట, దానిపై ననురాగము చూపుట నిజమైన వైరాగ్యము. పరిణామ సూత్రము ననుసరించి, మారిపోయి అదృశ్యములగు దేహాదికమును జూచి, నిర్విచారముగా నుండుటే వైరాగ్యము. మహర్షులు సన్యాసులు కారు; గృహస్థులే. నిత్యవస్తువైన దేవుని నమ్మి అనిత్యవస్తువుల నమ్మకుండ వాడుకొనవలెను.

930. భగవానుఁడు భక్తుఁడు కోరినంతనే ప్రత్యక్షమగుట కిష్టపడఁడు; కారణము తరచుగా దర్శనమిచ్చుచో భక్తుఁడును దేవుని ׳దేలికగా ׳జూచును. భగవన్మహిమను పూర్తిగా నెరిగిన మహాత్మ్ములెల్లప్పుడు దర్శన మిచ్చినను భగవాను నచంచల భక్తితోడనే పూజింతురు. అట్టి పరిపూర్ణతలేని భక్తుల కరుదుగా దేవుఁడు దర్శనమిచ్చును; వారికి ׳బరోక్ష దర్శనమిచ్చును. వారి కిహజీవిత సౌకర్యముల ׳గూర్చుటలోను, శుభముల నిచ్చుటలోను కష్టముల నివారించుటలోను భగవానుని కారుణ్యము పరోక్షముగాఁ గానఁబడును పూర్ణభక్తునికి సదా దర్శనమిచ్చును; "సదా పశ్యంతి సూరయః దివీవచక్షురాతతమ్." కన్నులున్నవాని కాకసము సదాగోచరించు రీతిగా, జ్ఞానులు పరమాత్మ నెల్లప్పుడు దర్శించుచుందురు.

931. నీకు వ్యతిరేకముగా నేదైన లేశమాత్రమైన దటస్థించుట కవకాశము లేదు; కారణము నీవు నాకు సంపూర్ణముగా బ్రణతుండవై, ఆత్మార్పణము చేసితివి; నన్ను నిరంతరము స్మరించుచు నీమనస్సు నాయందు లగ్న మొనర్చితివి. ఇంక నీకు లేశమాత్రమైనను పాపము లేదు. నేను నిన్ను సర్వకాల సర్వావస్థలలో గాపాడుచు నీకు మనఃక్లేశము గలిగించున దేదియు జరుగనీయను. బెంగలన్నియు విడిచి హాయిగాఁ గూర్చుండు మ"ని పరమేశ్వరుఁడు నాచెవులలో స్పష్టముగా బలుకు చున్నాఁడు. ఇంతకంటె నదృష్టమే ముండును ?

932. 'నేను' విడిచిపెట్టిన భక్తుఁడే భక్తుఁడు. 'నేను' అసత్యము; పరమాత్మయే సత్యము. అదియే నేనని జ్ఞాన సిద్ధిచే నెఱిఁగిన వాఁడే జ్ఞాని. సంసారమగ్నులైనవారికి అహంకార మమకారములు పనిచేయుచుండును. అది తప్పని తెలిసిన జ్ఞానికి, భక్తునికిఁగూడ నప్పుడప్పుడహంభావముపైఁబడి మోసగించును. ఈవిషయములో సర్వమీశ్వరుఁడే యను భావము స్థిరపడి, చలింపకుండ నుండవలెను. ఏమాత్ర మేమరినను, అహంకారమువచ్చి అదివఱకనేక జన్మములలో నార్జించిన భక్తిని జ్ఞానమును గలుషిత మొనర్చును. దీనికి మందు, "సర్వకర్త యీశ్వరుఁడే" యను విశ్వాసమును తపస్సుచే నిశ్చల మొనర్చి కొనవలెను.

933. భగవద్ధ్యానము చేయుటకు బవిత్ర స్థలకాల హృదయము లవసరమనుట నిజమే. కాని వానికై ప్రయత్న మవసరము లేదు. అన్ని స్థలములలో భగవానుఁడు నిండి యుండినందున, నన్ని స్థలములు పవిత్రములే. అదే విధముగా భగవానుఁడులేని కాలము లేదు, కావున నన్ని వేళలు పవిత్ర ములే. భగవద్ధ్యానమునకు హృదయము పవిత్రముగా నుండ వలెను. నీవు భగవద్ధ్యాన మారంభించి నంతనే, భగవన్నామ స్మరణ స్పర్శమాత్రముచే బవిత్రమగును. ఇఁక బవిత్రతా సమస్య యేది, "అపవిత్రః పవిత్రోవా, సర్వావస్థామ్ గతో పివా, యఃస్మరేత్పుండరీకాక్షమ్ సబాహ్యాభ్యంతరశ్శుచిః" యని చెప్పఁబడెను, "పవిత్రుడైనను, అపవిత్రుఁడైనను, సకల శుభాశుభావస్థలలో నున్నను, నెవఁడు పుండరీకాక్షుని స్మరించునో వాఁడు పైనలోపల శుచియే యనగా బవి త్రుఁడే." దేవుని స్మరించుటే చాలు; అపవిత్రత లన్నియుఁ బోయి, పవిత్రత సంభవించును.

934. ప్రతి నిముషము భగవానుఁ డిట్లు పలుకు చున్నాఁడు; "నీవు చేయునది, చేయఁగలది, చేయవలసినదియు నేమియు లేదు, నీవునన్ను మఱువకుండ నుండుటే ముఖ్యము. నీకేమి వలయునో నీకంటె నాకు సంపూర్ణముగా దెలియును. నీకోర్కెలను, నీసమస్యలను, నీబాధలను నేనెఱుఁగుదును. వానిని నాకు విడిచిపెట్టి, నేను వాని నెంత నీకు సంతృప్తి కర ముగా బరిష్కరింతునో చూడుము. నీ పనులను నేను

స్వయముగా జరిగించుచుండఁగా నీకెందుకో యీక నాఁదోళ నము? ఎన్నిసారులు చెప్పవలెను? నేను మఱల (జెప్పు చున్నాను; "అన్నియు నాకు విడిచిపెట్టి; నన్ను మఱువకుండ నుండుము. నన్ను భయభక్తులతో (బూజింపుము."

935. యోగ్యుఁడు, సమర్థుఁడునైన యొక వ్యక్తి మనకు మిత్రుఁడైన యెడల మనకనేక విధములుగా నాతఁడు తోడ్పడి, సంతసింపఁజేయును. కాని యామిత్రుఁడు నిష్క ల్మష పురుషుఁడు కావలెను. మన మైత్రిని స్వార్థమున కుప యోగించుకొన (జూచు వానిని మిత్రుఁడనరాదు. స్వార్థ రహితుఁడైన మిత్రుఁడు మనకెల్లప్పు డానంద మిచ్చును. అనంత పరిపూర్ణత, అఖండ యోగ్యతగల భగవానుఁడు మన మిత్రుఁడైనచో, నట్టి పరమమైత్రి వలని సౌఖ్యమును మనము రుచిచూచినచో మనమింకే మానవుని మైత్రిని కోరము. దేవునితో మైత్రి, తదానందము ననుభవైక వేద్యము.

936. భగవంతుని ధ్యానించుట వలన నీకానందము కలుగుచున్నదా? ధ్యానమునకు (గూర్చుండుటయు నీమనస్సు భగవంతుని పాదపద్మములపై నిలుచుటయు, భగవానుని పాదస్పర్శచే, వెన్వెంటనే భగవానుని దివ్య తేజస్సు, జ్ఞానము ఆనందము, శక్తి, శాంతి, నీ హృదయములో (ప్రవేశించు టయు జరుగవలెను. అనగా ధ్యానమున (బ్రవేశించుట, ఆనంద ముప్పొంగా నీహృదయమున (బ్రవేశించుట – ఏక కాలముననే జరుగును. అందుచే జపము, తపస్సు, ధ్యానము,

పూజ యనగా, హృదయ మానందామృత భరితమై, ఎన లేని సంతుష్టి, ధైర్యము, బలము, శుభ సౌఖ్యములు లభించు నే.

937. మానవుఁడు దేహముతో నెట్లు మెలఁగ వలెను? దేహముతో సంబంధము లేనిదే క్షణకాలము జీవింప (జాలము. దేహసంబంధము దుఃఖ హేతువే. అనారోగ్యజన్మ జరా మరణములు దేహలక్షణములు. కాని దేహము లేనిదే యీశ్వరారాధనము, తపస్సు, ధ్యానము జరుగుట కవకాశము లేదు. కావున దేహసంబంధముండి లేకుండవలెను. ఆసంబం ధము బంధము కారాదు. దేహము పరమార్థ సాధన కుప కరణమని గ్రహించి నిస్సంగబుద్ధితో దాని నుపయోగించు కొనవలెను. దానియందు మమకారము పెట్టి కొంటిమా, దుఃఖము తప్పదు. కావున దేహముండి లేకుండవలెను. ఇది పరిపూర్ణమగు నభ్యాసము కావలెను.

938. మంచిపనులు చేయువలసిన వని తెలిసియుఁ జేయ లేకుండుట, చేయరాదని తెలిసియు (జెడ్డపనులు మాన లేకుండుట వలన మనమెంత దుర్బలులమో బోధపడుచున్నది. "మంచి పనులు చేయుటకు, (జెడుపనులు మానుటకు వలయు బుద్ధిబలమును, వివేకమును, ధైర్యసాహసములను ప్రసాదించి, రక్షింపుము"ని భగవానుని ప్రార్థించుటయే తప్ప గత్యంతరము లేదు. మన దేహ మనోబుద్ధీంద్రియములను నడపువాఁడు పరమేశ్వరుఁడే గావున, వానిని సవ్యమార్గమున నడపి రక్షింపు మని ప్రార్థించు నే గాయత్రీ మంత్రసారాంశము, గాయత్రీ

జపమున కధికార మున్నను లేకున్నను మన మీా విధముగా భగవానుని ప్రార్థించి, రక్షణ పొందవచ్చును.

939. ఎవ రేమిచ్చినను దేవుఁడిచ్చినదే యని నిస్సంశయముగా నమ్మవలెను; ఏలన నది పూర్ణసత్యము గనుక, దేవుఁ డీయనిది తృణ లేశమును లభింపదు. ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు, ధనము, వస్త్రవాహనాదికములే గాక, చీపురుపుల్ల మొదలు, చిదానందము వఱకు సర్వము భగవంతుని సంకల్పము చేతనే జరుగును. భగవంతుఁడు తన సంకల్పమును లోకములోఁ దనకిచ్చ వచ్చిన వ్యక్తులచేఁ జేయించును. అందుకే, రాగద్వేషములు విడిచి, మనకేమి యెవరి ద్వారమున లభించిన నీశ్వరప్రసాదమని నమ్మి స్వీకరింపవలెను. సర్వలోకైక దాత యగు భగవానుని నమ్మి, భక్తిశ్రద్ధలతో నారాధింపవలెను.

940. నీ వస్తువున కనుకోనంత ధనము వచ్చినచో, విక్రయింతువు. నీజీవిత మను వస్తువును భగవానుని కమ్మవలెను. నీవు లెక్కపెట్టలేనంత ధనము నాతఁడిచ్చి నిన్నుఁ గొనఁగలఁడు. నీజీవితము నాభగవానుని కమ్మివేసి ఎన్నెన్ని దివ్యవస్తువులు, నీకిచ్చునో చూచికొనుము. నీ వడిగినవన్నియు నిచ్చును. నీ వడుగ నెఱుఁగని వన్నియుఁగూడ నిచ్చును. నీ వెన్నఁడూహింపఁ జాలని పరమశాంతి సౌఖ్యములనిచ్చు బ్రహ్మజ్ఞాన ప్రసాదమిచ్చును. నీ జీవితమును దేవుని కమ్మివేసిన క్షణమునుండియు నాతఁడు ప్రతిక్షణము నీయోగక్షేమ

బాధ్యతలు స్వీకరించును; ఇంతమంచి బేరమును బోఁగొట్టు కొందువా ?

941. ఎంతవ్యయము చేసినను తరుగని ధనమున్నచో ధనలోపముచేఁ గలుగు బాధలెవ్వియు నుండవు. అటులే అఖండమైన పుణ్యధనరాశి నిలువయున్నచో, నే నాఁడెట్టి అశుభముకాని, దుఃఖముకాని లేకుండఁ జేసికొనవచ్చును. దానధర్మాది సత్కార్యానుష్ఠానముచేఁ బుణ్యధన మార్జింపవచ్చును. ఈవిధముగా నమిత పుణ్యధన మార్జించుట మిక్కిలి శ్రమతోఁగూడి, కొన్ని జన్మములు కృషిచేయవలెను. ఇంకొకవైపున భోగానుభవముచేఁ బుణ్యరాశి తరుగుచుండును. ఎంత కాలము అనుభవించినను క్షీణింపని అనంత పుణ్యరాశి నార్జించు సులభోపాయమున్నది. అనంత పుణ్యరాశి యగు భగవాను నర్చించుటే, పరమేశ్వరుని సమగ్రభక్తితో నారాధించినచో, ననంత పుణ్యము, మోక్షము లభించును.

942. భగవంతు నాశ్రయించి, భగవత్కృప నార్జించుట కంటెఁ జేయవలసిన పని యింకొకటేదైన నున్నదని భావించు దౌర్భాగ్యము గర్హింపఁ దగినది. స్నాన పాన భోజన నిద్రాదులు, మలమూత్ర విసర్జనములు తప్పని సరిగాఁ జేయవలసి యున్నవి. దేహపోషణము, కుటుంబ రక్షణము నిమిత్తము ధనసంపాదనాదికముగూడఁ దప్పనిసరి పనియేకాని సర్వక్లేశములను నశింపఁజేసి, శాశ్వత సుఖ శాంతులిచ్చి రక్షింపఁగల భగవాను నాశ్రయించి ధ్యానించు పని కగ్ర

స్థానమిచ్చుటయే మానవ ప్రధాన కర్తవ్యము, తక్కినపను లన్నియు మానవలసిన అవసరము లేదు. భగవానుని పాద ములు పట్టి విడువకుండగనే మిగిలిన పనులన్నియు జేసికొన వచ్చును. నీవేమిచేయుచున్నను, మానినను, "ఇది భగవాను నాజ్ఞ, నాచే సర్వము చేయించుచున్నాఁడ"ని దృష్టిలో నుంచి కొని జీవించుట - పరమాత్మని కృపకు రూఢి మార్గము.

943. ప్రపంచములో సకల విషయములు పరమేశ్వర సంకల్పముచే జరుగుచున్నవి. ఆంతరంగిక దృష్టితో బరిశీ లించినచో నేది జరిగిన నందు దేవుని సంకల్పశక్తియు, దివ్య హస్తమును గోచరించును. ఈ యభ్యాసము పరిపక్వమై, పరిపూర్ణముగా సిద్ధించిన భక్తుఁడు, భగవంతుఁడు చేయని దేదైన నున్నదేమో చూడవలెనని కోరి యెన్నటికిని కృతా ర్థుఁడు కాఁజాలఁడు. ఏలన దైవ సంకల్పములేని పని దేవుని సృష్టిలో నేదియు నెన్నడును జరుగదు. అందుచే భక్తుఁడైన వ్యక్తి దేవుఁడులేని చోటును, దేవుని సంకల్పము లేనిపనియు జూడ గోరి విఫలుఁడగును.

944. నీవు కాశీరామేశ్వరాది యాత్రలు చేసివచ్చి తివా? లేకున్న నెప్పుడు యాత్రలకు బోవుదువు? ఈప్రశ్నలు సామాన్యముగా వేయుచుందురు. భక్తునకు బ్రప్రథమ ఘట్టము తీర్థయాత్ర, ఆలయములలో దేవుని దర్శనము, పుణ్య నదీ స్నానము, మున్నగునవి. జనన మరణాది సంసారము నుండి విముక్తుఁ డగుట కివి ప్రథమ సోపానములు మాత్రమే.

తపస్సు, జపము, ధ్యానము దృఢతర దీక్షతో నిత్యము చేయుచు, జ్ఞానసిద్ధి మోక్షము పొందనగును. ఇది యావజ్జీవ నిష్ఠ; సర్వత్ర వ్యాపించియున్న పరమాత్మను గుర్తించి, ప్రత్యక్ష దర్శనము లభించు వఱకు గొనసాగింప వలెను. అపుడు విశ్వమే దేవుని దేవాలయము; పరమపుణ్య క్షేత్రమునై తరింపజేయును.

945. జ్ఞానమనఁగా దెలియుట; ఏమి తెలియుట? ఎంత తెలియుట? దాని కాద్యంతము లున్నవా? తెలిసికొను పని నెప్పుడు విరమింపవచ్చును? జ్ఞానమనగా, జ్ఞేయమును సంపూర్ణముగా దెలిసికొనుట; ఇఁక దెలియ వలయున దేమియు మిగులకుండ దెలియుట యని శ్రీకృష్ణభగవానుఁడు గీతలో జెప్పియున్నాఁడు. ఇంకొకచోట భగవానుఁడే యేది తెలిసిన సర్వదుఃఖములు నశించునో అదియే జ్ఞానమని గీతలోనే నిర్వచించెను. దానినే బ్రహ్మజ్ఞానమనిరి. తెలిసినవాఁడనఁగా బ్రహ్మవేత్తయే. మిగిలిన వారందరు తెలియని వారే.

946. సంసారమెంత తుచ్ఛమైనదనగా, నెంతటి భక్తుని కైనను మనశ్శాంతి చెడఁగొట్టి, కలత కలిగించును, "ఈ కలఁత లేల నాకు గలిగింపవలె న"ని భక్తుఁడు ప్రశ్నించును, భగవాను నాశ్రయించినచో నెట్టి కలతలు కలుగకుండ నేల జేయఁడు? సంశయములు జనించుచుండును. లోపమెచట నున్నది? నీలోననే యున్నది. నీవు ధైర్యమువూని "ఎందుకీ కలఁత? ఎందుకు సంశయము? భగవానుఁ డుండుట, భక్త

డడిగినది చేయుటేకాక, భక్తుని యోగక్షేమ భారమంతయు వహించి రక్షించుట జరిగితీరును." ఇట్టి దృఢ విశ్వాసమును దృఢతర మొనర్చినచో, గలతలను కడిగివేసి, సంశయము లను సంహరించి, మహోల్లాసముతో సుఖముగా గూర్చుండ వచ్చునే. భగవన్నామ సంకీర్తనము జిహ్వాగ్రమున నృత్యము చేయుచు బ్రహ్మానంద మనుభవింపుము.

947. కామినీ కాంచనములు రెండుగావు; వానిని విడదీయుటకు వీలులేని యేకత్వమున్నది. కామభోగములకుఁ గాంచనము లేక ధనము ప్రధాన మంత్రిత్వము వహించును. అనేక రకములగు భోగ్యవస్తు సముదాయము లేనిదే కామాభి లాష ఫలింపదు. అటులే కాంచనమునకు భోగత్వ మిచ్చు నది కామము. ఇవి తాత్కాలి కక్షుద్రానందమును దుఃఖ సమ్మిశ్రిత మొనర్చి యిచ్చును. ఇవి రెండును మార్పుగలిగి, చెడి, నశించు లక్షణములు గలవి; శాశ్వతశాంతి సౌఖ్యముల నెట్లీయఁగలవు? కామకాంచనాసక్తి వశులు చపలచిత్తులై, ధర్మ దైవమహిమను దెలియఁజాలరు.

948. పురుషయత్న మనఁగానేమి? అది నిజమా అబద్ధమా? అత్యధిక సంఖ్యాకులు, పురుషప్రయత్న మున్న దనియు, దానికి దేవుఁడు తోడ్పడినప్పుడు సత్ఫలితములిచ్చు ననియు బలుకుచుందురు. స్తంభమున కావును త్రాటితోఁ గట్టిన గోవుకుఁగల స్వేచ్ఛ మనకున్నదని చెప్పుదురు. ఇది స్తంభము చుట్టును దిరుగు స్వేచ్ఛ. ఇది నిజమైనచో భగ

వానుని నిందించుటే యగును. పశువులను వలె మనుజుల బంధించు స్వేచ్ఛ నింద్యమైనది. లేదా జీవులకు సంపూర్ణ స్వేచ్ఛనిచ్చి, కర్మఫల మనుభవింపఁ జేయునందుమా, పాపములు చేయకుండు స్వచ్ఛబుద్ధి నేల భగవంతుఁ డనుగ్రహింపలేదు? తప్పుచేయు బుద్ధినిచ్చి, తప్పుచేసితి వని శిక్షించుట నిజమైనచో నదియు నీశ్వరనిందయే యగును. అనగా నీశ్వరుఁ డేకైక కర్తయనియు, మనుజులు నిమిత్త మాత్రులనియు నిర్ణయించుటే సహేతుకము.

949. ఒడలు తెలియని నీరసము; ఏమి పుచ్చుకొన్నను విరేచనమగు నను భయముచేఁ దీసికొనకుండ వలయు దుస్థితి. "ఎందు కీవిధముగా శిక్షించినావు కృష్ణా!" యని అడిగితిని. జవాబు చెప్పునా? "ఏమి లోపము చేసితివో కనిపెట్టుమని" జవాబు. "నాలోపమేమైన నున్నచో నింతగా శిక్ష కర్హుఁడనా" యని ప్రశ్న. "నిన్ను నిత్యము పూజించి, నీగీత దినదినము పారాయణ చేయుచున్నందుకు నాకెట్టి బాధయు లేకుండఁ జేయుట నీకేమి కష్టము కృష్ణా" యని కృష్ణుని పాదములపై శిరస్సుమోపి మ్రొక్కితిని. బాధ లుపశమించినవి.

950. "నాయంతటి భక్తుని శిక్షించి, పరీక్షచేయు నవసరమున్నదా?" అను నహంకార ముదయించెను. సమాధానము నాలో నుండియే వచ్చినది: "నీవెందులో లెక్క? సర్వమును విడిచి వేలకొలఁది సంవత్సరము లాకలములు దిని

తపస్సుచేసిన మహర్షులను, మహాయోగులను శిక్షించి బాగు చేసిన భగవానుఁడు నిన్ను స్వల్పముగా ఁజికాకు పెట్టి, అను కొనని అనారోగ్యమిచ్చి, వెంటనే తగ్గించి తప్పు తెలిసి కొమ్మ”ని బోధించుటలో ననౌచిత్య మేమున్నదిరా! “నాకు ఁగూడ శిక్షా?” యను దురహంకారము శిక్షార్హము కాదా? “నీ దోషము నీవు తెలిసికొని దానిని పీకి పారవేయకున్నచో నది లోలోన ఁగుళ్ళి బాధింపదా?” యని శ్రీకృష్ణవాణి వినిపించెను.

951. భగవాను నెదుట ఁబొగరుబోతుతన మెన్న డును జూపరాదు. నూటికి నూరుపాళ్లు వినయముతో, నీ శీర్షము దేవుని పాదపద్మములపై నుంచి, “నాకు దుర్బుద్ధు లెన్నడు పుట్టకుండ, దుష్కార్యములు సలుపకుండ నుండు లాగున ననుగ్రహింపుము. శ్రద్ధాభక్తులతో నీసేవ విడువ కుండ ఁజేయు సద్బుద్ధి నిచ్చి తరింపఁజేయుమ”ని ప్రార్థింప వలెను. అట్లు ప్రార్థించు చుండిన నేదైన శిక్ష భగవానుఁ డిచ్చినను, నీభక్తి శ్రద్ధలనున్నత స్థాయికి ఁదీసికొనిపోవు నుద్దేశము తోడనే భగవానుఁడు చేసెనని తెలిసికొని, సంత సించి, శిక్షభరింప లేకున్నచో, నామాట చెప్పికొనుము. కాని పొగరెన్నడు చూపకుము.

952. నీ కన్నులలో నుండి చూచు, నీ చెవులద్వార మున విను, నీబుద్ధితో నాలోచించు, నీ వివిధావయవములతో వివిధ కార్యములు చేయుశక్తి, చైతన్యము భగవాను ఁడిచ్చి

నదే. నీవు చూచుట, వినుట, తినుట, నిద్రించుట మున్నగు నవి పరమేశ్వర చైతన్యము చేయుచున్నది. అవి 'నేను' చేయు చున్నానని తలంచు చున్నావు. అందరలోఁగల 'నేను' పరమేశ్వర చైతన్యశక్తి; దానినే "నేన"ను కొందువు, నీవు చేయుట, భగవానుఁడు చేయుటనొకటే, ఇది సూక్ష్మదృష్టితో దర్శించుటయే యీశ్వర దర్శనమగును.

953. నీవేమి చేయుదువు? సర్వ జీవ జడములలో నుండి పరమేశ్వరుఁ డన్నిపనులు చేయుచున్నాఁడు. నీవు చేయుట కేమియును లేదు. "అసలు 'నీవు' నిజముగా నున్నావా"యని ప్రశ్న. నీవు దేవుఁడవే, అన్నిపనులు నీవే చేయు చున్నావు. నీవు దేవుఁడవని పరిశీలన చేతను, వేదాంతతత్త్వ జ్ఞానముచేత ననుభవ పూర్వకముగా గ్రహింపవలెను. అట్లు గ్రహించుట పూర్తియగు లోపున వేరుగా నల్పుఁడవై నీ వున్నావు. ఇది భ్రాంతియే. భ్రాంతిలో నీ వున్నావు. భ్రాంతి తొలఁగు వఱకు భగవన్మహిమ అనంతమైన దని యెరిగి, కీర్తించుటే పని; భ్రాంతితొలఁగి నీవే దేవుఁడవని తెలిసిన వెనుక సర్వమానందమయమే.

954. అనుక్షణము కృష్ణుఁడు (దేవుఁడు) జ్ఞాపక ముండి, యెదుట గోచరించుటెట్లు? ఒక రహస్య మున్నది. ప్రతిక్షణము నీవు బ్రతుకవలెనుగదా; అనగా నీవు బ్రతుకు చున్న ప్రతిక్షణము నీవు పూర్తిగా నిష్క్రియుఁడవై యుండ లేవు గదా. ఊపిరి పీల్చుట, గుండెకొట్టుకొనుట నెవఁడాపఁ

గలఁడు? మఱియు నీవు కూర్చుండుటయు, ఁబరుండుటయు నొక పనియే, ఒకగంటసేపు కూర్చుంటి వనుకొనుము. గంటలో ననుక్షణము కూర్చుండుట యను పని జరుగు చున్నది. అటులే నడచుట, తినుట మున్నగున వన్నియు జరుగుచున్నవి. అట్లు జరుగుచున్న ప్రతిక్షణ క్రియలలో నీతో నీవిట్లు చెప్పికొనుము; "కృష్ణా! ఈపని నీదే! నీ విందు లేకున్న నీపని జరుగదు. అన్నియు నీవే చేయుచున్నావు". నీవిట్లు సాధన చేసినచో, నన్నియు సమకూర్చు కృష్ణుఁడు నీకు సన్నిహితుఁడై, గోచరించుట పలుకరించుటయు జరుగును.

955. "ఉద్ధరేదాత్మనాత్మాన మాత్మానమవసాద యేత్ ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః" గీతావాక్యము: "ఎవనిని వాఁడుద్ధరించి కొనవలెను. తన్నుఁదా నుపేక్షింపరాదు. తనకు ఁదానే బంధువు, తానే శత్రువు," ఎవనిని వాఁడుద్ధరించుకొను టనఁగా నేమి? ప్రతి మానవుఁడు సర్వదుఃఖ రహితమగు మోక్షసిద్ధి నార్జించుటయో ఆత్మోద్ధరణము, మోక్షసాధన కృషి చేయకుండుట, తాను బంధములలోఁ దగుల్కొని దుఃఖించుచుండుటయే. మోక్ష మందభిలాష, దానికై వలయు భక్తిజ్ఞాన సంపాదనము, తపస్సు ధ్యానముచేయని మానవుఁడు తన్నుఁదానే శత్రువై బాధించి కొను మూర్ఖుఁడు. అనగా శ్రీకృష్ణ భగవానుఁ డందరకు నీవిధముగా ఁబిలుపు నిచ్చుచున్నాఁడు; "నీ క్షేమమే నీకక్కర లేని పశుజీవితము విడిచిపెట్టి, పరమేశ్వరు నారాధించి, ముక్తి

సాధింపకున్న నీదుఃఖములు పోవు; లెమ్ము; తపస్సు చేయుము; తరింపుము."

956. ప్రతి మానవుఁడు తనకుఁజావు తప్పదని ప్రతి దినము జ్ఞాపకము చేసికొనుచుండవలెను. అదియు ఁజాలదు. ప్రతి వ్యక్తియు ఁదాను మృతుఁడైనప్పుడు తన కళేబరము నెట్లు సాయముపట్టి యింటిబయట ఁబెట్టుదురో, ఏడు కట్లుగల వాహనముపై శ్మశానమునకు మోసికొని పోవుదురో, చితి పేర్చి, దానిపైనుంచి దహనము చేయుదురో, యింటివద్ద ముఖ్యులగు భార్య, బిడ్డలు ఆొమ్ములు బాదుకొని యేడ్తురో, — ఈదృశ్యమును ప్రతిమానవుఁడు దినదినము దృష్టిలో నుంచికొని, భక్తిశ్రద్ధలతో భగవానుని భజించి, అనాయాస మరణమును, మోక్షమును సంపాదించుటకు యత్నింపవలెను.

957. చూచి ఆనందించుటకు నేత్రములు, మనస్సు నిచ్చిన ఁజాలు; కాని మంచిచెడ్డలను వివేకించి తెలిసికొను బుద్ధిశక్తి నిచ్చినాఁడు భగవానుఁడు. మన నేత్రములతోఁ జూచిన వస్తువుల లక్షణము లెట్టివి? అవి మనకు సుఖము నీయఁగలవా? మనముచూచి సమ్మోహితుల మగు వస్తువులు కామినీకాంచనాదులు నిలకడగా నుండునా? అవి మార్పు పొంది, కృశించి, నశింపవా? వాని ననుభవించుటకు మన కిచ్చిన శరీరము, భోగానుభవ పటుత్వము నెల్లప్పుడు కలిగి యుండునా? రోగవార్ధకము లడ్డురావా? మరణము సంభవింపదా? మన కుపకరణమైన దేహము, వికారము నాశనము

గల వస్తువులపై భ్రమ కలిగించి, మోసగించుట తథ్యము కాదా? వీనిని వివేకించి, తెలిసికొని, నిజముగా శాశ్వతముగా నానంద మెందు లభించునో తెలిసికొని సంపాదించికొను మని బుద్ధి శక్తి వివేకములు బోధింపవలదా ?

958. మన జన్మములన్నియు (దుచ్ఛ జననేంద్రియ ముల ద్వారమున నేర్పాటుచేసిన భగవానుని మహిమ ఆశ్చర్యకరమైనది. శిశ్నోపస్థల సంయోగ సంజాతములైన జీవులకు తత్సంస్కారము, నఖశిఖపర్యంతముపట్టి వ్యాపించి, తొలగింపరానిదై నిలిచి, యుక్తవయస్సు వచ్చినంతనే, సంయోగ భోగములనే కోరుటలో నాశ్చర్య మేమున్నది? అనగా స్త్రీ పురుషులకు (బరస్పరాలింగన సంయోగభోగ కాంక్ష తమ దేహములలోని ప్రత్యణువునందు నిండి, ఉరకలు పెట్టుచున్నది. ధర్మానుకూలమో, ధర్మవిరుద్ధమో, కామ సంస్కార మమోఘశక్తి కలది. "కామమును విడిచి, దేవుని భజింపుము"ను నుపదేశము నెవఁ డనుష్ఠింపఁగలఁడు; కామము దేహముతో వచ్చి దేహముతో నశించును. కామ సంస్కారము జీవునంటి పెట్టుకొని సూక్ష్మ దేహమునందు నిలిచి, జన్మాంతరములను కోరుచుండును. దాని నెవఁడును జయింప (జాలఁడు. దేవుఁడొక్కఁడే దానిని నిర్మూలింపఁ గలఁడు. అందుచే మానవులు భగవాను నాశ్రయించి తరింపవలెను.

959. కామవాంఛ మూఁడు దేహములలో (బ్రత్యణువులో (వేళ్లు పారి, తొలఁగఁపరానిదై నిలిచియున్నది. ఇఁక

మోక్షప్రయత్నము సాగునా? ఇంకొక రహస్యమున్నది. ప్రతిప్రాణిలో దైవాంశయున్నది. అందుచే, నెట్టి కళంకము లేని శాశ్వతానంద శాంతి నిలయమైన పరమాత్మను జేరవలె నను కోర్కెయు దొలగింపరానిదై ప్రతిప్రాణిలో నున్నది; "నాకానందము కావలెను. దుఃఖము వలదు. సంపూర్ణము శాశ్వతమునైన సుఖము కావలెను. జ్ఞానము, బలము, శాంతి సంపూర్ణమైనవి, దుఃఖదూషితములు కానివి కావలెను." అను జీవివాంఛ దైవాంశ సంభూతమైనది. అది కామమును మించిన బలము గలది. సంపూర్ణదైవశక్తి సామర్థ్యములు ప్రతి జీవి తములో గర్భితములై యుండి, ఆవిష్కరణమును గోరు చున్నవి. కామమున కోటమి, పరమాత్మాను సంధాన కాంక్షకు విజయము తప్పదు.

960. తప్పుపని యనఁగా నేది? దేవుని వైపుపోవు దారినుండి తప్పించునదే తప్పుపని. అదియెట్లు తెలియును? మనము దానిని దెలిసి కొనుటకు కృషిచేయ నవసరము లేదు. మన వేదశాస్త్రములు వేనోళ్ల జాటియున్నవి. మనము వానిని గూర్చి పెక్కుసారులు వినియున్నాము. పరధన పర కాంతాపేక్ష తప్పుపని. అటులే జీవహింస, సజ్జనుల నవమా నించుట, తల్లిదండ్రుల నిరసించుట, మున్నగున వెన్నియో గలవు. ఎన్నడు తప్పు చేయకుండుటకు రెండు మార్గము లున్నవి. (1) కామ వశులమై శాస్త్రనిషిద్ధ కర్మలను చేయ రాదను దృఢదీక్ష కలిగి వర్తించుట, (2) మానసిక దౌర్బ

ల్యముచే నెన్నఁడైన దప్పు చేయవలెనను బుద్ధిపుట్టకుండ
జేయుమని భగవానుని నిత్యము సేవింపవలెను.

961. కొన్ని క్లిష్ట సమయములలో నేమి చేయవల
యునో తెలియని పరిస్థితి యేర్పడి, మతి చలింపఁజేయును.
అట్టి సమయములలో నశాంతి తొలగిపోవు నుపాయము;
శ్రీరామ నామస్మరణము నాపకుండ భక్తితో జేయు
చుండుటే. నాకట్టి పరిస్థితులు కొన్నివందల మారులు తట
స్థించినవి. ఏకాంతమునఁ గూర్చుండి, శ్రీరామప్రభువును
దలఁచికొని గొల్లుమని రాగములు పెట్టి, వెక్కి వెక్కి యేడ్చు
చుండువాఁడను. ఏడ్పునారంభించుట తోడనే, పరిస్థితి మారి,
ధైర్యము, బలము, శాంతి కలుగు చుండెడివి. నీరసభక్తికాక,
ఉజ్వల భక్తికి ఫలితములు వేగముగా లభించును. భక్తి పుష్టి
గాంచుటయు, సకల సమస్యలు సమసిపోయి, శ్రీరామప్రభు
ననుగ్రహముచే నవ్యయశాంతి సౌఖ్యములు లభించుటయు
జరుగును. పూర్ణ భక్తి యనగా రామనామముతో నేకమై
పోవుటే.

962. మన మెన్నఁడనుకొనని దేదైన బైబడిన
రీతిగా హఠాత్సంభవమైనపు డెంతవానికైనను మనస్సు చెదరి
పోవును. అది వ్యక్తిగతమైన విషయమే అయినచో, దుర్భర
దుఃఖమును కలుగును, అట్టిది తటస్థింపకుండ రక్షణ సాధన
మేదైన నున్నదా? అతి సులభమైనది, తిరుగులేనిది అమోఘ
శక్తిగలది పూర్ణసంతుష్టి నిచ్చి కాపాడు నది భగవత్సంకీర్త

నమే. అహోరాత్రము లుగ్రదీక్షతో, సంకీర్తనము చేయుచు దీక్ష చెడకుండ జూచికొనుచే. శ్రీరామస్మరణము బ్రహ్మాస్త్రము, కోట్లకొలది జన్మముల పాపరాశిని దహించి, సకల దుర్దశలను దొలగించి రక్షించును. మాటల వలన లాభము లేదు; చేసి ఫలితము నందవలెను.

963. భక్తుడు, జ్ఞానికాగోరు నాతడ డహింసా ధర్మము నాచరింపవలెను. సాధ్యమైనంతగా సకల జీవులకు సేవచేయుటకు యత్నింపవలెను. ఎవరిని బాధింపకుండుట, తప్పుపని చేయకుండుటే: మరి మంచిపనియో? సకల జీవులలో బరమేశ్వరు డున్నాడని విశ్వసించి ప్రాణిసేవయే పరమేశ్వరుని సంతసింపజేయు సేవయని గ్రహించి చేయుటచే బుణ్యకర్మ ఫలితము లభించును. అంతేకాదు ప్రాణిసేవతో భగవద్భక్తి కలియుటచే, పుణ్యము మాత్రమేకాక, పరమేశ్వర కృపయు, మోక్షమును లభించును.

964. అన్నిటి నిచ్చినవాడు భగవానుడు. దేహమును భార్యను బిడ్డలను, ధనగృహ వస్త్రాదికమును భగవంతు డిచ్చినవే. వానిని భగవానుడు సంతసించు రీతిగా నుపయోగించికొనవలెను. వాని నెట్లుపయోగింపవలెనో, వాని వలన నిహపరసుఖము లెట్లు లభించునో, వేదశాస్త్రములు వేయి విధముల వక్కాణించి యున్నవి. ధర్మవిరుద్ధములగు పాపకృత్యముల నెన్నడు చేయరాదు. ధర్మవిరుద్ధ భోగ వశుడు దైవద్రోహి యగును. అటులే ధనగృహాదికమును,

బుద్ధిశక్తిని దుర్వినియోగ మొనర్చుట పాపకృత్యమగును; అనగా భగవద్విరోధియై శిక్షాపాత్రుఁడగును. ధర్మదైవ ద్రోహులు, తమ చేతులతో తమ్ముఁదామే దహనము చేసి కొను దౌర్భాగ్యులు.

965. చేయ వలసిన పనులేవి? మానవలసిన వేవి? సూక్ష్మముగా (జెప్పఁ)చో నే పనులు దేవునికి దూరము చేయునో అట్టివి మానవలెను. ఏపనులు దేవునికి దగ్గరగా (దీసికొనిపోవునో, అట్టి పనులు చేయఁదగినవి. ఏ పనుల కెట్టి ఫలితములిచ్చు శక్తిగలవో తెలియు టెట్లు? ధర్మాధర్మ కర్మల (గూర్చి, వేదములు, సత్పురుషులు, వేనోళ్ళ (బలికియున్నారు. అప్పటికి సంశయము కలిగినచో, దైవభక్తులగువా రీవిధముగా భగవానుని (బ్రార్థింపవలెను; "భగవాన్! నీ సంకల్పము లేనిదే నేనేమియుఁ జేయఁజాలను. నీ దయకు దూరముచేయు పను లెన్నఁడు చేయు కుతూహలము కలుగకుండ (జేయుము. సకల విషయములలో నీకు (బ్రీతిగలుగు రీతిగా నేను వర్తింపఁ గలుగునట్లు చేయుము."

966. నీ ప్రీయని దేదియు లభింపదు. కాని నికృష్టము లైన పనులు నీతో (జెప్పి నీవు చేయవలెనని కోరుటకు భయ పడుచుంటిని. కాని నీయాజ్ఞ లేనిదే గడ్డి పరకయు లభింపదే! మాయింటి పనిమనిషి మానివేసినది. అనారోగ్యముచే నాభార్య పనులు చేసికొన లేకున్నది. నీవు పంపనిదే పని మనిషి లభించు టెట్లు? సిగ్గువిడిచి నీయంతటి వానిని, నికృష్ట

బుద్ధిశక్తిని దుర్వినియోగ మొనర్చుట పాపకృత్యమగును; అనగా భగవద్విరోధియై శిక్షాపాత్రుఁడగును. ధర్మదైవ ద్రోహులు, తమ చేతులతో తమ్ముఁదామే దహనము చేసి కొను దౌర్భాగ్యులు.

965. చేయ వలసిన పనులేవి? మానవలసిన వేవి? సూక్ష్మముగా ఁజెప్పఁ చో నే పనులు దేవునికి దూరము చేయునో అట్టివి మానవలెను. ఏపనులు దేవునికి దగ్గరగా ఁదీసికొనిపోవునో, అట్టి పనులు చేయఁదగినవి. ఏ పనుల కెట్టి ఫలితములిచ్చు శక్తిగలవో తెలియుటెట్లు? ధర్మాధర్మ కర్మల ఁగూర్చి, వేదములు, సత్పురుషులు, వేనోళ్ళ ఁబలికియున్నారు. అప్పటికి సంశయము కలిగినచో, దైవభక్తులగువా రీవిధముగా భగవానుని ఁబ్రార్థింపవలెను; "భగవాన్! నీ సంకల్పము లేనిదే నేనేమియుఁ జేయఁజాలను. నీ దయకు దూరముచేయు పనులెన్నఁడు చేయు కుతూహలము కలుగకుండ ఁజేయుము. సకల విషయములలో నీకు ఁబ్రీతిగలుగు రీతిగా నేను వర్తింపఁ గలుగునట్లు చేయుము."

966. నీ ప్రీయని దేదియు లభింపదు. కాని నికృష్టము లైన పనులు నీతో ఁజెప్పి నీవు చేయవలెనని కోరుటకు భయ పడుచుంటిని. కాని నీయాజ్ఞ లేనిదే గడ్డి పరకయు లభింపదే! మాయింటి పనిమనిషి మాని వేసినది. అనారోగ్యముచే నాభార్య పనులు చేసికొన లేకున్నది. నీవు పంపనిదే పని మనిషి లభించుటెట్లు? సిగ్గువిడిచి నీయంతటి వానిని, నికృష్ట

బాబోయి! ఈఘోర బాధావృతమైన సంసారపు ఊొచ్చులో నిలిచి, క్షణిక సుఖాపేక్షతో దైవధర్మ ద్రోహము చేయుటకు జంకని నీచలక్షణముల పెంపు; నా కేనాటికి వలదు తండ్రీ! నేను పడలేకున్నాను. అవ్యాజకారుణ్యపయోధి వగు నీ పాదములు పట్టితిని; రక్షింపవలెను."

969. "జీవనం సర్వభూతేషు; తపశ్చాస్మితపస్విషు; బీజంమాం సర్వభూతానాం విద్ధిపార్థ సనాతనమ్." గీతా వాక్యము, "సర్వప్రాణులలో జీవచైతన్యము; తపస్వులలోని తపస్సు; సర్వభూతములలోని శాశ్వత బీజమును, నేనే యని తెలియుము పార్థ." ఇందు విశేషార్థకము కలదు. చేతనా చేతనము లన్నిటిని సృజించినది నేనే. అనగా నంతయు ఁబర మాత్మ స్వరూపమే. ఈ సంగతి పరమాత్మ యగు శ్రీకృష్ణుఁడే చెప్పుచుండగా నిఁక సంశయ మెందులకు? అనగా నుపనిషత్తు చెప్పిన "అహంబ్రహ్మాస్మి" నేను పర బ్రహ్మము ననునది పరమసత్య మని గ్రహింపవలెను. అంతయు ఁబరమాత్మయైనచో, ఁజీమ, దోమ, పక్షి, పశువు, చెట్లు, పర్వతములు, నీవు, నేను, అంతా పరమాత్మయే. అది అనుభవపూర్వకముగా ఁదెలియుట మోక్షము.

970. బుద్ధిపూర్వకముగా ధర్మవిరుద్ధమగు నాలోచనము, మాట, పని యేదియు ఁజేయరాదు. అట్లు చేయవలెనను కోర్కె పూర్వ పాపసంస్కారముల ననుసరించి మనలో నుదయించి క్రియారూపమును దాల్చుచున్నవి. "ఇది ధర్మ

యుక్తమా, కాదాయను ప్రశ్న వేసికొని, అధర్మదూషిత మైనచో నట్టి పని చేయుటకు దిరస్కరింప వలెను. పాప సంస్కారబల మధికముగా నున్నచో నట్టి పనులు మాన లేము. ఇది మానవులకుఁగల దుస్థితి. అట్టి దుస్థితి సంభ వించి నపుడు, వెన్వెంటనే, భగవానుని ప్రార్థించి "నేను ధర్మ విరుద్ధముగా బ్రవర్తించుట మానలేని బలహీనత కలిగి యున్నాను. దానిని దిరస్కరించు బలము దయతో నిచ్చి గాపాడు మ"ని కోరవలెను. ఇట్లు ప్రార్థించు సంస్కార మభ్యాస బలముచే నధికమై, పాపము చేయకుండ రక్షించు నట్లు భగవానుఁ డనుగ్రహించును. పాప సంస్కారమును పుణ్య సంస్కారబలముతో ద్రొక్కివేయు సాధన చేయువలెను.

971. దేవుఁడు దనకు దోచిన పనులన్నిటిని జీవుల చేయి పట్టుకొని, స్వయముగా జేయించుచున్నాఁడు. ఆ పను లను గూర్చిన చర్చకు స్థానమే లేదు. వానినిగూర్చి పూర్తిగా దెలియఁగల సామర్థ్యమున్నవాఁడు దేవుఁడొక్కఁడే. జగ మంతయు భగవానుని వినోదప్రదర్శనము. మనము ప్రేక్ష కులముగాను, భగవాను డిచ్చిన పాత్రల ధరించు వారము గాను నుండక తప్పదు. మనకొక్క అధికార మున్నది. ఆయన నాటకమును బరికించి ఆనందించు శక్తినిమ్మనియుఁ బాత్రధారిత్వము తప్పనిసరియైనచో, నెట్టి శ్రమ, చికాకు, దుఃఖములులేని పాత్రధారిత్వమునే యిమ్మనియు భగవానుని ప్రార్థించుట నేర్చుకోవలెను. మన కోర్కెల నాతఁడు విని

ఆప్రకారమే చేయును. విశ్వజగన్నాటక కర్తను దృష్టిలో నుంచికొని బ్రతికినచో దుఃఖములుండవు.

972. "యేభజంతుమామ్ భక్త్యామయితే, తేషు చాప్యహమ్." "ఎవరు నన్నుభక్తితో భజింతురో వారి యందు నేనును, నాయందువారు నుందుర"ని గీతావాక్యము. భగవానుఁ డెల్లప్పు డందరలో నున్నాఁడు. భగవానునిలో మనముండుటయు నిత్యసత్యమే. భక్తుల విషయములో విశేష మేమున్నదని ప్రశ్న. అనగాఁ దనలో నివసించు భగవానుని గుర్తించు శక్తి భక్తునికి భగవానుఁడు కలిగించును. సర్వవ్యాపియైయున్న పరమేశ్వరునిలోఁ దానున్న సంగతియు భక్తుఁడు గుర్తించి, తరించుటకు భగవానుఁడు తోడ్పడునని భావము.

973. ఇతరుల కుపదేశించుటలోఁ గాలము గడుపగోరు పాండిత్యమధికముగాఁ గల విద్వాంసులు దేశమం దధికముగాఁ గలరు. వారి కోర్కె తమ ప్రసంగములవిని యితరులు తరింపవలెననికాదు. శ్రోతలు తమ్ముమెచ్చి సమ్మానింప వలెననియే. అనగా నట్టి పండితులు మెప్పుకోరుదురే కాని ముక్తిగాదు. సన్మానమును కోరుదురే కాని సత్యమును గోరరు; కీర్తికోరుదురు కాని ఆర్తిని దొలగించుకొనఁ గోరరు; తామెన్నఁడును దర్శింపఁదలపెట్టని దేవునిగూర్చి మహోపన్యాసములు చేసి, అంతకంటెఁ జేయువలయునది లేదని సంతృప్తిగాంతురు. అనగా నాత్మనిష్ఠాశూన్యులు, జన్మ

జరామృత్యువుల దోషముల నెట్లు జయింతురు? ఆత్మశోధన, తపస్సాధన, సత్యదర్శనము, భగవత్సాక్షాత్కారము, మోక్షసిద్ధి నిజమైన పండిత లక్షణములు.

974. భారతభూమిలో గృహస్థులు భగవంతు నేదో విధముగా పూజించుచునే యున్నారు. అనారోగ్యములు, దారిద్ర్యములు, తదితర బాధలు పోనిచో భగవదారాధన మెందుకు? బాధలున్నవి కనుకనే వానిని దొలగించి శుభ సౌఖ్యశాంతు లిమ్మని దేవుని పూజించుట జరుగుచున్నది. బాధలు యథాప్రకారముగా నుండుటో, అధికమగుటో జరిగినచో పూజాప్రార్థనలు వ్యర్థము. కాని ఒక రహస్యమున్నది. భగవంతుడు బాధలు పోగొట్టగల సమర్థుడను విషయము నిర్వివాదాంశమైయున్నది. (1) మన భక్తి లోప ముండ వచ్చును. (2) అల్పభక్తికి దైవానుగ్రహ మల్పముగానే లభింపవచ్చును. (3) ఏ స్వల్పపూజయైనను భగవానుడు తదుచిత ఫలమిచ్చితీరును (4) బాధలు మామూలుగా నున్నచో, ఎక్కువ చేయలేదని గ్రహించుట మంచిది (5) పూర్ణ భక్తి అనగా స్వచ్ఛ భక్తికి సంపూర్ణ ఫలితము నిచ్చును.

975. దినములు, ప్రతి దినమున కరువది గడియలు—అరగడియలోవలె పోవుచున్నవి. భగవానుని దర్శనభాగ్యము నేటికిని లభింపలేదు. అభయప్రదాన మనుగ్రహింప లేదు. ఏ క్షణమున యముడు తన దూతలతో వచ్చి, "రా! కాల

మైపోయినద”ని దండించునో తెలియదు. ఏమి చేయుట? చేయుట కేమున్నది; “తండ్రీ! అనుగ్రహింపవలెను. నా లోపములు మన్నించి, కృపతో రక్షింపకున్నచో, నాకింక రక్షకు లెవరున్నారు? నీ భక్తి చాలదందువా? నాశ్రాద్ధము. నాకు భక్తి అస లున్నదనుటయే అసత్యము! నేను భక్తుఁడను గాను, సంసార తుచ్ఛ సుఖాభిలాషలకు ఁగట్టువడిన పశు తుల్యుఁడను. అవ్యాజమైన కృప నీవుచూపి రక్షింపవలెను. ఆలసింపకుమ”ని పరిశుద్ధ చిత్తముతో దేవుని పాదములు పట్టుకొని యేడ్చుటే కర్తవ్యము.

976. జ్ఞానమనఁగా సర్వతోముఖ సంపూర్ణ సర్వ విషయ సామరస్య విజ్ఞానము, లోకములో నెంతటి ప్రజ్ఞా వంతులకైనను, కొన్నిటినిగూర్చి, కొన్ని విషయములు మాత్రమే తెలియును; తెలియని విషయముల వలన ఁదెలిసిన విషయములు మన మనుకొనిన దానికి విరుద్ధము కావచ్చును. మనకు ఁదెలిసినవి స్వల్పము; తెలియని వనల్పము. తెలిసినవి తెలియని వానివలన దోషయుక్తములు కావచ్చును. అందుచే నందరు తప్పులు చేయుచుందురు. తప్పులు చేయుటే కాదు, తప్పులు చెప్పిన నొప్పుకొనరు. పరమాత్మ జ్ఞానములో సర్వ విషయ జ్ఞానము సంపూర్ణముగా నిమిడియున్నది. అదియే బ్రహ్మజ్ఞానము లేక బ్రహ్మవిద్య, తత్స్వరూపమే భగ వానుఁడు. అట్టి జ్ఞాన ప్రసాదమునకై భగవానుని ప్రార్థింప వలెను.

977. సంపూర్ణ భక్తికాని, సంపూర్ణజ్ఞానము కాని లభింపవలెనన్నచో, మనలో నున్న అహంకారము సంపూర్ణముగా నశింపవలెను. నాకుఁ దెలియు నను భావము పూర్తిగా భస్మమైపోవలెను. "నా కేమియుఁ దెలియద"ను వినయ ప్రపూర్ణత కావలెను. ఈ యహంకారము సామాన్యముగాఁ జావదు. కోటి రూపములలో నది ప్రత్యక్షమై మహాత్ములనుగూడఁ గలుషితుల నొనర్చును. సంపూర్ణాత్మార్పణముచేసికొని, భక్తితో భజించి, పరమేశ్వర కృప నార్జించినవానికిఁగాని అహంకార విజయము సాధ్యమగును.

978. భక్తుఁడై పరమేశ్వరు నాశ్రయించిన సాక్ష్యము, పరమేశ్వర సాక్షాత్కారమో, పరమేశ్వరుఁడు పలుకరించి అభయమిచ్చుటో, ఁదనకుఁగల బాధలన్నియుఁ దొలఁగి పోవుటో జరుగవలెను. ఇది సులభమును, మిక్కిలి కష్టము గూడ నైనపని. స్వచ్ఛభక్తి విశ్వాసములున్నవారికి సులభము; లేనివారికి మిక్కిలి కష్టమునైనది. (1) భగవంతుఁడు సర్వవ్యాపియై యున్నాఁడు. అత్యంత సమీపవర్తియై అన్నియుఁ జూచుచు, వినుచు నున్నాఁడని నిస్సంశయముగా నమ్ముటే ప్రథమ లక్షణము; (2) భగవానుఁడు తనభక్తుని యెడఁ జూపు దయ, ఉత్సాహము మితిలేనివి; అనంత వేగముతోఁ గోర్కెలిచ్చు సామర్థ్య మాయనకుఁ గలదు. (3) భక్తుని భక్తిపరిణతి ననుసరించి, సముచితరూపములో దర్శనమిచ్చుట, జవాబు చెప్పుట, కోర్కెలిచ్చుట, జరుగుచుండును.

అత్యంత శ్రద్ధాభక్తులతో దేవుని పోకడలను గుర్తించు నభ్యాసము నిత్యము చేయుచుండవలెను.

979. అనంతమైన సృష్టిలో నొకటైన భూలోకములో, నొకదేశములో నొకమూల జన్మించితివి; కొలఁది కాలమైన వెనుక, శరీరమును విడిచి, యెచటికి (బోవుదువో తెలియదు. ఆ విడిచిపెట్టిన రూపములో మరెన్నఁడు నీవు నివసించిన చోటికి నీవువచ్చి, బంధువర్గమున కదే రూపములలో (గనపడుట జరుగదు. ఇదే విధముగా నెన్నివేల మారులో నీవు జన్మించి, మరణించితివి. అతి స్వల్ప కాలముండి పోవు స్థలబంధు గృహాదులపై మమకారబంధము పెట్టుకొని, దుఃఖముతప్ప మరేమి సాధింతువు? సర్వసృష్టి నాథుఁడైన భగవానుని నమ్మి, భజించి, కృపనార్జించినచో జనన మరణాది బంధములు తెగిపోయి, శాంతిసౌఖ్య పరిపూర్ణమగు మోక్షము లభించునని తెలిసికొని నీ జీవితము నీశ్వరార్పణ మొనర్చి తరింపరాదా?

980. సంసారము దురభ్యాసముచే వచ్చినది. అందలి దుఃఖములన్నియు (జిరకాలాభ్యాసముచే వచ్చినవే. అజ్ఞానము మూల కారణము. పుట్టుట దురభ్యాసము; పెండ్లి యాడుట దురభ్యాసము, పిల్లలను గనుట దురభ్యాసము, వారిని పోషించు తాపత్రయము దురభ్యాసము, అక్రమ ధనార్జనాదికము దురభ్యాసములో దురభ్యాసము; పోవు లక్షణములు పోయినపు డేడ్చుట దురభ్యాసము; ఈ దురభ్యాస

దోషము లీశ్వర పాదారవింద సేవచేసి, యాశ్వరకృపామృత మార్జించినఁ గాని పోవు. త్వరగా నాపని నారంభింపుము.

981. నియమమును పాటించి జీవితమును గడుపుట భగవత్కృప లేనిదే జరుగదు. నియమ మనగా దేవుఁడే యని విష్ణుసహస్ర నామములలోఁ జెప్పఁబడెను. ఒక మంచి నియమమును పాటించి నడచుకొనుటలో దేహ మనశ్శిక్షణము, ఒక క్రమగతి, యేకాగ్రతయు నిమిడియున్నవి. ఒక్క నియమ పాలనమువలన సుశిక్షితమైన మనస్సు మరెన్ని నియముల నైన సులభముగాఁ బాటించు నభ్యాస బలము లభించును. భక్తుఁడైన వ్యక్తి భగవానుని నిత్య మారాధింపవలె నను నియమమునకుఁ గట్టువడి జీవించినచో అట్టి నియమ పాలనము జయప్రదమగు నట్లు చేయుట దేవుని నియమమై యున్నది.

982. తప్పు చేయుట మానవులకు సహజ లక్షణము. కాని మానవులు పుణ్యాపాపములను, ధర్మాధర్మములను తప్పొప్పులను సవివరముగాఁ దెలిసికొని, సాధ్యమైనంత వరకు నెట్టి పాపకర్మలు చేయుట కిష్టపడరాదు. కామ కాంచన కాంక్షయే యాతప్పుపనులను చేయించు కారణము. ధర్మవిరుద్ధములైన కామధనములను కోరుట తప్పు, తప్పని స్పష్టముగాఁ దెలిసి కోరుటతప్పు, మరియు దాని నాచరణలోఁ బెట్టుట క్షమింపరాని తప్పు. తెలిసి చేసినను, తెలియకచేసినను తప్పు నిప్పువంటిది; కాల్చితీరును. పాపఫల మనుభ

వింపక తీరదు, అందుచే మానవుఁడు తప్పుచేయకుండ జీవింప యత్నింపవలెను.

983. ఒకవేళ ( దెలిసియు ( దప్పుచేయుట మానలేని పరిస్థితి యేర్పడినప్పుడు దానినుండి తప్పించికొను నుపాయము లేదా? ఉన్నది. (1) నేను కర్తనుగానని స్పష్టముగా ( దెలిసికొనిన వానికే కర్మఫలితము నంటదు. ఈశ్వరుఁడేకైక కర్త; నేను నిమిత్తమాత్రుఁడనని, నమ్ముట, అట్లాచరణలో ( జూపుట బ్రహ్మవేత్తలకే సాధ్యపడును. బ్రహ్మవేత్త లెందరుందురు? వారి సంఖ్య అతిస్వల్పము. అత్యధికులు తాము కర్తలమని నమ్మువారే. (2) అట్టివారు భక్తులై, భగవంతుని పాదము లాశ్రయించి, "తండ్రీ! నేను దుర్బలుఁడను. కామకాంచనలోలుఁడను. తప్పుచేయకుండు శక్తిలేని వాఁడను. నాచే ( దప్పుచేయింపక నన్ను దయతో రక్షింపుమ"ని త్రికరణశుద్ధిగా మొరపెట్టినచో భగవానుఁడు తప్పక రక్షించును.

983. తెలిసి తప్పుపని చేయుట జరుగదు. తెలిసి యెవఁడు తప్పుచేయును? తప్పుపని చేయుట జరిగినచో, వానికది తప్పని తెలియదన్నమాట. అమేధ్యమని తెలిసి, ఎవఁడు తినును? తినెనా? అమేధ్యమని తెలియదన్నమాటే? అందుచే మనము తెలిసి, తెలియక తప్పుచేయుట దేవుని దృష్టిలో ( దెలియక చేసినట్లే, అందువలన ( దెలియక, సరిగా ( దెలియక, పూర్తిగా ( దెలియక మనము తప్పులు చేయుదుము; అప్పుడు,

"ప్రభూ! నేను మూర్ఖుఁడను. క్షమింపుమ"ని చిత్తశుద్ధితో నర్థించినచో భగవానుఁడు రక్షించును.

985. ఒకపని ధర్మవిరుద్ధ పాపకర్మయని మనకు స్పష్టముగాఁ దెలిసినప్పుడు. ఆపనిచేసి తీరవలెనను మానసిక చాపల్యము, ఇంద్రియలోలత్వము,భోగలాలసత్వము, జన్మాంతర సంస్కారము కలిసి ప్రోత్సహించును. మానుటకు నిశ్చయబలము చాలదు. ఏమి చేయుట? పాపము చేయనని త్రికరణశుద్ధిగా యత్నించినచో, భగవానుఁ డడ్డుపడి; నీపాప బుద్ధిని సడలించి, పాపకృత్యము జరుగకుండఁ జేయును. కాని ఒక్కటి మరువరాదు. తెలిసి, వ్యామోహావశులమై, పాప మొనర్చి, దానిని స్వప్నమందైనను సమర్థింపఁబూనుట, చేసిన పాపముకంటె దారుణపాప మగును. అందుచే దేవు నెదుట నిలిచి క్షమాభిక్ష వేఁడుకొనుటే సత్యమైన కర్తవ్యము.

986. పాపముతోఁ గాని, పాప వాసనలతోఁ గాని యెన్న డేరూపముననను రాజీపడుట కంగీకరింపరాదు. భక్తుఁడీవిషయములో భగవాను నీవిధముగాఁ బ్రార్థింపవలెను. "భగవాన్! నాయందు దయచూపి, నాకు పాపచింత కలుగ కుండఁజేయుము. నాగత పాప సంస్కారములు నాపైఁబడి గొంతికివేయు చున్నవి. వానిని కృపతో నిర్మూలింపుము. ధర్మవిరుద్ధ భావములు, మాటలు, చేతలు నన్ను వశమొనర్చు కొనకుండ జయించుశక్తి నాకు లేదు. నీవు నాకు వానిని

జయించు బలము, జ్ఞానము ననుగ్రహించి కాపాడుము."
తప్పక రక్షణ కలిగి తీరును.

987. భక్తుఁడు భగవంతు నిట్లు ప్రార్థింపవలెను; "ఈక్షణములోఁ బరిపూర్ణచిత్తముతో నీపాదములపై శీర్షము మోపి, నాజీవిత సర్వస్వమును నీ కంకితము నిచ్చున్నాను. సంశయముకాని, మినహాయింపుకాని నాకు లేదు. అందుచే నా కెట్టి దోషమును సంక్రమింపకుండ నీవు రక్షింతువని నమ్ము చున్నాను. ఏకారణముచే నైన నుత్తరక్షణములో నాకు బుద్ధిమాంద్యము కలిగి నా యేకాగ్రత సడలి, నా నిశ్చిత చిత్తము చలింపవచ్చును. కాని నా మొదటి నిర్ణయమే నీవు దయతో స్వీకరించి, నన్ను రక్షింపఁ గోరుచున్నాను. నీకృప ననేక సమయములలోఁ జవిచూచినాను; ఎల్లప్పుడుచూప వేడుచున్నాను."

988. భక్తుఁడు భగవాను నిట్లు ప్రార్థింపవలెను; "నేను నాకోరికలను దెలుపుటలో లోపము లుండవచ్చును; పరిశుద్ధ హృదయ సమర్పణములో లోపము లుండవచ్చును. పూర్ణ చిత్తశుద్ధితో నిన్నుఁగోరుటయు నీవుకోర్కెను సఫల మొనర్చుటయు జరిగితీరునను విశ్వాసములో లోపముండ వచ్చును; నేనుగోరునది నీ వనుగ్రహింతువో లేదో పరీక్షించుటయు దప్పు గావచ్చును. కోరినవిచ్చుటలో నెన్నఁడు లోపము చేయకుండు సమర్థుఁడవు కావున నిన్ను నే నాశ్ర యించితిని, ఇది ప్రతిఫలాపేక్షతో గూడినదగుటచే సరియగు

భక్తి కాదేమో, నేననుకొన్నరీతిగా నాలోని లోపములను క్షమించి, నన్ను నీ నిష్కళంక భక్తునిగాఁజేసి రక్షింపుము."

988. తర్కించి భగవన్మహిమ నెఱుగుటకు సాధ్యము కాదని ఉపనిషత్తులు పలుకుచున్నవి. తర్కము కుతర్కము లోనికి సులభముగా దారితీయును. బుద్ధిశక్తి కతీతుఁడవగు నిన్ను దర్కముచే నెటులు తెలియుట సాధ్యమగును? అందుచే బూర్ణవిశ్వాసముతో నీ నామస్మరణము చేయు చుండుటే కర్తవ్యమని నిశ్చయించితిని, నీవు దయతో నన్ను రక్షింతువని నమ్ముచున్నాను." తర్కము దురహంకార కారణము; తప్పుత్రోవలలోని కీడ్చును, కావున భగవానుని నమ్మి, నిరంతరము భక్తితో భజించుటవలన సర్వలోపములు తొలగిపోవును.

989. భగవన్నామ సంకీర్తనము భక్తితో జేయు టనగా, మంచి చీపురుచేత బట్టుకొని, తనలోనున్న కుళ్లును, చుట్టుప్రక్కలగల చెత్తను తుడిచివేయుటయే. అనగా నది ఆత్మశుద్ధి, యింటి శుద్ధి, పరిసర శుద్ధి, తీవ్రముగా జేసినచో దేశశుద్ధియు నగును. భక్తుఁడు భక్తితో భగవన్నామ సంకీర్తనము చేయుచోట, భగవానుఁ డుండి, భక్తుని, భక్తునికి సంబంధించిన వారినందరిని శుద్ధుల నొనర్చి రక్షించుటలో సందేహమేమియును లేదు. భగవద్భజన మేరూపములో జేసినను అది అగ్నిజ్వాలారూపముదాల్చి, సకల కశ్మలము

లను, పాపములను దహింపఁజేయును. భక్తుడున్న చోటులలోఁ బాపమున కవకాశ ముండరాదు.

991. అనారోగ్యమా? నీరసమా? అందుచే వికల చిత్తుఁడవై యేడ్చెదవా? బుద్ధిలేదా? రామ మంత్రమున్నదని యెరుఁగవా? రామనామ సంకీర్తనమువలన ఆరోగ్యము, బలము సర్వసుఖశాంతి సంపదలు లభించునని నమ్మవా? నమ్మలేక పోయినచో, "చావు మంచిది! వెఱ్ఱివాఁడా! నమ్ము; సర్వ కశ్మలములు దగ్ధమై, పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము, సర్వ శుభములు వెదకికొని వచ్చి నిన్ను వరించును. రామ స్మరణము చేయుచున్నాను గాని, దుఃఖములు పోవుట లేదందువా! భక్తితో, ఏకాగ్రతతో, పరమవిశ్వాసముతోఁ జేయవలయునని యెన్నిమారులు చెప్పవలెను? సర్వదోషములు పోయి, సర్వసుఖములు లభించుటే నీనిశ్చల భక్తిపూర్వక స్మరణమునకు సాక్ష్యము.

992. సమగ్ర భక్తి గలవాఁడు సాక్షాత్తు భగవానుఁడే యగునని తెలిసికొనవలెను. అట్టి పూర్ణ భక్తుఁడు తానుగోరిన దేదైనను దేశకాల పాత్రతలతో నిమిత్తము లేకుండ జరిగితీరును, భక్తుఁ డేపని కొఱకును కదల నక్కరలేదు. తనకుఁ దన సకల బంధుమిత్రులకుఁ దన దేశస్థులకుఁ గాక ప్రపంచములోఁ దా నాశీర్వదించు నెవరికైనను సర్వ శుభములు భగవానుఁడు వెంటనే కలిగించును. దేవుఁడు

సర్వత్ర నుండుటచే దూరప్రశ్నయే లేదు. అదే విధముగా ఎప్పపాటు కాలములో నెట్టి కార్యమైనను జరిగించుటకు భగవత్సంకల్పమున కట్టి ప్రభావమున్నది, ఇఁక పాత్రత; దేవుని కందరు సములే. భక్తుడు కోరుటయు వెంటనే భగవంతుఁడది జరిగించుటయు విశేషముకాదు; ఏలన భక్తుఁడనఁగా పూర్ణ భక్తుఁడు భగవంతునితో నభేదము కలవాఁడగును.

993. పూర్ణ భక్తుఁడనగా పంచభూతాత్మక ప్రకృతిపై సంపూర్ణాధికారియై, లోక కల్యాణమును సాధించునాతఁడే. ఆతని యునికియే లోక కల్యాణము; ఆతఁడున్నచోట నెట్టి యుపద్రవములు సంభవింపవు. అతివృష్టి, అనావృష్టి, భూకంపము, ఉప్పెన, ప్రబలవ్యాధులు, అకాల మృత్యువులు, కాట్లాటలు నెన్నఁడు సంభవింపవు. ఏలన ప్రకృతి దేవుని రూపమే. భక్తుఁడనగా పరిపూర్ణ భక్తుఁడు భగవానుని కత్యంత ప్రియుఁడు. అట్టి భక్తుఁడున్న చోటఁగాని కోరినచోటఁగాని ప్రకృతి సక్రమవర్తన జూపును. పంచభూతములు భక్తుని, దేవునితో సమానముగా పూజించి సేవించును.

994. భగవద్గీతను పదునెనిమి దధ్యాయములు నిత్యము పారాయణ చేయునింట స్వయముగా శ్రీకృష్ణ భగవానుఁడు నివసించుటయే కాక, ఆకుటుంబమున కిహపర సర్వ

శుభములను చేకూర్చును. అందుచే, భగవద్గీతాపారాయణము చేయుటనగా, మితిలేని అఖండ పుణ్యము నిచ్చును. అట్టి పారాయణము జరుగుచోట ప్రకృతి వైపరీత్యము లేమియు దటస్థింపవు. భక్తుని ఆజ్ఞననుసరించి యముడును వర్తించును. భక్తిశ్రద్ధలతోఁ బారాయణము చేయుటవలన జరామరణాతీతమగు మోక్షానందమును సిద్ధించును.

995. ఆరోగ్యమా, బలమా, ధైర్యమా, ఆనందమా, అఖండ చిత్తశాంతియా, భయరాహిత్యమా, జనన మరణాతీతామృత రసాస్వాదనమా, సంకల్పమాత్ర సర్వ కార్యసిద్ధి సంపాదన దక్షతయా, సకలాసాధ్యములు సులభ సాధ్యము లగుటయా? ఏమి కావలెను? అన్నియుఁ గావలెనా? మొగమోటము పొందకుము; అన్నియుఁగోరుట దురాశలోఁ జేరదు. భగవద్భక్తుని కన్నియు గోరుట కధికారమున్నది. పరమేశ్వర భజనమువలని ఫలితమనగా నమిత సంపూర్ణానంద వైభవము. ఇవన్నియు నొక క్షణార్ధములో నిచ్చుట భగవానునికి దృణప్రాయము.

996. తప్పుపని చేయనివాఁడు మానవ దేహమును ధరించి యీలోకములో జన్మింపఁడు. కాని తప్పుతప్పే. తెలిసి చేసినను, తెలియక చేసినను తప్పు చేయుట పాపమే. పాపమనఁగా భగవంతుని కిష్టములేనిది, భగవంతుని దూరము చేయునది; అందుచే దానిఫలితము దుఃఖమును గలుగఁజేయు

నదై యుండును. తప్పుపని చేయుటకు, వయస్సు, కాలము, బలము, పాండిత్యములతో సంబంధము లేదు. ముఖ్యదోషములు పరధన పరకాంతాభిలాషలు. వానికై యత్నించుటే ప్రబల పాపములని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి. ఈసంగతి పామరులకు బండితులకు దెలియును. ఒకటే మార్గము. చేసిన తప్పులకు భగవంతుని పాదముల నాశ్రయించి క్షమా పణ చెప్పికొనుట, అట్టి తప్పు లింకెన్నడు జరుగకుండ రక్షింపు మని భగవంతుని ప్రార్థించుటయు ముఖ్యములు.

997. ఊొచ్చులో బొరపాటునఁగాని, తప్పని సరియై కాని కాలు వేసి, కాలికి బురద అంటుకొనుట జూచి, నీరు పోసి కాలును శుభ్రపఱచు కొనవలదా? ఎన్నఁడు కాలు ఊొచ్చులో వేయని పురుషుఁడు పూజ్యుఁడు; కాని వేసి. తెలిసికొని, వెంటనే శుద్ధిచేసికొను వాఁడును పూజ్యుఁడే, ధర్మవిరుద్ధమైన పని. యెన్నఁడు చేయకుండువాఁడు మహా నీయుఁడు. తెలిసియో, తెలియకయో చేసి, ఖిన్నుఁడై, దేవు నికి మొకరించి, క్షమాభిక్ష వేడి, యిక నెన్నఁడట్టి పని చేయ కుండు దీక్షబూని, తన దీక్ష విజయమందుటకై దేవునే నిత్యము ప్రార్థించు నాతఁడుగూడ బూజ్యుఁడే.

998. పుణ్యాత్ములందరు, తమ భక్తిచే దమ పాప ముల నుండి భగవానునిచే గాపాడ బడినవారే. హృదయ ములోనున్న పుండరీకాక్షుని హృదయ పూర్వకముగా

ప్రార్థించి, పవిత్రమగు నాత్మ సమర్పణ యజ్ఞము నొక్క సారియైనను సక్రమముగా జేసినవారే. అట్టివారి పాపములను భగవానుడు నిర్మూలించి, అభయహస్తమిచ్చుట జగద్విదితము. జ్ఞానాజ్ఞాన కృతములైన దోషములనుండి నన్ను శుద్ధు నొనర్చి, దయచూపుమని భక్తితో గోరిన వారి ననంత కృపావేగములతో భగవానుడు రక్షించిన చరిత్రలెన్నియో గలవు. క్షమాభిక్ష వేడినచో, రావణునైన క్షమించి, రక్షింతునని రాముడు రామాయణములో బలికినాడు.

999. మనకు సరియగు భక్తి కొంత యున్నట్లు సాక్ష్యము మనమనస్సులో గలత కలిగి, యేమిచేయవలెనో తెలియని దుస్థితిలోని కీడ్చు నెన్నడును జరుగదు. కర్తవ్యములు వెలుగులో వస్తువులవలె స్పష్టముగా గోచరించును. సంశయము లుండవు; మన ఆలోచనలు, మాటలు, చేతలు నెన్నడపక్రమ మార్గము పట్టవు. అనగా భగవత్కృప మన కున్నదని సాక్ష్యము. భక్తిగల వాని మనస్సులో నజ్ఞానమను చీకటి తెర చిల్లులుపడి, జ్ఞానకిరణ ప్రసార మేర్పడును. ఆ వెలుగులో, దేవుడు, ధర్మము, సత్యము ప్రసన్నములగును.

1000. భగవంతుని కాత్మ సమర్పణమునకు భక్తి ముఖ్యలక్షణము. మన సమర్పణము పరిశుద్ధమైనదైనచో, వెంటనే స్వీకరించి, సంపూర్ణరక్షణ మిచ్చును. కాని మనము

భక్తుల మనుకొన్ని, దైవద్రోహుల మగుచున్నాము. ఏలన, మనము భగవానుని కిచ్చిన సమర్పణమును, మఱచి తిరిగి, స్వీకరించి మన యిచ్చవచ్చిన రీతిగా వాడుదుము. ఇచ్చిన దానిని మరల (బుచ్చుకొనుట తప్పు. దేవున కిచ్చి మరల (బుచ్చుకొనుట సాటిలేని దోషము. అందుచే మనము ప్రతి దిన మాత్మార్పణము తిరిగి తిరిగి చేయుచుండవలెను; దాని వలన (గొంతదోషము తగ్గును. కాని రహస్య మొకటి యున్నది. పరిశుద్ధ పరిపూర్ణ చిత్తముతో నొకసారి మనము దేవుని కాత్మార్పణము ప్రకటించుచో, దానిని మనము తిరిగి తీసికొనకుండ దేవు(డే స్వయముగా (బూనుకొని, మన అర్ప ణమును శాశ్వతమొనర్చి, మోక్షార్హునిచేసి రక్షించును.

1001. అర్జును(డు యుద్ధవీరు(డు. యుద్ధవీరులు చాలమందిలో నాత(డొక(డు. యుద్ధవీరత్వము, చాలదు. యుద్ధవీరు(డు తప్పుత్రోవల (బట్టవచ్చును. అర్జును( డంత వా(డును తప్పుత్రోవపట్టి, యుద్ధవిముఖు(డయ్యెను. అందుకే "తస్మాత్ యోగీభవార్జున" యని ఉపదేశము. యుద్ధమేకాదు; ఏపని చేయుటకైనను, మానవు(డు యోగియైనప్పుడే సవ్య ముగా( జేయ(గల(డు; బ్రహ్మచారి యోగియై బ్రహ్మ చర్యము చేయవలెను; లేకున్న ఘోటక బ్రహ్మచారి యగును; గృహస్థు(డు యోగియై సంసారము చేయవలెను; లేకున్నచో నాత(డు కామ లంపటు(డగును. అటులే సన్యాసి;

పరిపాలకుఁడు, పండితుఁడు వర్తకుఁడు, ముందరయోగిరై
తమ కర్తవ్యముల నిర్వహించుచో దోషముల కవకాశ
ముండదు. యోగి యనఁగా బ్రహ్మవేత్త; ఆతఁడు నిస్సం
గుఁడై, తన స్వధర్మమును, లోక కల్యాణమును సాధింపఁ
గలఁడు.

1002. భగవంతుని స్మరించు టనగా సాటిలేని మహా
కార్యము. భగవంతుని స్మరణ మగ్నిజ్వాల; కోటి జన్మ
ముల పాపరాశి ఆ మంటలలో భస్మమైపోవును. దూదికొండ
యెంత యెత్తైన నేమి? నిప్పు పెట్టగనే నిముసములో ధూళి
యగును. పాపము లెన్ని యుండనీ! గట్టిగా నమ్మి, రామ
స్మరణమో, నీకిచ్చవచ్చిన భగవన్నామ స్మరణమో
చేయుము; పాపములు మిగులవు. ఈస్మరణము నేకాగ్రత,
శ్రద్ధ, భక్తి, దృఢ విశ్వాసములతో నిరంతరము చేయుచో
నిది అప్రతిహాత జ్వాలయై, నీకుటుంబములో, నీజాతిలో, లోక
ములో ఁగల సకల పాపరాశులను బూడిదచేసి, లోకమును
శుద్ధమొనర్చును. ఫలితముల ఁజూచి, నీవాశ్చర్య చకితుఁడ
వగుదువు.

1003. భగవద్దర్శనము కావలెనా? నమ్మిచూడు;
ఎండ దేవుఁడు; వానదేవుఁడు, చలి దేవుఁడు, పగలు, రాత్రి
దేవుని రూపములే; వెలుగు, చీకటి దేవుఁడే; కామక్రోధ
ములు, నిష్కామత్వక్రోధరాహిత్యములు దేవుఁడే; "అమృ

తంచైవ మృత్యుశ్చ సద సచ్చాహమర్జున." "మృత్యువు, అమృతత్వము, సత్తు, అసత్తు నేనే." ఇది వ్రాయు చున్నది దేవుఁడే, చదువువాఁడు దేవుఁడే; దేవుఁడు కానిది లేదు. కన్నులు తెరచి చూచున దంతయు దేవుఁడే; సర్వము భగవన్మయమై యున్నది. దేవుని జూచుట కెచటి కేగుదువు? దేవునితో, దేవుని మీఁదుగా, దేవుఁడు దేవుని చూచుట కేగుట యెంత విచిత్రము! అన్నిటిని దేవునిఁగా ఁజూచుట జీవిత ప్రతి క్షణానుభవములోనికి వచ్చినచో నపుడు 'నేను' 'నీవు' లు పూర్తిగా నదృశ్యము లగును;

1004. "నన్నుఁ దలచుకొనరా! చిత్త గొడవలఁ దలఁచి చిత్తము చలింపగా నేడ్తువా!" భగవాను నాదేశము. ఇందేమి కష్టమున్నది? భగవన్నామము స్మరించుటయు, నీకున్న కష్టములు, దుఃఖములు తొలఁగి పోవుటయు, సర్వ శుభసౌఖ్యశాంతులు లభించుటయు జరుగును. ఈ చిన్న పని చేయుటమాని, స్త్రీలు పురుషులు, పనికిరాని ప్రసంగములతోఁ గాలమును వ్యర్థమొనర్చి కష్టదుఃఖములుపైఁ బడఁగా రోదన మారంభింతురు. ఒక పైస పెట్టుబడితో, ఁగోట్ల కొలది ధనము వచ్చుచుండఁగా, బిచ్చమెత్తు టెందులకు? ఇచటనే దేవుఁ డున్నాఁడని నమ్మి "నాదుఃఖములు తీసివేసి ఆనందమిమ్మ"ని అడుగ లేవా? నీవడుగుటయు నాతఁడిచ్చు

టయు, గాలవ్యవధి లేకుండ జరిగిన సంగతి స్వీయానుభవ బలముచే నిది వ్రాయఁబడినది.

1005. "భగవాన్! నన్ను బరీక్షించు చుంటివా?" నాకభ్యంతరములేదు. నీవిచ్చు పరీక్షాప్రశ్నావలికి సమాధానములు నీవే చెప్పి వ్రాయింపవలెను. అనంత బ్రహ్మాండకోటిని సంకల్పమాత్రమున సృజించి పాలించు నఖండసార్వభౌముఁడవు, వాగ్బుద్ధ్యతీత ప్రజ్ఞానిధివి, నీవు పరీక్షాధికారివి; అల్పుఁడను, అజ్ఞుఁడను, నేను నీవిచ్చు ప్రశ్నలకు జవాబు మాట నటుంచి, నీప్రశ్నలు నాకర్థమగునా? అయితే, "నేను మతిలేక పరీక్ష పెట్టుచుంటినా?" యని నీవన వచ్చును. కాని జవాబులు నీవు తోఁపింపకుండ నాకెట్లు తోఁచును. పరీక్షలో జయాపజయములు నీవే! నావే యందువా? నూటికి నూరు మార్కులు వచ్చునట్లు నాచే వ్రాయించు. నీవు, పరీక్ష, నేను అన్నియు నీవే. ఇది నీలీలా వినోదనాటకము; నన్ను శ్రమపెట్టకుండ నాటకమాడుకో!

1006. "వైద్యుఁడా! ముందు నీరోగమును పోఁగొట్టుకొని, ఆరోగ్యముపొంది, తరువాత నితరుల కారోగ్యప్రదానము చేయవచ్చును. నీ జబ్బును తగ్గించుకొనలేని వాఁడ వితరుల రోగములను నిర్మూలింపఁ గోరుటలోనేమి ప్రయోజనమున్నది? ప్రతి మానవునకు జన్మజరామృత్యు

రోగ దుఃఖము లను జాడ్యములు, వేలకొలఁది జన్మములనుండి పాతుకొనిపోయి యున్నవి. తన్నుఁ దానారోగ్యవంతునిఁగా దిద్దుకొనలేని చపట యితరులను దిద్దిబాగుచేయునా? ప్రతి వ్యక్తియుఁ గామినీకాంచన దాసుఁడై పిచ్చివానివలె వర్తించు చుచు నితరుల పిచ్చిని బోఁగొట్టుదునని పలుకుట పిచ్చిలోఁ బిచ్చికాదా? అనగా నుత్తమభక్తుఁడు, ఉత్తమ జ్ఞానియు లోకసేవ కర్హులు.

1007. దేహమును నమ్మువానికంటె బుద్ధిహీనుఁడింకొకఁడు లేఁడు. దేహమును ద్వేషించు వానికంటె దౌర్భాగ్యుఁడింకొకఁడు లేఁడు. దేవునిఁ దెలిసికొనుటకు దేహమీయఁబడినది. దేవునికీదేహమును పూజాద్రవ్యముగా నిచ్చివేసి, జ్ఞానమోక్షము లిమ్మని నిత్యము ప్రార్థించుచున్నచో అనారోగ్యాకాల మృత్యువులు, దారిద్ర్య దుఃఖములు, లేకుండఁజేసి, దేహమున్నంత కాలము లోపములు తొలగించి, మరల దేహావసరములేని మోక్షసిద్ధిని భగవానుఁడిచ్చును.

1008. నాకాయుర్భాగ్య మింతవరకు నిచ్చి, నిన్ను స్మరించి తరించు సాధనగా నీవాక్యములు వ్రాయించితివి. ఇది నాకొక గొప్ప తపస్సాధనగా, నడచినది. మానవుని ప్రథమ కర్తవ్యము ముక్తుఁడగుటకు యత్నించుటే. నీదయ

నా కీజీవితములో ననేక విధముల దినదినము చూపితివి. నీ సాక్షాత్కారము, మోక్షమునిచ్చి నాకభయహస్త మిచ్చు వఱకు నాకెట్టి లోపములేని ఆరోగ్య సహితాయుర్దాయ భాగ్యము, భక్తిజ్ఞానములు, చేకూర్చి రక్షింపుమని నీపాద పద్మముల నాశ్రయించితిని. నన్ను ధన్యునొనర్చి రక్షింప వేడుచున్నాను.



## గ్రంథకర్త యితర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1) | భారతీయ తత్త్వశాస్త్రము- 5 భాగములు | ... | 25-00 |
| 2) | భగవద్గీత | ... | 5-00 |
| 3) | భారతీయ హృదయము | ... | 3-00 |
| 4) | శ్రీరామ స్తవ సుధాలహరి | ... | 2-00 |
| 5) | శ్రీరామకృష్ణ వివేకానంద రామ తీర్థుల జీవితోపదేశములు | ... | 2-50 |
| 6) | నా సత్యాన్వేషణము | ... | 2-00 |
| 7) | భగవత్సన్నిధికి వేయిమెట్లు | ... | 10-00 |
| 8) | Thousand Steps to God (English) | ... | 10-00 |
| 9) | Autobiograpy English | ... | 10-00 |
| 10) | స్వీయచరిత్ర | ... | 10-00 |
| 11) | శతకత్రయము | ... | 3-00 |

విలాసము :- 2/8-10-22, కమలాదేవి వీధి,
గాంధినగరము, కాకినాడ - 4.